# కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల పుట్టుక



ఫ్రెడరిక్ ఏంగిల్స్

అనువాదం:
మహీధర రామమోహనరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2

# ORIGIN OF THE FAMILY PRIVATE PROPERTY AND STATE



FREDERIK ENGELS

*Translator :*

M. Ramamohana Rao

VISALAANDHRA PUBLISHING HOUSE
VIJAYAWADA-2

# విషయ సూచిక



✶

# పీఠిక

"కుటుంబం వ్యక్తిగతఆస్తి, రాజ్యాంగాల పుట్టుక" మార్క్సిస్టు ప్రామాణిక గ్రంథాలలో అతి ముఖ్యమైనది. మార్క్స్ మరణానంతరం 1884 లో ఏంగిల్సు దీనిని వ్రాశాడు. ప్రాచీన సామాజిక వ్యవస్థను గురించి మోర్గన్ చేసిన పరిశీలనలను చూపిస్తూ చరిత్రను భౌతికవాద దృక్పథం లోంచి వివరించేటందుకు మార్క్స్ స్వయంగా తలపెట్టాడు. దానికోసం మోర్గన్ వ్రాసిన "ప్రాచీన సమాజం" అనే పుస్తకంలోంచి చాలభాగాలు వ్రాసి పెట్టుకున్నాడు. వాటి పక్కపక్కనే విమర్శాత్మక వ్యాఖ్యలను వ్రాసివుంచాడు. కాని, ఆయనతన వుద్దేశాలను నెరవేర్చుకోలేక పోయాడు. ఆ పనికి ఏంగిల్సు పూనుకొన్నాడు. తానీ పుస్తకాన్ని మార్క్స్ కోరిక ప్రకారమే వ్రాశానని ఆయన ఈ పుస్తకం మొదటి ముద్రణ పీఠికలో వ్రాసుకొన్నాడు.

ప్రాచీన సమాజంగురించి మోర్గన్ సాగించిన పరిశోధనలకు మార్క్స్-ఏంగిల్సులు ఎంతో ప్రాముఖ్యత నిచ్చారు. లిఖిత చరిత్ర స్వరూపాన్ని నిర్ణయించగల ప్రాచీన కాలపు, ఆదిమ పరిస్థితులను పట్టుకొని, మోర్గన్ వాటి స్వరూప సంధానం చేసేడంటూ ఏంగిల్సు తన పీఠికలో చాల మెచ్చుకొన్నాడు. ప్రాచీన గ్రీకు, రోమను, జర్మను చరిత్రలలో అనేక అపరిష్కృతసమస్యలు మిగిలిపోయేయి. ఆ సమస్యలకు సమాధానాన్ని మోర్గన్ ఉత్తర అమెరికాలోని ఇండియన్ తెగల గణవ్యవస్థలో పట్టుకొన్నాడు.

చరిత్ర భౌతికవాదస్వభావం గలదనే అభిప్రాయానికి మోర్గన్ తనంత తానే వచ్చినట్లు ఏంగిల్సు వ్రాశాడు. ఆ అభిప్రాయాన్ని అంతకు

పూర్వం చాలఏళ్ళక్రితమే మార్క్సు ఏంగిల్సులు వ్యక్తీకరించారు, శాస్త్రీయ పద్ధతులలో నిరూపించారు. దానినే మోర్గన్ తన ధోరణిలో తాను పున రుద్ఘాటించాడు. ప్రాచీన సమాజచరిత్రకు సంబంధించిన అనేక యథార్థ విషయాలను చాల జాగ్రత్తగా వివేచనచేసి మోర్గన్ పరిశోధించేడు. చరిత్ర భౌతికవాద స్వభావంగలదనే సిద్ధాంతాన్ని ఆ పరిశోధనలు రుజువు పరి చాయి. వాటిలోని గొప్పతనం అదే. చరిత్ర భౌతికవాద స్వభావంగలదనే సిద్ధాంతాన్ని సమాజంయొక్క చరిత్రలోని ప్రధానాంశాలకు వర్తింపజేసి ఆ సిద్ధాంతాన్ని విస్తృతం, సుస్థిరం చేయడంలో మార్క్సు, ఏంగిల్సు లకు మోర్గన్ కృషి చాలా తోడ్పడింది. స్థూలంగాచూస్తే, మోర్గన్ పరిశోధనల ఫలితాలను ఏంగిల్సు వివరించే డనిపిస్తుంది. కాని, అది సరికాదు. "కొత్తగా అనేక విషయాలు లభ్యమైనాయి. వాటిని మనం ఉపయోగించుకోవాలి. మనకు కొన్నిఅభిప్రాయా లున్నాయి ఇదివరకే మనం కొన్ని నిర్ణయాలకు వచ్చాం. వాటి దృష్ట్యా కొత్తవిషయాలనువివ రించాలి.అదేమీ లేకుండా, మోర్గన్‌ను సవిమర్శకంగా వ్యాఖ్యానించకుండా ఉన్న దున్నట్లుగా వివరించడానికే అయితే ఈ రచనకు అర్థం లేదు." *

అని ఏంగిల్సే వ్రాశాడు. మనుష్యుని బుద్ధీ, జ్ఞానమూ వికసించినకొద్దీ కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగం గురించిన అభిప్రాయాలు అభి వృద్ధి పొందినకొద్దీ, కుటుంబమూ, వ్యక్తిగత ఆస్తీ, రాజ్యాంగమూ పరి ణామం పొందుతూవచ్చేయని అనూచానంగా భావిస్తున్నారు. నిజం చెప్పా లంటే, మోర్గన్‌కూడా పరంపరాగతమైన ఈ భావవాద దృక్పథంనుంచే సమాజ పరిణామక్రమాన్ని పరిశీలించడానికి పూనుకొన్నాడు. విషయం ఏదయినా, ఆయన ప్రారంభించిన పద్ధతి అది. అయినా, జీవితావసర వస్తువులను సంపాదించుకోవడంలో కనిపెట్టిన కొత్తపద్ధతులూ, విశే షాలూ ద్వారా మానవవిజ్ఞానం వృద్ధిపొందిందని ఆయనే చూపించాడు. మోర్గన్ ఆదిమసమాజవ్యవస్థ స్వరూపాన్ని కనిపెట్టాడు. దానితోనే

* Marx - Engels, Briefe, Teil I. S. 330 - 331. లెనిన్ గ్రాడ్ 1933.

విజ్ఞానశాస్త్ర చరిత్రలో నూతన యుగం ఆరంభమయిందనవచ్చు. తాను కనిపెట్టినదానిని పట్టి ఆయన తనంత తానే భౌతికవాద దృక్పథాన్ని అనుసరించాడు ప్రారంభించేటప్పుడు ఎత్తుకున్న భావ వాద దృక్పథాన్నీ, వివరణక్రమాన్నీ క్రమంగా విసర్జించాడు. మొదట ఎత్తుకున్న దృక్పథాన్నీ వివరణక్రమాన్నీ, తర్వాత పరిశోధనల ఫలితంగా మోర్గన్ తేల్చిన అభిప్రాయాలనూ ఏంగిల్సు విడదీసి చూపించాడు. మోర్గన్ కనిపెటినదానికి శాస్త్రీయమైన ఆర్థికసాక్ష్యబలం తగినంతగా లేదు. అసలే లేదని చెప్పవచ్చు. దానిని సమకూర్చగలది మార్క్సిజమ్ ఒక్కటే. ఏంగిల్సు చేసిన దదే. మోర్గన్ పరిశోధనల ఫలితాలనూ, పర్యవసానాలనూ ఆయన సవిమర్శంగా వ్యాఖ్యానించాడు. మార్క్సు యొక్క ఆర్థిక, చారిత్రక సిద్ధాంతాలను సమకూర్చాడు. సామాజిక విజ్ఞానం ఇతోధికంగా వృద్ధిపొందడానికి మహాసౌకర్యం కలిగించాడు.

మోర్గన్ పరిశోధనలఫలితాలను సమీక్షించడంలో ఏంగెల్సు మార్క్సు వ్రాసిపెట్టుకొన్న విమర్శాత్మక వ్యాఖ్యల నుపయోగించుకొన్నాడు. ప్రాచీనసమాజ చరిత్రను అధ్యయనంచేసిన ఇతరు లనేకమంది రచనలు కూడా తీసుకొన్నాడు. చరిత్రలు చదివాడు. జాతులు, వానిలక్షణాలు వ్రాసిన ప్రత్యేక శాస్త్రగ్రంథాలు పరిశీలించాడు. సంస్కృతీ చరిత్రను, ప్రాచీనసమాజ చరిత్రను, కుటుంబ వ్యవస్థను, వివాహవ్యవస్థను గురించి వ్రాసిన పుస్తకాలను అధ్యయనంచేశాడు. ప్రాచీన కాలంనాటి జర్మను, కెల్టుజాతుల చరిత్రను గురించి స్వయంగా పరిశోధనలు చేశాడు. ఇంకా అనేక వివిధ విషయాలను పరిశీలించి మరీ పర్యవసానాలకు వచ్చాడు. ఎన్నో చారిత్రకాంశాలనూ, రాజకీయ విషయాలనూ ఆధారంచేసుకొని వ్రాశాడని లెనిన్ దీనినెంతో మెచ్చుకొన్నాడు. "అధునాతన సోషలిజాన్ని గురించిన ప్రధాన గ్రంథాలలో ఇదొకటి" - అన్నాడాయన.

ప్రాచీనకాలపు తెగలవ్యవస్థ ఏ పద్ధతిలో పరిణామం పొందిందో, ఆ పరిణామక్రమం ఏ యే దశలగుండా సాగిందో, ఆ వ్యవస్థ తప్పని సరిగా శిథిలం అయి తీరే పరిస్థితులు ఏవో ఏంగిల్సు ఈ పుస్తకంలో వివరించాడు. ప్రాచీన సమాజాన్ని లోపలనుంచే బద్దలకొట్టి, వర్గసమాజం

ఏర్పడడానికి తోడ్పడిన శక్తులను ఆయన చూపించాడు. కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగం – వీని పుట్టుకనూ, పరిణామాన్నీ వివరించాడు. స్థూలంగా సమాజంయొక్క చరిత్రను, ముఖ్యంగా ప్రాచీనకాలపు తెగలలోని వ్యవస్థ ఏలా పరిణామం పొందిందో తెలిపే చరిత్రను చారిత్రక భౌతికవాద సూత్రాన్ని వర్తింపచేసి చూపాడు.

వ్యక్తిగత ఆస్తీ, దానిని ఆధారం చేసుకొని తల ఎత్తిన కుటుంబ రూపాలూ, రాజ్యాంగ విధానాలూ 'అనాద్యములూ, అనంతములూ'నని విప్లవ వ్యతిరేకములయిన తత్వ, న్యాయ, రాజకీయార్థికశాస్త్రిలు నిరూపించడానికై తాపత్రయపడుతున్నాయి ఆసిద్ధాంతాలన్నిటినీ ఏంగిల్సు పుస్తకం తుడిచిపెట్టేసింది. ప్రపంచజాతులలో కొన్ని వుత్తమమైనవీ, కొన్ని అధమమైనవీ అంటూ వున్నాయనీ, జర్మనుజాతి పొందిన అభివృద్ధిక్రమానికే ఒక ప్రత్యేకత వున్నదనీ, ప్రపంచాన్ని పాలించడానికే జర్మనులు పుట్టారనీ, జర్మను అతి జాతీయ దురహంకారులు పదేపదే చెప్తూంటారు. విప్లవ వ్యతిరేకములయిన ఈ భావాలు ఎంత తప్పువో ఈ పుస్తకం నిరూపిస్తూంది. జర్మనీలోని ఫాసిస్టులు చరిత్రను తల్లక్రిందులుచేసి తప్పుడు సిద్ధాంతాలను సృష్టించారు. జర్మను తెగలకు కొన్ని ప్రత్యేక జాతిలక్షణా లున్నాయన్నారు. దంపతీ (Monogamy) వివాహపద్ధతిగాక జర్మను తెగలు మరో వివాహపద్ధతిని ఎరగరంటారు. ఆ తెగలలోవున్న కుటుంబ వ్యవస్థ, వివాహ పద్ధతి, సమాజ వ్యవస్థ, రాజ్యాంగము అనేవి మార్పులేకుండా వస్తున్నాయనీ వానికి మార్పు వుండదనీ చెప్తారు. ఏంగిల్సు వ్రాసిన ఈ పుస్తకంచదివితే పై సిద్ధాంతాలు అర్థరహితాలని స్పష్టంగా కనబడుతుంది. చరిత్రగతిని పరిశీలిస్తే వివిధ కుటుంబరూపాలూ, ఆస్తీ రాజ్యాంగరూపాలూ పరిణామశీలములుమాత్రమే నని ఏంగిల్సు నిరూపించాడు. ఆధునికచరిత్ర గ్రంథాలనుంచీ భూగోళ శాస్త్ర, జాతిలక్షణ (ethnography) శాస్త్ర, సాంస్కృతిక చరిత్రలనుంచీ బోలెడన్ని యథార్థవిషయాలను సేకరించి సాక్ష్యంచూపించాడు.

ఈ పుస్తకం మొదటి ముద్రణకు వ్రాసిన పీఠికలో ఏంగిల్సు ఒక తప్పు వ్రాశాడు. భౌతిక జీవితానికి సంబంధించిన వివిధ పరిస్థితులు

సమాజాభివృద్ధికి తోడ్పడిన విధానాన్ని గురించి అది తప్పు అభిప్రాయాల్ని కలిగించుతుంది. కనకి ఆ తప్పు ఏమిటో ఇక్కడ చెప్పడం అవసరం. దాంట్లో ఆయన ఇల్లా వ్రాశాడు :

"భౌతికవాద దృక్పథం ప్రకారం. మిగిలినవాని మాట ఎలావున్నా తక్షణ జీవితంయొక్క ఉత్పత్తిక్రమమే చరిత్రను నడుపుతుంది. ఈ ఉత్పత్తిక్రమం ద్వివిధం. ఒకటి, జీవితావసర వస్తువుల ఉత్పత్తి.... రెండోది, ప్రజోత్పత్తి, జాతియొక్క విస్తృతి. ఒక చారిత్రిక దశలో, ఒక దేశంలో వున్న సామాజిక వ్యవస్థ ఈ ద్వివిధ ఉత్పత్తిక్రమాన్ని పట్టి వుంటుంది : పని పద్ధతులలో వచ్చిన అభివృద్ధీ, కుటుంబ వ్యవస్థా దానిని నిర్ణయిస్తాయి."

పని పద్ధతులతో సమానంగా – అంటే, వస్తూత్పత్తి క్రమంతో సమానంగా కుటుంబవ్యవస్థ ఆనాటి సామాజికాభివృద్ధికి కారణం అవుతుం దనడం సరికాదు. 'ప్రజోత్పత్తి క్రమం'లో లేక జాతి విస్తరణ క్రమంలో స్త్రీపురుషుల మధ్య ఏర్పడే సంబంధాలు సమాజాభివృద్ధి దశను నిర్ణయం చేస్తాయి. సమాజంలోని భౌతిక జీవితాని కవి అవసరం. దానిలో సందేహం లేదు. ప్రజాభివృద్ధికీ. ప్రజల జీవనానికీ అవసరమైన పదార్థాలను ఉత్పత్తిచేసే పద్ధతి, అంటే జీవనావసర వస్తువులను సమకూర్చుకొనే పద్ధతి మాత్రమే ప్రజల భౌతిక జీవనస్థితినీ, యావత్తు సమాజంయొక్క వ్యవస్థనూ నిర్ణయిస్తుంది. స్త్రీ, పురుష సంబంధాలు, కుటుంబంయొక్క స్వరూపాలు, వివాహ వ్యవస్థ – ఇవన్నీ సమాజ వ్యవస్థలోవే. ఇదే ప్రధానమైన చారిత్రక భౌతికవాద సిద్ధాంతం. ఇదే సరయినదీ, పరిష్కృతమయినదీ, ప్రామాణికమయినదీను. 'గతితార్కిక, చారిత్రక భౌతికవాదం' అనేదాంట్లో దీనిని స్టాలిన్ వివరించాడు.

ఈ పుస్తకంలో ఏంగిల్సు ఇచ్చిన విస్పష్ట యథార్థవిషయ సంచయమే ఈ విషయాన్ని పూర్తిగా ధృవపరుస్తుంది. వస్తూత్పత్తి విధానంలో వచ్చిన మార్పునుపట్టి, సమాజంలోని వస్తూత్పాదకశక్తుల అభివృద్ధినిపట్టి కుటుంబవ్యవస్థ, వివాహప్రథల స్వరూపాలూ, స్త్రీ పురుషుల మధ్య సంబంధాలూ మారుతుంటాయని ఈ పుస్తకం చూపుతుంది.

ఏంగిల్సు ఈ పుస్తకంలో వ్యక్తీకరించిన ముఖ్యాభిప్రాయాలను లెనినూ, స్టాలినూ విస్తృతపరిచారు. సోషలిస్టు, కమ్యూనిస్టు వ్యవస్థలలో వర్గాలూ, రాజ్యాంగిమూ రద్దుకావడం సమస్యను గురించి ముఖ్యంగా వారు విస్తరించారు. సమాజం, ఆస్తి, కుటుంబం, వర్గాలు, రాజ్యాంగం యొక్క అభివృద్ధి, వాని భవిష్యత్తూ సోషలిస్టు దశలోనూ, కమ్యూనిస్టు దశలోనూ ఎలా వుంటాయో వారు చాల స్పష్టంగా చూపించారు.

[ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ (బోల్షివిక్) కేంద్ర కమిటీ - నిర్వహిస్తున్న మార్క్సు - ఏంగిల్సు - లెనిన్ ఇన్స్టిట్యూట్. ]

## మొదటి ముద్రణ (1884)

# ఉపోద్ఘాతం

ఒక విధంగా చెప్పాలంటే, కారల్ మార్క్స్ కోరిక ప్రకారం ఈ పుస్తకం వ్రాశాను. చరిత్రను భౌతికవాద దృక్పథంనుంచి పరిశీలనచేసి ఆయన—కొంతవరకు మేము అనికూడా చెప్పుకోవచ్చు—కొన్ని సిద్ధాంతాలకు వచ్చాడు. మోర్గన్ పరిశోధనా ఫలితాలకు ఆసిద్ధాంతాలను అనువర్తింపజేసి, వాని ప్రాముఖ్యతను స్పష్టంగా చూపించాలని ఆయన ఒక పథకం వేసుకొన్నాడు. చరిత్రను భౌతిక వాదదృక్పథం నుంచి పరిశీలించే పద్ధతిని అప్పటికి నలభయ్యేళ్ళక్రితమే మార్క్స్ కనుగొన్నాడు. వానినే అమెరికాలో మోర్గన్ మళ్ళీ ప్రతిపాదించాడు. అనాగరిక స్థితినీ నాగరికదశనూ పోల్చి చూపడంలో మార్క్స్ వచ్చిన ప్రధాన నిర్ణయాలకే ఆయనా వచ్చాడు. మార్క్స్ వ్రాసిన 'దాస్ కాపిటల్' నుంచి అనేక భావాలను జర్మనీలోని ఆర్థిక శాస్త్రజ్ఞులు ఒక మూల దొంగిలిస్తూనే రెండోమూల చాల ఏళ్ళపాటు అటువంటి పుస్తకం వున్నదనే విషయంకూడా ఎరగనట్లు నటించారు. మూత పెట్టేశారు. అలాగే ఇంగ్లండులోని ఆదిమ చరిత్ర విజ్ఞానవేత్తలమనుకొనేవారు మోర్గన్ వ్రాసిన 'ప్రాచీన సమాజం' * విష

---

* ప్రాచీన సమాజం, (ఆటవిక యుగంనుంచి అనాగరిక యుగం గుండా నాగరికతకు మానవుడు పొందిన వికాసక్రమం గురించిన పరిశోధనలు) — రచయిత: లూయీ. హెచ్. మోర్గన్, లండన్, మాక్మిలన్ అండ్ కంపెనీ, 1877. ఈ పుస్తకం అమెరికాలో ముద్రించ

యంలో వ్యవహరించారు. కీర్తిశేషుడయిన నా మిత్రుడు మార్క్స్ వ్రాయ దలచుకొనికూడా పూర్తిచేయలేకపోయిన రచన స్థానాన్ని నా పుస్తకం స్వీకరించలేదు. ఆ లోపాన్నిది స్వల్పంగా మాత్రమే తీరుస్తుంది, అయినా ఆయన మోర్గన్ పుస్తకంలోంచి వ్రాసిపెట్టుకొన్నవీ, * వాటిమీద వ్రాసి పెట్టుకొన్న సవిమర్శక వ్యాఖ్యలూ నావద్ద వున్నాయి. సాధ్యమైన చోట్లనల్లా వానిని యథామాత్రుకగా వ్రాస్తాను.

భౌతికవాదదృక్పథం ప్రకారం చెప్పాలంటే మిగిలిన దాని మాట ఎలావున్నా తక్షణ జీవితంయొక్క ఉత్పత్తిక్రమమే చరిత్రను నడిపిస్తుంది. ఈ ఉత్పత్తి క్రమం ద్వివిధం. ఒకటి జీవితావసరము లయిన ఆహారం, బట్టలు, ఇల్లు, అవసరములైన పనిముట్లు మొద లయిన వస్తువుల ఉత్పత్తి, రెండోది ప్రజోత్పత్తి. జాతియొక్క విస్తృతి. ఒక చారిత్రక దశలో ఒక దేశంలో వున్న సామాజిక వ్యవస్థ ఈ ద్వివిధ ఉత్పత్తి క్రమాన్ని పట్టివుంటుంది. పనిపద్ధతులలో వచ్చిన అభివృద్ధీ కుటుంబ వ్యవస్థా దానిని నిర్ణయిస్తాయి. పని పద్ధతులు అభివృద్ధి పొందనప్పుడు మొత్తం ఉత్పత్తి తక్కువగానే వుంటుంది. అంటే సమాజంలోని సంపద తక్కువగా వుంటుంది. ఆ దశలోవి సామాజిక వ్యవస్థలో స్త్రీ పురుష సంబంధాల ప్రాబల్యం అధికంగా వున్నట్లు కనబడుతుంది. స్త్రీ పురుష సంబంధాల ప్రాబల్యం అధికంగావున్న ఈ సామాజిక వ్యవస్థలోపలనే మనుష్యుని శ్రమ చేయగల వుత్పత్తి క్రమంగా పెరుగుతుంది. దానితోపాటు వ్యక్తి గత ఆస్తి, మార్పిడీ, ఐశ్వర్యంలో హెచ్చుతగ్గులూ, ఇతరుల శ్రమ

---

బడింది. బ్రిటన్‌లో దొరకడం చాలా కష్టతరంగా వుంది. రచయిత ఇప్పటికి కొద్ది సంవత్సరాలక్రితమే మరణించాడు. (ఫ్రెడరిక్ ఏంగిల్సు వ్రాసిన పదవ్యాఖ్య)

* మోర్గన్ వ్రాసిన ప్రాచీన సమాజంయొక్క క్రోడీకరణ – అంటూ మార్క్స్ వ్రాసినదానినిగురించి ఏంగిల్సు ఉద్దేశం. మార్క్స్– ఏంగిల్సు ఆర్చీవ్స్, సం. 9. మాస్కో 1941 – సంపాదకుడు.

శక్తిని ఉపయోగించుకోగల అవకాశాలూ ఎక్కువవుతాయి. వర్గవైరుధ్యాలకు పునాది ఏర్పడుతుంది. సమాజంలో తల ఎత్తిన నూతన శక్తులు కొన్ని తరాల పాతసమాజ వ్యవస్థను నూతన పరిస్థితులకు అనుగుణంగా చక్కదిద్దేటందుకు ప్రయత్నం చేస్తాయి. కాని ఆ రెంటికీ పొసగదు. దానితో పూర్తి విప్లవం వచ్చేస్తుంది. నూతనంగా సమాజంలో వృద్ధిపొందిన వర్గాల ఘర్షణలో స్త్రీ పురుష సంబంధాలమీద ఆధార పడివున్న సమాజం విశీర్ణం అయిపోతుంది. దాని స్థానంలో రాజ్యాంగాలుగా ఏర్పడిన నూతన సమాజం ఆవిర్భవిస్తుంది. ఈ నూతన సమాజంలోని యూనిట్లు స్త్రీ పురుష సంబంధాలమీద ఏర్పడిన జన సమూహాలు కాదు, ప్రాంతీయ జనసమూహాలుగాని. ఈ సమాజంలో కుటుంబవ్యవస్థ ఆస్తిపద్ధతులమీద ఆధారపడి వుంటుంది ఈనాటి వరకూ మనకు లభిస్తున్న లిఖితచరిత్ర వర్గవైరుధ్యాలు పోరాటాలచరిత్ర. ఆ వర్గవైరుధ్యాలూ, పోరాటాలూ ఈ నూతన సమాజంలో యథేచ్ఛగా పరిణతి పొందుతాయి.

లిఖితచరిత్రకు వెనుకనున్న ఆదిమ చరిత్రలోని ప్రధానాంశాలను కనిపెట్టి, మోర్గన్ వాటిని క్రమరూపంలో పెట్టాడు. ప్రాచీనగ్రీకు, రోమను, జర్మను చరిత్రల్లో అపరిష్కృతంగా మిగిలిపోయిన అతిముఖ్యములయిన సమస్యలకు సమాధానాన్ని ఆయన ఉత్తర అమెరికాలోని ఇండియన్ తెగల దాంపత్య ముఠాల జీవితపద్ధతులలో కనుక్కున్నాడు. అదే ఆయన గొప్పతనం. ఆయన ఒక్కరోజుపాటు కూర్చుని వ్రాసేసిన పుస్తకం కాదది. నలభయ్యేళ్ళపాటు కుస్తీపట్టి, విషయాలన్నీ కరతలామలకం చేసుకొని వ్రాసిన పుస్తకం అది. మన రోజుల్లో వెలువడిన ఉత్తమ పుస్తకాలలో అదొకటి అనడానికి కారణం ఇదే.

దిగువ వ్రాసిన పుస్తక విషయాలు చదివినప్పుడు దానిలో మోర్గన్ పుస్తకంలోంచి పునహరించిన వేమిటో, నేను వ్రాసినవేమిటో పాఠకుడికి సులభంగానే తెలుస్తుంది. గ్రీసు, రోముల చరిత్రకు సంబంధించిన ప్రకరణాలలో నేను మోర్గన్ వ్రాసిన సంగతులతో సరిపుచ్చుకోకుండా నా వద్దనున్న ఇతర వృత్తాంతాన్నికూడా పునయోగించుకొన్నాను. కెల్టులు-

జర్మన్ల గురించి వ్రాసిన ప్రకరణాలు పూర్తిగా నావే: దీని విషయంలో మోర్గన్ ఇతరులు చెప్పిన వృత్తాంతాలమీద పూర్తిగా ఆధారపడవలసి వచ్చింది. జర్మనీ పరిస్థితుల విషయంలో ఆయన ఒక్క టాసిటస్ మినహా మిగిలిన దానినంతనూ ఫ్రీమన్ యొక్క తుక్క, తప్పుడు వ్రాతలనుంచి తీసుకొన్నాడు. ఇంక ఆయన తెచ్చిన ఆర్థిక విషయాల సాక్ష్యం ఆయన అవసరాలకు సరిపడింది; కాని, నా పుస్తకానికది చాలదు, అందుచేత ఆ విషయాలన్నీ నా వివరణలే. ఇంక మోర్గన్ అభిప్రాయమని నేను స్పష్టంగా వ్రాయనిభావాలు, అభిప్రాయాలూ కేవలం నావే.

ఫ్రె. ఏంగిల్సు.

15

# నాలుగో ముద్రణ (1891)

# ఉపోద్ఘాతం *

ఈ పుస్తకం ఇంతవరకు వేల సంఖ్యలో ముద్రించబడినా, ఆరు నెలలనుంచి ప్రతులు దొరకడంలేదు. కొత్త ముద్రణకు ఏర్పాట్లు చేయించమని కొంతకాలంగా ప్రచురణకర్త నన్ను అడుగుతున్నాడు. కాని, ఇతర తొందర పనులుండడం మూలంగా ఆ విషయం చూడలేక పోయాను. ఈ పుస్తకం మొదట ముద్రించబడి అప్పుడే ఏడేళ్ళయింది. ఈ మధ్యకాలంలో కుటుంబాల ఆదిమరూపాల్ని గురించి మనకు ఎక్కువ సంగతులు తెలిశాయి. అందుచేత, శ్రద్ధతీసుకొని కొంత వివరించడమూ, విస్తరించడమూ చాల అవసరం. లేక ఇప్పుడు దీని నిల్లాగే స్టీరియోచేసి పంపేస్తే, కొంతకాలంవరకూ దీనిలో మార్పులు చేయడానికి నాకు కుదరదు. **

---

* ఈ పీఠికను ప్రథమంలో Die Neue Zeit (Jahrg 1890-91 Bd. 2. Heft 41, S. 460) లో వ్యాసరూపంలో ముద్రించబడింది. ఆ వ్యాసం పేరు "ఆదిమ కాలపు కుటుంబ చరిత్ర గురించి" (బాకోఫెన్ మాక్లెన్నాన్, మోర్గన్) — సంపాదకుడు.

** Die Neue Zeit లో మిగతావాక్యం ఇల్లావుంది. "కొత్త ముద్రణ ఈ నాడు జర్మను సోషలిస్టు సాహిత్యం మామూలుగా ప్రచురించబడుతున్న పరిమాణంలో వుండాలి. ఆ పద్ధతి ఇతర జర్మను పుస్తక ప్రచురణ వ్యాపార రంగంలో అపరిచితం."

అందుచేత పుస్తకాన్నంతనూ జాగ్రత్తగా సంస్కరించాను. దీనికి సంబంధించిన విజ్ఞానశాస్త్రంలో ఈనాడు వచ్చిన అభివృద్ధులను గమనికలో పెట్టుకొని, చాలచోట్ల కొత్తవిషయాలుచేర్చాను. మోర్గన్ పరిశోధనలు సమాజంయొక్క ఆదిమకాల చరిత్రకు సంబంధించిన అభిప్రాయాలను పూర్తిగా మార్చేసినాయి. ఆదిమకాల చరిత్రలో ప్రత్యేకాధ్యయనం చేసిన బ్రిటిష్ చరిత్రకారులు జాతి దురహంకారపు పోకడలతో మోర్గన్ పరిశోధనల విషయమై మూకీభావం వహించి వానిని తొక్కెయ్యాలని చూస్తున్నారు. అలాగని ఆయన పరిశోధనల ఫలితాలను స్వీకరించకపోవడంలేదు. * అందుచేత బాకోఫన్ కాలంనుంచి, మోర్గన్‌వరకూ కుటుంబ చరిత్రలో వచ్చిన పరిణతిని ఈ పీఠికలో సంగ్రహంగా వ్రాస్తున్నాను.

నా పుస్తకాన్ని చాల భాషలలోకి అనువదించేరు. మొదట వచ్చింది ఇటాలియన్ భాషలో తర్వాత 1885 సెప్టెంబరునుంచి 1886 మే వరకు రుమేనియను భాషాపత్రిక Contemporanul అనే యాస్సీ మాస పత్రికలో తర్వాత 1888 లో కోపెన్ హాగన్‌లో డేనిష్ భాషలో వచ్చింది. ఇప్పుడు తయారవుతున్న జర్మను ముద్రణ ననుసరించి హెన్రీ రావే వ్రాసిన ఫ్రెంచి అనువాదం ప్రస్తుతం అచ్చు అవుతూంది.

పద్దెనిమిదివందల అరవైదాకా కుటుంబాన్నిగురించి వ్రాసిన చరిత్ర గ్రంథమే లేదు. మోసెస్ అయిదు పుస్తకాలలోనూ వున్నదేదో అదే కుటుంబ చరిత్రకు సంబంధించిన విజ్ఞానం. మోసెస్ పుస్తకాలలో వర్ణించినంతగా పితృస్వామిక కుటుంబ వ్యవస్థనుగురించిన వివరాలు మరి దేంట్లోనూ లేవు. ఆ కుటుంబవస్థతే చిర కాలంగా వున్నదనుకున్నారు. ఒక్క బహుభార్యాత్వం తప్ప మిగిలిన విషయాలన్నింటా ఈ నాటి బూర్జువా కుటుంబ పద్ధతి పై దానికి ప్రతిబింబమే ననుకున్నారు. చరిత్రగతిలో కుటుంబ పద్ధతులలో మార్పేమీ రానట్లే! మహా అయితే మరీ ఆదిమదశలో వావివరసలు లేకుండా స్త్రీ పురుషులు కలుస్తుండే

---

* ఇతర దేశాలలోకూడ ఇంగ్లీషువాళ్ళు తొక్కిన పంథానే తరుచుగా అనుసరిస్తున్నారు.

వారనీ. అటువంటి దశ వుండేదనీ వొప్పుకొనేవారు. యూరపులో దంపతీ (monogamy) పద్ధతి వుండగా, తూర్పు దేశాలలో బహు భార్యాత్వం, ఇండియాలో కొన్నిచోట్లా, టిబెట్లో కొన్నిచోట్లా, బహు భర్తృత్వం ఆచారంలో వున్నాయని యెరుగుదురు. చరిత్ర క్రమంలో ఈ మూడింటి స్థానం ఏమిటో తెలియదు. ఈ మూడూ ఏకసమయంలో ఒకదాని ప్రక్క నొకటి వుంటున్నాయనీ, వానికేమీ సంబంధంలేదనీ అనుకొన్నారు. ప్రాచీన కాలంలో కొంతమంది ప్రజలలోనూ, ఇప్పటికీ ఆటవికులలోనూ కుటుంబంలో పరంపరను తల్లివేపు నుంచేగాని తండ్రివేపు నుంచి లెక్కించరు, ఇప్పటికీ అనేకమంది ప్రజలలో, కొంతకొంత మంది జనసమూహాల మధ్య వివాహాలు నిషిద్ధం. ఈ విషయం గురించి ఆనాడు సూక్ష్మంగా పరిశీలన జరగలేదు. పైగా ఈ ఆచారం ప్రపంచంలో అన్నిమూలల్లోనూ కనిపిస్తూంది. ఈ సంగతులు అందరికీ తెలుసు. రోజు రోజూ ఇంకా కొత్తసంగతులు దృష్టికి వస్తున్నాయి. కాని వాటిని ఎల్లా అర్థంచేసుకోవాలో ఎవ్వరూ ఎరగరు. 1865 లో ఇ. బి. టైలర్ "మనుష్యజాతి ఆదిమకాల చరిత్రను గురించిన పరిశోధనలు" అంటూ

---

ఒక పుస్తకం వ్రాశాడు. దానిలో ఇవన్నీ "చిత్రమైన ఆచారాలు" అంటూ వ్రాశాడు. ఆటవిక ప్రజలలో కొందరు కాలుతున్న కర్రను ఇనుప పనిముట్లతో ముట్టుకోరు. ఇల్లాంటివే అనేక తెలివితక్కువ, బూటకపు మతాచారాలు బోలెడున్నాయి. వివాహ నిషేధాలు మొదలయినవన్నీ ఆ మాదిరివే అనుకొన్నారు.

1861 లో బాకోఫెన్ Mutterecht (తల్లి పరంపర) ప్రచురించబడింది. కుటుంబంయొక్క చరిత్రను గురించి అధ్యయనం చేయడం అప్పటినుంచే ప్రారంభమయింది. బాకోఫెన్ తన పుస్తకంలో ఈ విషయాలు వివరించాడు :

1. ప్రారంభదశలో మానవసమాజంలో స్త్రీ పురుషులు వావివరసలు లేకుండా దాంపత్యసంబంధాలు కలిగివుండేవారు. దాని కాయన 'భోగంవృత్తి' (Hetaerism) అని పేరుపెట్టాడు. ఆ పేరు సరిపడదు.

2. వావివరసలు లేకుండా యధేచ్ఛాసంబంధాలు పెట్టుకోవడం వలన పిల్లలతండ్రి ఎవరో తెలియదు. కనక, కుటుంబపరంపర తల్లి వేపునుంచే లెక్కపెట్టడం సాధ్యం. ఈ పద్ధతి ప్రాచీనకాలంలో అందరు ప్రజలలోనూ వుండేది.

3. చిన్నకారు అందరూ తల్లిదండ్రులలో తల్లి నొకర్తెనే గుర్తు పట్టగలరు. ఆ కారణంచేత స్త్రీలకు చాల మర్యాద, గౌరవభావం చూపించేవారు. దానిని ఆయన 'ఆడవాళ్ళ రాజ్యం'గా (Gynecocracy) భావించాడు.

4. దంపతీ వివాహపద్ధతిలోకి, అంటే ఒక ఆడుది ఒకే మగ వానికి భార్యగావుండే పద్ధతిలోకి మార్పురావడం అంటే ఆదిమకాలపు మతనియమాలను ఉల్లఘించడమే నన్నాడు. (నిజానికి వుల్లంఘించినది మతనియమాన్నికాదు. ఒక ఆడుదానితో సంబంధం పెట్టుకొనేటందుకు మగవాళ్ళందరికీ హక్కువుంది. అది అనూచానంగా వస్తున్న హక్కు. ఆ హక్కు నిరాకరించబడింది.) అల్లాగ ఉల్లంఘించినందుకు తప్పు యిచ్చుకోవలసివుం దన్నాడు. అంటే హక్కు కోల్పోయినవాళ్ళు అల్లరి చేయకుండా ఊరుకునేటట్లు చేయాలి. దానికోసం నియమితకాలంపాటు ఆడుది మిగిలిన మగవాళ్ళందరితో కలిసేది. అదే ఆమె చెల్లించవలసిన తప్పు.

ఆయన యెంతో ఓర్పూ, నేర్పుతో ప్రాచీన ప్రామాణిక గ్రంథాలనుంచి పైవానికి యెన్నో ఉదాహరణలను పోగుచేశాడు. మతసంబంధమైన కొత్తకొత్త భావాలు పరిణతిపొంది, పాత దృక్పథాన్ని ప్రతిబింబించే పాతదేవతల మందిరంలోకి నూతన దృక్పథాల్ని ప్రతిబింబించే కొత్తదేవతల్ని ప్రవేశపెట్టినాక క్రమంగా పాతవాళ్ళు మూలబడ్డారు. ముఖ్యంగా గ్రీకుల్లో యిది జరిగింది. దీని ఫలితంగానే 'భోగంవృత్తి' నుంచి "దంపతీ" పద్ధతి పరిణతి పొందిందని బాకోఫెన్ అభిప్రాయం.' అంటే తల్లిపరంపర పోయి తండ్రిపరంపర వచ్చిందన్నమాట అన్నాడు. స్త్రీ పురుషుల సాంఘిక స్థాయిలో వచ్చిన చారిత్రకమైన మార్పులకు మనుష్యుల నిజపరిస్థితు

లలో వచ్చిన మార్పులు కారణం అనిగాక, ఆ నిజపరిస్థితులను ప్రతిబింబించే మతసంబంధమైన భావనలే వానికి కారణమని ఆయన అభిప్రాయం. క్షీణించిపోతున్న తల్లి పరంపరకూ, విజయవంతంగా పైకివస్తున్న తండ్రి పరంపరకూ మహావీర యుగంలో జరిగిన పోరాటాన్ని ఐస్కిలస్ తన ఒరెస్టియాలో అద్భుతంగా చూపించాడని బాకోఫెన్ చూపించాడు. తన ప్రియుడైన అజిస్థస్‌కోసం క్లితామ్నెస్త్రా అప్పుడే ట్రోజాయుద్ధంనుంచి ఇంటికి తిరిగి వచ్చిన తన మగడు అగమెమ్నాన్‌ను చంపేసింది. కాని, అగమెమ్నాన్ వలన క్లితామ్నెస్త్రాకు పుట్టిన కొడుకు ఓరెస్టెస్ తల్లిని చంపేసి తన తండ్రిని చంపినందుకు కసి తీర్చుకున్నాడు. ఆ పని చేసినందుకు ఎరినెస్ (ఉగ్రదేవతలు) ఆతనిని తరమడంప్రారంభించాయి. తల్లిపరంపరనుకాపాడుతున్నభయంకరదేవతలవి. వాని అభిప్రాయంప్రకారం మాతృహత్య మహానీచమైన అపరాధం. దానికి ప్రాయశ్చిత్తంకూడా లేదు. కాని అపాలో, అధినాలు ఆతనిని కాపాడారు. అపాలో ఆకాశవాణిద్వారా ఓరెస్టెసును రెచ్చగొట్టి, అతనిచేత ఈ హత్య చేయించాడు. ఈ తగాదాలో మధ్యవర్తిత్వానికి అధినాను పెట్టారు. అపాలో, అధినాలు కొత్త దేవతలు. తండ్రి పరంపరమీద ఆధారపడిన నూతన వ్యవస్థకు వారు ప్రతినిధులు. అధినా ఉభయపక్షాలవారి వాదనలనూ వింటుంది. ఆ సమయంలో ఓరెస్టెస్‌కూ, ఎరినెస్‌కూ మధ్య జరిగిన వాదోపవాదాలను వింటే, అసలు తగాయిదా క్లుప్తంగా అర్థం అవుతుంది.

క్లితామ్నెస్త్రా రెండు అపరాధాలు చేసిందని ఓరెస్టెస్ అంటాడు: ఆమె తన భర్తను చంపింది. అంటే, తన తండ్రిని చంపింది. తనకంటె ఎక్కువ నేరస్థురాలైన క్లితామ్నెస్త్రాను వదిలి ఎరినెస్ తన వెంటబడ్డారెందుకు?

దానికిచ్చిన సమాధానం గమనించవలసి వుంది.

"ఆమెకూ, ఆమె చంపినవానికీ రక్తసంబంధంలేదు"

దీని అర్థం ఏమిటి? రక్తసంబంధీకుడు కాని వానిని చంపడం క్షమార్హం. హంతకురాలికి హతుడు మగడే అయినాసరే. ఆ విషయాన్ని

ఎరినెస్ పట్టించుకోరు. రక్త సంబంధీకులమధ్య జరిగిన హత్యలకు ప్రతీకారం చేయడమే వాళ్ళవని. తల్లి పరంపర ప్రకారం మాతృహత్య మహాపాపం !

ఆ సమయంలో ఓరెస్టెస్ తరపున అపాలో కలుగచేసుకొంటాడు. అథీనియన్ జూరీలయిన అరియో, పాజిటెస్‌లను ఈ సమస్యపై తమ అభిప్రాయం ఇవ్వవలసిందిగా అథీనా ఆహ్వానిస్తుంది. జూరీలలో విక్షించి పెట్టాలనేవాళ్లూ, శిక్షించాలనేవాళ్లూ సమానసంఖ్య అయ్యారు. న్యాయాధికారిణిగా అథీనా తన వోటును ఓరెస్టెసుకు అనుకూలంగా ఇచ్చింది. ఆయనను వదలేశారు. ఆ విధంగా తల్లి పరంపరను తండ్రి పరంపర దిగతొక్కేసింది. ఎరినెస్ అన్నట్లు "తరువాతి తరం దేవతలు" వారిని ఓడించారు. తర్వాత కొత్తవ్యవస్థలో ఎరినెస్ దేవతలు మరో ఉద్యోగం స్వీకరించేటట్లు వొప్పించారు.

ఓరెస్టియాకు బాకోఫెన్ చేసిన ఈ వ్యాఖ్య సరియైనదే. ఆయన పుస్తకంలోకల్లా ఈ ఘట్టం చాల అందమైనదీ, శ్రేష్ఠమైనదీను. కాని బాకోఫెన్‌కూడా ఐస్కిలస్ లాగే ఎరినెస్ అపాలో, అథీనాల అస్తిత్వాన్ని విశ్వసించాడు. మహావీర యుగంలో గ్రీసుదేశంలోవారు తల్లి పరంపరను రద్దుపరచి తండ్రి పరంపరను స్థాపించారని భావించాడు. ప్రపంచచరిత్రను నడుపుతున్నది మతమే ననే అభిప్రాయం చివరికి తాంత్రికవాదంగా (Mysticism) పరిణమించడంలో ఆశ్చర్యంలేదు. అందుచేత బాకోఫెన్ వ్రాసిన ఆ మహాగ్రంథాన్ని చదవడానికి ఎంతో కష్టపడ్డా ఫలితం అట్టే వుండదు. కానీ, కొత్త విషయాలను వెలుగులోకి తెచ్చిన గొప్పతనం అంతమాత్రంచేత కొరవడదు. వావివరసలు లేకుండా స్త్రీ పురుష సంబంధాలు అమలుజరిగిన రోజు లుండేవంటూ అంతవరకూ చెప్పుకొనేవారు. అంతే. గ్రీకులలోనూ, ఆసియా వాసులలోనూ ఒకప్పుడు బహుభార్యాత్వమే కాకుండా బహు భర్తృత్వంకూడా ఆచరణలో వుండేదనీ, దంపతీవ్యవస్థ తర్వాత తర్వాత వచ్చింది మాత్రమేననీ, ఆ ప్రాచీనకాలపు పరిస్థితిని గురించిన వుదాహరణలు ప్రాచీన వాఙ్మయంలో బోలెడున్నాయనీ ఆయన సోదాహరణంగా చూపిం

చాడు; ఆ ప్రాచీనాచారం పోయి దంపతీ వ్యవస్థ వచ్చినప్పుడు స్త్రీలు ఈ హక్కును కొనుక్కోడానికి పరిమితరూపంలో లొంగుబాటు చూప వలసి వచ్చిందనీ, ఈ ఆచారం వెనుకటి పరిస్థితులకు చిహ్నమాత్రంగా మిగిలిందనీ ఆయన చూపించాడు; అందుచేతనే వంశవృక్షాన్ని మొదట తల్లి పరంపరలోనే గుణించవలసివచ్చింది అన్నాడు; దంపతీ వ్యవస్థలో పిల్లలతండ్రి ఎవరో ఖచ్చితంగా తెలుస్తుంది. కనీసం ఫలానావాడు తండ్రి అని చెప్పవచ్చును. అయినా, ఆ వ్యవస్థ ఏర్పడ్డాక కూడ చాలకాలంవరకూ తల్లి పరంపరే గణనలో వుండేది అన్నాడు; పిల్లల తల్లిదండ్రులలో తల్లి ఒక్కర్తె మాత్రమే గుర్తుతెలిసే అవకాశం వుండడంచేత స్త్రీలకు సమాజంలో ఉన్నత స్థానం వుండేదనీ, అటు తర్వాతకాలంలో అది పోయిందనీ అన్నాడు. అయితే, బాకోఫెన్ ఈ విషయాలను ఇంత స్పష్టంగా పెట్టలేదు. ఆయనకు తాంత్రిక దృక్పథమే లేకుండావుంటే చెప్పగలిగేవాడు; అయితేనేం, అవి నిజమేనని నిరూపించాడు. 1861 లో అదొక గొప్ప విప్లవమే.

బాకోఫెన్ తన మాతృభాషయైన జర్మనులో ఆ మహా గ్రంథం వ్రాశాడు. ఆ రోజుల్లో జర్మనులకు ఈనాటి కుటుంబ వ్యవస్థయొక్క పూర్వచరిత్రను తెలుసుకోవాలనే ఆసక్తి ఇతరుల కున్నంతగా వుండేది కాదు. అందుచేతనే ఆయనను గురించి మిగిలినవాళ్ళకు తెలియనే తెలియదు. ఈ విషయంమీదనే 1865 లో మరో పుస్తకం వచ్చింది. కాని, దానిని వ్రాసిన ఆయనకు బాకోఫెన్ అనే ఆయన వున్నాడనే సంగతి కూడా తెలియదు.

1865 లో పుస్తకం వ్రాసిన ఆయనపేరు జె. ఎఫ్. మాక్లెన్నాన్, ఈయన పుస్తకం బాకోఫెన్ రచనకు పూర్తిగా విరుద్ధం బాకోఫెన్ది తాంత్రిక దృక్పథమేగాని మనిషి మంచి సమర్థుడు. మాక్లెన్నాన్ శుష్కవాదియైన లాయరు. కవి సహజమైన భావనాచాతుర్యంకన్న ఒక వకీలు తన కేసును వాదిస్తున్న విధంగా వ్రాశాడు. వధువును ఆమె బంధువుల నుంచి తన స్నేహితుల సహాయంతో వరుడు ఎత్తుకుపోతున్నట్లు నటించి పెళ్ళి చేసుకొనే పద్ధతి (దీనిని భారతీయులు రాక్షస వివాహం

పేరుతో పిలుస్తారు - అను.) అనేకమంది ఆటవిక, అనాగరిక ప్రజలలోనేగాక నాగరిక ప్రజలలోకూడ కనిపిస్తుందని మాక్లెన్నాన్ వ్రాశాడు. వెనుకటి అలవాటునుబట్టి వచ్చిన ఆచారం యిది. ఆ రోజులలో ఒక తెగవాళ్లు మరో తెగలోని పడుచుల్ని బలవంతంగా యెత్తుకొనిపోయి పెళ్ళి చేసుకొనేవారని ఈ ఆచారంపట్టి తెలుసుకోవచ్చు. అయితే ఈ 'రాక్షసవివాహ' పద్ధతి యెందుకు వచ్చింది? మగవాళ్ళకి కావలసిన భార్యలు వాళ్ళ తెగలలోనే లభ్యమైనంతవరకు ఇటువంటి అలవాటు రావలసిన అగత్యంలేదు. కొన్ని తెగలలో జనం వేర్వేరు గుంపులుగా విభజింపబడి వుంటున్నారు (1865 వరకూ పొరపాటున యీ గుంపుల్నే తెగలుగా భ్రమపడేవారు). ఆ గుంపులలో వాళ్లు తమ తమ గుంపులోనివాళ్ళనే పెళ్ళిచేసుకోకూడదు. ఒక గుంపులోని స్త్రీలు మరో గుంపులోంచి భర్తల్ని తెచ్చుకోవాలి. అలాగే మగవాళ్లూను. ఇంక కొన్ని తెగలలో మరో ఆచారం వుండేది. గుంపులలోని ఆడవాళ్ళూ, మగవాళ్ళూ గుంపులోని వాళ్ళనే పెళ్ళి చేసుకోవాలి. ఈ రెండు తరహాల ఆచారాలలోనూ మొదటి పద్ధతికి బహిర్వివాహపద్ధతి (exogamy) అనీ, రెండో దానికి అంతర్వివాహ పద్ధతి (endogamy) అనీ మాక్లెన్నాన్ పేరు పెట్టాడు. బహిర్వివాహపద్ధతిని అనుసరించే తెగలకూ, అంతర్వివాహ పద్ధతి ననుసరించే తెగలకూ మధ్య పేచీ వున్నదనేశాడు. బహిర్వివాహ పద్ధతిని గురించి తాను చేసిన పరిశోధనలే ఈ వైరుధ్యం తన కల్పనతప్ప వేరు కాదని నిరూపిస్తూన్నా, దానిమీదనే తన వాదనలన్నీ నడిపాడు: బహిర్వివాహ పద్ధతి ననుసరించే తెగలు తమ భార్యల్ని పై తెగలనుంచే తెచ్చుకోవాలి ఆటవికదశలో తెగకీ తెగకీ మధ్య ఎప్పుడూ యుద్ధస్థితే గాని శాంతిస్థితి వుండదు, అందుచేత పై తెగలనుంచి భార్యల్ని తెచ్చుకోవాలంటే యుద్ధం అనివార్యం - ఇదీ ఆయన సిద్ధాంతం.

మాక్లెన్నాన్ ఇంకా ఇల్లా వాదించాడు : ఈ బహిర్వివాహపద్ధతి యెప్పుడొచ్చింది? రక్తసంబంధమూ, వావీ అనేవి అటుతర్వాత ఎప్పుడో వచ్చాయి కనక ఈ ఆచారం వాటి మూలంగా వచ్చి వుండదు. ఆటవిక

లలో ఆడుపిల్లల్ని పుట్టగానే చంపెయ్యడం అలవాటు ఒకటి వుంది. బహుశా ఆ అలవాటు మూలంగానే ఈ పద్ధతి వచ్చి వుంటుంది. ఆడ పిల్లల్ని చంపే అలవాటుమూలంగా ప్రతి తెగలో మగవాళ్లు ఎక్కువుం టారు. ఆడవాళ్లు తక్కువ. అందుచేత చాలమంది మగవాళ్లు కలిసి ఒక ఆడుదానిని పెట్టుకొంటారు. ఆ విధంగా బహు భర్తృత్వం వచ్చింది.

దీనికి ఫలితంగా, పిల్లలకు తల్లిమాత్రమే తెలుస్తుంది. తండ్రి ఎవరో తెలియదు. అందుచేత వంశవృక్షం మగవానివేపునుంచిగాక ఆడు దాని వేపునుంచి లెక్కిస్తారు. ఆ విధంగా తల్లి పరంపర వచ్చింది. తెగలో ఆడవాళ్లు తక్కువగా వుండడంవలన మరో ఫలితం కలిగింది. బహు భర్తృత్వంవలన ఆ లోపం తీరదు. కనక, ఇతర తెగలనుంచి బలవంతంగా స్త్రీలను ఎత్తుకురావడం అలవాటు వచ్చింది - ఇదీ ఆయన వాదం.

"తెగలో స్త్రీలు తక్కువగా వుండడంలోనే బహిర్వివాహ పద్ధతీ, బహు భర్తృత్వమూ వచ్చేయి. కనక, బహిర్వివాహ పద్ధతి ఆచారంగా వున్న తెగలన్నీ ఒకప్పుడు బహు భర్తృత్వాన్ని ఆచరించినవే అయి వుంటాయి - * అనుకోవాలి....అందుచేత బహిర్వివాహ పద్ధతి ఆచా రంగా గల తెగలన్నింటా ప్రప్రథమంలో బంధుత్వం రక్తసంబంధాన్ని బట్టే తల్లులద్వారా మాత్రమే గుర్తించబడేది. ఈ విషయంలో సందేహం అనవసరం."

(మాక్లెన్నాన్, ప్రాచీన చరిత్ర పరిశీలన 1886. ఆదిమ వివాహ పద్ధతి, పుట 124).

బహిర్వివాహపద్ధతి అంటూ ఆయన పేరుపెట్టిన ఆచారం సర్వత్రా వుండేదనీ, దానికి చాల ప్రాముఖ్యం వుందనీ చూపించడమే మాక్లె న్నాన్‌లో వున్న విశిష్టత. ఐతే, బహిర్వివాహపద్ధతిని ఆచరించే తెగలున్నా యనే విషయాన్నికనిపెట్టిన దాయనకాదు. ఆ వివాహపద్ధతి ఆయనకు అర్థం

* గీతలు ఏంగిల్సువి.

కానూలేదు. పరిశీలకులు చాలామంది దీనినిగురించి విషయ సంగ్రహణం చేశారు. వాటిని మాక్లెన్నన్ తన గ్రంథంలో వుపయోగించుకొన్నాడు కూడా. అదిగాక లాథామ్ అనే ఆయన 'మానవజాతుల వివరణ' (1851) అనే పుస్తకంలో ఈ పద్ధతి మాగార్ ఇండియన్లలో వున్నదని చెప్పి, దాని వర్ణనం సరిగ్గా ఇచ్చాడు. ఆ పద్ధతి ప్రపంచం మొత్తంమీద అన్ని చోట్లా వుండేదన్నాడు. ఆ వాక్యాలను మాక్లెన్నాన్ తన పుస్తకంలో వుదహరించాడు. 1847 లో మోర్గన్ 'అమెరికన్ రివ్యూ' అనే పత్రికలో ఇరాక్వా తెగలను గురించి కొన్ని వ్యాసాలు లేఖల రూపంలో వ్రాశాడు 1851 లో 'ఇరాక్వాల సమితి' అనే పేరున వ్రాశాడు. ఈబహిర్వివాహపద్ధతి ఇరాక్వాలలోవున్నదని ఆయన దానిలో నిరూపించాడు. దాని స్వరూపాన్ని యథాతథంగా వర్ణించాడు. కాని మాక్లెన్నాన్ వకీలు ధోరణిలో దానిని గంద్రగోళపరిచాడు బాకోఫెన్ తాంత్రికవాద కల్పన తల్లి పరంపరను గంద్రగోళ పరచింది.

తల్లి పరంపరలో వంశక్రమాన్ని లెక్కగట్టడం పద్ధతి ప్రప్రథమంలో వుండేదని గుర్తించడం మాక్లెన్నాన్ గొప్పదనమే ననాలి, అయితే ఈ విషయాన్ని బాకోఫెన్ తనకన్న ముందే వూహించాడని తర్వాత తర్వాత ఆయనే వ్రాశాడు. అయితే ఈ విషయంలో కూడా మాక్లెన్నాన్ ఆలోచనలు విస్పష్టంగా లేవు. "స్త్రీలద్వారానే బంధుత్వం పరిగణించబడేద"ని ఆయన పొడుగునా వాసన వ్రాశాడు. ఈస్థితి ప్రాథమికదశలో మాత్రమే వుండేది. తర్వాత వంశక్రమాన్నీ, వారసత్వాన్నీ స్త్రీవైపునుంచే పరిగణించుతూన్నా, బంధుత్వాన్ని మగవానివైపునుంచికూడా లెక్కపెట్టేవారు. ఈ దశనుగురించి చెప్పేటప్పుడుకూడా మాక్లెన్నాన్ "స్త్రీలద్వారానే బంధుత్వం పరిగణించబడేద"ని వ్రాస్తూ వచ్చాడు. న్యాయవాదుల ఆలోచనాపద్ధతులలోని పరిమితులను మనం ఇక్కడ చూడగలం. వారు ఒక న్యాయసూత్రాన్ని గట్టిగా పట్టుకొంటారు. పరిస్థితులలో వచ్చిన మార్పుల ఫలితంగా ఆ సూత్రంలో మార్పులు తీసుకురాక తప్పకపోయినా వారు దానికి పూనుకోరు. ఆ సూత్రాన్ని యథాతథంగానే వర్తింపచేయడానికి పూనుకుంటారు. అదే ఇక్కడా కనబడుతుంది.

మాక్లైన్నాన్ సిద్ధాంతం సరియైనదే అయినా, ఆయనకే దానికి తగిన సాక్ష్యం లేదనిపించింది.

"అపహరణ (నటన - ఏంగిల్సు) ద్వారా భార్యల్ని తెచ్చుకొనే పద్ధతి ఇప్పుడు మగవాని* ద్వారా బాంధవ్యాన్ని గుర్తించే అలవాటు ఏర్పడిన తెగలలోనే విస్పష్టంగా కొట్టవచ్చినట్లు కనబడుతూంది." (పుట 140) మరోచోట మళ్ళీ ఇల్లా వ్రాశాడు :

"ఈనాడు ఎక్కడా శిశుహత్యను ఒక ఆచారంగా అనుసరిస్తున్నది లేదు. ఆదిమకాలపు బంధుత్వ పరిగణనపద్ధతీ, బహిర్వివాహ పద్ధతీ ఒకే చోట వున్నదీలేదు. ఇదో చిత్రమైన విషయం." (పుట 146).

ఈ రెండు విషయాలూ ఆయన నిర్వచన సరికాదని చూపిస్తున్నాయి. అందుచేత సరికొత్త చిక్కు కల్పనలు, వూహలతో తన వాదనను బలపరచుకొనేటందుకు పూనుకొన్నాడు.

అయినా, ఆయన సిద్ధాంతాన్ని ఇంగ్లండులో చాల అభినందించారు. దానిమీద ఎంతో ఆసక్తి కనబరిచారు. కుటుంబం యొక్క చరిత్రను ప్రప్రథమంలో సంధానపరచినవాణ్ణిగా ఆయనను గౌరవించారు. ఆయన అభిప్రాయాలను ప్రామాణికంగా తీసుకున్నారు. బహిర్వివాహపద్ధతీ, అంతర్వివాహపద్ధతీ ఆచరించే 'తెగల'మధ్య వైరుధ్యాలున్నాయని ఆయనచేసిన సిద్ధాంతానికి కొన్ని మినహాయింపులనూ, మార్పులనూ అంగీకరించినా ఆ అభిప్రాయాన్ని మాత్రం వదలకుండా పట్టుకుని కూర్చున్నారు, చివరకు స్వతంత్రంగా, స్వేచ్ఛగా పరిశీలించడానికి వీలులేకుండా గంతకట్టినట్లు ఆటంకంగా అది తయారయింది. ముందుకెళ్ళడం అసాధ్యమయింది. మాక్లెన్నాన్ సిద్ధాంతాన్ని ఇంగ్లండులో స్వీకరించడం, వాళ్ళతోపాటు ఇతరత్రాకూడా ప్రామాణికంగా తీసుకోవడం జరిగింది. బహిర్వివాహ పద్ధతిని అనుసరించే తెగలకూ, అంతర్వివాహపద్ధతిని అనుసరించే తెగలకూ మధ్య వైరుధ్యాలున్నాయంటూ

* అంటే వంశక్రమాన్ని మగవానివైపునుంచి పరిగణిస్తున్న వారిలోనే అని అర్థం... ఏంగిల్సు.

ఆయన చేసిన సిద్ధాంతం పొరపాటు అనీ, అది ఆయన చేసిన పరిశోధన లలోని మంచినికూడా నిష్ప్రయోజనం చేసి, ఎంతో అపకారాన్ని తెచ్చి పెట్టిందనీ ఇక్కడ చెప్పడం అవసరం.

ఈలోపున ఎన్నో కొత్తసంగతులు బయటపడ్డాయి. అవేవీ మాక్లెన్నాన్ పథకంలో ఇమడలేదు. ఆయనకు తెలిసిన వివాహపద్ధతులు మూడుమాత్రమే : బహు భార్యాత్వం. బహు భర్తృత్వం, దంపతీపద్ధతి. అయితే ఈ వివాహాల విషయంలో పరిశోధన జరిగినకొద్దీ మరో వివాహ పద్ధతికూడా అమలులో వున్నట్లు ఎన్నో నిదర్శనలు కనిపించాయి. కొంత మంది మగవాళ్ళు కలసి, కొంతమంది ఆడవాళ్ళను సామూహికంగా పెళ్ళి చేసుకోవడం అనేది వెనుకబడివున్న తెగలు కొన్నింటిలో కనబడింది. ఈ సామూహిక వివాహం (Communal marriage) చారిత్రకంగా సత్యమేనని లుబ్బక్ తన 'నాగరికత పుట్టుపూర్వోత్తరాలు' (1870) అనే పుస్తకంలో వ్రాశాడు.

అటుతర్వాత కొద్ది నెలలకే 1871 లో మోర్గన్ ఎన్నో కొత్త సంగతులను దృష్టిలోకి తెచ్చాడు. అవి అనేక సమస్యల్ని పరిష్క రించాయి. ఇరాక్వాలలో అమలులో వున్న బంధుత్వ పద్ధతే అమెరికా లోని ఆదిమజాతుల వారందరిలోనూ వున్నదనే నిర్ణయానికి ఆయన వచ్చాడు. అదే ఆ ఖండం అంతటా వ్యాప్తిలో వుందన్నాడు. ఆ చిత్ర మైన బంధుత్వ పద్ధతికీ, వివాహరీత్యా ఏర్పడే బంధుత్వ పద్ధతికీ వైరుధ్యం వున్నదని గ్రహించాడు. అప్పుడు ఒక ప్రశ్నావళినీ. పట్టికనూ తయారుచేసి, దానిప్రకారం ఇతర ఆదిమప్రజలలో అమలులో వున్న బంధుత్వ పద్ధతుల సమాచారాన్ని సేకరించవలసిందని ఆయన అమెరికా ప్రభుత్వాన్ని కోరాడు. వారిచేత ఆపని చేయించాడు. ఆ సమా చారాన్ని పరిశీలించాక ఆయన తేల్చిన వివి :

1. అమెరికాలోని ఇండియను తెగలలో అమలులో వున్న బంధుత్వ పరిగణనపద్ధతులే ఆసియాలోని అనేక తెగలవారిలో వున్నాయి. ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలోని తెగలవారిలో అవే కొద్ది మార్పులతో వున్నాయి.

2. ఈనాడు హవాయ్ దీవులలోనూ, ఇతర ఆస్ట్రేలియన్ దీవుల లోనూ వున్న తెగలవారిలో ఒక విధమైన సామూహిక వివాహ పద్ధతి అమలులోవుంది. ఆ పద్ధతి యిప్పుడు అంతరించిపోతూవుంది. ఆ వివాహపద్ధతినుంచి అమెరికన్ ఇండియన్ తెగలలోని బంధుత్వపరిగణన పద్ధతికి గల మూలాన్ని అర్థంచేసుకోవచ్చును.

3. హవాయ్ మొదలయిన దీవులలోని వివాహపద్ధతులకు భిన్నమైన బంధుత్వ పరిగణనపద్ధతి అక్కడ అమలులోవుంది. దానినిబట్టి ఒకరోజున ఆ దీవులలో మరొక విధమైన వివాహపద్ధతి అమలులో వుండేదనీ, అదిప్పుడు అంతరించిపోయిందనీ తెలుస్తుంది.

ఈ విధంగా పోగుచేసిన విషయాలనూ, వాటినిబట్టి తేలుతున్న ఫలితాలనూ కలిపి ఆయన 1869 లో "రక్తసంబంధాలా, బంధుత్వాలా వ్యవస్థలు" - అనే పుస్తకాన్ని ప్రచురించాడు. దానితో ఈ విషయంపై చర్చలు పలుముఖాలుగా వ్యాపించడానికి తోడ్పడ్డాడు. ఆయన బంధుత్వ పరిగణనపద్ధతులతో ప్రారంభించి దానికి అనుగుణంగావుండే కుటుంబం యొక్క స్వరూపాన్ని నిర్ధారణచేశాడు. ఆ విధంగా మానవజాతి యొక్క ఆదిమ చరిత్రనుగురించి పరిశోధించేవారికి నూతన మార్గాలను చూపాడు. పరిశోధనలు చాల వెనుకటికాలంలోకంటా సాగించడానికి వీలు కలిగించాడు. ఈ పద్ధతిని సరియైనదిగా భావించేటట్లయితే మాక్లెన్నాన్ కల్పన అంతా యెగిరిపోతుంది.

'ఆదిమకాలపు వివాహవ్యవస్థ' (ప్రాచీన చరిత్ర పరిశోధనలు, 1876)ను సంస్కరించి కొత్తగా తెచ్చిన ముద్రణలో మాక్లెన్నాన్ తన సిద్ధాంతాన్ని సమర్థించుకొనేటందుకు పూనుకున్నాడు. తాను తయారు చేసిన కుటుంబవ్యవస్థ చరిత్ర నంతనూ ఆయన వట్టి వూహలమీద ఆధారపడి తయారుచేసినదే. కాని, లుబ్బక్‌నూ మోర్గన్‌నూ ప్రతి వాక్యానికీ సాక్ష్యాధారాలేమిటో చెప్పమని కూర్చున్నాడు. స్కాట్లండు కోర్టుల్లో అడిగేమాదిరిగా ఎదురు మాటకవకాశం లేని గట్టి సాక్ష్యం కావాలన్నాడు. జర్మనులలోనూ, బ్రిటనులలోనూ, ఇతరత్రానూ బహుభర్తృత్వం అమలులో వుండేదని ఆయన చేసిన సిద్ధాంతానికి సాక్ష్యం ఏమిటి? జర్మను

లలో మేనమామకూ, మేనల్లునికీ చాల దగ్గర బంధుత్వం పరిగణించబడుతుండేదనిటాసిటస్ వ్రాశాడు. (జర్మనియా, ప్రకరణం 20)పది, పన్నెండు మంది బ్రిటనులు కలిసి సమష్టిగా భార్యల్ని కలిగివుండేవారని సీజరు వ్రాశాడు. అనాగరిక ప్రజలలో స్త్రీలను సామూహికంగా భార్యలనుగా అనుభవించడం ఆచారం వున్నదని వెనుకటి రచయితలు చాల మంది వ్రాసిపెట్టారు. ఇవన్నీ చూపిస్తూ మాక్లెన్నాన్ వెనకముందు లేకుండా తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఫిర్యాదీతరఫు వకీలు తన యిష్టంవచ్చినట్లల్లా ఆరోపణలు చేయడానికి అవకాశం ఇచ్చి, నిందితుని తరఫున ఆడే ప్రతి మాటకూ సాక్ష్యం కావాలని అడిగినట్లేవుంది, మాక్లెన్నాన్ ధోరణి.

గుంపుపెళ్ళి అనేది వట్టి భావనమాత్రమే నన్నాడు. ఆ విధంగా మాక్లెన్నాన్ బాకోఫెన్‌కన్న వెనక్కిపోయాడు. ఇండియను తెగలు పరాయివాళ్ళనుకూడా, చివరకు తెల్లవాళ్ళని సహా 'అన్న', 'అయ్యా' అనడం మామూలనీ, అందుచేత మోర్గన్ తన్నివేసిన బంధుత్వపు పిలుపులన్నీ సాంఘిక మర్యాదలు మాత్రమేననీ ఆయనఅన్నాడు. కాథలిక్ మత బోధకుల్ని 'అయ్యా' అనీ, మతబోధకురాండ్రని 'అమ్మా' అనీ అంటారు. సన్యాసులూ, సన్యాసినులూ, ఫ్రీమాసన్‌లూ ఇంగ్లండులోని వృత్తిసంఘాల సభ్యులూ తమ సమావేశాలలో 'అన్నా', 'చెల్లమ్మా' అని పిలుచుకుంటారు. గనక, ఈ అమ్మ, అయ్య; అన్న, చెల్లాయి వగైరా మాటలు మర్యాద వాచకాలు తప్ప వాటికి మరో ప్రత్యేకత లేదన్నట్లే వుంది, ఈ వాదన. మాక్లెన్నాన్ వాదనలో, నిజానికి పస ఏమీలేదు.

అయితే ఒక్క విషయంలో మాత్రం ఆయన వాదనల కెవరూ ఎదురు చెప్పలేదు. బహిర్వివాహ పద్ధతి అమలులోవున్న తెగలకూ, అంతర్వివాహ పద్ధతిని అనుసరించే తెగలకూ చుక్కెదురు అంటూ ఆయనచేసిన సిద్ధాంతాన్ని కాదన్నవారులేరు. దానిమీదనే ఆయన వ్రాసిన కుటుంబచరిత్ర అంతా ఆధారపడివుంది. అందుచేత కుటుంబం యొక్క చరిత్రగతికంతకూ ఆ తెగలమధ్య వ్యతిరేకతే మూలాధారం అనే అభిప్రాయం ప్రచలితంగా వుండిపోయింది. ఈ వ్యతిరేకతను చూపి అసలు

విషయాన్ని సమర్ధించాలంటే కుదరడంలేదనీ, ఆయన సేకరించిన సమాచారానికీ, దానికీ పొసగడం లేదనీ వొప్పుకుంటారు. అయినా రెండు పరస్పర విరుద్ధాలయిన ఆచారాల్ని అనుసరించే తెగలున్నాయనీ, వాని మధ్య పేచీలున్నాయనీ చెప్పేమాటను వేదవాక్యంలా శిరసావహించారు. ఎ గిరాడ్-తులా వ్రాసిన "కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు" (Origines de la famille 1871,), ఆఖరికి లుబ్బక్ వ్రాసిన "నాగరికత పుట్టుపూర్వోత్తరాలు" (నాలుగోముద్రణ 1882) దీనికి వుదాహరణగా చెప్పవచ్చును.

మోర్గన్ ప్రధాన రచన 'ప్రాచీన సమాజం' (1877) యొక్క ప్రాముఖ్యత ఇక్కడనేవుంది. దానిని ఆధారం చేసుకొనే నేనీ పుస్తకము వ్రాశాను. మోర్గన్ 1871లో తాను చూచాయగా కనబరచినవిషయాన్నిదీనిలో సమగ్రంగా ఆకళింపుచేసుకొని విస్తరించాడు. బహిర్వివాహ పద్ధతికీ, అంతర్వివాహ పద్ధతికీ పోటీ ఏమీలేదు. ఈ క్షణంవరకు బహిర్వివాహ పద్ధతిని ఫలానా తెగలు అనుసరిస్తున్నాయని చెప్పేటందుకు సాక్ష్యం ఏమీలేదు. ఏదోఒకప్పుడు ప్రతిచోటా గుంపుపెళ్ళి పద్ధతి అమలులో వుండేది. ఆ రోజుల్లో తెగ అనేక గుంపులుగా విభజింప బడివుండేది. ప్రతిగుంపులోనివాళ్ళూ తల్లివేపునుంచి రక్తసంబంధంకలిగి వుండేవారు. ఈ విధమైన గుంపులు లేక గణాలలోని సభ్యులు అ గణంలోని వారినే పెళ్లిచేసికోకూడదు. అంటే ఒక్కొక్కగణంలోని మగవాళ్ళు తమ తెగ లోంచే భార్యల్ని తెచ్చుకొన్నా, వారి భార్యలు మాత్రం పై గణాలనుంచి వచ్చినవాళ్ళవుతారు. అంటే ప్రతి గణములోనూ అంతర్వివాహం నిషిద్ధం. కాని, ఈ గణాలన్నీ చేరి ఏర్పడిన తెగలో అంతర్వివాహమే అమలులో వుండేది. దీనితో మాక్లెన్నాన్ నిర్మించినట్టి ఊహాసౌధంయొక్క చివరి అవశేషాలు కూలిపోయాయి.

మోర్గన్ ఇంతతో ఆగలేదు. అమెరికన్ ఇండియన్ తెగలలో కనబడిన గణాల్ని ఆధారం చేసుకొని ఆయన తన పరిశోధనలలో మరో అడుగు ముందుకు వేశాడు. తల్లి పరంపర ననుసరించి గణాలు ప్రప్రథమంలో ఏర్పడ్డాయనీ, వానిలోంచి తండ్రి పరంపర ప్రకారం ఏర్పడిన

గణాలు పరిణతి పొందాయనీ ఆయన కనిపెట్టాడు. ప్రాచీనకాలపు నాగరిక ప్రజలలో మనం చూస్తున్న తండ్రి పరంపర ననుసరించేగణాలు ఆ విధంగా ఏర్పడినవే అన్నాడు. గతంలో చరిత్రకారు లందరికీ గ్రీకు, రోమను గణాలు అంతుపట్టేవి కావు. అమెరికను ఇండియను గణాలను చూడడంతో వాని విషయమూ అర్థం అయింది. ఆదిమ సమాజ చరిత్రకు మూలం ఏమిటో అర్థం అయింది.

జీవశాస్త్రానికి డార్విన్ పరిణామ సిద్ధాంతం ఎంత ముఖ్యమో, ఆర్థికశాస్త్రానికి మార్క్స్ అదనపువిలువ సిద్ధాంతం యెంత ముఖ్యమో, నాగరిక ప్రజలలో కనిపించే తండ్రిపరంపర గణాలకు పూర్వం తల్లి పరంపరగణాలు వుండేవని మోర్గన్ కనిపెట్టిన అంశంకూడా అంతే ముఖ్యం. దీనిని ఆధారంచేసుకొని ఆయన కుటుంబవ్యవస్థయొక్క చరిత్రను మొట్టమొదటిమారు రేఖామాత్రంగా చిత్రించాడు. కుటుంబ వ్యవస్థయొక్క పరిణామంలో వచ్చే ప్రధాన దశలను ఆయన దానిలో చూపాడు. మనకు దొరికినంతవరకు సమాచారాన్నిబట్టి వానిని మనం స్వీకరించవచ్చును. ఆదిమ చరిత్ర రచనలో ఒక నూతనయుగం దీనితో ప్రారంభమయిం దనవచ్చును. ఈ విజ్ఞానశాస్త్ర శాఖకు తల్లిపరంపర గణాలు కీలకం అయాయి; వానిని కనిపెట్టినప్పటినుంచీ మనం మన పరిశోధనలను ఏ దిశగా సాగించాలో, వేటిని పరిశోధించాలో, మన పరిశోధనల ఫలితాలను ఏ విధంగా వర్గీకరించాలో మనకు అర్థం అయింది. అందుచేత ఇతఃపూర్వంకన్న మోర్గన్ పుస్తకం వచ్చాక ఈ విషయంలో మనం వేవేగంగా ముందుకు పోగలుగుతున్నాం.

మోర్గన్ కనిపెట్టిన విషయాలను ఇప్పుడంతా అంగీకరిస్తున్నారు. అంతకంటే, ఇంగ్లండులోని ఆదిమ చరిత్ర పండితులు, అవి తమవయి నట్లే వుపయోగం చేసుకుంటున్నారు అంటే సరిగా వుంటుంది. మన దృక్పథాలలో వచ్చిన ఈ మార్పుకు కారణం మోర్గనేయని వారిలో ఒక్కరైనా బహిరంగంగా చెప్పరు. ఇంగ్లండులో ఆయన పుస్తకం సాధ్యమైనంతవరకు కనబడకుండా చేశారు. ఆయన వ్రాసిన వెనుకటి పుస్తకాలేవో పేర్కొని వాటి రచయితగా అభినందిస్తున్నారు; ఆయన కనిపెట్టిన

మహత్తర విషయాలను గురించి పెదవి విప్పరు. వానిని సమర్థిస్తూ చేసిన వివరణలను పట్టుకొని విమర్శలు సాగిస్తారు. 'ప్రాచీన సమాజం' మొదటి ముద్రణ అయిపోయింది; ఈ మాదిరి పుస్తకాలు అమెరికాలో ఎక్కువగా అమ్మవు. ఇంగ్లండులో చూస్తే ఈ పుస్తకాన్ని పనికట్టుకుని కనబడకుండా చేసినట్లు కనబడుతూంది. నూతన యుగాన్ని నిర్మించిన ఈ ఉద్గ్రంధం ఇప్పుడు మార్కెట్టులో జర్మన్ భాషలో మాత్రమే దొరుకుతూంది.

దీనికి కారణం ఏమిటి? ప్రాచీనచరిత్ర పండితులు తమ రచనలలో మర్యాదకోసం ఆయన పుస్తకాలనుంచి చాలా భాగాల నుదహరిస్తున్నారు. ఇతర విధంగా మర్యాదలు చూపుతున్నారు. అయినా, ఆయన పుస్తకం మార్కెట్టులో దొరకదు. దీనిని చూస్తే, బుదిపూర్వకంగానే మూకీభావం వహించి, దానిని వ్యాప్తిలోకి రాకుండా చెయ్యాలనే తలపెట్టారనిపిస్తుంది. దీనికి కారణం, మోర్గన్ అమెరికను కావడం కాదుగదా? తమకుకావలసిన విషయాలను సేకరించుకోవడంలో బ్రిటిష్ ప్రాచీనచరిత్ర పండితులు చూపే శ్రద్ధా, జాగ్రత్తా ప్రశంసనీయాలు. ఆ విషయాలనూ, తమ భావాలను ఒక క్రమపద్ధతిలో పెట్టుకొనేటందుకు కావలసిన దృక్పధాన్నీ ఇద్దరు విదేశీయులనుంచి - బాకోఫెన్, మోర్గన్‌లనుంచి - తీసుకోవలసి రావడం వారికి బాధ అనిపిస్తూందో, యేమో. జర్మనీవాడంటే, పోనీ అనుకోవచ్చు కాని, అమెరికను? అమెరికా దేశీయునిముందు బ్రిటిష్ వాళ్ళల్లో దేశభక్తి ఆవేశాలు పొంగిపొరలుతాయి. నేను అమెరికాలో వున్నప్పుడు చాల తమాషాయైన సంఘటనలను చూశాను.. దీనికితోడు ఇంగ్లండులోని ప్రాచీనచరిత్ర పండితులందరికీ మాక్లెన్నాన్ నాయకుడూ, ఆది పురుషుడూను. శిశుహత్యలు, బహు భర్తృత్వం, తల్లి పరంపర కుటుంబాలలో రాక్షస వివాహపద్ధతులు గురించి ఆయన తయారుచేసిన ఊహాజనిత సిద్ధాంతాలను ఎంతో భక్తి, విశ్వాసాలతో పునరుచ్చరిస్తుంటారు. బహిర్వివాహ పద్ధతినీ, అంతర్వివాహ పద్ధతినీ అనుసరించే పరస్పర వ్యతిరేకములయిన 'తెగలు' వున్నాయంటూ ఆయన చేసిన సిద్ధాంతాన్ని ఎవరన్నా కాదంటే మీదపడిపోతారు. దైవదూషణగా భావిస్తారు.

ఆ తప్పు సిద్ధాంతాలను ఎగరకొట్టేసిన మోర్గన్ వారి దృష్టిలో దైవద్రోహం చేసినట్లే. పైగా, ఆయన ( మోర్గన్ ) తన అభిప్రాయాల్ని బహు సున్నితంగా పెట్టాడు. వాటిని విన్నవాళ్ళెవరూ కాదనలేరు; అంతవరకూ బహిర్వివాహ పద్ధతికీ. అంతర్వివాహ పద్ధతికీ మధ్య కొట్టుమిట్టాడుతున్న మాక్లెన్నాన్ భక్తులు ఆ వాదాన్ని వినగానే, ఆశ్చర్యంతో జుట్టు పీక్కోవలసివచ్చింది. "ఇంత స్వల్పవిషయం ఇంతకాలంగా మన కెందుకు తోచలేదా" యని వాళ్ళ ఆశ్చర్యం.

ఇదేమీ చాలనట్లు మోర్గన్ నాగరికతను విమర్శించాడు. పెట్టుబడి దారీ సమాజాన్ని విమర్శించాడు. ఫొరియర్ ధోరణిలో యీనాటి సామాజిక వ్యవస్థకు పునాదిగావున్న వర్తకపు సరకుల ఉత్పత్తి పద్ధతిని విమర్శించాడు. కారల్‌మార్క్సు వుపయోగించే మాటలలో భావిసమాజ పరిణామాన్ని గురించి మాట్లాడాడు. దానితో ఆయన పాప భాండం నిండింది. తగిన శిక్ష లభించింది. మాక్లెన్నాన్‌కు ఆయనమీద కోపంవచ్చి "చారిత్రక దృక్పథం" ఆయనలో లేదన్నాడు. జెనీవా నివాసి ప్రొఫెసర్ గిరాద్ - తులా కూడా 1884 లో మోర్గన్ గురించి అదేమాట అన్నాడు నిజానికి మాక్లెన్నాన్ తెచ్చిన బహిరంతర్వివాహాల మధ్య చిక్కుపడి పదేళ్ళక్రితం యీ గిరాద్ - తులా గిలగిలలాడిపోతూంటే (1874 Origine de la famille) మోర్గనే ఆయనను బయటకు లాగాడు.

ప్రాచీన చరిత్రలో మోర్గన్ తీసుకొచ్చిన ఇతరమార్పుల్ని గురించి ఇక్కడ వ్రాయడం నాకు అనవసరం అవసరమైనంత వరకు పుస్తకం లోనే ఎక్కడికక్కడవుదాహరించాను. ఆయన వ్రాసిన ఈ ప్రధాన గ్రంథం వెలువడి అప్పుడే పద్నాలుగేళ్ళయింది. ఈ మధ్యకాలంలో ప్రాచీన కాలపు మానవ సమాజవ్యవస్థను గురించి మనకెన్నో కొత్త సంగతులు తెలిశాయి. మానవజాతివిజ్ఞానశాస్త్రజ్ఞులు, దేశ సంచారులు, ప్రాచీనచరిత్ర పండితులేగాక వేర్వేరు కాలాలలోని ధర్మశాస్త్రాల్ని ఒకదానితో ఒకటిపోల్చి అధ్యయనం చేస్తున్నవారుకూడా రంగంలోకి దిగారు. అనేక కొత్తసంగతులనూ, ఆలోచనలనూ మనముందు పెట్టారు. దీనిఫలితంగా, కొన్నివిషయాలలో మోర్గన్ ఆలోచనలు తప్పుఅని తేలింది.

కాని ఆ కొత్తవిషయాలేవీ ఆయనే చెప్పిన ప్రధానాంశాలను తోసివేయ లేదు. ప్రాచీనకాలపు చరిత్రను ఆయన అమర్చిన పద్ధతే మొత్తంమీద ఈ నాటికీ చెల్లుబడి అవుతూంది. ఈ అభివృద్ధిని తెచ్చిన రచయితను దాచిన కొద్దీ, అది అధికాధికంగా జనాదరణ పొందుతూందనికూడా మనం చెప్పవచ్చు.*

ఫ్రెడరిక్ ఏంగిల్సు,
లండన్, 16 జూన్, 1891.

---

* 1888 సెప్టెంబరులో నేను న్యూయార్కునుంచి తిరిగి వచ్చేటప్పుడు ఒక మాజీ కాంగ్రెసు సభ్యుణ్ణి (రోఛెస్టరునుంచి ఎన్నుకోబడ్డాడు) కలుసుకున్నాను. ఆయన లూయీ మోర్గన్‌ను ఎరుగును. కాని ఆయనను గురించిన విశేషాలేవీ చెప్పలేకపోయాడు. రోఛెస్టరులో మోర్గను ఒక సాధారణ పౌరుడుగా మాత్రమే, తన చదువేదో తానేదోగా నివసించాడన్నాడు. మోర్గన్ సోదరుడు ఒక సైన్యోద్యోగి. కర్నలు. వాషింగ్టన్‌లోని యుద్ధశాఖలో పనిచేస్తుండేవాడు. తన సోదరుని సహాయంతో ఆయన తాను చేస్తున్న పరిశోధనల గురించి ప్రభుత్వాధికారులలో ఆసక్తి కలిగేటట్లు చేశాడు. తన రచనలు చాల వానిని ప్రభుత్వం ఖర్చుమీద అచ్చు వేయించాడు. తాను కాంగ్రెసులో ఉన్నప్పుడు ఈ విషయంలో తానుకూడా సహాయపడ్డానని ఆ మాజీ కాంగ్రెసు సభ్యుడు అన్నాడు.

[ఫ్రెడరిక్ ఏంగిల్స్ వ్యాఖ్య]

# 1

# ఆదిమకాల సంస్కృతిలో వివిధ దశలు

విశేష మేధాసంపన్నుడైన మోర్గన్ మానవజాతి ఆదిమకాల చరిత్రను మొట్టమొదటిసారిగా ఒక క్రమపద్ధతిలోకి తేవడానికి ప్రయత్నించాడు. ఏవన్నా అతి ప్రధానములయిన కొత్త సంగతులు తెలియవచ్చి ఆయన అవలంబించిన విభజనపద్ధతిలో మార్పులు తీసుకురావలసిన అగత్యం కలిగితేతప్ప, నిస్సందేహంగా అదే అమలులో వుంటుందని ఆశించవచ్చు.

ఆదిమచరిత్రను ఆయన మూడు ప్రధానయుగాలుగా విభజించాడు. ఆటవిక యుగం, అనాగరిక యుగం, నాగరిక యుగం. వానిలో ఆయన మొదటి రెండు యుగాల్ని గురించీ, అనాగరిక యుగంలోంచి నాగరిక యుగంలో మార్పువచ్చిన సంధిదశను గురించీ మాత్రమే ఎత్తుకున్నాడు. అందులో ఆటవిక, అనాగరికయుగాలు రెంటినీ ఒక్కొక్కదానిని మూడేసి దశలుగా విభజించాడు : దిగువదశ. నడిమిదశ, పైదశ. ఆహారాన్ని ఉత్పత్తి చేసుకొనే పద్ధతిలో మనుష్యుడు పొందిన అభివృద్ధినిపట్టి ఆయన ఈ విభజనచేశాడు. ఏమంటే,

"భూమిమీద మనుష్యుని ఆధిక్యత, ఈ విషయంలో (ఆహారోత్పత్తిలో) ఆతనికున్న చాతుర్యంమీదనే ఆధారపడివుంది. ఆహారోత్పత్తిని పూర్తిగా తన స్వాధీనంలో పెట్టుకోకలిగిన ప్రాణి ఒక్క మానవుడే.

జీవనాధారవస్తువుల విస్తరణా. మానవజాతి అభివృద్ధిలో వచ్చిన ప్రధాన యుగాలూ కొంచెం ఇంచు మించుగా కలసి వున్నాయనవచ్చు."

— మోర్గన్

కుటుంబంయొక్క పరిణామంకూడా వీని ప్రక్కప్రక్కనే నడుస్తుంది. అయితే, అక్కడావిధంగా యుగాల్ని విభజించేటందుకు అనువైన చిహ్నాలు స్పష్టంగా కనబడవు.

## 1. ఆటవిక యుగం

*క. దిగువ దశ :* ఇది మానవజాతియొక్క శైశవదశ అని చెప్పవచ్చు. ఆ దశలో మనుష్యుడు ఇంకా తాను పుట్టిన సమశీతోష్ణ భూములలో, లేదా, ఆ పరిసర మండలాలలో వున్న అరణ్యాలలోనే నివసిస్తున్నాడు అధమం కొంతవరకయినా అతడు చెట్లమీదనే నివసిస్తూ వుండివుండాలి. అధవా, ఆనాటి భయంకర జంతువులకు ఎరగాకుండా బ్రతికివుండగలగడం అసంభవం. ఆ దశలో అతడు పళ్లు, కాయలు, దుంపలు తిని బ్రతికాడు. శబ్దోచ్చారణలో విస్పష్టత ఈ దశలోనే వచ్చింది. ఆ దశలో ఇదే మానవుని ప్రధాన విజయం. మన చరిత్ర పరిశోధనకు అందినంతవరకూ ఈ దశలో నివసిస్తున్న మానవుడు ఎక్కడా కనబడలేదు. అత డీ దశలో కొన్ని వేల సంవత్సరాలు బ్రతికి వుండవచ్చు. అయినా, ఇటువంటి దశ ఒకటి వుండేదని నిరూపించడానికి మనవద్ద ప్రత్యక్షప్రమాణం ఏదీలేదు; కాని, మానవుడు జంతు సముదాయంలోంచి పరిణామం పొందాడనేదానిని మనం అంగీకరించేటట్లయితే, ఈ మాదిరి సంధి దశనుకూడా మనం అంగీకరించవలసి యుంటుంది.

*గ. నడిమి దశ :* నిప్పు వుపయోగాన్ని తెలుసుకోవడం, తిండికి చేపలు, పీతలు, నత్తలు మొదలయిన జలచరాల్ని వుపయోగించడంతో ఈ దశ ఆరంభమవుతుంది. ఈ రెండింటికీ చాల దగ్గర సంబంధం వుంది. నిప్పు నుపయోగించకపోతే చేపలు పూర్తియైన పుష్టి నివ్వలేవు. కొత్తగా లభించిన ఈ పోషక వస్తువుల సహాయంతో మానవుడు

శీతోష్ణపరిస్థితులమీదా, ప్రదేశాల ప్రత్యేకతమీదా ఆధారపడనక్కర్లేకుండా స్వతంత్రుడు కాగలిగాడు. ఆటవిక యుగంలోనే ఆతడు నదులవెంబడి పడీ, సముద్ర తీరాలవెంటబడీ భూమిమీద చాల దూరం వ్యాపించాడు. మనం 'పాలియోలిథ్స్' అని పిలిచే శిలాయుగపు ఆరంభదినాలనాటి మోటు, రాతి పనిముట్లు నేడు ప్రపంచంలో అన్ని ఖండాలలోనూ అక్కడక్కడా కనిపిస్తున్నాయి ఈ పనిముట్లు చాల మోటుగా, పదునులేకుండా బండగా వుంటాయి. ఇవన్నీ పూర్తిగానో, ప్రధానం గానో ఈ దశకు సంబంధించినవే. ఆనాడు మానవుడు వలస పోయాడనడానికి ప్రత్యక్షోదాహరణలు యివే. నూతన పరిసరాలలో మానవుని వస్తునిర్మాణ కౌశల్యానికి నిరంతరం పని కలుగుతూ వచ్చింది; ఒరిపిడినుంచి నిప్పు పుట్టించగలిగాడు. కొత్తకొత్త ఆహార పదార్థాల్ని సంతరించుకోడానికి అది తోడ్పడింది. ఉదాహరణకి – పిండి పదార్థం అధికంగా వుండే వేళ్ళు, దుంపలు మొదలయిన వానిని వేడి బూడిద కుమ్ములోనో, నేల పొయ్యిలలోనో వుడకబెట్టడం నేర్చు కొన్నారు. వారు మొదట కనిపెట్టిన ఆయుధాలు గద, ఈటె. వీటి సహా యంతో జంతువులను వేటాడేవారు. అప్పుడప్పుడు అవి తిండికి దొరికేవి. అంతేగాని పుస్తకాలలో చదివేమాదిరిగా కేవలం వేటమీదనే జీవించిన జాతులు నిజానికెన్నడూ లేవు. వేటతో తిండి సంపాదన ఎప్పుడూ అనిశ్చితమే. బహుశా మనుష్యభక్షణం వచ్చినది ఈ దశలోనే అయి వుంటుంది, ఆహార పదార్థాలు దొరకడం ఎప్పుడూ అనిశ్చితంగా వుండ డమే దానికి కారణం అయివుంటుంది, ఈ అలవాటు ఈ దశనుంచి ఎంతో కాలంవరకూ కొనసాగింది. ఆస్ట్రేలియాలోని ఆదిమవాసులూ, పోలినీషియను*లూ నేడుకూడా ఈ దశలోనే వున్నారు.

చ. *హై దశ* : విల్లూ, అంబూ కనిపెట్టడంతో ఈ దశ ఆరంభమవు తుంది. దీనివలన వేటద్వారా ఆహారం సంపాదించ గలగడం నిత్యసాధ్యం

---

* పసిఫిక్ మహాసముద్రంలో అనేక ద్వీపసముదాయాలు న్నాయి. వానిని పోలినేషియా అంటారు. వానిలోని ప్రజలు పోలి నేషియనులు.

అయింది. వేట నిత్యకృత్యాలలో ఒకటయింది; విల్లు, నారి, అంబు అనేక విషయాల పరిజ్ఞానంతో మాత్రమే నిర్మించగల పనిముట్టు. దీనిని నిర్మించుకోగల వారికి విశేషమయిన అనుభవం, నిశితమైన ఊహాజ్ఞానం ఉందనే అనుకోవాలి. (కుండలు చేయడం నేర్చుకోవడంతో మానవుడు ఆటవిక దశనుంచి అనాగరికదశలోకి మారడం ప్రారంభమవుతుందని మోర్గన్ అభిప్రాయం) కుండలు చేయడం నేర్వలేక పోయినా విల్లంబులు కనిపెట్టిన నాటినుంచే అతడు గ్రామాలలో స్థిరపడడం ఆరంభం అయింది; జీవనాధార వస్తువుల ఉత్పత్తిమీద మరింత ఆధిపత్యం లభించింది.

ఈ దశలో అతడు కర్రతో పాత్రలు, వంటపాత్రలు తయారుచేసినట్లు, చెట్ల బెరడునుంచి నారతీసి, చేతితో వల్కలాలు తయారుచేసుకొన్నట్లు (వారికింకా మగ్గం తెలియదు.), వడపలు, చువ్వలతో బుట్టలు అల్లినట్లు, రాతిపనిముట్లకు వాడితెచ్చినట్లు (నియోలిథిక్స్) మనకు కనబడుతూంది. నిప్పు కనిపెట్టడం: రాతిగొడ్డలిని సంపాదించడంతో బుర్ర దోనెలు (Canoes) సర్వసాధారణం అయినాయి. కొన్నికొన్నిచోట్ల దూలాలూ, వాసాలతో ఇళ్లుకట్టడంకూడా నేర్చుకొన్నారు. ఉదాహరణకి అమెరికా వాయవ్యభాగంలోని ఇండియను*లకు ఇవన్నీ తెలుసు. వారు కుండలు చేయడం ఎరగరు: కాని, విల్లంబులు ఎరుగుదురు. ఇనుపకత్తి అనాగరిక మానవుడికీ, మందుగుండు నాగరిక మానవుడికీ ప్రధానాయుధం అయినట్టే, విల్లంబులు ఆటవికుని ఆయుధం.

## 2. అనాగరిక యుగం

*క. దిగువ దశ :* మట్టిపాత్రలు వాడకంలోకి రావడంతో ఈ దశ ఆరంభమవుతుంది, బుట్టలూ, కర్ర గిన్నెలూ పొయ్యిమీదపెడితే కాలిపోకుండేటందుకు వానికి మట్టిపూత పెట్టే అలవాటు వచ్చివుంటుంది.

---

* తూర్పు ఇండియా దీవుల్లోనూ, పశ్చిమ ఇండియా దీవుల్లోనూ, అమెరికాలోనూ వున్న ఆదిమవాసుల్ని ఇండియను లంటారు.

ఆ అలవాటునుంచి క్రమంగా మట్టిపాత్రలు పుట్టివుంటాయి. ఈలాగే జరిగి వుంటుందనడానికి అనేకచోట్ల రుజువులు కనబడ్డాయి. అల్లా జరగడానికే అవకాశం వుందికూడా. లోపలపాత్ర ఏదీ అవసరం లేకుండా, మట్టి అచ్చుతోనే పనిగడుస్తుందని ఆ తర్వాత కనిపెట్టివుంటారు.

ఇంతవరకూ మనం అనుసరించిన అభివృద్ధిక్రమ సూత్రం సర్వ సాధారణమైనదీ, ప్రజలందరికీ వర్తించేదీను. ఆయా ప్రదేశాల ప్రత్యేక తలతో నిమిత్తం లేకుండా, అన్నిచోట్ల ప్రజలూ ఆయా దశలలో పైన చెప్పిన విధంగానే జీవించివుంటారు. అయితే, అనాగరిక యుగం ఆరంభం కావడంతో, మనుష్యుని అభివృద్ధిలో మలుపులు కనబడ్డాయి. ఇక్కడినుంచి ప్రపంచంలోని వేర్వేరు ఖండాల ప్రకృతి సంపదలలో వున్న వైవిధ్యం అక్కడక్కడుండే ప్రజల అభివృద్ధిపథాన్ని నిర్ణయించ సాగింది. పశువుల్ని మచ్చికచేసి పెంచడమూ, మొక్కా - మొటికా పెంచడమూ అనేవి అనాగరిక యుగంలోని ప్రత్యేక లక్షణాలు. ప్రాచీన ప్రపంచం అని పిలిచే ప్రాచ్యఖండంలో మనుష్యుడు మచ్చిక చేసుకోగల జంతువులన్నీ వున్నాయి. ఒక్కటిమినహా మిగిలిన వ్యవసాయానికి పనికి వచ్చే అపరధాన్యాలన్నీ వున్నాయి. పశ్చిమఖండంలో - అమెరికాలో - మచ్చికయ్యే జంతువు ఒక్క 'లామా' మాత్రమే వుంది అదయినా దక్షిణాన ఏవో కొన్ని ప్రదేశాలలో మాత్రమేవుంది. వ్యవసాయానికి అనుకూలమైన ధాన్యాలలో ఉత్తమం అయిన మొక్కజొన్న ఒక్కటే ఆ భూభాగంలో వుంది. ప్రకృతి సంపదలలో వున్న ఈ వైవిధ్యం కారణంగా భూగోళభాగాలు రెండింటిలోనూ వుండే ప్రజ ఎవరిదారివారు తొక్కారు. ప్రతి ఖండంలోనూ ఆయా అభివృద్ధి దశలను గుర్తించ డానికై వేరువేరు సరిహద్దు గుర్తులు కనిపిస్తాయి.

*గ. నడిమిదశ :* తూర్పుగోళ భాగంలో పశువుల్ని మచ్చికచేయ డంతో ఈ దశ ఆరంభమవుతుంది. ఆహారంకోసం నీటిపారుదల ద్వారా మొక్కల్ని పెంచి వ్యవసాయం చేయడంతో, పచ్చిఇటికల్నీ రాళ్ళనీ వుపయోగించి ఇళ్ళుకట్టుకోవడంతో పశ్చిమార్ధగోళంలో ఈదశ ఆరంభం అవుతుంది.

మన సమాలోచనను పశ్చిమార్థగోళంనుంచి మొదలుపెట్టుకొద్దాం. ఎందుకంటే, యూరపియనుల ఆక్రమణకాలందాకా అక్కడి ప్రజలు ఈ అభివృద్ధిదశను దాటి యెన్నడూ ముందుకు సాగలేదు.

అనాగరిక యుగపు దిగువదశలో వున్న ఇండియన్లు (మిస్సిసిపీ నదికి తూర్పునవున్న గుంపులతో సహా) వారు కంటబడిన నాటికే కొంత వరకు మొక్కజొన్న, సొర. దోస మొదలయినవి పైరు చేస్తున్నారు వారి ఆహారంలో అధికభాగం యివే. వాళ్ళు నివసించే యిళ్ళు బల్ల కూర్పు చేసినవి. గ్రామాలచుట్టూ వాడి గసిగలు పాతి కోరళ్ళు తీర్చారు. కాని, వాయువ్య ప్రాంతంలోని తెగలు ముఖ్యంగా కొలంబియానదీ ప్రాంతాలవారింకా ఆటవిక యుగవు పై దశలోనే వున్నారు. కుండలు చేయడంకాని, మొక్కలు పెంచడంగాని వారికి తెలియదు. రెండోవేపున అమెరికా ఆక్రమణనాటికి న్యూ మెక్సికోలోని 'ప్యూబ్లో' ఇండియన్లూ, మెక్సికన్లూ, పెరూ నివాసులూ, మధ్య అమెరికావాసులూ అనాగరిక యుగపు నడిమిదశలో వున్నారు. పచ్చి ఇటికలతోనో, రాతితోనో కట్టిన కోటలవంటి యిళ్ళల్లో వారు కాపురంవున్నారు. ఎక్కడినుంచో నీరు పారించి మడులుకట్టి, ఆ యా ప్రాంతాలనుపట్టీ. వాతావరణాన్నిపట్టీ మొక్కజొన్నో, ఇతర మొక్కలో పెరుచేస్తున్నారు, వారి ఆహారంలో అధికభాగం యివే. వీరు కొన్ని జంతువుల్ని కూడా మచ్చికచేశారు. మెక్సికన్లు టర్కీకోళ్ళనీ, తదితర పక్షుల్నీ పెంచుతున్నారు. పెరూవి యన్లు * 'లామా' ని పెంచుతున్నారు. వారు ఇనుము నెరగరు. కాని కొన్ని ఇతర లోహాల్ని యెరుగుదురు. దాని ఫలితంగా వారింకా రాతి ఆయుధాలనూ, రాతి పనిముట్లనీ విడువలేకపోయారు. ఇంక స్పానిష్ ఆక్రమణతో స్వతంత్రంగా అభివృద్ధిపొందే అవకాశాలన్నీ నశించి పోయాయి.

ఇక పూర్వార్థగోళంలో పాలకూ, మాంసానికీ పనికివచ్చే జంతు వుల్ని మచ్చికచేయడం ప్రారంభించిననాటినుంచీ అనాగరికయుగపు నడిమిదశ ఆరంభమవుతుంది. ఈ దశలో చాలాకాలం గడిపినాకగాని

---

* పెరూదేశంలో నివసించే ప్రజలు.

ఇక్కడివారు మొక్కల పెంపకం నేర్చినట్లు కనబడదు ఆర్యులూ, సెమైట్లూ * జంతువుల్ని మచ్చికచేసి, పెద్ద పెద్ద మందల్ని పెంచారు. ఇతర అనాగరిక ప్రజలకన్న వారు ముందుకుపోవడానికి కారణమిదేనని పిస్తుంది. యూరపు ఆసియాలలోని ఆర్యనులు నేటికీ పశువులకు ఒకే పేర్లను వాడుతున్నారు. కాని సాగుచేస్తున్న మొక్కలపేర్లుమాత్రం వేరు.

పశువుల మందల్ని పెంచడంవలన వారు అవకాశాలున్నచోట పచ్చిక మైదానాలలో జీవించవలసి వచ్చింది. యూఫ్రేటు, టైగ్రిస్ నదీ తీరాల•లోని పచ్చికబీళ్ళలో సెమైట్లూ, హిందూదేశపు నదీ తీరాలలోనూ, ఆక్సస్, జెక్జార్టెస్ నదుల†తీరాలలోనూ, డాన్, డ్నీపర్ * నదీతీరాలలోనూ వున్న పచ్చిక బీళ్ళలో ఆర్యను తెగలు ఇల్లాగే జీవించారు. బహుశా ఆ బీళ్ళప్రాంతంలోనే వారు పశువుల్ని మచ్చికచేయడం నేర్చుకున్నారేమో. తత్ఫలితంగా తర్వాతితరాలవాడికి యీ బీళ్ళలో నివసిస్తున్న గుంపులు ఆ పచ్చిక ప్రాంతాలలోనే పుట్టినారనిపించివుంటుంది. కాని, నిజానికి యీ బీడుభూములలో మానవజాతి జన్మించే అవకాశం లేదు. వారి పూర్వీకులయిన ఆటవిక మానవులకుగాని, ఆఖరుకు అనాగరికయుగపు దిగువదశలో వున్నవారికిగాని యీ మైదానాలు ఏమాత్రమూ నివాస యోగ్యాలుకావు. పైగా నదీతీరాలలోని పచ్చికమైదానాల జీవితాని కోమాటు అలవాటుపడ్డాక వారు తమ పూర్వులు పుట్టి పెరిగిన ఆ అరణ్యాలలోకి పోడానికి బుద్ధిపూర్వకంగా అంగీకరించరు. అనాగరిక యుగపు నడిమి

---

* సెమ్ అనే పూర్వపురుషునివంశంవారు. ప్రధానంగా యూదుల్ని ఇప్పుడీపేరుతో పిలుస్తారు. అసీరియను, ఆర్మీనియను, హిబ్రూ, ఫొనీషియన్, అరబిక్, ఇథియోపిక్ భాషల్ని సెమెటిక్ భాషలని పిలుస్తారు.

• ప్రస్తుతం ఇరాక్ అని పిలువబడుతున్న దేశభాగంలో ఈ నదులు ప్రవహిస్తున్నాయి.

† ఆక్సెస్‌ను ఆమూదర్యా అనీ, జెక్జార్టెస్‌ను సిర్‌దర్యా అనీ పిలు స్తున్నారిప్పుడు. ఇవి సోవియట్ టర్కమనిస్తాన్‌లో వున్నాయి.

* ఇవి ఈనాటి సోవియట్ యూక్రెయిన్‌లో ఉన్నాయి.

దశలో వున్న మానవుడి స్వభావంకూడా అంతే. తప్పనిసరి పరిస్థితులు వచ్చి, వారు ఒకప్పుడు పశ్చిమదిశకూ, ఉత్తరంవేపూ కదిలారు. అప్పుడైనా పశ్చిమాసియాలోనూ, యూరపులోనూ వున్న అరణ్య భూములలో పోడుకొట్టి, ధాన్యంసాగుచేసి పశువులమేత కూర్చుకున్నారు. అననుకూలమైన ఆ ప్రాంతాలలో శీతాకాలపు చలిలో మందల్ని రక్షించు కొనేటందుకు ఏర్పాట్లు చేసుకొన్నారు. అప్పుడుగాని వారు అటువేపు కదలనేలేదు. ఈ గుంపులవాళ్ళు పశువుల మేతకోసమే మొదట ధాన్యం పండించారు. తర్వాతనే అది మనుష్యుడి ఆహారంలో ప్రధానభాగం అయింది.

పాలూ, మాంసమూ బిడ్డల పెరుగుదలకు బాగా తోడ్పడతాయి. అవి రెండూ సమృద్ధిగావున్న ఆర్యన్, * సెమిటిక్ ప్రజలు బాగా అభి వృద్ధిపొందారంటే బహుశా అవే కారణంఅయి వుండొచ్చు. అనాగరిక యుగపు దిగువదశలో వున్న ఇండియన్లు చేపలూ, మాంసం అధికంగా తింటారు అదే దశలో వున్న న్యూ మెక్సికోలోని 'ప్యూబ్లో' ఇండియన్లు యించుమించు పూర్తిగా శాకాహారులు. వీరిలో ఇండియన్ల మెదడుకన్న ప్యూబ్లో ఇండియన్ల మెదడు చిన్నది. ఇంతకన్న వేరే ప్రమాణం అవసరంలేదు. ఏది ఏలావున్నా మనుష్యభక్షణం ఇప్పటినుండే క్రమంగా తగ్గిపోయింది. కేవలం ఒక మతాచారంగానో, ఇంద్రజాలానికి సాధనం గానో (ఈ దశలో ఇంద్రజాలం కూడా మతాచారాలతో ఇంచుమించు సమానమైనదే;) మాత్రమే అది మిగిలిపోయింది.

---

* బాస్కులు, తురుష్కులు, మాగ్యార్లు, ఫిన్నిషు, మరికొంత మందీతప్ప ఇతర యూరపియనులూ, ఆర్మీనియా, పర్షియా ఉత్తర హిందూస్థానంలోని ప్రజలూ ఆర్యమ జాతులుగా పేర్కొనబడతారు. ప్రాచీనకాలపు పర్షియాదేశపు తూర్పుభాగంలో 'అరియానా', లేక 'అరియా' అనే ప్రాంతం వుండేది. అక్కడినుంచే ఆర్యనులు నలు మూలలకూ చెదిరి ప్రయాణించేరని చెప్తారు. ప్రస్తుతం పర్షియా కుప యోగించే 'ఇరాన్' అనేదికూడా ఈ మాటనుంచే వచ్చింది.

చ. పై దశ : ముడిఇనుమును కరిగించి పోతపోయడం నేర్చు కొన్న నాటినుంచీ ఈ దశ ఆరంభం అవుతుంది. అక్షరాలసంకేతాలను పెట్టుకొని, వానిని సాహిత్య రచన కుపయోగించడంతో నాగరికయుగం ఆరంభమవుతుంది మానవ సమాజ పరిణామంలో ఇంతవరకూ జరిగి పోయిన దశ లన్నింటి ఉత్పత్తికన్నా ఈ దశలో ఉత్పత్తి చాలా హెచ్చు. (ఒక్క పూర్వార్ధగోళంలో మాత్రమే సమాజం ఈ దశనుదాటిముందుకి పోయిందని పైన మనం తెలుసుకున్నాం) వీర యుగంనాటి గ్రీకులు, రోము నిర్మాణానికి ముందునాటి ఇటాలియనులు, టాసిటస్ కాలంనాటి జర్మనులు, వైకింగ్ * యుగంనాటి నార్సిమన్♦ వీరంతా ఈ దశకు చెందినవారే.

అన్నింటికన్న ముఖ్యంగా ఇనపకర్రు వేసిన నాగలి – పశువులచే లాగబడేది – మనకీ దశలోనే కనబడుతుంది. దీని సహాయంతో విస్తృతంగా వ్యవసాయం సాగించడానికీ, పొలాలలో సాగుచేసే పద్ధతిని ప్రవేశ పెట్టడానికీ వీలుచిక్కింది. ఆ విధంగా అంతక్రితంకన్న ఆహార పదార్థాలు అపరిమితంగా దొరకడానికి వీలుచిక్కింది. భూములు దున్నాలన్నా బీళ్లు పెంచాలన్నా అడవులు పోడుకొట్టి బాగుచెయ్యాలి. ఆ పని విస్తారంమీద జరగాలంటే ఇనపగొడ్డలీ, ఇనుప పలుగూ వుండితీరాలి. కాని అప్పటికే జనాభా వేగంగా పెరిగింది. చిన్న చిన్న ప్రదేశాలలో జన సమ్మర్దం ఎక్కువయింది. భూముల్ని దున్ని సాగులోకి తీసుకురాకపూర్వం చాల అసాధారణ పరిస్థితుల్లో మాత్రమే నాలుగయిదు లక్షల జనాభా ఒక కేంద్ర పరిపాలనాసంస్థ క్రింద ఏకమైవుండగలిగేది. బహుశా అటువంటి దెన్నడూ జరిగివుండకపోవచ్చు కూడా.

---

* వైకింగ్‌లు : స్కాండినేవియా తెగలలో ఒకరు. 8, 9, 10 శతాబ్దాలలో వీరు యూరోపు పశ్చిమకోస్తాతీరం అంతా పాకి గగ్గోలు పుట్టించారు.

♦ స్కాండినేవియాలోనివారు.

హోమర్ * గీతాలలో, ముఖ్యంగా ఇలియడ్‌లో మనకు అనాగరిక యుగపు పై దశ మహోన్నత స్థితిలో ఉన్నట్లు మనకు గోచరిస్తుంది. ఆ నాటికి ఇనుప పనిముట్లు బాగా వృద్ధి చెందాయి. కొలిమితిత్తులు, చేతి మరలు, కుమ్మరి సారె కనిపెట్టారు. నూనె తియ్యడం, సారాయికాచడం తెలుసుకున్నారు. లోహ పరిశ్రమ ఒక కళగా వృద్ధి పొందుతూంది. బండి, రధము వచ్చాయి. పలకలతోనూ, దూలాలతోనూ ఓడల్ని నిర్మిస్తు న్నారు. వాస్తువిద్య (గృహ నిర్మాణ విద్య) ఒక కళగా మారుతూంది. బురుజులూ, గోపురాలతో కోటలు కడుతున్నారు. హోమరు కావ్యాలూ, మహా పురాణాలూ వ్రాయబడ్డాయి. గ్రీకులు అనాగరికయుగం నుంచి నాగరిక యుగంలోకి తెచ్చుకొన్న పెన్నిధులు యివీ. సీజరూ, టాసిటసూ వర్ణించిన జర్మనులతో హోమరు వర్ణించిన గ్రీకుల్ని పోల్చిచూస్తే అనాగరిక యుగపు పైదశలో ఉత్పత్తి ఎంత ఎక్కువగా వృద్ధి పొందిందో మనకు అర్థం అవుతుంది. ఆనాటికి జర్మనులు అనాగరికయుగపు పై దశలో అడుగుపెడుతున్నారు. హోమరునాటి గ్రీకులు ఆ దశనుగడిచి ముందుకు అడుగు వేస్తున్నారు.

మానవజాతి ఆటవికదశనుంచి అనాగరికయుగం గుండా నాగరిక దశయొక్క తొలిఘట్టాలకు ఏలా చేరుకుందో మోర్గన్‌ను అనుసరించే నే నిక్కడ సంగ్రహంగా వర్ణించాను. ఇందులో ఎన్నో కొత్త అంశాలు మనకు కనిపిస్తాయి. అవన్నీ ఉత్పత్తిలో వచ్చిన అభివృద్ధిని అనుసరించి సరాసరి తీసుకోవడంచేత యెవ్వరూ వానిని కాదనడానికి వీలుండదు. కాని ఈ పుస్తకం ఆఖరయ్యేసరికి నేను వివరించబోతున్న దానితో పోల్చిచూస్తే మాత్రం యిది పేలవంగానూ, దుర్బలంగానూ కనబడక మానదు. ఏమంటే, ఆఖరుకిగాని, అనాగరిక - నాగరికయుగాల సంధికాలం, వాటిమధ్యగల విస్పష్ట వ్యత్యాసం సంపూర్ణంగా కనబడదు.

---

* గ్రీసుదేశపు చారణకవి. అంధుడు. ఇలియడ్, ఒడెస్సే అనే రెండు వీరరసపూరిత మహాకావ్యాలను వ్రాశాడు. ట్రాయ్‌పట్టణపు ముట్టడి గాథ ఇలియడ్‌లో వర్ణించబడింది.

ఇప్పటివరకు మోర్గనుచేసిన విభజనని యీ విధంగా క్లుప్తీకరించ వచ్చును : ప్రకృతి ప్రసాదించిన వస్తువుల్ని వాని సహజస్థితిలోనే అనుభ వించడం ఆటవికయుగపు ప్రధాన లక్షణం. మానవుడు తయారుచేసు కొనే వస్తువులు ప్రధానంగా ఆ అనుభవానికి సాయపడేవిగా వుంటాయి. కాని అనాగరికయుగంలో మానవుడు పశువుల్ని మచ్చికచేసి. పెంచడం నేర్చుకన్నాడు. వ్యవసాయం ఆరంభించాడు. ప్రకృతి దత్తాలయిన వస్తువుల ఉత్పత్తిని మానవశక్తిద్వారా అధికంచేసే మార్గాలు నేర్చు కున్నాడు. ఇక నాగరికయుగంలో అతడు ప్రకృతి ప్రసాదించిన వస్తు వులమీద యింకా అధికంగా పనిచెయ్యడం నేర్చుకొంటాడు. ఇది పరిశ్రమల యుగం – కళల యుగం.

# 2

# కుటుంబం

ఈ నాడు న్యూయార్కు రాష్ట్రంలో స్థిరపడిపోయిన "ఇరాక్వా" ఇండియన్లమధ్య తన జీవితంలో అధికభాగాన్ని మోర్గన్ గడిపాడు. వారి తెగలలో ఒకటైన 'సెనెకా'లలోకి దత్తుపోయాడుకూడా. ఆతడు వారిలో అమలులోవున్న రక్త సంబంధాలకీ, వాస్తవకుటుంబ సంబంధాలకీ తేడా వున్నట్లు పరిశీలనలో గ్రహించాడు. వారిలో ఒక విధమైన దంపతీ (ఏక భార్య. ఏక భర్తృత్వ) పద్ధతి అమలులోవుంది. అయితే భార్యాభర్తలలో ఏ ఒక్కరైనా సులభంగా ఆ బంధాన్ని తెంచివేసుకోవచ్చు. దానికి ఆయన "జంటపెళ్ళి" అని పేరు పెట్టాడు. వారికి కలిగిన సంతానం ఏ జంట తాలూకు పిల్లలో అందరికీ తెలుస్తుంది అలాగే అంగీకరిస్తారు కూడా. ఎవరు తండ్రి? తల్లి, కొడుకు, కూతురు, తోబుట్టినవాడు, తోబుట్టువు ఎవరో, ఆ పేర్లతో ఎవర్ని పిలవాలో సందేహించవలసిన అవసరం వుండదు. కాని, ఇరాక్వా మగవాడు తన బిడ్డల్నేగాక తన సోదరుల పిల్లల్ని కూడా తన కొడుకులు, తన కూతుళ్ళు అని పిలుస్తాడు. వారుకూడా అతనిని తండ్రి అనే అంటారు. కాని అతడు తన తోబుట్టువుల బిడ్డల్ని మాత్రం మేనల్లుళ్లు, మేనకోడళ్ళు అంటాడు. వా రాతనిని మామ అంటారు. రెండోవేపున ఇరాక్వా స్త్రీ తన ఆడతోబుట్టువుల బిడ్డల్నికూడా తన పిల్లలతోపాటు తన కొడుకులూ, తన కూతుళ్ళూ అనే పిలుస్తుంది. వారుకూడా ఆమెను తల్లి అని

పిలుస్తారు. కాని ఆమె తన తోడబుట్టిన మగవాని బిడ్డల్ని మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు అంటుంది. వారామెను అత్త అంటారు ఆ విధంగా అన్నదమ్ముల బిడ్డలు ఒకరికొకరు తోడబుట్టినవాళ్ళు, తోబుట్టువులూనూ. అక్క చెల్లెళ్ళ సంతానం కూడా అంతే. కాని, స్త్రీయొక్క సంతానమూ ఆమె సోదరుల సంతానమూ ఒకరికొకరు బావలు, వదినలు - ఇవన్నీ వట్టిపేర్లు మాత్రమే అనుకోకూడదు. ఇవి స్వ - పరభావాన్నీ, రక్తసంబంధాలలో వున్న సమానత్వ - అసమానత్వాల్నీ చూపిస్తాయి. ఈ భావాల్ని పట్టి రక్త సంబంధ వ్యవస్థని ప్రస్తరించారు. ఒకే మనిషికి వందలకొలది మందితో బాంధవ్య భేదాల్ని ప్రకటించ వచ్చును. ఇంకో విశేషం కూడా ఉంది. అమెరికాలోని ఇండియను తెగలందరిలో మాత్రమే గాకుండా (ఇంతవరకు మరొక వ్యవస్థ ననుసరించే వారు అక్కడ కనబడ లేదు.) భారతదేశంలోని ఆదిమవాసులలోనూ, దక్షిణ భారతంలోని ద్రవిడ ప్రజల్లోనూ, హిందూస్థానంలోని గౌరా తెగల్లోనూ ఈ వ్యవస్థ ఇంచుమించు యథాతథంగా అమలులోవుంది. నేటికీ దక్షిణ భారత దేశంలోని తమిళులలోనూ, న్యూయార్కు రాష్ట్రంలోని సెనెకా, ఇరాక్వాల లోనూ రెండువందల బంధుత్వములవరకూ ఇల్లాగే సమానంగా కనిపిస్తాయి. అమెరికాలోని ఇండియను లందరిలోమాదిరిగానే భారతదేశంలోని యీ తెగలలోకూడా రక్తసంబంధాల వ్యవస్థకీ, అమలులోవున్న కుటుంబ బాంధవ్యాలకీ వైరుధ్యం వుంది.

దీనికి కారణం ఏమిటి? ఆటవిక, అనాగరిక యుగాలలో వున్న ప్రజల సామాజిక వ్యవస్థలో రక్తసంబంధాలకు నిర్ణయాత్మకమైన ప్రాముఖ్యం వుంది. అందుచేత చాలా ప్రాంతాలలో విస్తరించివున్న ఈ వైరుధ్యాన్ని కేవలం శబ్దప్రయోగాలతో త్రోసిపుచ్చడం సాధ్యం కాదు. అమెరికా అంతటిలోనూ సర్వసాధారణంగా వున్న యీ వ్యవస్థ అక్కడి జాతులతో ఏ విధమైన సంబంధమూలేని ఆసియా ప్రజలలో కూడా వుంది, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో కూడ కొద్ది మార్పులతో యీ వ్యవస్థే కనబడుతూంది. కనక - దానిని ఒక చారిత్రకక్రమంలో

వివరించాలేగాని, మాక్లెన్నాన్* మాదిరిగా ఏదో చెప్పేయ్యకూడదు. తండ్రి, బిడ్డ, కొడుకు, కూతురు మొదలయిన శబ్దాలు కేవలం పిలవ డానికి ఉపయోగపడేవి మాత్రమే కాదు. స్పష్టమైన, చాల ఖచ్చితమైన అన్యోన్య బాధ్యతలు వానిలో యిమిడివున్నాయి. మన మిప్పుడు చర్చిస్తున్న యీ ప్రజల సామాజిక నిర్మాణంలో యీ మొత్తం బాధ్యత లకు చాల ప్రాముఖ్యం వుంది. చివరకు దీనికి సమాధానంకూడా దొరి కింది. సాండ్విచ్ ద్వీపాలలో (హవాయ్) 19వ శతాబ్దం ప్రథమార్థ భాగం నాటికి ఒక విధమైన కుటుంబపద్ధతి అమలులోవుంది.

ఆ కుటుంబంలోని తల్లి, తండ్రి సోదరులు, తోబుట్టువులు, కొడు కులు, కూతుళ్లు, మేనమామలు, మేనత్తలు, మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు సరిగ్గా అమెరికను ఇండియనుల, ప్రాచీనభారతీయుల రక్త సంబంధాలలో సూచించబడుతున్న వ్యవస్థలోనే వున్నారు. అయితే ఇక్కడ మరొక్క తమాషా వుంది. అక్కడ అమలులో వున్న రక్త సంబంధాల వ్యవస్థకీ, ఆనాడున్న కుటుంబ పద్ధతికీ సంబంధం లేదు. హవాయియన్ దీవులలో వున్న రక్త సంబంధ వ్యవస్థ ప్రకారం అక్కచెల్లెళ్ళ, అన్నదమ్ముల బిడ్డ లందరూ ఒకరి కొకరు అన్నదమ్ములూ, అక్క చెల్లెళ్లూను, వారు తమ తల్లి దండ్రులకీ, తల్లి తోబుట్టువులకీ, తండ్రి సోదరులకీ మాత్రమే ఉమ్మడి బిడ్డలు కాదు. తల్లిదండ్రులు ఇద్దరి తోడబుట్టినవాళ్ళకీ, తోబుట్టు వులకీ కూడ ఉమ్మడి బిడ్డలుగానే వారు పరిగణించబడుతారు. అమెరికా లోని రక్త సంబంధాల వ్యవస్థ ఒక ప్రాచీన కుటుంబ పద్ధతిని సూచిస్తూంది, కాని ఆ కుటుంబ పద్ధతిమాత్రం అక్కడ అదృశ్యం అయింది, అయితే అటువంటి కుటుంబం హవాయి ద్వీపాలలో కన బడింది. కాని ఆ ద్వీపవాసుల రక్త సంబంధ సంప్రదాయంచూస్తే అంత కన్నా ప్రాచీనమైన మరో కుటుంబస్థితి కనబడుతుంది. ఆ కుటుంబ

* మాక్లెన్నాన్, జాన్ఫెర్గుసన్. 1827 - 1881. ఆంగ్లేయ శాస్త్రవేత్త. వృత్తిరీత్యా లాయరు. వివాహం, కుటుంబం గూర్చి వ్రాసిన ప్రథమ చరిత్రకారులలో ఒకడు.

పద్ధతి ఈ నాడు ఎక్కడన్నా అమలులో ఉన్నట్లు చూపించలేము. కాని, అటువంటిదొకప్పుడుపుండి తీరాలి: లేకుంటే, అక్కడ కనిపించే రక్త సంబంధ వ్యవస్థ లాంటివి ఎన్నడూ బయలుదేరి వుండవు.

"కుటుంబం అనేది నిత్యం మారుతూ వుంటుంది. అదెప్పుడూ స్థిరంగా వుండదు. సమాజం దిగువ దశనుండి పై దశకు మారుతూన్న కొద్దీ అదికూడా పైపైకి పాకుతూ వుంటుంది.... కాని రక్తసంబంధాల వ్యవస్థ అలా కాదు. అది కదలదు. చాల కాలానికోమారు, కుటుంబంలో వచ్చిన ప్రధానమైన మార్పుల్ని అది నమోదు చేస్తూంటుంది. కుటుంబ వ్యవస్థ పెద్దగామారినప్పుడు అదీ మారుతుంది. అంతవరకదికదలదు."*

— మోర్గన్.

"రాజకీయ, న్యాయ, మత, తాత్విక వ్యవస్థల విషయంలోకూడా, సాధారణంగా ఇంతే జరుగుతుంది. † అన్నాడు మార్క్స్. కుటుంబ పద్ధతి సజీవంగా మార్పులు పొందుతూవుంటే రక్త సంబంధవ్యవస్థ కరడుకట్టిపోతుంది. రక్తసంబంధాలు సాంప్రదాయంగా నిలబడిపోయి వుంటే, కుటుంబం దానిని మించిపోయి విస్తరిస్తుంది. కాని కవీర్ * పారిస్ సమీపంలో దొరికిన ఒక జంతువుయొక్క అస్థిపంజరంలోని, పొత్తికడుపు ఎముక (Marsupial) ను పట్టి అది కంగారూ జాతి జంతువుదనీ, అది ఇప్పుడు అంతరించిపోయినా ఆ జాతి జంతువు ఒకప్పుడు అక్కడ వుండేదనీ నిర్ధారణ చేశాడు. అలాగే మనంకూడా చరిత్రలో మాత్రమే మిగిలిపోయిన రక్తసంబంధవ్యవస్థనుపట్టి, దానికి సరిపడే కుటుంబపద్ధతి ఒకప్పుడక్కడ వుండేదని ఖచ్చితంగా చెప్ప గలుగుతాం.

---

* మోర్గన్ "ప్రాచీన సమాజం" పుట 444.

† Karl Marx-Abstract of Morgan's "Ancient Society, Marx-Engles Archive Vol. IX, P. 21, Moscow 1941.

* జార్జి కవీర్ (1769-1832) ఫ్రెంచి ప్రకృతి శాస్త్రవేత్త, కంపేరటివ్ అనాటమీ, పాలియంటాలజీలను నిర్మించినవాడు.

పైన మనం చర్చించిన రక్తసంబంధ వ్యవస్థలు కుటుంబ పద్ధతులు ప్రకారం ప్రతి బిడ్డకూ ఒకరికంటె ఎక్కువ మంది తండ్రులూ, తల్లులూ కనిపిస్తారు. ఇది నేడున్న పరిస్థితికి విరుద్ధం. అమెరికను రక్త సంబంధ వ్యవస్థతో హవాయియనుల కుటుంబ పద్ధతి సరిపోతుంది. అమెరికను ఆ రక్త సంబంధ వ్యవస్థను బట్టి సోదరీ సోదరులు ఒకే బిడ్డకి తల్లిదండ్రులు కాజాలరని బోధపడుతుంది. కాని హవాయియనుల రక్త సంబంధ వ్యవస్థ సరిగ్గా అల్లాంటి కుటుంబ పద్ధతినే సూచిస్తూంది. మనముందు అనేక కుటుంబ పద్ధతులు ఒకదాని తర్వాత మరొకటి రూపొందడం కనిపిస్తుంది. ఇవి ఇంతకుముందు ఏకైకమాత్రంగా అమల్లో ఉన్నట్లు అంగీకరింపబడ్డ ప్రతి కుటుంబ పద్ధతినీ వ్యతిరేకిస్తూ వచ్చాయి. ప్రస్తుతం మనం సాంప్రదాయ సిద్ధంగా ఏక భార్య, ఏక భర్తృత్వాన్నే అంగీకరిస్తాం. ఒక పురుషుడు ఎక్కువమంది భార్యల్ని కట్టుకొన్నా, ఒకస్త్రీ ఎక్కువమంది భర్తల్నికలిగివున్నా మనం దానిని దాచిపుచ్చుతాం. సమాజం విధించిన ఈహద్దులు సిగ్గూ శరమూ లేకుండా అతిక్రమింప బడుతున్నా, వాటిని ఛాందసులైన నీతిబోధకులవలె మనంకూడా దాటవేస్తున్నాం. కాని, ఆదిమచరిత్ర చదివితే ఏక కాలంలో స్త్రీలు బహు భర్తృత్వాన్నీ, పురుషులు బహు భార్యాత్వాన్నీ అవలంబించిన రోజు లున్నాయని బోధపడుతుంది. అందుచేత బిడ్డల్ని అందరూ ఉమ్మడి బిడ్డలుగానే పరిగణించే వారనీ ఈ పరిస్థితులు ఎన్నో మార్పులు పొంది పొంది చివరకు ఏక భార్యా, ఏకభర్తృత్వ (దంపతీ) పద్ధతి ఏర్పడిందనీ తెలుస్తుంది. ప్రారంభ కాలంలో చాలమంది ఉమ్మడి వివాహబంధంలో ఇమిడి వుండేవారు. కాని క్రమంగా ఒక్కొక్క మార్పు వచ్చినప్పుడల్లా వారి సంఖ్య తగ్గిపోతూ ఉండేది. చివరకు ఆ బంధంలో ఒక్క జంటని మాత్రమే ఇముడ్చుకొనే స్థితి ఏర్పడింది. ఇదే ఈనాడు అమలులో వున్న వివాహపద్ధతి.

ఈ విధంగా, మోర్గన్ కుటుంబంయొక్క పూర్వచరిత్రను పునరా లోకనంచేస్తూ పూర్వం ఒకానొకప్పుడు ఆదిమదశ వుండేదని చెప్పాడు. ఆ దశలో స్త్రీ పురుష సంబంధాలలో ఏ విధమయిన నియమాలూ లేవు.

తెగలోని ప్రతి స్త్రీ ఆ తెగలోని ప్రతి మగవానికీ భార్య. అలాగే ప్రతి పురుషుడూ తన తెగకు చెందిన స్త్రీలందరికీ భర్త. ఇటువంటి కుటుంబ పద్ధతి ఒకనాడున్నదనే విషయంలో మోర్గన్ తన సహచరుల అభిప్రాయంతో ఏకీభవించాడు. 18 వ శతాబ్దంనుంచీ ఇల్లాంటిసమాజంగురించి చెప్పుకోడం వుంది. కాని దానిని గురించి సాధారణ రూపంలో తప్ప పెద్దగా వివరాలు తెలియవు ఆటువంటి స్థితి ఒకటున్నదని గాఢంగా నమ్మి, నష్టశేషమయిన కొన్ని జాడలలోనూ మత సంప్రదాయాలలోనూ దాని అవశేషాల్ని కనిపెట్టడానికి పరిశోధనలు జరిపిన మొదటి వ్యక్తి బాకోఫెన్. * ఆయన గొప్పతనం అందులోనే వుంది. కాని ఆయన జాడలు తీసి కనిపెట్టిన వ్యవస్థ "గుంపు పెళ్ళి" మాత్రమే. ఏ నియమాలూ ఎరగని స్త్రీ పురుష సంబంధాల వ్యవస్థ అంతకు చాలకాలం పూర్వానిది. దాని నాయన వూహిచనేలేదు. ఈ విషయం మనకిప్పుడు తెలుస్తూంది. ఏ నియమాలూ లేని స్త్రీ - పురుష సంబంధాల వ్యవస్థ చాలా పూర్వకాలానిదై వుండాలి. అటువంటి పద్ధతి ఒకనాడు ఉండి వుంటే చాల వెనుక బడియున్న ఆటవిక సమాజాలలో ఘనీభూతంగా నిలిచియున్న అవశేషాల ఆధారంతోతప్ప, ప్రత్యక్షంగా వాని జాడతీయడం ఇంచుమించు అసాధ్యమైన పని. అంత ప్రాచీనదశకు అది చెందినది. ఈ సమస్యను పరిశోధకుల ఎదుటబెట్టి చర్చకు తేవడమే బాకోఫెన్ చేసిన గొప్ప పని.*

---

* జోహాన్ జాకోబ్ బాకోఫెన్. 1815 - 1877. స్విట్జర్లాండు వాసి. న్యాయ శాస్త్రవేత్త; చరిత్రకారుడు. బాస్లేలో రోమన్ ధర్మ శాస్త్రాచార్యుడు. Das Mutterrecht (స్టట్ గార్ట్ 1861) అనే పుస్తకం వ్రాశాడు.

* బాకోఫెన్ తాను కనిపెట్టిన విషయాన్ని, వూహించిన విషయాన్ని సరిగ్గా అర్థంచేసుకోలేదు. ఆ ఆదిమ దశను వర్ణించడంలో ఆయన 'హెటిరియారిజమ్' అనే మాటను వాడేవాడు. ఇది గ్రీకులు వాడిన శబ్దం. వివాహంకాని మగవాళ్లు లేదా దంపతీ వివాహంలో వున్న మగవాళ్ళు, అవివాహిత స్త్రీలతో సంబంధాలు కలిగివుండడం అనే అర్థంలో వారు యీ శబ్దాన్ని వాడారు. అంటే, సమాజంలో

స్త్రీ పురుష సంబంధాల్లో ఈ విధమైన ప్రాథమికదశ ఎన్నడూ లేదని నిరాకరించడం ఈ మధ్య ఒక ఫేషన్ అయిపోయింది. మానవ జాతి కీ దశ "అవమాన"మని వారి వూహ. ఆ అవమానం జరగకుండా చూడాలనుకున్నారు. అందుకోసం పైన చెప్పినమాదిరి స్థితివున్నదని నిరూపించేటందుకు ఆధారాలు లేవని అన్నారు. అలా అనడంకోసం మిగతా జంతు ప్రపంచంనుంచి వుదాహరణలు తెచ్చి చూపడానికి ప్రత్యేక ప్రయత్నాలు చేశారు. లెతోర్నె (Letourneau) * ప్రోగుచేసిన (Euolution du Marriage ef de la Famille - 1888 - పారిస్) అశేషములయిన ఆధారాల్ని పట్టిచూస్తే, అభివృద్ధి తక్కువగా వున్న జంతువులలోనే ఏవిధమైన నియమాలు లేని స్త్రీ పురుష సంబంధాలు కనబడతాయి. కాని, మానవుని ఆదిమ జీవితస్థితిని గురించి తెలుసుకోవడానికి మాత్రం ఈ వుదాహరణలు తోడ్పడవని నేను చెప్పగలను. వెన్నెముకగల జంతువులు చాల కాలం వరకూ జంటగా దాంపత్యం నిర్వహిస్తాయంటే దానికి శరీర శాస్త్ర రీత్యా సమాధానం చెప్పుకోవచ్చు.

---

ఒక నిర్ణీతమైన వివాహపద్ధతి వున్నట్లూ, దాని వెలుపలకూడా స్త్రీ పురుష సంబంధాలు సాగుతున్నట్లూ, ఆ విధంగా వ్యభిచారానికి అవకాశాలున్నట్లూ తట్టుతుంది. వారు యీ శబ్దాన్ని మరో అర్థంలో వుపయోగించలేదు. కాబట్టి నేనూ, దీనిని మోర్గనుతోపాటు అదే అర్థంలో వాడుతున్నా. బాకోఫెన్ తాను కనిపెట్టిన అత్యంత ప్రధానములైన సంగతులు అన్ని సందర్భాలలోను మాయావాదపు ముసుగులో దాగివుంటాయి. దీనికి కారణంవుంది. చరిత్రగతి పరిణామంలో స్త్రీ పురుష సంబంధాలు ఆ యా కాలంనాటి మత విషయిక భావాలలోంచి పుట్టాయనీ, వాస్తవజీవిత పరిస్థితుల్లోంచి కాదనీ ఆయన వూహ. (ఫ్రెడరిక్ ఏంజెల్స్)

* పూర్తిపేరు ఛార్లెస్-ఝా-మారీ లెతోర్నె (1831–1902) ఫ్రెంచివాడు. సమాజశాస్త్రవేత్త, మానవజాతి శాస్త్రవేత్తాను. చదువుకొన్నది వైద్యవిద్య. సార్బోనే విశ్వవిద్యాలయంలో ఆచార్యుడు. సంస్కృతి చరిత్రపై అనేక పుస్తకాలు వ్రాశాడు.

ఉదాహరణకి పక్షుల్నే తీసుకుందాం. గుడ్లు పొదిగే కాలంలో ఆడపిట్టకి సహాయం అవసరం. కాబట్టి పక్షుల్లో ఒకే పెంటి ఒకే పుంజు ఖచ్చితంగా దంపతీ జీవితం గడుపుతాయంటే, మనుష్యుడు కూడా అలాగే వుంటాడ నడానికి అది రుజువు కాదు. మనుష్యుడు పరిణామం పొందినది పక్షుల నుంచికాదు. ఇంక - ఖచ్చితమైన ఏకపత్నీ, ఏకపతిత్వం మహాసుగుణం అయితే మనం నారిపురుగు గుణవంతమైనదని చెప్పుకోవాలి. దాని శరీరంలోవున్న 50 - 200 ఉంగరాలలో ప్రతి ఒక్కదానిలోనూ స్త్రీ. పురుషావయవా లున్నాయి. అది బ్రతికివున్నంతకాలమూ తనలో తానే జత కూడుతూంటుంది పోనీ యని మనం పిల్లలకు పాలిచ్చిపెంచే జంతువులకు మాత్రమే పరిమిత మవుదామనుకుంటే, దానిలో అన్ని తరహాల దాంపత్యపద్ధతులూ - ఏ విధమైన నియమాలూ లేకుండా దాంపత్యం నెరిపేవి వున్నాయి. గుంపుపెళ్ళి లక్షణాలు కనబడతాయి. బహుభార్యాత్వం కనబడుతుంది. ఏకపత్నీ, ఏకపతిత్వం వుంది. వానిలో బహుభర్తృత్వం ఒక్కటే లేదు. బహుభర్తృత్వాన్ని మానవుడు మాత్రమే సాధించగలిగాడు. మనకు సన్నిహితంగావుండే చతుర్భుజ (చతుష్పాద) జంతువులలో సైతం అన్ని తరహాల స్త్రీ పురుష సంబంధాలూ కనబడతాయి. అయితే ఇంకా దగ్గరకువచ్చి, నాలుగు వానర జాతుల్ని మాత్రమే తీసుకోదలిస్తే అవి ఒకప్పుడు బహుభార్యాత్వాన్నీ, మరొకప్పుడు ఏకపత్నీత్వాన్నీ అనుసరిస్తున్నట్లు మాత్రమే లెతోర్నో చెప్పగలిగాడు. అవి కేవలం ఏకపత్నీత్వాన్నే అవలంబిస్తున్నాయని సోస్సురే * వ్రాసినట్లు గిరాడ్-టులన్ ♦ పేర్కొన్నాడు.

---

* పూర్తి పేరు హెన్రీడే సోస్సురే. స్విట్జర్లండువాడు. ప్రకృతి శాస్త్రవేత్త. దేశాటనంచేశాడు. జెనీవాలో ఆచార్యుడు. 1829-1905.

♦ అలెగ్జి గిరాడ్ టులన్. 1839 లో పుట్టాడు. జెనీవాలో చరిత్రాచార్యుడు. బాకోఫెన్ శిష్యుడు. Origines de la Famille రచయిత. 1874 లో ముద్రించబడింది.

వానరజాతులు ఏకపత్నీత్వాన్నే అనుసరిస్తాయని ఈ మధ్య వెస్టర్‌మార్క్ * తెలియజేశాడు. (The History of Human Marriage, London 1891) కాని ఇంతవరకు ఆయన అభిప్రాయాలు సాక్ష్యానికి నిలబడలేదు. ఇంతవరకు దొరికిన విషయసామగ్రి వలన ఒక్కటి తేలింది. దానిని లెతోర్నే పెద్దమనిషి తరహాగా అంగీకరించాడుకూడా "జంతువులలో వాని మానసిక పరిణామదశలకీ. అవి జతకూడే పద్ధతులకీ ఎక్కడా పొందికేలేదు." అన్నాడాయన. దీనినే ఎస్పినాస్* తన పుస్తకంలో .(Des Societes animales - 1877) వివరంగా వ్రాశాడు.

"మనకు జంతువులలో కనిపించే సాంఘిక సముదాయాలలో 'మంద' ఉన్నతమైనది. అది ఎన్నో కుటుంబాల కలయికగా కనిపిస్తుంది. కాని మొదటినుండి కూడ కుటుంబమూ మంద అనేవి పరస్పరవిరుద్ధమైనవి. అందులో ఒకటి ఎంత అభివృద్ధి చెందితే రెండోది అంతసన్నగిల్లుతుంది"

పై సంగతులవలన వానరజాతి యొక్క కుటుంబ పద్ధతుల్ని గురించీ, తదితర సాంఘిక వ్యవస్థల్ని గురించీ యిదమిద్ధంగా మనకేమి తెలియదని తేలిపోతుంది. మనకు ఇంతవరకు లభించిన భోగట్టాలోని విషయాలన్నీ పరస్పర విరుద్ధంగా వున్నాయి. దానికి మనం ఆశ్చర్యపడవలసిన పనికూడాలేదు. ఆటవికతెగల్ని గురించిన విషయాలలోసైతం యెన్నో వైరుధ్యాలున్నాయి. వాని నెంతో పరిశీలించి మంచిచెడ్డలు

* ఎడ్వర్డు అలెగ్జాండర్ వెస్టర్ మార్క్. 1802 లో పుట్టాడు. సమాజ శాస్త్రవేత్తా, మానవజాతి శాస్త్రవేత్తాను. హెల్సింగ్ ఫోర్సు విశ్వవిద్యాలయాచార్యుడు. 1907 నుంచీ లండన్‌లో ప్రొఫెసరుగా పని చేశాడు.

* విక్టర్ ఆల్ఫ్రెడ్ ఎస్పినాస్ 1844–1922. ఫ్రెంచి తత్వవేత్తా, సమాజశాస్త్రజ్ఞుడూను. పారిస్‌లో ఆచార్యుడుగా పనిచేశాడు.మనస్తత్వశాస్త్రం, తత్త్వశాస్త్రం, బోధనా విధానం, సమాజ విజ్ఞానం మీద పుస్తకాలు వ్రాశాడు.

తేల్చవలసివుంది. మానవ సమాజాల్ని పరిశీలించడంకన్న వానర సమూహాల పరిశీలన కష్టతరం. కనక ఏమాత్రం ఆధారపడ్డానికి వీఱలేని సమాచారాన్నిబట్టి ప్రస్తుతం మనం ఏ నిర్ణయానికీ రాకూడదు.

అంతకంటే మన సమాలోచనను ప్రారంభించడానికి పైన చెప్పిన ఎస్పినాస్ వాక్యం చక్కగా ఉపకరిస్తుంది. ఉన్నత జంతుజాలంలో మంద, కుటుంబం అనేవి ప స్పరానుబంధం కలవి కావు; అవి పరస్పర విరుద్ధాలు. జతకూడే రోజుల్లో మగజంతువు చూపే ఈర్ష్యవల్ల మందల కట్టుబాట్లు సడలిపోవడమో, తాత్కాలికంగా మంద విడిపోవడమో జరుగుతుంది – అని ఎస్పినాస్ ఎంతో స్పష్టంగా వర్ణిస్తాడు.

"కుటుంబ బంధాలు దృఢంగా వున్నప్పుడు మంద అనేది అరుదుగా ఏర్పడుతుంది బహూపత్నీత్వంగాని, స్త్రీ పురుష సంబంధాలలో స్వేచ్ఛగాని వున్నప్పుడు మంద దానంతటదే ఏర్పడుతుంది.... మంద ఏర్పడాలంటే కుటుంబ బంధాలు సడలిపోవాలి. వ్యక్తి స్వతంత్రం కావాలి. అందుచేతనే పక్షులలో నిర్మాణంతో కూడిన 'గుములు' మనకు అంతగా కనబడవు... ఉంచుమించుగా నిర్మాణయుక్తములైన మందలు మనకు జంతువులలోనే కనిపిస్తాయి. దీనికి కారణం వ్యక్తి కుటుంబంలో ఐక్యం కాకపోవడమే. కనక మంద మనదనే ఆత్మీయ భావానికి ఇది నా కుటుంబం అనే స్వత్వభావంకన్న బలమైన శత్రువు వేరొకటి లేదు. కుటుంబంకన్న ఉన్నతమైన సామాజిక వ్యవస్థ ఏర్పడిందంటే కారణం మూలమట్టుగా మారిపోయిన అనేక కుటుంబాలు దానిలో కలిసిపోవడమే. ఈ కుటుంబాలు తర్వాత తర్వాత చాల అనుకూలమయిన పరిస్థితులు ఏర్పడినప్పుడు తిరిగి నిర్మాణం పొందగలిగాయి. ఈ విషయమై సందేహం అవసరంలేదని నా అభిప్రాయం."

(Espinas: op. cit., quoted by Girand - Teulon in his Origines da mariage et de la famille, 1884 PP. 518-20)

మానవ సమాజానికి సంబంధించిన కొన్ని విషయాల్ని తెలుసుకొనేటందుకు జంతు సముదాయా లుపయోగిస్తాయని మనకిక్కడ బోధపడుతూంది. కాని ఆ వుపయోగం నిషేధార్థ రూపంనేనే.

మనకు దొరికినంతవరకు ప్రమాణాల్నిబట్టి పరిశీలిస్తే ఉన్నతి పరిణామదశలోవున్న [వెన్నెముకగల] జంతువులలో రెండు విధాలయిన కుటుంబ నిర్మాణం మాత్రమే కనబడుతుంది. ఒకటి బహుపత్నీత్వం, రెండు విడివిడి జంటలు. బహుపత్నీత్వంలోను, జంటల పద్ధతిలోను కూడా నియమం ఒకే పురుషుడు; ఒకే భర్త. మగ జంతువులో వుండే ఈర్ష్యాభావమే జంతు కుటుంబాన్ని మందకు వ్యతిరేకంగా కూరుస్తుంది. దానిని ఏకాకిని చేస్తుంది. మగ జంతువులోని ఈర్ష్య సాంఘిక నిర్మాణాలలో ఉన్నతమైన 'మంద' ఏర్పడడానికి ప్రతిరోధకం అవుతుంది. మందలోని ఐక్యతను సడలింప చేస్తుంది. కనీసం జతకూడే రోజుల్లో మందను తాత్కాలికంగా విడగొట్టేస్తుంది. మొత్తంమీద దాని అభివృద్ధిని నిరోధిస్తుంది. జంతువుల కుటుంబాలతో ఆదిమ మానవసంఘాన్ని పోల్చి చూడరాదనడానికి ఇవొక్కటేచాలు. జంతువుల నుండి మానవుడు ముందుకు సాగిపోతున్నప్పుడు, ఆ రోజుల్లో వారిలో కుటుంబం అనేది ఉండకుండా వుండాలి; లేదా జంతుజాలంలో కనబడని కొత్తరకం కుటుంబ పద్ధతి వారిలో వుండి వుండాలి. వేటగాండ్ల సమాచారాన్ని పట్టి వెస్టర్ మార్క్ గోరిల్లాలూ, చింపాంజీలూ ఒక ఆడుదీ ఒక మగదీ చొప్పున జంటలు జంటలుగా నివసిస్తాయని వ్రాశాడు మానవుడు ఆనాటి ప్రాథమిక దశలో బ్రతకగలగాలంటే, అంతకంటే వున్నతమైన సామాజిక వ్యవస్థ అవసరం. పరిణామారంభ దశలోవున్నమానవుడికి ఆత్మరక్షణకు అవకాశాలు చాలతక్కువ. ఆ నిరాధారపరిస్థితులలో మానవజంతువు చిన్న చిన్న గుంపులుగా ఏర్పడితేనే మనగలదు జంతువులకన్న మానవుడు విశేషంగా అభివృద్ధి పొందాలంటేనూ, ప్రకృతిలో సాధ్యంకాగల మహోన్నతాభివృద్ధిని సాధించాలంటేనూ జంతువులలో కనిపించేదానికన్న ఉన్నతమైన సాంఘిక నిర్మాణం అవసరం. వ్యక్తిలో లోపంగావున్న ఆత్మరక్షణ శక్తిని పరస్పర సహకారం ద్వారా భర్తీ చేసుకోవాలి. ఈనాడు వానరజాతిలో కనిపించే పరిస్థితుల్నిబట్టి, ఎన్నోదో మానవునిలో వచ్చిన పరిణామాలను వూహించిచెప్పడం సాధ్యంకాదు. ప్రస్తుతం మనకు కనబడే స్త్రీజాతి పరిణామ పథంనుంచి పైదొలగిపోయినట్లూ, ఇది క్రమంగా అంతరించడమో క్షీణదశకు రావడమో జరుగుతున్నట్లూ కనబడు

తూంది. అందుచేతనే నేడు వానిలోవున్న కుటుంబ పద్ధతుల్ని చూపించి, మానవుని సాంఘికపద్ధతుల్ని సమర్థించబోవడం తప్పు అంటున్నాను. జంతువులలోంచి మానవుడు పరిణామం పొందాలంటే మొట్టమొదట వయస్సుగాళ్ళలో పరస్పర సహనం వుండాలి. ఈర్ష్య వుండకూడదు. ఈనాటికి కూడా ప్రపంచంలో ఏమూలనైనా ఈమాదిరి ప్రాచీన, ఆదిమ కుటుంబపద్ధతి ఒకటుందా? చరిత్రలో ఇటువంటిది ఉండేదని రుజువు పరచగలమా? ఉంది. ఇదే గుంపుపెళ్ళి. ఈ కుటుంబంలో కొంతమంది స్త్రీలగుంపూ, కొంతమంది పురుషులగుంపూ ఒకరికొకరు చెందివుంటారు. ఇక్కడ ఈర్ష్యకి తావులేదు. మరికొంత అభివృద్ధివచ్చిన దశలో మనకు అరుదైన 'బహుభర్తృత్వ పద్ధతి' కనబడుతుంది. ఈ నూతన పద్ధతివలన మానవునిలో, అసూయాభావం అసలే ఉండదు అందుచేత జంతువులలో ఇది కనబడదు. ఇప్పుడు మనకు కనిపించే గుంపు పెళ్ళిళ్ళు అన్నింటా చిత్రమైన గజిబిజి కట్టుబాట్లు కనబడతాయి. వానినిపట్టి చూస్తే, అంతకు పూర్వం అంతకంటేనూ అతి సాధారణమైన రూపంలో స్త్రీ పురుష సంబంధాలు వుండి వుండాలనిపిస్తుంది. వీటన్నింటినీపట్టి తేలుతున్న దేమిటి? జంతువులనుండి మానవుడు పరిణామం పొందిన సంధిదశలో ఆ దశకు అనుకూలంగా స్త్రీ పురుష సంబంధాలలో పూర్తి స్వేచ్ఛ వుండేది. అలాగాక జంతువుల స్త్రీ పురుష సంబంధాలలోంచి ఉదాహరణలు తీసుకొనడానికి ప్రయత్నిస్తే మనం అసలు విషయాన్ని వదలి దూరంపోవడమే తటస్థపడుతుంది.

స్త్రీ పురుష సంబంధాలలో స్వేచ్ఛఅంటే ఏమిటి? అప్పుడూ ఇదివరకూవున్న నిర్బంధాలూ, నిషేధాలూ లేక పోవడమే ఆ స్వేచ్ఛకు అర్థం. ఈర్ష్య అనే ఆటంకం తొలగిపోయివుండాలని యింతకుముందే చెప్పేను. ఇప్పుడు మనం చూసే ఈర్ష్యాభావం ఆటుతర్వాత ఎంతో కాలానికి వృద్ధిపొందింది. 'పాపి' అనే భావంకూడా అలాగ తర్వాత వచ్చినదే. మొట్టమొదటి దశలో సోదరీ సోదరులు, భార్యాభర్తలుగా వుండేవారు. అంతేకాదు. తల్లిదండ్రులకూ, బిడ్డలకూ మధ్య దాంపత్య సంబంధాలుండడం కొన్ని జాతులలో నేటికీ ఆమోదయోగ్యంగానేవుంది.

పార్థియన్లు * పర్షియన్లు, సిథియన్లు • హూణులు † మొదలయిన వారిని గురించి ప్రాచీన గ్రీకులూ, రోమన్లూ వ్రాసిన విషయాలను గురించి నేనిక్కడ చెప్పటంలేదు. బెహ్రింగ్ జలసంధి * ప్రాంతాలలో వున్న 'కివయటు'లు, అలాస్కా సమీపంలోని 'కాదియకు'లు బ్రిటిష్ ఉత్తర అమెరికాలో భాగంలోని 'తిన్నే' ప్రజలలో ఇటువంటి ఆచారాలు వున్నాయని బాన్‌క్రాఫ్** వ్రాసేడు. (The native races of the Pacific

---

* పార్థియా అనేది పర్షియా దేశంలోని ఒక భాగం. అక్కడ నివసించిన ఒక తెగను పార్థియన్లని ప్రాచీనకాలంలో వ్యవహరించేరు.

• యూరపుఖండానికి ఆగ్నేయభాగంలో ఆశియాఖండ భాగంలో ప్రాచీనకాలంలో అనేక తెగల ప్రజలు నివసించేవారు. వీరు సంచారజాతి ప్రజలు. ప్రాచీనకాలపు రచయితలు వీరిని సిథియన్లని పిలిచేవారు.

† వీరిని 'హన్' అంటారు. మంగోలియాజాతికి చెందిన సంచారజాతి ప్రజ. క్రీ. శ. 375 ప్రాంతంలో 'గోత్' తెగలను గదుముకుంటూ వీరు యూరపు ప్రవేశించేరు. వీరి తెగకు చెందిన 'అత్తిలు'డనే నాయకుడు క్రీ. శ. 433 – 453 మధ్య యూరపును జయించేడు. నేటి హంగరీ, జర్మనీలోని ప్రజలు వీరి సంతతులుగా భావించబడతున్నారు. ఈ తెగల ఆదిమ పురుషుల్ని 'హున్ను' అనే వారనీ, చైనాకు పొరుగున ఉత్తరదిశలో వుండేవారనీ తెలుస్తూంది. వీరినే భారతీయులు హూణులనే పేరున పిలిచేరు.

* ఆసియా ఖండంలో ఈశాన్యాగ్రాన కామాచెట్కాకూ, ఉత్తర అమెరికా వాయువ్యాగ్రాన అలాస్కాకూ మధ్యనున్న జల సంధిని బెహ్రింగ్ జలసంధి అంటారు.

** పూర్తిపేరు హెర్బర్ట్‌హెూవేబాంక్రాఫ్ : 1832–1918. అమెరికా దేశీయుడు, చరిత్రకారుడు. ఉత్తరఅమెరికాలోని తెగలను గురించి పరిశోధన చేశాడు.

states of North America - 1875 vol. 1) ఛిప్పేవా ♦ ఇండియన్లలోనూ, చిలీలోని * కాకూస్ జాతిలోనూ ♦కరిబియన్లలోనూ ఇండో-చైనాలోని కరెన్ తెగలలోనూ ఇటువంటి ఆచారం వున్నదని 'లెతోర్నే' తెలుసుకొన్నాడు.

మనుష్యుడు కల్పించుకొన్న నిషేధాలలో వావి చాలా ముఖ్యమైనది. వేరువేరు తరాలకి చెందిన స్త్రీ పురుషుల మధ్య వివాహ సంబంధాలు శుద్ధఛాందస దేశాలలో కూడ ఈ నాడు వింతగా కనబడ్డంలేదు. అరవై ఏళ్ళపై బడ్డ "కన్య" ముప్ఫయ్యేళ్ళ యువకుని పెళ్లాడేస్తూంది. వాళ్ళిద్దరూ ధనవంతులైయుంటే అదేం విడ్డూరం అనిపించడంలేదు. ఇంక ఆరోజుల్లో వావిని కల్పించుకోనిదశలో తల్లిదండ్రులకూ, బిడ్డలకూ మధ్య స్త్రీ పురుష సంబంధాలుండడం తప్పుగానూ, విడ్డూరంగానూ కనిపించి వుండదు. మనం ఈనాడు అనుసరించే వావివరసలువేరు. వీనికీ ఆనాడు వారు కల్పించుకొన్న వావివరసలకూ సంబంధమేలేదు. పైగా ఈ రెండూ పరస్పర విరుద్ధంగా వుంటాయికూడ. అందుచేతనే వాటిని అవతలగా పెడదాం. ఇంక మనకి కనిపించే కుటుంబ వ్యవస్థలలోకెల్లా అతిప్రాచీనమైన దానిని చూస్తే, ఆనాడు దాంపత్య సంబంధాలలో ఎంతో స్వేచ్ఛవున్నట్లు కనిపిస్తుంది. స్వేచ్ఛ అనడంలో వుద్దేశం తర్వాత తర్వాత ఆచారాలరూపంలో అమలులోకి వచ్చిన నిర్బంధాలు ఆనాడు లేవనడమే. అంతేకాని, నిత్యజీవితంలో స్త్రీ పురుషులు యధేచ్ఛా

♦ ఛిప్పేవాలకు ఓజిబ్వాలనేది మరొక పేరు. ఉత్తరఅమెరికాలో అల్గోన్‌కియన్ జాతికి చెందిన ఒక తెగ.

* చిలీ దక్షిణఅమెరికాలోని ఒక రాష్ట్రం.

♦ కరిబియన్లనే కారిబ్‌లు అంటారు. అమెరికన్ ఇండియన్లలోని ఒక తెగ. అమెరికాను కనిపెట్టిన నాటికి కరిబియన్ సముద్రంలోని హైతీదీవిలోనూ, దక్షిణఅమెరికా ఉత్తరభాగంలోనూ, చిన్న అంటిల్లే దీవిలోనూ నివసిస్తున్నారు. ఈ తెగ ఇప్పుడించుమించు అంతరించిపోయిందనే చెప్పాలి. కొద్దిమంది మాత్రం ట్రినిడాడ్ దీవిలో నివసిస్తున్నారు.

చారం సాగించేరనికాదు. ఒకస్త్రీ, ఒక పురుషుడు జతకూడి జీవించడంలో అభ్యంతరం ఎన్నడూలేదని మాత్రమే దీనిఅర్థం. గుంపు పెళ్ళిళ్ళలో అధికభాగం ఈ మాదిరి జంటలే. ఈ విధమైన కలయికలతో కూడిన ప్రాథమికదశ లేదనడానికి వెస్టర్‌మార్క్, ఒక బిడ్డ కలిగే వరకూ కలిసి వుండే అన్నితరహాల దాంపత్య సంబంధాలకూ కూడ 'వివాహం' అని పేరుపెట్టేడు. అయితే స్త్రీ పురుష సంబంధాలలో స్వేచ్ఛవున్న అతి ప్రాచీన కాలంలో కూడా పైమాదిరి జంటవివాహాలు జరగడానికి అవకాశంవుంది. అప్పటికింకా స్త్రీ పురుష సంబంధాలలో నిర్బంధాలు సాంఘికాచారాలలోకి పరివర్తన పొందివుండలేదు గనుక, ఆ వివాహాలు ఆనాటి స్వేచ్ఛాసూత్రాలకు భంగకరం కాదనీ చెప్పవచ్చు. కాని, వెస్టర్‌మార్క్ ధోరణివేరు. ఈ స్వేచ్ఛాసంగమ పద్ధతివలన మనుష్యుల "మనసు మొగ్గుదల" అణచివేయ బడుతుందనీ, కనక "దీని రూపాంతరమే వ్యభిచారం" అనీ వ్రాసేడు. ఆదిమ సమాజాన్ని కేవలం వ్యభిచారగృహం గానే వూహించగలవారు ఆ సమాజాన్ని అర్థంచేసుకోలేరని నావూహ. గుంపు పెళ్లినిగురించి చర్చించే టప్పుడు ఈ విషయానికి మళ్ళీవద్దాం.

స్త్రీ, పురుష సంబంధాలలో స్వేచ్ఛవుండిన ఈ ప్రాచీనస్థితినుంచి, ఏనాడో చాలకాలంక్రిందట కుటుంబం యొక్క ప్రాథమిక రూపం – రక్త సంబంధీకుల కుటుంబం (Consanguine Family) – ఏర్పడిందని మోర్గన్ చెప్పాడు.

## 1. రక్త సంబంధీకుల కుటుంబం

ఇది కుటుంబ వ్యవస్థయొక్క ప్రప్రథమ దశ. ఇందులో వివాహబంధంలో కలిసే గుంపులు, వారి వారి తరాల్నిపట్టి విభజితం అవుతాయి. ఒక కుటుంబంలోని తాతలూ – అవ్వలూ ఒకరికొకరు భార్యాభర్తలు. వీరి సంతానంఅయిన స్త్రీ పురుషులు మరల ఒకరికొకరు భార్యాభర్తలు. అలాగే వీరి బిడ్డలు – అంటే మొదటితరం వారి మనుమలూ మనమరాండ్రూ (మూడోతరం) – ఒకరికొకరు భార్యాభర్తలు. ఈమాదిరివివాహాలలో ఒకటి రెండు తరాలవారు, రెండు మూడు

తరాలవారు పరస్పరం వివాహసంబంధాలు కలిగివుండకూడదు. మనం చెప్పే పరిభాషలో వారికి వివాహ హక్కులు, బాధ్యతలు వుండకూడదు. తోడబుట్టిన ఆడ, మగవారి తాత ముత్తాతలద్వారా వేలువిడిచిన సోదరీ సోదరబాంధవ్యంగలవారు ఒకరికొకరు అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూను. అందుచేతనే వారు ఆలుమగల సంబంధం కలిగివుండడానికి అర్హులు. ఈ దశలో సోదరీ సోదరుల మధ్య దాంపత్య సంబంధాలుండడం సర్వ సాధారణ విషయం * ఈ కుటుంబం యొక్క వైశిష్ట్యం ఏమిటంటే,

* వాగ్నర్ తాను వ్రాసిన నిబెలుంగ్ ప్రతిలో ఆదిమకాల స్థితిని గురించి పూర్తిగా అపభ్రంశం పట్టించినందుకు మార్క్స్ చాల ఘాటుగా విమర్శిస్తూ 1882 వసంతర్తువులో ఒక లేఖ వ్రాసేడు.

"సోదరిని భార్యగా కౌగలించుకోవడం ఎక్కడన్నా విన్నామా?" అని వాగ్నర్ ఆశ్చర్యం ప్రకటించేడు. ఈ అపవిత్ర పద్ధతుల్ని సంస్కరించి ఆధునికపద్ధతిలో ఆ "ఋతుదేవతల" ప్రేమ గాథలకు కొద్దిగా వావివరసల బిగింపులు జోడించేడు. దానిని మార్క్స్ విమర్శిస్తూ ఇల్లా అన్నాడు:

"ఆదిమకాలంలో సోదరి భార్యగానేవుండేది. అది నీతిబద్ధమే కూడా."

[నాలుగో ప్రచురణలో చేర్చిన పాదపీఠిక] వాగ్నర్ మిత్రుడూ, ఆయనమీద విశేషాభిమానంగల ఒక ఫ్రెంచిదేశీయుడు ఈ పాదపీఠికను అంగీకరించలేదు. వాగ్నర్ పూర్వకాలపు 'ఎడ్డా' అనే పుస్తకాన్ని వరవడిగా తీసుకొన్నాడనీ, అందులోని ఓగిస్ద్రెస్కా (Ogisdrecka) లో ఈ దిగువ మాటలున్నాయనీ ఆయన వుదాహరించేడు.

దానిలో 'లోకి' అనే పాత్ర 'ఫ్రెయియా' అనే పాత్రను ఈ ఈ విధంగా నిందిస్తాడు:

"నీ సోదరుడే నిన్ను దైవసమక్షంలో కౌగలించుకున్నాడు."

దీనినిపట్టి చూస్తే, ఆనాటికప్పుడే సోదరీ సోదరులమధ్య దాంపత్యసంబంధం నిషేధింపబడినట్లు కనిపిస్తుంది. ఆదిమ కాలపు

**దీనిలోని సభ్యులందరూ ఒకే జంటయొక్క సంతానం అయివుంటారు. మొదటిజంట, వారి సంతానం, ఆ సంతానంయొక్క సంతానం. అలాగే వారి సంతానం ప్రతి తరంలోనూ స్త్రీ పురుష లొకరికొకరు సోదరీ సోదరులు. ఆ కారణంచేతనే వారు ఒకరికొకరు భార్యాభర్తలు.**

---

పురాణగాధలయెడ విశ్వాసం పూర్తిగా సడలిన దశలో 'ఓగిస్ద్రెస్లా' లోని మాటవచ్చినట్లు కనబడుతుంది. లూసియన్ మాదిరిగా దేవతల్ని అవహేళనపట్టించడం తప్పవేరుకాదు. మెఫిస్టాఫెలస్ మాదిరిగా లోకీ ఆ విధంగా ఫ్రెయియాను నిందించడం వాగ్నర్ వాదాలకు వ్యతిరేకమే అవుతుందిగాని అనుకూలం కాజాలదు. మరో కొన్ని పద్యాల అనంతరం న్జోర్డ్‌తో లోకీ ఇల్లా కూడా అన్నాడు: "నీచెల్లెలికి నువ్వొకొడుకుని కన్నావు."(Vichsystur thinni gazcen slikan_ mog) ఇంక న్జోర్డ్ 'ఆసా' వాసికాదు. వానా నివాసిగాని. యూగ్లింగామహాకావ్యంలో అతడు ఇలా అన్నట్లుంది: వానా దేశంలో సోదరీ సోదరులమధ్య వివాహాచారం వుంది. కాని ఆ ఆచారం ఆసా దేశంలోలేదు. దీనినిపట్టి 'ఆసా' లోని దేవతల కన్న వానాభూమి లోని దేవతలు ప్రాచీనులని తోస్తూంది. ఏది ఏలా వున్నా, న్జోర్డ్ 'ఆసా' భూమిలో అక్కడి వారిమధ్య, వారితో సమాన హెూదాలో నివసించేడు. దీనిని పట్టి తేలుతున్న దేమిటి? నార్వేదేశపు దేవతల్ని వర్ణించే పురాణాలు వ్రాయబడే నాటికి, కనీసం దేవతలలోనైనా సోదరీ సోదరుల మధ్య వివాహాలు జరిగేపద్ధతి వున్నదనీ, ఆపద్ధతి జనానికి అసహ్యం అనిపించే స్థితిలేదనీ చెప్పడానికి 'ఓగిస్ద్రెస్కా' ఒక సాక్ష్యం. వాగ్నర్‌ను సమర్థించదలచుకుంటే 'ఎడ్డా'ను అడ్డం పెట్టుకొనే కన్నగెతే నుపయోగించుకోవడం మంచిది. ఆయన దేవతల్ని గురించీ బాయాదెరేను గురించీ వ్రాసిన జానపదగేయ కావ్యంలో ఇల్లాంటి పొరపాటు అభి ప్రాయాన్నే ప్రకటించేరు. మతాచారాల దృష్ట్యా స్త్రీలు ఎక్కువ మంది పురుషులతో కలిసే విధాన్ని ఆయన ఆధునిక యుగపు వ్యభిచారంతో పోల్చేడు.

[ఎఫ్. ఏంగిల్సు పాదపీఠిక]

'రక్తసంబంధీకుల' కుటుంబపద్ధతి నేడెక్కడా కనిపించదు. ఎంతో వెనకబడివున్న ప్రజలలోకూడ చరిత్రకు తెలిసినంతవరకు దీనికి ఉదాహరణ కనబడలేదు. అయినా అటువంటి కుటుంబపద్ధతి ఒకటివుండి తీరాలి. దానిని మనం వొప్పుకోక తప్పదు. హవాయిదీవుల ప్రజలలో వినిపించే రక్తబంధుత్వపు తరాలు యిటువంటి కుటుంబపద్ధతిలోనే ఏర్పడగలవు. ఆ రక్తబంధుత్వపు పిలుపులు పోలెనేషియా అంతటా అమలులో వున్నాయి. కాలక్రమేణ కుటుంబపద్ధతిలో వచ్చిన పరిణామాన్ని చూసినా ప్రాథమికదశలో ఈమాదిరి కుటుంబపద్ధతే తప్పనిసరిగా వుండి తీరాలనిపిస్తుంది.

---

....రిఛర్డు వాగ్నర్ – జర్మనీదేశపు వాగ్గేయకారుడు. జర్మనీ దేశపు పురాణగాధల్ని తీసుకొని చాలా గేయనాటికలు వ్రాసేడు. Der Ring des Nibelungen అనే నాటిక చాలా ప్రసిద్ధి కెక్కింది. 1813 – 1883 మధ్య జీవించేడు.

.... – లోకీ పురాణదేవత. అగ్ని, విధ్వంసం, దుష్టత్వముల అధిదేవత.

....ఫ్రెయియా–నార్స్ పురాణదేవత. మాతృత్వానికీ, ప్రేమకూ అధినేత. ఓడిన్ అనే దేవుడి భార్య.

....లూసియన్ – గ్రీకు దేశీయుడు. సామోసాటా నివాసి. క్రీ.శ. 120 – 180 ల మధ్యకాలపువాడు. ప్రహసన రచయిత. ఏంగిల్సు చెప్పినట్టు ప్రాచీన కాలపు వాల్టయిర్...

... మెఫిస్టాఫిలస్–మధ్య యుగాలనాటి జర్మను జానపద గాధ ఫాస్టులోని ఒక పాత్ర. గెటేమెఫిస్టాఫెలస్‌ను దయ్యంగా చిత్రించేడు. ఫాస్టు సహచరుడు. ఎక్కడికక్కడే ఏవోపేచీలు తెస్తూంటాడు. మంచి అన్నా, మానవుని ఆదర్శాలన్నా ఏమాత్రం విశ్వాసం లేనివాడు.

... న్జోర్డ్–నార్సు దేశపు పురాణగాథల లోని దేవత. నౌకలకు, చేపలవేటకు అధిదేవత.

## 2. ప్యూనలాన్ కుటుంబం

తల్లిదండ్రులకీ సంతానానికీ మధ్య దాంపత్యసంబంధాల నిషేధం కుటుంబనిర్మాణంలో వచ్చిన మొదటిమెట్టు ఆ తర్వాత సోదరీ సోదరుల మధ్య సంయోగ సంబంధాల నిషేధం రెండోమెట్టు. ఇంచుమించు సమానవయస్కులు కావడంచేత సోదరీ సోదరులమధ్య దాంపత్య సంబంధాలను నిషేధించడం చాలముఖ్యమూ, చాల కష్టమూకూడ. ఇది క్రమక్రమంగా అమలులోనికి తేబడింది. ప్రారంభంలో ఒకే తల్లిబిడ్డలమధ్య దాంపత్యం నిషేధింపబడి వుండాలి. అది కూడా ప్రారంభంలో చెదురుచెదురుగా అవలంబించబడి, చివరకు సాధారణా చారంగా పరిణమించి వుంటుంది. (హవాయీ ద్వీపాలలో అక్కడక్కడ నేటికీ ఈ ఆచారం చెదురుచెదురుగా కనిపిస్తూనేవుంది) క్రమంగా ఈ నిషేధాన్ని ఒకటి, రెండు, మూడు తరాలకు చెందిన వ్రేలు విడిచిన సోదరీ సోదరులకుకూడా విస్తరింపచేసివుంటారు. "ప్రకృతిసిద్ధమైన ఎన్నిక సూత్రం ఏ విధంగా పనిచేస్తుందో చూపడాని కిది మంచి వుదాహరణ" * అన్నాడు మోర్గన్. సోదరీ సోదరులమధ్య దాంపత్య సంబంధాలు ఆచారంగా అనుసరించబడుతున్న తెగలకన్న ఆ ఆచారాన్ని నిషేధించిన తెగలు వేగంగా, బాగా అభివృద్ధిచెందుతాయి ఆ అభివృద్ధికి ఫలితంగా ఏర్పడి బాగా విస్తరించిన గణ సంస్థను చూస్తే, ఈ అడుగు ఎంత ప్రధానమైనదో గ్రహించగలం. అనాగరికయుగంలో వున్న ప్రజలందరిలో కాకపోయినా, అత్యధిక సంఖ్యాకులలో వారి సాంఘిక వ్యవస్థకు యీ గణసంస్థ పునాదిరాయి. గ్రీసు – రోములు సరాసరి దీనిద్వారానే నాగరికతలోనికి పరిణతిపొందాయి.

మెట్టమొదట ఏర్పడిన కుటుంబాలు కొన్ని తరాలు గడిచేక తప్పకుండా విడిపోయితీరాలి. ఆదిమకాలంలో తెగలోని వారంతా సమష్టిగా ఒకే ఇంట్లో నివసించే అలవాటు వుండేది. ఈ సామూహిక కుటుంబ పద్ధతి 'అనాగరికయుగపు' చివరిరోజులవరకూ అన్ని తెగలలోనూ

* Ancient Society పుట – 434. మోర్గన్.

అమలులోవుంది. ఈ మాదిరి కుటుంబాలలోని జనులసంఖ్యకికూడా ఒక హద్దువుంటుంది. పరిస్థితుల్నిపట్టి ఆ సంఖ్య మారుతూవచ్చినా, ఒకే ప్రాంతంలోని యీ మాదిరి కుటుంబాలలో జనసంఖ్య సమానంగానే వుంటుంది. ఒకే తల్లియొక్క సంతానం మధ్య దాంపత్య సంబంధాలు నిషేధింపబడగానే, దానికి ఫలితంగా పాతకుటుంబ వ్యవస్థ మారి, నూతన వ్యవస్థ యేర్పడింది. ఈ నూతన వ్యవస్థలో కుటుంబ సభ్యులందరూ ఆ కుటుంబానికి చెందినవారే కానక్కర్లేదు. తోబుట్టువు లంతా (సయానా తోబుట్టువులూ, వేలువిడిచిన తోబుట్టువులు) ఒక కుటుంబానికి మొదలవుతారు. అన్నదమ్ములంతా మరోకుటుంబానికి మొదలవుతారు. ఇలాంటిదే ఏదో ఒక పద్ధతిలో ఈ నూతన కుటుంబం "రక్త సంబంధీకుల కుటుంబ వ్యవస్థలో"నుండి పుట్టి ఉండాలి. మోర్గన్ దీనికి "ప్యూనలాన్ కుటుంబం" అని పేరు పెట్టేడు. హవాయీ దీవులలోని ఆచారం ప్రకారం కొంతమంది అక్క చెల్లెళ్ళు (వాళ్లు ఒకతల్లి బిడ్డలూ కావచ్చు, లేదా అక్క చెల్లెళ్ళ మనవరాళ్ళో, ముని మనవరాళ్ళో అయి ఆ బంధుత్వంద్వారా అక్కచెల్లెళ్ళూ కావచ్చు) తమ ఉమ్మడి భర్తలకి ఉమ్మడి భార్యలుగా వుంటారు. ఈ స్త్రీల తోడబుట్టినవాళ్ళు వీరి భర్తలుగా ఉండకూడదన్నారుకదా, అందుచేత వీరి భర్తలంతా అన్నదమ్ములే అయి యుండనక్కరలేదు. వారలా పిలుచుకోరుకూడ. వారు ఒకరినొకరు "ప్యూనలా" అని పిలుచుకుంటారు. ఆమాట కర్థం "సన్నిహిత సహచరులు,సహభాగులు". అదేవిధంగా ఒకే తల్లికొడుకులో వేలువిడిచినవారి సోదరులో తమ అక్కచెల్లెళ్ళని కాక పైవారిని కొందరిని ఉమ్మడిభార్యలుగా చేసుకుంటారు. ఆ భార్యలుకూడ తమలో తమరు "ప్యూనలా" అనే పిలుచుకుంటారు.ఇది ఒకవిధమైన కుటుంబం యొక్క పురాతన స్వరూపం. దీనిలో ఎన్నో మార్పులు కాలక్రమేణా రావటానికి వీల్లు ఉన్నాయి. దీని ప్రధానలక్షణం యిది : కుటుంబం విస్పష్టంగా కనబడుతుంది. ఆ కుటుంబ సభ్యులమధ్య భార్యలు, భర్తలు ఉమ్మడిగా ఒకరి నొకరు అనుభవిస్తారు మొదట్లో ఒకే తల్లి సంతానం. తరువాత వేలు విడిచినవారి సంతానం తమలో తాము భార్యా భర్తలుగా జీవించడానికి నిషేధించబడతారు.

అమెరికాలో ఉన్న రక్తసంబంధ వ్యవస్థలోని అంతరువులన్నిటినీ ఉన్నవిఉన్నట్లు తెలియజేసే కుటుంబపద్ధతి ఇది ఒక్కటే. ఇందులో ఒక స్త్రీయొక్క చెల్లెళ్ళు. అక్కల బిడ్డలు ఆమె బిడ్డలుగానే పిలువబడతారు. ఒక మగవాని సోదరుని బిడ్డలుకూడ ఆయన సంతానంగానే లెక్కపెట్టబడతారు. కాని సోదరీ సోదరుల బిడ్డలు సోదరులు కాజాలరు. ఒక స్త్రీయొక్క అన్నదమ్ముల బిడ్డలు ఆమెకు మేనల్లుళ్ళు, మేనకోడళ్ళూను. అల్లాగే ఒక మగవాని యొక్క తోబుట్టువుల సంతానం అతనికి మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు. కాని సోదరీ సోదరుల సంతానం ఒకరికొకరు మేనబావలు, మేనవదినలూను. ఒక స్త్రీ యొక్క అక్కచెల్లెళ్ళ భర్తలు ఆమెకూ భర్తలే. ఒక మగవాని యొక్క అన్నదమ్ముల భార్యలు ఆయనకూ భార్యలే. ఇది ఆచరణలో అమలుజరగకపోయినా ఆ హక్కు మాత్రం మిగిలింది. సోదరీ సోదరుల మధ్య వివాహం నిషేధించబడగానే వారి సంతానాన్ని వివిధ తరగతులుగా విభజించవలసి వచ్చింది. అంతవరకూ అక్కచెల్లెళ్ళ అన్నదముల బిడ్డ లందరూ కలసి సోదరీ సోదరులుగానే పరిగణింపబడేవారు. కాని యిప్పుడు ఒక భాగం పూర్వంలా సోదరీ సోదరులుగానే ఉంటారు. ఇంకో భాగం సోదరీ సోదరులుగా లెక్కలోకి రారు. అంటే అక్కచెల్లెండ్ర సంతానానికీ, రెండవవైపున అన్నదమ్ముల సంతానానికీ ఏకమాతృత్వం, ఏకపితృత్వం లేదు. అందుచేత మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు, మేనబావలు, మేనవదినలు అనే బంధుత్వాలు మొట్టమొదటిమారు అవసరమయ్యాయి. అంతకుపూర్వం ఉన్న కుటుంబపద్ధతిలో యీ బాంధవ్యానికి అర్థంలేదు. ఒకే భార్య, ఒకే భర్త అనే సిద్ధాంతంమీద ఆధారపడిన వివాహపద్ధతులు వేటిలోనైనా యీ అమెరికన్ రక్తసంబంధ పద్ధతి అసంగతంగా కనబడుతుంది. ఈ వ్యవస్థలోని ప్రతి చిన్న అంశానికి సరిఅయిన సమాధానం ప్యూనలాన్ కుటుంబపద్ధతిలో లభిస్తుంది. వాటి ఉత్పత్తికి కూడ ఆధారాలక్కడనే దొరుకుతున్నాయి. ప్యూనలాన్ కుటుంబం కానియ్యండి, యించుమించు అల్లాంటి మరొక పద్ధతే కానియ్యండి, అది ఈ రక్తసంబంధ వ్యవస్థమాదిరిగానే బహుళంగా విస్తరించి యుండాలి.

అమెరికాలోని పూర్వపు స్పానిష్ సన్యాసులవంటి మత ప్రచారకులకు యీ ఆచారాలు పాషండాచారాలుగాను, పరమ అసహ్యంగానూ కనిపించాయి. అందుచేత వాటిని తోసేశారు. అలాకాక వారు కొంచెం విమర్శనాదృష్టితో పరిశీలించి ఉన్నట్లయితే, యీమాదిరి క్రైస్తవేతర కుటుంబపద్ధతికి నిదర్శనలు పోలనీషియా అంతటా కనబడి ఉండేవి. ఇటువంటి పద్ధతి హవాయీ ద్వీపంలో ఉన్నదని ధృవపడనే ధృవపడింది.*

సీజరు బ్రిటన్‌పై దాడిచేసిననాటికి అక్కడి ప్రజలు అనాగరికపు నడిమిదశలో ఉన్నారు. వారినిగురించివ్రాస్తూ "అన్నలూ, తమ్ముళ్లూకలసి తండ్రులు కొడుకులూ కలసి పదిపన్నెండేసి మంది ఉమ్మడిగా భార్యలను కలిగియున్నారు" అంటూ ఆయన వ్రాశాడు. ఇది గుంపుపెళ్ళి అని స్పష్టంగా చెప్పవచ్చు. అనాగరకదశలోయున్న స్త్రీకి, భార్యలతో కాపురం చెయ్యకలవయస్సులోనున్న కొడుకులు పది పన్నెండుమంది ఉండటం అసంభవం. కాని ప్యూనలాన్ కుటుంబపద్ధతికి సరిపడే అమెరికన్ రక్త సంబంధ వ్యవస్థలో ఇది సాధ్యం. దూరపువారయినా, దగ్గరవారయినా అన్నదమ్ముల సంతానం ఒకరికొకరు అన్నదమ్ములుగానే లెఖ్ఖ. "తండ్రులూ కొడుకులూ కలసి" అనే సీజరు వాక్యం భ్రమాత్మకం కావచ్చు. అలాగని అది కేవలం అసంభవం అని తోసెయ్యడానికి వీలులేదు. తల్లీ కొడుకూ; తండ్రీ కూతురూ ఒకేగుంపులో వివాహసంబంధం కలిగియుండటం జర

* బాకోఫెన్ ఈ మాదిరి స్వేచ్ఛా సాంగత్యాన్ని "Sumpfzeugung" అని పిలిచాడు. దీనిని తాను నూతనంగా కనుక్కొన్నానని ఆయన అభిప్రాయం, దీని చిహ్నాలు "గుంపుపెళ్ళి" వ్యవస్థను చూపిస్తాయి. "ఈ ప్యూనలాన్ వివాహాలను బాకోఫెన్ చట్ట విరుద్ధమైనవానినిగా లెక్కకట్టేటట్లయితే, ఆనాటిమానవుడికి యీనాటి పెళ్లిళ్ళలో చాలభాగం వావులుగా కనిపిస్తాయి. తండ్రివైపునుంచి తల్లి వైపునుంచి "కజిన్" బంధుత్వం కలవారు—అది దగ్గర బంధుత్వమైనా దూరపుదైనా—నేడు వివాహం చేసుకుంటున్నారు. వీనిని రక్తసంబంధం కల అక్క చెల్లెళ్లు, అన్నదమ్ముల మధ్య జరుగుతున్న వివాహాలుగా అతడు పరిగణిస్తాడు." (మార్క్స్)—ఏంజిల్స్ వ్యాఖ్య.

గకపోవచ్చును. కాని తండ్రీ కొడుకూ; తల్లీ కూతురూ ఒకే గుంపులో వివాహ బంధంలో కట్టుబడియుండవచ్చు. ఆటవిక అనాగరిక ప్రజలు ఉమ్మడిగా భార్యలను కలిగియున్నారని హెరోడోటస్ తదితర ప్రాచీనకాలపు గ్రంథ కర్తలూ వ్రాశారు. వాటికి యీ గుంపుపెళ్లి పద్ధతులు ఉదాహరణలుగా ఉన్నాయి. గంగానదికి ఉత్తరాన అయోధ్యరాష్ట్రంలోని తికూర్లను గురించి వాట్సన్, కీయీలు యిటువంటి విషయమే వ్రాశారు.

"స్త్రీ పురుషులమధ్య గల వివాహబంధం నామమాత్రమే. ఏ కష్టం లేకుండా వారు తమ సంబంధాలను మార్చుకోగలరు. వారు పెద్ద పెద్ద కుటుంబాలుగా యించుమించు భేదభావంలేకుండా దాంపత్యసంబంధం కలిగి వివసిస్తున్నారు. ఒకవేళ ఇద్దరు వ్యక్తులు వివాహం చేసుకున్నట్లు పరిగణింపబడితే, ఆ బంధం నామమాత్రంగానే ఉండేది."

(Watson and Kaye: The People of India Vol. 2 పుట 85–1868.)

గణసంస్థ సర్వసాధారణంగా ప్యూనలాన్ కుటుంబ పద్ధతిలో నుంచే సరాసరి వచ్చినట్లు కనిపిస్తుంది. ఆస్ట్రేలియాలోని తరగతుల విభజన పద్ధతిలోంచికూడ అది పుట్టింది* ఆస్ట్రేలియనులకు గణాలున్నాయి. ప్యూనలాన్ కుటుంబం యింకా లేదు. కాని అంతకంటె మొరటైన ఒక గుంపు పెళ్ళిపద్ధతి అక్కడ అమలులో ఉంది.

అన్నిరకాలగుంపుపెళ్ళిళ్ళలోను పిల్లలకి తండ్రి ఎవరనేది తెలియదు. కాని తల్లి ఎవరో తెలుస్తుంది. కుటుంబంలోని పిల్ల లందర్నీ ఆమె తన బిడ్డలనే అనవచ్చు. అందరియెడలా సమానంగానే మాతృవిధులను నిర్వహించవచ్చు. అయినా ఆమె తన సహజసంతానాన్ని గుర్తించగలదు. అందుచేత గుంపుపెళ్లి ఉన్నంతకాలమూ సంతానాన్ని తల్లివైపు మంచే పరిగణిస్తారు. అందుచేత "ఆడకోవ" మాత్రమే లెక్కలోకి

---

* ఆస్ట్రేలియా ఆదిమవాసులలో వివాహ సంబంధాలతో ఏర్పడిన పెద్ద పెద్ద గుంపులు (వీనిని మొయిటీలంటారు) ఉన్నాయి. రచయిత యిక్కడ యికముందు కూడ ఉదాహరించేది వీటినిగురించే.

వస్తుంది. ఆటవిక యుగంలోనూ, అనాగరిక యుగపు దిగువదశలోనూ ఉన్న ప్రజలందరిలో యిది యింతే. ఈ విషయాలను మొదట కనుక్కొన్నవాడు బాకోఫెన్. తల్లివైపునుంచి సంతానాన్ని గుర్తిస్తారని సూచించడానికి, దాని ఫలితంగా ఆ కాలంలో జ్ఞాతిబాంధవ్యం తల్లివైపు నుంచే గుర్తించబడుతు దని సూచించడానికి ఆయన "తల్లిహక్కు" అనే మాట నుపయోగించాడు. సౌకర్యంకోసం నేనూ అదే వాడుతున్నాను. కాని ఈ పదం సరిఅయినదికాదు. ఏమంటే ఈ దశలోవున్న సమాజంలో 'హక్కు' అనే మాటకు అర్థంలేదు.

ప్యూనలూన్ కుటుంబంలోని ప్రధాన శాఖలు రెండింటిలో ఒకటి తీసుకుందాం. ఒకే తల్లియొక్క కూతుళ్లూ, వారి వ్రేలువిడిచిన అక్కచెల్లెళ్లు ఒకశాఖ. వీరి అందరి సంతానం, వీరందరికి తల్లివైపునుంచి సోదర బంధుత్వంఉన్న మగవాళ్లు కూడ ఈ శాఖకే చెందుతారు. ఈశాఖలోవి అక్కచెల్లెళ్ళకు అన్నదమ్ములు భర్తలుకారని ఊహిద్దాం. ఇట్టివారే తర్వాత గణసంస్థలో మనకు కనిపిస్తారు ఇది గణంయొక్క ప్రప్రథమ రూపం. గణంలోని వా రందరికీ ఆదిమాత ఒకర్తే. ఒక్కొక్క తరంలోని ఆడ, మగ ఆమె సంతతకి చెందినవారు కావడంచేత అంతా ఒకళ్ళ కొకళ్లు సోదరీ సోదరులు. వీరిలో అక్కచెల్లెళ్ళకు వారి అన్నదమ్ములు భర్తలు కాజాలరు, అందుచేత ఆ భార్యా భర్తలకు ఆదిమాత ఒకర్తె కాదు. వారు ఒకే రక్తసంబంధానికి చెందినవారూకాదు. ఈ అక్కచెల్లెళ్ళ పిల్లలందర్నీ ఆ శాఖలోనివారిగానే గుర్తిస్తారు. ఏమంటే సంతానాన్ని తల్లివైపునుంచే గుర్తించుతారు. కనుక అదే లెక్కలోకి వస్తుంది. తల్లివైపునుంచి బంధుత్వం కలిసిన వేలువిడిచిన సోదరీ సోదరుల మధ్య కూడా దాంపత్య సంబంధాలు నిషేధించబడ్డంతో, రక్త సంబంధీకుల కుటుంబశాఖ గణంగా మారిపోయింది అంటే ఆశకోవకు చెందిన రక్త సంబంధీకులతో కుటుంబం ఏర్పడుతుంది. ఈ కుటుంబంలో వారిమధ్య వివాహం నిషిద్ధం. ఇప్పటినుంచీ గణం మొత్తానికి చెందిన సాంఘిక, మత స్వభావం గల సంస్థల సహాయంతో యివి దృఢపడ్డాయి. ఒకే తెగకు చెందినగణాలలో కూడ దేనికది ప్రత్యేకంగా రూపొందాయి. దీనిని గురించి

ముందు ముందు తెలుసుకుందాం. అయితే ప్యూనలాన్ కుటుంబ పద్ధతి నుంచి దానంతటదే గణ సంస్థ తప్పనిసరిగా పరిణామం పొందుతుందని గ్రహించ కలిగినపుడు అటువంటి సంస్థలుగల ప్రజలలో - అనాగరిక, నాగరిక జాతులందరిలోనూ—ఒకనాడు ప్యూనలాన్ కుటుంబ పద్ధతి ఉండేదని నిర్ధారణగా చెప్పవచ్చును.

మోర్గన్ తన పుస్తకం వ్రాసేనాటికి గుంపు పెళ్ళిళ్ళకు సంబంధించిన విషయాలు మనకంతగా తెలియవు ఆస్ట్రేలియన్లలోని గుంపు పెళ్ళిళ్ళ తరగతులను గురించి మాత్రం చాల స్వల్పంగా తెలుసును. హవాయి దీవులలోని ప్యూనలాన్ కుటుంబంగురించి తెలిసినంత వరకూ ఆయన 1871 నాటికి ప్రకటించారు. ఈ ప్యూనలాన్ కుటుంబం ఒకవేపు అమెరికాలోని ఇండియన్ల రక్త సంబంధపద్ధతులకి పూర్తిగా సరిపడింది. రెండోవైపు తల్లిహక్కుతో కూడిన గణాలు సరాసరి ప్యూనలాన్ కుటుంబనుంచే పరిణతి పొందినాయని ఇదిచూపుతోంది. అంతేకాక ఆస్ట్రేలియాలోని తరగతి విభజన పద్ధతి కంటె యీ ప్యూనలాన్ కుటుంబం ఉన్నతమైన అభివృద్ధి దశను చూపుతోంది అందుచేతనే "జంట పెళ్ళిళ్ళు" రావడానికి ముందు ఇది ఒక అత్యవసరమైన మెట్టుఅని. సర్వత్రా యిది ఆకాలంలో ఉండిఉండాలని మోర్గన్ ఊహించడంలో ఆశ్చర్యం లేదు. ఆయన తర్వాత గుంపు పెళ్ళికి సంబంధించిన చాల విషయాలు మనకు తెలిసేయి. అయితే, ప్యూనలాన్ కుటుంబం గుంపు పెళ్ళిళ్ళలో ఉన్నత స్థాయికి చెందినదనీ నాగరికమనీ ఆయన ఊహించకలిగాడు. అదిముఖ్యం. ఇక్కడినుంచి ముందుదశలకు వచ్చిన పరిణామాలను అతి సులభంగా ఊహించవచ్చును.

లారిమోర్ - ఫైజన్ అనే ఇంగ్లీషు మిషనరీ యీ గుంపు పెళ్ళిళ్ల విషయంలో అనేక కొత్త విషయాలు సమీకరించాడు. ఆయనకు మనం కృతజ్ఞత చూపవలసినదే. ఈ మాదిరి పెళ్లిళ్లకి ఆస్ట్రేలియాను ప్రధానమైన కేంద్రంగా భావించాలి. అక్కడ యెన్నో సంవత్సరాలపాటు ఆయన యీ మాదిరి కుటుంబపద్ధతిని గురించి పరిశోధించాడు. దక్షిణ ఆస్ట్రేలియాలో గాంబీర్ అనే పర్వతాలున్నాయి. అక్కడున్న ఆస్ట్రేలి

యన్ నీగ్రో లంతా చాల వెనుకబడియున్న దశలో ఉన్నట్లు ఈయన గమనించాడు. ఇక్కడి తెగంతా రెండు తరగతులుగా విభజింప బడింది. ఈ రెండూకూడ తరగతికి బయటనే వివాహసంబంధాలు పెట్టు కోవాలి. వీటిని మొయిటీ లంటారు. ఒకటి క్రోకీ, రెండోది కుమైట్ ఈ రెండు తరగతుల్లోనూ కూడ తరగతిలోపల దాంపత్యం నిషిద్ధం, పైగా ఒక తరగతిలో పుట్టిన ప్రతి మగవాడూ పుట్టుకతోనే రెండవ తరగతిలో పుట్టిన ప్రతి స్త్రీకి భర్త. అలాగే స్త్రీలుకూడ రెండో తరగతిలోని ప్రతి మగవానికి భార్యలు ఇక్కడ వివాహం వ్యక్తుల మధ్య జరగలేదు. మొయిటీకి మొయిటీకి మధ్య వివాహం జరి గింది. అయితే బహిర్వివాహపద్ధతిని అనుసరించే రెండు తరగతులుగా విభజింపబడటంతప్ప వీనిలో స్త్రీ పురుషుల వయస్సులో తారతమ్యాలు గాని, దగ్గర దూర బంధుత్వాలుగాని అభ్యంతరంగా గుర్తించబడవు. ఈ విషయం యిక్కడ గమనించవలసియుంది. ఒక క్రోకీవానికి, ప్రతి కుమైట్ ఆడుది భార్యయే. అది జన్మతఃవచ్చిన హక్కు. తల్లి హక్కు ప్రకారం అతని కూతురుకూడ కుమైట్ తరగతికి చెందినదే అవుతుంది. ఆమె కుమైట్ తల్లియొక్క సంతానం కావడంచేత జన్మతః ఆమె ప్రతి క్రోకీ మగవానికి భార్యయే. ఆ మగవాళ్ళలో తండ్రికూడ వుంటాడు. మొత్తంమీద మనకు తెలిసినంతవరకూ మొయిటీ సంస్థల నిర్మాణంలో యీమాదిరివి నిషేధించినట్లు కనిపించవు తల్లిదండ్రులకూ బిడ్డలకూమధ్య దాంపత్యసంబంధం వుండడం తప్పుగా పాటించబడని రోజులలో (ఈ మాదిరి సంబంధాల నిషేధాలు పాటంతటవే ఆచరణలో కొస్తున్నప్పటికి) ఈ సంస్థలు పుట్టియుండాలి. స్త్రీ పురుష సంబంధాలు స్వేచ్ఛగా సాగుతున్న దశ అనేది లేకపోతే మొయిటీలు ఏర్పడేనాటికి తల్లి దండ్రులకీ, పిల్లలకూమధ్య అదివరకే దాంపత్యసంబంధం నిషేధించబడి ఒక ఆచారంగా పాటించబడి యుండాలి. అదే నిజమయితే రక్తసంబంధ వ్యవస్థలోంచి యీనాటి మొయిటీల పద్ధతి పట్టివుందనాలి. దాని తర్వాత వచ్చిన మొదటిదశ అనుకోవాలి. ఈ ఊహే సముచితమని నా అభి ప్రాయం. నాకు తెలిసినంతవరకూ ఆస్ట్రేలియాలో తల్లి దండ్రులకూ,

పిల్లలకూ మధ్య దాంపత్యసంబంధా లున్నట్లు కనబడదు. తల్లి హక్కుగల గణసంస్థ బహిర్వివాహపద్ధతికి పరిణామరూపం. ఆ గణం ఏర్పడేటందుకు పూర్వమే యీ నిషేధం అమలులోకి వచ్చినట్లు ఆస్ట్రేలియాలోని గణవిధానమే సూచిస్తోంది.

దక్షిణ ఆస్ట్రేలియాలోని గాంబీర్ పర్వత ప్రాంతంలోనేగాక, తూర్పుగా డార్లింగ్‌నదీ ప్రాంతాలలోనూ, ఈశాన్యంగా క్వీన్స్‌లాండ్ లోనూ కూడ రెండు మొయిటీల పద్ధతి అమలులో యున్నట్లు కన్పడుతూంది అందుచేత యిది బాగా వ్యాప్తిచెందినదేనని చెప్పవచ్చు. ఈపద్ధతి తల్లికీ పిల్లలకూ మధ్య, అన్నదమ్ములకూ అక్కచెల్లెళ్ళకూ మధ్య, అక్కచెల్లెళ్ళ పిల్లల మధ్య వివాహాలు కూడదని నిషేధిస్తోంది. వారంతా ఒకే మొయిటీకి చెంది ఉండటమే దీనికి కారణం. కాని అక్క చెల్లెళ్ళ పిల్లలు, అన్నదమ్ముల పిల్లలు ఒకరి నొకరు వివాహం చేసుకొనవచ్చు. న్యూసౌత్ వేల్సులో డార్లింగ్‌నదీ ప్రాంతాలలోనూ, కామిలారాయి తెగవారు అంతర్దాంపత్యాన్ని నిషేధించడంలో మరో అడుగు ముందుకు వేశారు. మొదట రెండు మొయిటీలు, మళ్ళీ ఒక్కొక్కటి రెండు దళాలుగా విభజన అయాయి. ఈ దళాలు ఏక మొత్తంగా రెండో మొయిటీలోని దళాలకు భార్యా భర్తలు. తల్లి యొక్క మొయిటీని పట్టి ఆమెసంతానాన్ని మూడోదళంలోనో, నాలుగోదళంలోనో చేరుస్తారు. వీరిసంతానం మళ్ళీ ఒకటో దళం రెండోదళం అవుతుంది. వారు పరస్పరం దంపతులు, మళ్ళీ తరంవారూ పరస్పరం దంపతులు ఈ విధంగా తరగతులతోబాటు తరాలు కూడ విభజింపబడతాయి. ఒకతరం వారు ఒకటీ రెండూ దళాలయితే, వారితర్వాత తరం మూడోదళం నాలుగోదళం అవుతుంది. మూడోతరం ఒకటీ రెండూ దళాలవుతుంది. నాలుగోతరం మూడూ నాలుగూ దళాలవుతుంది. ఈ పద్ధతిలో తల్లి వేపునుంచి వేలు విడిచిన బంధువులు మొదటి తరం వారయితే భార్యా భర్తలు కాజాలరు. మళ్ళీ రెండో తరం వారికి ఆ అవకాశం యుంటుంది. ఇదొక చిత్రమైన గజిబిజి పద్ధతి. మాతృస్వామిక గణాల నిర్మాణంతో యిది మరింత గజిబిజి అయింది. కాని ఆ వివరాల

లోకి యిప్పుడు పోలేము. ఇక్కడ గమనించవలసిందేమంటే అంతర్దాంపత్యాన్ని నిషేధించాలనే భావం ఎందుకు చేస్తూన్నదీ తెలియకుండానే దానంతటదే ఆచరణలోకి వస్తుంది.

పై విషయాలను పట్టి చూస్తే, ఆస్ట్రేలియాలో గుంపు పెళ్ళి అనేది గుంపుగా ఉన్న ప్రజలమధ్య జరుగుతున్న ఉమ్మడి పెళ్ళిగానే ఉందని తెలుస్తూంది. స్త్రీ పురుషుల సంఖ్య సమానంగా ఉన్న ప్రదేశాలలో ఆ ఖండం నాలుగు మూలలా యిది ఆచారంలోయుంది. ఇది మన చాంధసుల దృష్టిలో వట్టి వ్యభిచారం. నిజానికి వీనిని జాగ్రత్తగా పరిశీలిస్తే అంత వికటంగా కనిపించవు. పై పెచ్చు యిల్లాంటి పద్ధతి అమలులో ఒకటిఉన్నదనే అనుమానంకూడ ఎన్నో సంవత్సరాలదాక కలగలేదు. ఈ నాడు కూడ యివంతా పొరపాటు నిర్ధారణ అనే వాళ్ళులేకపోలేదు. పై పై దృష్టితో చూస్తే యీ గుంపు పెళ్ళిళ్ళు అస్థిరమైన దంపతీ వివాహాలుగా కనిపిస్తాయి. బహు భార్యాత్వానికి, వ్యభిచారానికి యివి మారు రూపం అనిపిస్తాయి. ఈ వివాహపద్ధతులు యించుమించుగా ఆచరణలో యూరపియన్ పద్ధతులకు సరిపడినట్లే కనిపిస్తాయి, వీని మూల సూత్రాలను తెలుసుకోడానికి ఫైసన్, హూంవిట్ అనేవారు చాలకాలం కృషి చేశారు. ఆ మూల సూత్రం ఏమిటి ? ఆస్ట్రేలియన్ నీగ్రో తన యింటికి వందలకొద్దీ మైళ్ళదూరంలో తన భాషకూడ తెలియని ప్రజలమధ్య తిరుగుతూన్నా, అతడు వెళ్ళిన చోట్లల్లా ఏ రాత్రికారాత్రి ఒక స్త్రీని సంపాదించగలడు. నిర్బంధంగాని, సంకోచంగాని లేకుండా ప్రతి తెగలోనూ, ప్రతి దళంలోనూ తనతో ఆ రాత్రి గడపగల స్త్రీని సంపాదించగలడు.

చాలామంది భార్యలున్నవాడు ఆ రాత్రికి తన భార్యలలో ఒకర్తెను అతిధికివ్వాలనేది వీరి ధర్మం. ఈ ఆచారం యూరోపియనులకు అవినీతిగానూ, అధర్మంగానూ కనబడవచ్చు. కాని, ఆస్ట్రేలియన్ నీగ్రోలలో అమలులోవున్న ధర్మం అది. ఆమె మరొకరి వివాహ తరగతికి సంబంధించినది. అందుచేత జన్మతః వారాతనికి భార్యలు. స్త్రీ పురుషుల నొకరికొకర్ని నిర్దేశిస్తున్న ఈ నైతిక ధర్మమే తమ తమ తరగతులకు వెలుపల దాంపత్యాన్ని నిషేధిస్తూంది. వారిలో రాక్షస వివాహ పద్ధతి

(భార్యల్ని బలవంతంగా తెచ్చుకొనే పద్ధతి.) కొన్నిచోట్ల చాల ప్రచారంలో వుంది. అటువంటి సందర్భాలలోకూడా వారు వేర్వేరు తరగతులకి చెందినదీ లేనిదీ బహూ పట్టుదలగా చూస్తారు.

జంటపెళ్ళి రూపంలోనేనాయె - ఇద్దరు వ్యక్తులమధ్యనే దాంపత్య సంబంధంవుండే స్థితి ఏర్పడుతూం దనడానికి యీ రాక్షసవివాహ పద్ధతి ఒక సూచన. ఒక పడుచువాడు తన మిత్రులు కొందరిని సాయం తీసుకొని, ఒక పడుచు నెత్తుకుపోయినప్పుడూ లేవదీసుకుపోయినప్పుడూ వారందరూ ఆమె నోమారు వరుసగా అనుభవిస్తారు. అఖరున ఆ ప్రయత్నం ప్రారంభించినవానికి ఆమె భార్యగా అంగీకరించబడుతుంది. ఆ విధంగా పట్టితెచ్చిన ఆమె తన మగనినుంచి పారిపోయి, మరొకని చేత పట్టుబడితే ఆమె రెండోవానికి భార్య అవుతుంది. మొదటివానికామెమీద హక్కు వుండదు. ఆ విధంగా ఒక మూల 'గుంపుపెళ్లి' సర్వసాధారణాచారంగా పరిపాటిలోనే వున్నా, దాని ప్రక్క ప్రక్కనే దానితోపాటుగానే పరిమిత, ప్రత్యేక సంబంధాలుకూడా ఏర్పడుతున్నాయి. కొద్దికాలమే కలిసివుండనీ, దీర్ఘకాలం కలిసివుండనీ జంటలుగా నివసించడం ఏర్పడుతూంది. రెండోవేపున ఆ గుంపులలోను, వాటి సరసన బహుభార్యాత్వంకూడ సాగుతూంది. ఇక్కడకూడా 'గుంపుపెళ్లి' పద్ధతి క్రమక్రమంగా అంతరించిపోతూం దన్నమాట. అయితే యూరపియనులతోడి సంబంధం ఫలితంగా ముందేది అంతరిస్తుంది? గుంపుపెళ్లి పద్ధతా? దానిని అనుసరించే ఆస్ట్రేలియను నీగ్రోలా? ఏది ముందు? ఏది వెనుక?

ఆస్ట్రేలియాలో అమలులో వున్నమాదిరి తరగతి వివాహాలు గుంపు పెళ్ళి పద్ధతిలోకూడ అతి ప్రాచీన, ప్రాథమిక రూపాలు. ప్యూనలాన్ కుటుంబ పద్ధతి మనకు తెలిసినంతలో అత్యున్నత అభివృద్ధి దశకు చెందిన గుంపు పెళ్లి పద్ధతి. సంచార జీవితం గడుపుతున్న అటవిక దశలో వున్న మానవుని సామాజికాభివృద్ధి స్థాయికి ఇది సరిపడుతుంది. ఆ సామూహిక వివాహపద్ధతి, ప్యూనలాన్ కుటుంబ పద్ధతి అమలులో వుందంటే ఆ నాడు కొంతవరకు మానవుడు స్థిరవాసం చేస్తున్నాడ నీ,

సమిష్టి కుటుంబాలుగా నివసిస్తున్నారనీ వూహించగలం. ఆ కుటుంబ పద్ధతి భవిష్యదభివృద్ధిదశకు ప్రాతిపదిక అవుతుంది. ఈ రెండు దశలకూ మధ్య తప్పకుండా ఎన్నో అంతర్దశలుండి తీరుతాయి. వాని పరిశీలన ఇప్పుడే ప్రారంభమయింది. దానినింకా తొక్కిచూసినవారు తక్కువ. ఎంతో పరిశోధన జరగవలసి వుంది ఈ విషయంలో.

## 3. జంట పెళ్ళి

గుంపు పెళ్ళి కాలంలోనూ, అంతక్రితమూకూడా స్త్రీ పురుషులు అల్పకాలమో, అధికకాలమో జంటలుగా కలిసి జీవించక పోలేదు. అసంఖ్యాకంగా వుండే భార్యలలో ఒకామె మగవానికి ముఖ్యభార్యగా వుండేది. (ముద్దులభార్య అనడానికి తగిన పరిస్థితులు అప్పటికింకాలేవు.) మిగిలిన మగవాళ్ళందరిలో ఆత డామెకు ప్రధాన భర్త. ఇదే క్రిస్టియన్ మతబోధకులను ఎంతో కంగారు పెట్టిందని చెప్పవచ్చును. గుంపు పెళ్ళి అంటే యిష్టంవచ్చినప్పుడు ఇష్టంవచ్చినఆమెను అనుభవించే భార్యల సమూహం అనీ, హద్దూపద్దూలేని వ్యభిచారానికి ఆటపట్టు అనీ వారు భావించారు. క్రమంగా గణసంస్థలు దృఢపడ్డాయి. అంతవరకూ ఒకరి కొకరు భార్యాభర్తలుగా పరిగణించబడిన గుంపులనుంచి సోదరీ - సోదరులను మినహాయించడం పరిపాటి అయింది. చివరకు వారి మధ్య వివాహ సంబంధాలు అసంభవం అయాయి.

ఫలితంగా జంట పెళ్ళిళ్ళు అలవాటునుంచి అవసరంగా మార్పు చెందాయి. రక్త సంబంధం కలవారి మధ్య వివాహసంబంధాలపై నిషేధం గణ సంస్థలో వచ్చింది. అది క్రమంగా విస్తరించింది. ఇరాక్వాలలోను, అనేక ఇండియను తెగలలోను మనకది కనిపిస్తుంది. వారు అనాగరిక యుగపు దిగువదశలో వున్నవారు. వారిలో అనేక వందల తరహాల బంధుత్వాలు ఏర్పడివున్నాయి. ఏ విధమైన బంధుత్వం కలిసినప్పటికీ వారి మధ్య వివాహం నిషిద్ధం. ఈ నిషేధాలు పెచ్చుపెరిగి గుంపు పెళ్ళిళ్ళు అంతకంతకు అసంభవం అయిపోయాయి; ఆ పద్ధతికి బదులు జంటపెళ్ళి కుటుంబం అమలులోకి వచ్చింది. ఈ దశలో మగవాడు ఒకే

ఆడుదానితో జీవిస్తాడు. ఆర్థిక కారణాల మూలంగా బహుభార్యాత్వం అరుదు. బహుభార్యాత్వమూ, ఇతర స్త్రీలతో పొందూ మగవాళ్ళ ప్రత్యేకాధికారంగా తయారయింది. కాని, రెండోవేపున ఒకనితో వున్నంత కాలమూ స్త్రీ ఖచ్చితంగా పాతివ్రత్యం పాలించవలసిందే. మరొకరితో కలియడం జరిగితే బహుకఠోరంగా శిక్షిస్తారు. అయితే స్త్రీ పురుషులలో ఎవరికి ఇష్టంలేకపోయినా, వివాహబంధాన్ని అతి సులువుగా విడగొట్టి వేసుకోవచ్చు. వారికి పిల్లలుంటే వారు వెనకటి మాదిరిగా తల్లిదగ్గరే వుంటారు. వారిద్దరూ వేరేవేరే మరల వివాహం చేసుకొనేటందుకు ఆటంకం ఏమీలేదు.

ఈ విధంగా రక్తసంబంధంగల వారిమధ్య వివాహ నిషేధం విస్తరించిన కొద్దీ "సహజమైన ఎన్నిక" సూత్రంకూడ ప్రభావం కలిగిస్తుంది.

అంతక్రితం రక్త బాంధవ్యంలేని గణాలమధ్య వివాహం జరగడం వలన "శారీరకంగానూ, మానసికంగానూ కూడ బలిష్ఠమైన సంతానం కలగసాగింది...అభివృద్ధి పొందుతున్న రెండు తెగలు ...ఒంటిగా కలిసి నప్పుడు కొత్త పుర్రె, మెదడూ, విస్తరిస్తుంది. రెండుతెగలవారి శక్తులూ ఇద్దరిలోనూ విస్తరిస్తాయి" అన్నాడు మోర్గన్, "తన ప్రాచీన సమాజం" అన్న పుస్తకంలో.

ఆ విధంగా గణనిర్మాణంలోవున్న తెగలు వెనకబడినవానిమీద పై చెయ్యి సంపాదిస్తాయి. లేదా వెనకబడిన తెగలు తమను తప్పనిసరిగా అనుకరించేటట్లు చేసుకుంటాయి.

కాబట్టి ప్రాచీనకాలంనాటి కుటుంబచరిత్రను పరిశీలిస్తే వివాహ బంధం పరిధి అంతకంతకూ సంకుచితంఅవుతూ వచ్చిందని తెలుస్తుంది. మొట్టమొదటతెగకు తెగంతా వివాహబంధ పరిధిలో వుండేది. ఆ పరిధిలో నున్న స్త్రీ పురుషులంతా ఉమ్మడిగా దంపతులు. మొదట దగ్గరబంధువులు, క్రమంగా దూరబంధువులు, చివరకు పెండ్లిద్వారా బంధుత్వం కలిసినవారిని కూడా వివాహబంధంలోంచి మినహాయించడం, వారిమధ్య దాంపత్యసంబంధాలు నిషేధించడం వచ్చింది. గుంపు పెళ్లిళ్లింక ఏ

విధంగానూ ఆచరణలో సాధ్యంకాకుండా పోయాయి. ఇంక మిగిలింది జంట ఆ జంటమధ్య కూడా వివాహబంధం చాల అల్పప్రాణం. అది కూడా తెంపివేస్తే ఇంక వివాహమనేదే వుండదు. ఈ ఒక్క విషయం చూస్తే "ఒకే భార్య. ఒకే భర్త" వివాహాలకు వ్యక్తులమధ్య లైంగిక ప్రేమ కారణంకాదని మనకు కనిపిస్తుంది. ఈ దశలోవున్న ప్రజలందరి లోను యీ ఆచారం వుంది. దాని కింతకన్న పెద్ద సాక్ష్యం అక్కర్లేదు. అంతక్రితం అమలులోవున్న కుటుంబపద్ధతులలో మగవాడికి ఆడవాళ్ళ లోపం యెన్నడూలేదు. పైపెచ్చు చాల ఎక్కువగా లభించేవారు కాని, ఇప్పుడింక ఆడవాళ్లు కరువయ్యారు. వాళ్ళకోసం వెతుకులాడవలసి వస్తూంది. ఫలితంగా జంటపెళ్లిళ్లతోపాటుగా ఆడపిల్లల్ని ఎత్తుకొచ్చి పెళ్లి చేసుకోవడమూ డబ్బు ఇచ్చి కొనుక్కోవడమూ వంటి పద్ధతులు వ్యాప్తి లోకివచ్చాయి. ఇవి అవ్యవస్థయొక్క పట్టిలక్షణాలేగాని,అంతకంటె మరేం కాదు. పరిస్థితులు మూలమట్టుగా మారిపోయిన దానికవి ఫలితం మాత్రం కాదు. ఈ లక్షణాలనూ, భార్యల్ని సంపాదించడంలో అవలంబించిన పద్ధతుల్నీ మాక్లెన్నాన్ ప్రత్యేక తరగతి వివాహపద్ధతులనుగా ఊహించాడు. 'రాక్షస వివాహాలూ', 'శుల్క వివాహాలూ' ఆయన ఆలోచనలో ప్రత్యేక కుటుంబ పద్ధతులయాయి. అమెరికాలోని ఇండియను తెగలలోనూ, అదే అభివృద్ధిదశలోవున్న ఇతరులలోనూ ఎక్కడా సర్వసాధారణంగా వివాహ ప్రక్రియ వధూవరులచేతులలో వుండదు. అసలువారిని సంప్రదించడం అనేదేవుండదు. చేయవలసిందంతా తల్లుల ద్వారానే జరిగిపోతు ది. ఒకరి ముఖాలొకరు ఎరగని వ్యక్తుల్ని వారు దంపతులను చేసేస్తారు. వివాహకాలం సమీపించినాకనే తమకు సంబంధం కుదిరినట్లు వారికి తెలుస్తుంది. పెళ్ళికి పూర్వం వరుడు వధూ పక్షం వారికి బహుమతులిస్తాడు. వధూ పక్షంలోకూడ ఆమె తల్లివేపు వారికేగాని తండ్రివేపువారికి కాదు. పెళ్ళికూతుర్ని కొనుక్కుని ఇచ్చిన బహుమతులుగానే వీనిని లెక్కకడతారు. ఇరువురిలో ఎవరు కాదన్నా ఆ పెళ్ళి విచ్ఛిన్నం చేయబడుతుంది. కాని, చాలా తెగలలో – ఇరాక్వాలనే వుదాహరణకు తీసుకోవచ్చు – ఆ విధంగా వివాహం విచ్ఛిన్నం కావడానికి జనాభిప్రాయం ప్రతికూలంగా

వుంటూంది. తగవులు వచ్చినప్పుడు, ఇరువేపుల బంధువులూ కలుగ చేసుకుంటారు. సమాధానపరచడానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నాలన్నీ విఫలమైనప్పుడే దంపతులు విడిపోతారు. పిల్లలుంటే వారు తల్లిదగ్గరే వుంటారు. ఉభయులూ మళ్ళీ పెళ్లిచేసుకోవచ్చు.

వేరే కాపురం పెట్టడం అవసరమూ, మంచిదీ అయినా, జంట కుటుంబం చాల బలహీనంగానూ, అస్థిరంగానూ వుండటంచేత ప్రాచీన కాలంనుంచీ అనుశ్రుతంగా వస్తున్న సామూహిక, గృహ వ్యవస్థను అది రద్దు పరచలేక పోయింది. కాని సామూహిక గృహ వ్యవస్థలో స్త్రీదే ఎప్పుడూ పై చేయి. అసలు తండ్రిని గుర్తించడం అసంభవమే కావడం చేత సంతానాన్ని తల్లివైపునుంచే గుర్తిస్తారు. ఫలితంగా తల్లులకే గౌరవం. నాగరికుల మనుకొనేవారిలో ప్రారంభంనుంచి స్త్రీ పురుషుడికి బానిసగా వుంటూందని పద్దెనిమిదోశతాబ్దంనుంచీ ఒక అభిప్రాయం ప్రచారంలోవుంది. అది ఆధారంలేని మాట, ఆటవికదశలో వున్న ప్రజలలో, అనాగరికయుగపు దిగువ, నడిమిదశలలోని వారిలో, ఒక్కొక్కప్పుడు ఎగువ దశవారిలోకూడ స్త్రీ స్వతంత్రురాలు. అంతేకాదు. ఆమెకెంతో గౌరవం. ఇరాక్వ్యా జాతికి చెందిన సెనెకా తెగలమధ్య చిరకాలం జీవించిన ఆర్థర్ రైట్ అనే మత బోధకుడు జంటకుటుంబంలో స్త్రీకి వుండే స్థానాన్ని ఇట్లా వివరించాడు:

"ఇంక వారి కుటుంబ పద్ధతులు. పూర్వకాలపు పెద్దపెద్ద ఇళ్ళల్లో (అనేక కుటుంబాలు కలిసి ఏర్పడ్డ సామూహిక గృహాలు) నివశిస్తున్న స్థితిలో, ఆ ఇంట్లో ఒక జిమ్మా (గణం)ది అధికారం. అది సహజం. ఆ జిమ్మా స్త్రీలు ఇతర జిమ్మాల (గణాల) నుంచి పురుషుల్ని తెచ్చుకుంటారు... సాధారణంగా ఇంట్లో ఆడవాళ్ళదే పెత్తనం... దినుసులన్నీ ఉమ్మడిసొత్తు. భర్త అనండి, ప్రేమికుడనండి, మగవాడు తన వంతు సంబారాలు తెచ్చి పడెయ్యకపోతే వాడి అవస్థ ఉంటుంది చూడాలి. ఆతడికాయింట పిల్లలెందరున్నా సరే. అతని వస్తువులెన్నివున్నా రే. ఏ క్షణంలోనైనా సరే ఆతడిని నెత్తిన గుడ్డవేసుకొని పొమ్మనవచ్చు. సబదేశం వచ్చాక, మరి అక్కడ వుండడం అతనికి క్షేమంకాదు...

విజంగా కుంపటె త్తేస్తారు... ఇంక తన జిమ్మాకు పోవలసిందే సాధార ణంగా అతడు మరొచోట వివాహసంబంధం కుదుర్చుకుని వెళ్లిపోతాడు. ఇతర అన్నిచోట్లలాగే ఇక్కడా జిమ్మాలో స్త్రీలదే పెత్తనమూ అధికా రమూ. అవసరం వచ్చింద టే వాళ్లు తమ నాయకుడికికూడా "కొమ్ములు కోసేసి" (ఇది వాళ్ళ పారిభాషికపదం) సామాన్య యోధులలో ఒకణ్ణిగా చెయ్యడానికి ఏ మాత్రం వెనుతియ్యరు "

[మోర్గన్ - ప్రాచీన కుటుంబం పుట 454.]

సామూహిక గృహవ్యవస్థలో ఆ యింట్లోవుండే స్త్రీలు అందరూ కాని, ఇంచుమించు అందరూగాని ఒకేగణానికి చెందివుంటారు. వారి భర్తలంతా ఇతరగణాలనుంచి వస్తారు ప్రాచీన కాలంలో ఆడవాళ్ళ పెత్తనం సర్వసాధారణ విషయం అయివుండడానికదే భౌతికకారణం. ఈ విషయాన్ని బాకోఫెన్ గుర్తించాడు. ఆయన కనిపెట్టిన మహత్తర విషయాలలో ఇది మూడోది. ఆటవిక తెగల్లోనూ, అనాగరిక తెగల్లోనూ స్త్రీలమీద పనిభారం ఎక్కువని మతబోధకులూ, చూసివచ్చినవారూ చెప్తారు. దానికీ ఇంటిపెత్తనానికీ వైరుధ్యం లేదు. స్త్రీ పురుషులమధ్య శ్రమ విభజనను నిర్ణయించేది సమాజంలో స్త్రీలకున్నస్థానం కాదు. దానికి ఇతర కారణాలున్నాయి.| ఆడవాళ్ళకు తగినపనుకునేకన్న ఎక్కువ పని చేసే ఆ ఆడవాళ్ళకి యూరపియను సమాజంలోని ఆడవాళ్ళకన్న ఆదిమసమాజంలో ఎక్కువ గౌరవంవుంది. నాగరిక జాతులలోని గృహి ణికి బూటకపు గౌరవం బోలెడంత లభిస్తుంది. నిజమైన పని ఆమెకుం డదు. కాని ఆమె సామాజిక పాత్రమాత్రం అధికంగా శ్రమపడి పనిచేసే అనాగరిక స్త్రీకన్న హీనం. అనాగరిక ప్రజలలో వారి స్త్రీ నిజంగా గృహిణి, అన్నివిషయాలలోనూ ఆమె గృహపత్ని.

అమెరికా వాయువ్య ప్రాంతంలోనూ, ముఖ్యంగా దక్షిణ అమెరి కాలోనూ వున్న ఆదిమజాతులు ఆటవికయుగపు ఎగువదశలో జీవితం గడుపుతున్నారు. వారిలో బహు సూక్ష్మంగా పరిశోధన జరిపితే తప్ప అమెరికాలో జంట కుటుంబ పద్ధతి, గుంపు పెళ్లి ఆచారాన్ని పూర్తిగా తొలగించిందో లేద చెప్పడం కష్టం. దక్షిణ అమెరికాలోని వారిలో

దాంపత్య జీవితపు స్వేచ్ఛను గురించి అనేక కథలు వినబడుతున్నాయి. అవన్నీ వింటూంటే అక్కడ గుంపు పెళ్లి అలవాట్లు పూర్తిగా మాసి పోయాయనుకోడానికి వీలుకనపించదు. అక్క చెల్లెళ్ళలో పెద్ద ఆమెను కట్టుకొన్న వాడు ఆమె చెల్లెళ్ళందరినీ, వారికి వయస్సు వచ్చిన వెంబడిని, తన భార్యలనుగా చేసుకొనే హక్కు ఉత్తర అమెరికా లోని నలభయి తెగలవారిలో ఈనాటికి ఆచారంగావుంది. అక్కచెల్లెళ్ళంతా ఉమ్మడి భర్తల్ని కలిగివుండే రోజులనాటి ఆచారాల అవశేషం ఇది కాలిఫోర్నియా ద్వీపకల్పంలోని ఆదిమతెగలవారు (వీరు ఆటవిక యుగపు ఎగువదశ జీవితం గడుపుతున్నారు.) కొన్ని ఉత్సవాలు జరుపు కొంటారనీ, ఆ సందర్భంలో అనేక 'తెగల' వాళ్ళు ఒకచోటచేరి స్వేచ్ఛా సంగమం జరుపుతారనీ బాన్‌క్రాఫ్ట్ వ్రాస్తున్నాడు. ఈతడు 'తెగ'లని పేర్కొన్నవి గణాలు మాత్రమే. ఒక గణంలోని స్త్రీ పురుషులు, మరొక గణంలోని స్త్రీపురుషులకు ఉమ్మడిగా భార్యలూ,వారిభర్తలుమధ్య అనిర్ధారిత మైన భార్యాభర్తృ సంబంధాలు కొనసాగేవి. ఆ ప్రాచీనయుగపు స్మృతి చిహ్నాలే యీ వుత్సవాలు. ఇదే ఆచారం ఈనాటికీ ఆస్ట్రేలియాలో వుంది. కొన్ని తెగలలో కులపెద్దలు, నాయకులు, మంత్రగాళ్ళయిన పురోహితులూ ఈ ఉమ్మడిభార్యల ఆచారాన్ని స్వప్రయోజనాలకోసం వినియోగించుకొంటున్నారు. అనుభవిస్తున్నారు. వీరు సంవత్సరంలో కొన్ని ఉత్సవదినాలలోనూ, తెగలోని జనంఅంతా సమావేశం అయిన కాలంలోనూ వెనుకటికాలపు సమష్టి అనుభవానికి వొప్పుకొని, తమ భార్యలు పడుచుకారుతో అనుభవించగల అవకాశం కలిగిస్తున్నారు. అప్పుడూ అప్పుడూ జరిగే యీ మాదిరి విందుల్లో ఏ కొద్దిరోజులపాటో ప్రాచీనకాలపు స్వేచ్ఛాసంగమపద్ధతి అమలులోకి వస్తుందంటూ వెస్టర్ మార్క్ యెన్నో వుదాహరణలు తన పుస్తకంలో (పుటలు – 28, 29) ఇచ్చాడు. భారతదేశంలోని హోలు, సంతాలులు, పంజాలు, కోటార్లు మొదలయినవారిలోనూ, కొందరు ఆఫ్రికన్ తెగలవారిలోనూ యీ ఆచారాలు కనిపిస్తున్నాయి. వెస్టర్ మార్క్ గుంపుపెళ్లి ఆచారంలేదని నిరాకరిస్తూ, యీ ఆచారం దాని అవశేషంకాదనీ, ఇతర పశువుల

మాదిరిగా ఆదిమ మానవుడికూడా ఋతుకాలం వుండేదనీ, దాని అవశేషమే యీ ఆచారమనీ అన్నాడు.

గుంపు పెళ్లికీ, జంటపెళ్లికీ నడుమవుండే సంధిదశ బాకోఫెన్ కనిపెట్టిన నాలుగో మహత్తర విషయం. ఈ సంధిదశ విస్తృతంగా కనిపిస్తూంది. ప్రాచీనకాలంలో దేవతలు విధించిన నియమాలను అతిక్రమించినందుకై ప్రాయశ్చిత్తకర్మ యని బాకోఫెన్ వూహిస్తున్నది నిజంచేత స్త్రీ తాను పవిత్రంగా వుండే హక్కును కొనుక్కోవడంతప్ప వేరు కాదు. ప్రాచీనకాలపు భర్తల సమూహాన్ని వదల్చుకొని ఏ ఒక్కనితోనో వుండే అధికారాన్ని ఆమె కొనుక్కొనేపద్ధతిని తాంత్రికరూపంలో కనబరచడంతప్ప వేరుకాదు. ఆమె పరిమితంగా లొంగుబాటుకు ఒప్పుకోవడంతో ప్రాయశ్చిత్తం చేసుకొంటూంది. బాబిలోనియన్ వనితలు ఏడాదికోమాటు మిలిట్టా దేవాలయంలో ఆత్మార్పణం చేసుకొనేవారు. ఆశియా మైనరులోని ప్రజలు తమ స్త్రీ సంతానాన్ని అనైతిస్ దేవాలయంలో కొన్నేళ్ళపాటు వుంచేవారు. అక్కడ వారు తమకు నచ్చిన వారితో స్వేచ్ఛా సంగమంచేస్తూ గడిపేవారు. పెళ్లికిపూర్వం ఆడపిల్లలు ఈ విధంగా కొంతకాలం గడపడం అవసరంగా వారు భావించేవారు. మధ్యధరాసముద్రానికీ, గంగానదికీ మధ్య ప్రదేశంలోని ఆశియా వాసులలో చాలామంది మతాచారాల పేరుతో ఈ విధంగా ఆచరిస్తూనే వున్నారు. ప్రాయశ్చిత్తరూపంలో స్త్రీ చేయవలసిన త్యాగం కాలక్రమేణా తగ్గించబడుతూ వచ్చిందని బాకోఫెన్ వ్రాస్తున్నాడు.

"ఏటేటా, మళ్ళీ మళ్ళీ ఆత్మార్పణం చేయడానికి బదులు ఒక్కమారుతోనే ప్రాయశ్చిత్తం పూర్తి అవుతూంది. పిల్లల తల్లులు స్వేచ్ఛా సంగమానికి ఒడబడవలసి రావడానికి బదులు కన్యలుగా వున్నప్పుడావని కంగీకరించడంతో సరిపడుతూంది. వివాహకాలంలో జరిగేదానికి బదులు వివాహాత్పూర్వం ఆచరించడంతో సరిపుచ్చుతున్నారు. నియమం లేకుండా అందరితోనూ సంగమించవలసిన స్థితిపోయి, తా నేరుకొన్న కొద్దిమందితో సంగమించడం చాలుననేది అంగీకరించబడింది."

[Mutterrecht, పుట 19]

ఈ విధంగా మతాచారాలను అడ్డుపెట్టుకోవడం ఇతరులలో లేదు. గ్రీస్ నివాసుల్లోనూ, కెల్టు ప్రజల్లోనూ, తదితరుల్లోనూ పూర్వకాలం వివాహం అయ్యేవరకూ యువతులు స్వేచ్ఛాసంగమాన్ని అనుభవించేవారు. భారతదేశంలోని ఆదివాసులు చాల మందిలోనూ, మలేతెగలలోనూ, దక్షిణ సముద్ర ద్వీప వాసుల్లోనూ, అనేక అమెరికను ఇండియను తెగల్లోనూ ఈనాటికీ ఈ స్వేచ్ఛ అనుమతించబడుతూంది. ఇంకా మించు దక్షిణ అమెరికా అంతటా ఆదివాసి ప్రజలలో ఈ ఆచారం అమలులో వున్నదని కొంచెం అధికంగా దేశంలోపలికి వెళ్ళివచ్చినవా రందరికీ తెలుసు. ఇండియను తెగలకు చెందిన ఒక ధనిక కుటుంబంలో తాను చూసిన విషయాన్ని అగస్సీజ్ అనే ఆయన "బ్రెజిలులో నా సంచారం" అనే పుస్తకంలో (1868 లో బోస్టన్, న్యూయార్కులలో ప్రచురించబడింది. పుట - 266) వ్రాశాడు. పెరుగ్వే తోడి యుద్ధంలో ఆ యింటి యజమాని ఒక సైన్యోద్యోగిగా పనిచేస్తున్నాడు. ఆయన కుమార్తెను చూచి అగస్సీజ్ 'యీ అమ్మాయి తండ్రి ఎల్లా ఉన్నారంటూ' తల్లిని ప్రశ్నించాడు - ఆయన తల్లికి భర్త అని భావించి. ఆమె చిరునవ్వు నవ్వింది. "ఈ బిడ్డకు తండ్రి లేదు. దేవుడిచ్చిన బిడ్డ" - అంది. ఈ విషయాన్ని వుదాహరిస్తూ ఆయన ఇల్లా వ్రాశారు :

"కన్యాత్వకాలంలో (పెళ్ళికాకముందు) కలిగిన బిడ్డల్ని గురించి ఇండియను స్త్రీలూ, మిశ్రమజాతి స్త్రీలూ ఎల్లప్పుడూ ఈ విధంగానే చెపారు... ఇది తప్పుగాగాని, సిగ్గుచేటనిగాని వారు అనుకోరు... ఇది అసాధారణ విషయ మేమీ కాదు... ఇందుకు విరుద్ధంగా జరగడమే అసాధారణ విషయం. పిల్లలు తమ తల్లినే ఎరిగివుంటారు. ఎందుచేతంటే తమను పోషించే భారం, బాధ్యత ఆమె మీదనే వుంటుంది. వారికి తండ్రినిగురించి తెలియనే తెలియదు. తమ విషయంలో శ్రద్ధ తీసుకోవలసిన బాధ్యత అతనికున్నదని తల్లిగాని, పిల్లలుగాని అనుకోనే అనుకోరు." నాగరికుల కిది ఆశ్చర్యంగానే వుంటుంది. కాని, 'తల్లిహక్కు' వున్నచోటా, 'గుంపుపెళ్ళిళ్ళు' ఆచారంగా వున్నచోటా ఇది సర్వసాధారణమైన విషయం.

ఇంక ఇతర తెగల విషయం చూదాం. పెళ్ళికాలంలోనే పెళ్ళికొడుకు స్నేహితులూ, బంధువులూ, పెళ్లికి వచ్చినవారూ ముందు పెళ్లికూతుర్ని అనుభవించాకనే పెళ్లికొడుకువంతు వస్తుంది. ఆదిమకాలంలో బలెరిక్ దీవుల్లోనూ, ఆఫ్రికాలోని జౌగిల్లాలలోనూ యీ ఆచారం వుండేది, ఇథియోపియాలోని బారియాలలో యీ ఆచారం ఇప్పటికీవుంది. ఇంక ఇతరులలో అధికారి అయినవాడు - అతడిని కులపెద్ద అనండి, తెగపెద్ద అనండి, వారు కాకపోతే మంత్రవేత్త, పురోహితుడు, రాజు, ఎవరో - పేరు ఏదయితేనేం అధికారి సమాజప్రతినిధిగా మొదటిరాత్రి పెళ్లికూతురుతో గడుపుతాడు. ఈ ఆచారానికి ఎవరు ఎన్ని పైమెరుగులుపూసి మరుగుపరచబోయినా, మొదటిరాత్రి హక్కు యీనాటికీ గుంపుపెళ్లి పద్ధతులకు చిహ్నంగా అలాస్కా ప్రాంతవాసులలో వుంది (బాంక్రాఫ్ట్- దేశీయ తెగలు - 1, పుట 81), ఉత్తర మెక్సికోలోని తాహూలాలలోనూ (పై పుస్తకంలో) ఇతరుల్లోనూ కూడా యిది వుంది. మొట్టమొదట కెల్టిక్ జాతులు నివసించిన దేశభాగాలలో - ఉదాహరణకు ఆరగాన్‌లో - మధ్య యుగాలవరకూ ఈ ఆచారం వుంది. ఇది గుంపుపెళ్లి పద్ధతినుంచి సరాసరి సంక్రమించింది. కాస్టయిల్ రాష్ట్రి రైతు ఎన్నడూ దాసుడుగా జీవించలేదు. కాని, ఆరగాన్‌లో అత్యంతావమానకరమైన రూపంలో దాసత్వం వుండేది. కాథలిక్ మతావలంబి అయిన ఫెర్డినాండురాజు 1486 లో దానిని నిషేధిస్తూ చట్టంచేసేవరకూ అది అమలు జరిగింది. ఆయన ప్రకటించిన తాఖీదులో ఇల్లా వుంది :

"ఒక రైతు పెళ్లిచేసుకున్నప్పుడు.... ఈ ప్రభువులు (సినార్‌లు, బారన్‌లు) మొదటిరాత్రి ఆమెను అనుభవించకూడదు. పెళ్లినాటిరాత్రి ఆమె పడుకున్నప్పుడు తమ అధికారాన్ని నిరూపించుకొంటూ ఆమె మీదుగా గాని, ఆమె ప్రక్కమీదుగాగాని దాటి వెళ్ళడం కూడదు. రైతు యొక్క కూతుర్నిగాని,కొడుకునిగాని, డబ్బు ఇచ్చో ఇవ్వకుండానో వారి యిష్టానికి వ్యతిరేకంగా పనిచేయించుకో కూడదు." [సుగెన్హీమ్ వ్రాసిన "దాసప్రథ" అనే పుస్తకం, అసలు ప్రతి, కాటలోనియాలో దొరికినదాని నుంచి. ఇది 1861 లో పీటర్సుబర్గులో ప్రచురించబడింది. పుట—35]

అందరికీ ఉమ్మడి భార్యగావుండే స్థితినుంచి, ఏక భార్య – ఏక భర్తృత్వానికి మార్పుతెచ్చినది ముఖ్యంగా స్త్రీయేనని బాకోఫెన్ వ్రాశాడు. అది ముమ్మాటికీ సత్యం. జీవితంలో ఆర్థిక పరిస్థితులు అభివృద్ధి పొందడంతో, ప్రాచీనకాలంనుంచీ ఆచారంగా వస్తున్న దాంపత్యసంబంధాలలో అమాయిక. ఆటవిక స్వభావం తొలగిపోయింది. ప్రాచీన సామూహిక జీవిత పద్ధతి అంతరించడమూ, క్రమంగా జనాభా పెరుగుతూండడమూతో స్త్రీలకు వెనుకటికాలపు దాంపత్య సంబంధాలు పీడాకరంగానూ, అవమానకరంగానూ తోచి వుంటాయి. దానినుంచి బయటపడడానికి తాత్కాలికంగానో, శాశ్వతంగానో ఒకే మగవానితో వుండగల ఏకపత్నీత్వ హక్కును కొనుక్కోడానికి వారెంతో ఆదుర్దాపడి వుంటారు. ఈ ముందడుగు మగవాడివేపునుంచి వచ్చింది మాత్రంకాదు. అతడి కీ భావంకూడా కలిగి వుండదు. ఏమంటే మగవాడు ఈనాటికీ కూడా గుంపు పెళ్ళిలో వున్న సౌఖ్యాన్ని త్రోసిపుచ్చే స్థితిలో లేడు. జంట పెళ్ళిలోకి మార్పు తెచ్చినది స్త్రీ. ఆవిధంగా స్త్రీ జంట పెళ్ళిలోకి మార్పు తెచ్చిన తర్వాతనే పురుషుడు ఖచ్చితమైన దంపతీ వివాహ పద్ధతిని ప్రవేశపెట్టగలిగాడు. దీని ప్రకారం మగవాడు ఆడుదానికి మాత్రమే పాతివ్రత్యం ప్రవేశపెట్టాడు.

ఆటవిక యుగానికీ, అనాగరిక యుగానికీ మధ్య సంధిదశలో జంట కుటుంబం అనేది ఏర్పడింది. ప్రధానంగా ఇది ఆటవికయుగపు ఎగువదశలోనే కనిపిస్తూన్నా, అనాగరికయుగపు దిగువ దశలోకూడా ఒకటి రెండుచోట్ల ప్రారంభమైనట్లు కనబడుతూవుంది. ఆటవికయుగానికి గుంపు పెళ్ళి, నాగరిక యుగానికి దంపతీ వివాహంలాగే, అనాగరిక యుగానికి జంటపెళ్ళి ముఖ్యమైన లక్షణం. జంటపెళ్ళినుంచి సుస్థిరమైన దంపతీవివాహం అభివృద్ధి చెందాలంటే యింతవరకూ మనం చూసిన వానికంటే భిన్నమైన కారణా లుండాలి. జంటల ఫలితంగా గుంపు అనేది అంతరించి దాని చివరిరూపం అవతరించింది. ఇప్పుడున్నది ఒక స్త్రీ, ఒక పురుషుడు మాత్రమేవున్న జంట. ఈ జంట రెండు అణువుల కలయికతో ఏర్పడిన కణంవంటిది. సహజఎన్నిక అనేది యెప్పటికప్పుడు

జనాన్ని గుంపుపెళ్ళినుంచి దూరంచేస్తూ వచ్చింది. ఇక్కడితో దాని పని పూర్తి అయింది; అదింక చెయ్యగల దేమీ లేదు. నూతన సామాజికశక్తులు ఏర్పడితేతప్ప యీ ఒంటి జంటనుంచి కొత్తతరహా కుటుంబ వ్యవస్థ ఏర్పడదు. ఆ నూతన శక్తులు ఏర్పడ్డాయి కూడా.

జంట కుటుంబవ్యవస్థ బాగా అమలులోవున్న అమెరికా నిక్కడ వదిలేద్దాం. ఇంతకన్న ఉన్నతమైన కుటుంబవ్యవస్థ ఇక్కడ ఏర్పడిం దనుకొనేటందుకు అవకాశాలు లేవు. అమెరికాను కనిపెట్టి, దానిని ఆక్రమించడానికి పూర్వం అక్కడ స్థిరమైన దంపతీవివాహ వ్యవస్థ ఏ కాలంలోగాని, ఏ ప్రాంతంలోగాని ఏర్పడిం దనుకొనేటందుకు ఉదాహరణలు కనబడవు. పూర్వార్ధగోళంలో పరిస్థితి మాత్రం అదికాదు.

పూర్వార్ధగోళంలో పశువుల్ని మచ్చిక చేయడమూ, మందలను పెంచడమూతో ఇదివరకు ఎన్నడూ వూహించనంతగా సంపదలు వృద్ధి అయినాయి. వానితో నూతన సామాజిక సంబంధాలు ఏర్పడ్డాయి. అనాగరికయుగపు దిగువ దశవరకూ ప్రజలకున్న ఆస్తి ఇల్లు, బట్ట, మోటురకం ఆభరణాలు, తిండి సంపాదించుకొనేందుకూ, వండుకొనేందుకూ పనికివచ్చే పరికరాలు—పడవలు, ఆయుధాలు, అతి సాధారణరకం వంటపాత్రలూ వంటివే. ఏరోజుకారోజున వారు తిండికి తడుములాడుకోవలసిందే. ఇప్పుడింక గుర్రాలు, ఒంటెలు ఎడ్లు, గొర్రెలు, మేకలు, పందులు మొదలైనవానిని మందలుగా పెంచుతూ గోపాలక జాతులు వృద్ధి పొందాయి. యూఫ్రేట్సు, టైగ్రిస్ నదీ తీరాలలో సెమైట్లు యిలాగే వృద్ధి పొందారు. భారతదేశంలో పంచనద ప్రాంతంలోనూ, గంగా మైదానంలోనూ, ఆక్జస్, జాక్జార్టెస్ నదీ ప్రాంతాలలో జల కాష్ఠ సమృద్ధి గల బీళ్ళలోనూ ఆర్యులుకూడా ఈ విధంగా వృద్ధిపొందినవారే. వారి కిప్పుడు సంపద లేర్పడ్డాయి. ఆ సంపదను కాస్త భద్రపరచుకుంటేచాలు. కొద్దిపాటి శ్రద్ధచూపిస్తేచాలు, మందలు మందలు పెరుగుతాయి. మంచి పుష్టికరమైన పాలు, మాంసం సమృద్ధిగా లభిస్తాయి. అంతవరకూ ఆహార సంపాదన కవలంబించిన పద్ధతులన్నీ పాతబడి పోయాయి. వెన

కటి రోజుల్లో వేట తప్పనిసరి అయ్యేది. ఇప్పుడు అది వినోదంగా మారింది.

అయితే ఈ నూతన సంపదలు ఎవరివి? ప్రారంభంలో గణాలకే చెందివుంటా యనడంలో సందేహంలేదు. కాని, చాలా ప్రాచీనకాలం లోనే మందలు స్వంత ఆస్తిగా మారిపోయి వుండాలి. "మోసెస్ ఆది గ్రంథం" లో ఫాదర్ అబ్రహామ్‌కు మందలూ అవీ వున్నాయని వ్రాయ బడివుంది. అయితే అవి కుటుంబ యజమాని హోదాలో ఆయన వన్నారా, లేక గణాలలో వంశపారంపర్యపు హక్కుతో నాయకుడు కావడంవలన ఆ మందలకు యజమాని అన్నారా అనేది వూహించ లేము. అయితే ఒకటిమాత్రం నిజం. ఆస్తికి యజమాని అనేది ఈనాడు మనం ఉపయోగిస్తున్న అర్థంలో ఆయనకు చెల్లదు. అనాగరికయుగంలో సుందరములయిన వస్తుజాలం - లోహపాత్రలు, విలాససామగ్రి, నర పశువులైన బానిసలు కుటుంబపెద్ద స్వంతఆస్తి అయి వున్నట్లే. చారిత్రకప్రమాణాలు దొరకడం ప్రారంభంఅయిన ఈనాటికి అన్ని చోట్లా మందలు కుటుంబపెద్దల వయిపోయినట్లే కనబడుతూంది.

ఈ రోజులనాటి కప్పుడే బానిసపద్ధతికూడ అమలులోకి వచ్చింది. అనాగరికయుగపు దిగువదశలో వున్న మనిషికి బానిస అవసరంలేదు. ఆ దశలోవున్న అమెరికను ఇండియనులు వోడిపోయిన తమ శత్రువుల యెడ వ్యవహరించిన పద్ధతికీ, అనాగరికయుగపు ఎగువ దశలోని ప్రజలు వ్యవహరించిన పద్ధతికీ తేడా వుండనవానికదే కారణం. దిగువ దశలోవి వారు ఓడిపోయిన శత్రువుల్ని చంపెయ్యడమో, తమ తెగలోకి దత్తు చేసుకొని సోదరులనుగా ఆదరించడమో చేస్తారు. స్త్రీలను భార్యలనుగా తీసుకొనేవారు. లేదా వాళ్ళనీ, వాళ్ళ పిల్లల్నీ దత్తు తీసుకొనేవారు. ఆ దశలో మానవుని శ్రమశక్తి అతని పోషణకు అవసరపడేదానికన్న అదనంగా వుత్పత్తిచెయ్యగల స్థితి లేదు. పశువుల మందల్ని పెంచడం, లోహాలు తవ్వడం, నేత నేయడం, వ్యవసాయం చెయ్యడం వచ్చాక ఏర్పడ్డ పరిస్థితులు వేరు. అంతవరకూ అడిగితే లభించిన భార్యలకు మారకపువిలువ ఏర్పడింది. వారి నిప్పుడు కొనుక్కోవలసి వస్తూంది.

శ్రమశక్తికీ అదే పరిస్థితి ఏర్పడింది. ముఖ్యంగా పశువులమంద కుటుంబఆస్తిగా మార్పుచెందాక మరీను. పశువులమంద పెరిగినంత వేగంగా కుటుంబం పెరగదు. మందల్ని కాయడానికి మంది అధికంగా వుండాలి. ఈ పనికి యుద్ధాలలో పట్టుబడిన ఖైదీలు వుపయోగపడ్డారు. పశువుల మాదిరిగానే వారుపిల్లల్ని కంటారు. పెరుగుతారు.

ఈ పశుసంపద కుటుంబాల స్వంత ఆస్తిగా మారాక, వేగంగా వృద్ధి పొందసాగింది. జంట పెళ్లి, గణంలో మాతృప్రాధాన్యమూవున్న ఆనాటి సామాజిక వ్యవస్థ గట్టి దెబ్బతింది. జంట పెళ్లి పద్ధతి కుటుంబంలో ఒక నూతన పరిస్థితిని తెచ్చిపెట్టింది. ఇప్పుడు కుటుంబంలో అసలు తల్లితోపాటు అసలు తండ్రికూడా స్పష్టంగా కనబడుతున్నాడు. ఈ నాటి "తండ్రుల" కన్న ఆనాటి "తండ్రి" అతని సంతానానికి నిజమైన తండ్రి అని చెప్పవచ్చు. ఆనాటికి కుటుంబంలో తిండి సంపాదించడం, దానికి కావలసిన పనిముట్లు చూసుకోవడం బాధ్యత మగవానిది. పని విభజన అల్లావుండేది. అందుచేతనే తిండి సంపాదించుకొనేటందు కుపయోగపడే పనిముట్లు అతని స్వంత ఆస్తిగా వుండేవి. ఒకవేళ ఆ జంట విడిపోతే ఆడుదాని కింట్లో సామాను మిగిలేది. అతడు తన పనిముట్లు తీసుకొని వెళ్ళిపోయేవాడు. ఆ విధంగా సంఘంలోవున్న ఆచారం ప్రకారం జీవనాధారమయిన పశువులు. తరవాత కాలంలో పనిచేయడానికి పరికరాలుగా వుపయోగపడుతున్న బానిసలు మగవాని ఆస్తిగా అంగీకరించబడినాయి అదే సంఘంలో అనాటికున్న ఆచారం ప్రకారం అ ఆస్తికి ఆతని కొడుకులు వారసులు కాజాలరు. వారసత్వం విషయంలో ఆనాటి స్థితి యిది:

ప్రారంభంలో తల్లిహక్కు గుర్తించబడేది. అంటే ఆడుకోవలోనే వంశక్రమం నిర్ణయించబడేది. ఆలాగే గణంలో అమలులోనున్న వారసత్వఆచార ప్రకారం గణంలో చనిపోయిన వ్యక్తి ఆస్తి ఆగణంలో వున్న అతని బంధువులకే సంక్రమించేవి. ఆస్తి గణంలోంచి బయటికి పోరాదు. ఆదిలో వానికి విలువ అట్టే లేకపోవడంచేత వానిని అతని సన్నిహిత బంధువులకి–అంటే తల్లివేపు రక్తసంబంధీకులకి వప్పచెప్పే

వారు. చనిపోయినవాని సంతానం అతని గణానికి చెంచరు. వారి తల్లి గణానికి చెందేవారు. ప్రారంభంలో తల్లి తాలూకు రక్తబంధువులతో సమంగా వారికీ తల్లి వస్తువులు సంక్రమిస్తూండి వుంటాయి. తర్వాత బహూశా ఆమె ఆస్తికి వారే ప్రథమ వారసులుగా గుర్తింపబడివుండొచ్చు. కాని. వారికి తండ్రినుంచి వారసత్వం ఏమీ సంక్రమించదు, ఏమంటే వారు అతని గణానికి చెందరు.

ఆతని ఆస్తి ఆతని గణంలోనేవుండిపోవాలి అందుచేత యజమాని చనిపోయినప్పుడు ఆతని మందలు, ఆతని సోదరీ సోదరులకు. సోదరీ సంతానానికి – వా రెవ్వరూ లేకపోతే ఆతని తల్లి చెల్లెళ్ళు, వారి సంతానానికీ పోవలసిందే. ఆతని స్వంతబిడ్డలకు ఆతని ఆస్తిమీద వారసత్వపు హక్కు లేదు.

ఈవిధంగా, సంపదలు వృద్ధిపొందినకొలదీ ఒకవేపుకుటుంబంలో స్త్రీ కన్నా పురుషునికి ప్రాముఖ్యంవచ్చింది. రెండోవేపు ఆ ప్రాముఖ్యాన్ని వుపయోగించుకొని ఆతడు అనూచానంగావస్తున్న ఆచారానికి విరుద్ధంగా తన సంతానానికి వారసత్వంకలిగించాలనే ఆలోచనకు ప్రోత్సాహంకలిగింది. కాని, తల్లిహక్కు గుర్తించబడుతున్నంతవరకూ అదిసాధ్యంకాదు- అందు కోసం ఆహక్కును తొలగించాలి. తొలిగించారుకూడా. ఆ పని చేయడం, ఈనాడు మనం అనుకొనేటంత కష్టంకాదు. మానవజాతి చూచిన మహత్తర విప్లవాలలో ఇదొకటి. చాలా ప్రాముఖ్యం గలదీను. గణాలలో ఒక వ్యక్తినికూడా కదిలించకుండా యిది సాధించబడింది. ఎక్కడవాళ్ళు అక్కడేవుంటారు.భవిష్యత్తులో కుటుంబంలోని మగవాళ్ళ సంతానం కుటుంబంలోనే వుండాలనీ; ఆడపడుచుల సంతానం వారి తండ్రిగణానికే చెందాలనీ ఒక్క చట్టం చేస్తే చాలు.వంశక్రమాన్నీ వారసత్వాన్నీ స్త్రీ వేపునుంచి గుర్తించడం ఒక్క దెబ్బతో మారిపోతుంది వాని స్థానే వంశక్రమాన్ని పురుషుడి వేపునుంచి గుర్తించడమూ, వారసత్వం తండ్రినుంచి సంక్రమించడమూ జరుగుతుంది. నాగరిక ప్రజలలో ఈ విప్లవం ఎప్పుడు వచ్చింది ? అనేది చెప్పడం సాధ్యం కాదు. కాని జరిగిందనడంలో మాత్రం సందేహం లేదు. చరిత్ర

యుగానికి పూర్వమే అది జరిగిపోయింది. తల్లి హక్కుకు సంబంధించిన చిహ్నాలెన్నింటినో బాకోఫెన్ సేకరించాడు. మార్పు జరిగిం దనడానికి అవే పెద్ద నిదర్శనం. ఈ మార్పు ఎంత సులువుగా జరిగిందీ చూడాలంటే అమెరికాలోని ఇండియన్ తెగల నెన్నింటినో మనం పరిశీలించవచ్చును. వానిలో ఈ మార్పు వచ్చిన దీ మధ్యనే. ఇంకా కొన్ని తెగలలో ఈ మార్పు జరుగుతూంది. సంపదలు అభివృద్ధి పొందాయి. వారి జీవిత పద్ధతులు మారాయి. అడవులనుంచి 'ప్రయరీ'లలోకి వారి నివాసం మారింది. నాగరికత సంపర్కం, మత ప్రచారకులు నైతిక పలుకుబడీ — యివన్నీ వారిలో యీ మార్పును తీసుకువచ్చాయి. మిస్సోరీ తెగ లెనిమిదింటలో ఆరింట మగవాని నుంచి వంశక్రమాన్ని గుర్తించడమూ, మగవానినుంచి వారసత్వాన్ని గుర్తించడమూ అమలులోవుంది. మిగిలిన రెండూ వంశక్రమాన్నీ, వారసత్వాన్నీ స్త్రీ వేపునుంచే గుర్తిస్తున్నాయి. కానీ, మియామీ, డెలవారే తెగలలో ఈమధ్యనే ఒక క్రొత్త ఆచారం బయలుదేరింది. సంతానానికి తండ్రి ఆస్తి సంక్రమించేటట్లు చేయడానికై వారి తండ్రిగణానికి సంబంధించిన ఏదో ఓ పేరును వారికి వుపయోగిస్తున్నారు.

"పేర్లు మార్చేయడంద్వారా వస్తువునే మార్చివెయ్యాలని ప్రయత్నించే మనుష్యుని వితండవాదనను ఏమనాలి? తన స్వప్రయోజనానికి అవసరమైతే, సాంప్రదాయాన్ని వదలకుండానే, దానిలో ఏదో నెరుసులు వెదకి దానినుంచి బయటపడ్డానికి ప్రయత్నిస్తాడు."(మార్క్స్)

దీనివలన ఎంతో గంద్రగోళం ఏర్పడింది. తండ్రి హక్కు స్థాపిస్తేనే యిది కొంతైనా తొలుగుతుంది. ఆలాగే జరిగింది. కొంత గజిబిజి అణిగిందికూడా. "ఇదే అతి సహజమైన మార్పు అనిపిస్తూంది" అన్నాడు మార్క్స్. పూర్వార్థగోళంలోని నాగరికప్రజలలో ఏవిధంగా మార్పు వచ్చింది అనే విషయమై ధర్మసూత్రాల్ని సమన్వయపరచి చెప్పేవన్నీ కేవలం అనుమానసాధ్యాలే. ఉదాహరణకు మాక్సిమ్ కోవాలేవ్‌స్కీ వ్రాసిన Tableau des origines et de l'evolution dela Fam

et de la Propriete, [స్టాక్‌హోమ్‌లో 1890 లో ముద్రించబడింది] చూడవచ్చు.

తల్లిహక్కును రద్దుచేయడం స్త్రీ జాతికి సంభవించిన పరాజయం అని చెప్పాలి. ప్రపంచ చరిత్రనే అది మార్చింది. ఇంట్లోకూడా మగవాడే పెత్తనం పట్టుకొన్నాడు. స్త్రీ పరాభవం పొందింది. మగవాని కామానికి బానిస చేయబడింది. పిల్లల్నికనే యంత్రంగా మార్చబడింది. వీరయుగంనాటి. ముఖ్యంగా పురాణయుగంనాటి గ్రీకులలో ఇది స్పష్టంగా కనబడుతూంది. క్రమంగా దానిని కప్పిపుచ్చడానికై మెరుగులూ, పూతలూ పెట్టారు. మృదువైన రూపం యిచ్చారు. అయితే అసలది అల్లాగే వుండిపోయిందనేది మరిచిపోకూడదు.

ఇక్కడ పితృస్వామిక కుటుంబం అనేది ఒక మెట్టుగా ఏర్పడింది. మగవానికి సర్వాధికారాలూ సంక్రమించడంవలన కలిగిన మొదటి ఫలితాలు ఏలా వున్నాయో ఆ కుటుంబాన్నిచూసి గ్రహించవచ్చును. ఈ కుటుంబ వ్యవస్థయొక్క ప్రధాన లక్షణం బహుభార్యాత్వం కాదు. దానిని గురించి మరోచోట వివరిస్తా.

"కుటుంబ పెద్ద అధీనంలో స్వతంత్రులూ, పరాధీనులూ అయిన వ్యక్తులు చాలామంది ఒక కుటుంబంగా వుంటారు. కుటుంబపెద్దకు బహుమంది భార్యలుండడమూ, పరాధీనుడైన దాసునకు ఒకే భార్యాబిడ్డలుండడమూ సెమైట్ తెగలలో కనిపిస్తుంది. ఒక పరిమిత ప్రదేశంలో పశువుల మందల్ని కాపాడుకోవడం ఈ వ్యవస్థ ప్రధానోద్దేశం." (మార్క్స్)

ఈ కుటుంబంయొక్క ప్రధాన లక్షణం పైతృకాధికారాన్ని నెలకొల్పడం. దాసుల్నికూడా దానిలోకి తీసుకోవడమూను. ఈ మాదిరి కుటుంబానికి మంచి వుదాహరణ రోమనులలో కనబడుతుంది. మన ఆధునిక ఛాందసుల దృష్టిలో ఆవేశాలూ, కలహాలూ లేనిది కుటుంబమేకాదు. కాని కుటుంబం (ఫామిలీ) అంటే అసలు అర్థం అది కాదు. ప్రారంభంలో రోమనులు బానిసలను గురించి చెప్పేటప్పుడే కుటుంబ (ఫామిలియా) శబ్దాన్ని వుపయోగించారు. వివాహితులైన భార్యాభర్తలూ, వారి సంతానమూ దానిలోకి రానేరాదు. 'ఫాములస్'

అంటే ఇంటి బానిస. 'ఫామిలియా' అంటే ఒక వ్యక్తికి చెందిన బానిసల మొత్తం. గయస్‌కాలంనాటికికూడా ఫామిలియాయొక్క వారసత్వం యజమాని ఇష్టంమీద ఆధారపడి సంక్రమించేది. సమాజంలో కొత్తగా ఏర్పడిన ఈ నిర్మాణానికి రోమనులు 'ఫామిలీ' అనే శబ్దాన్ని వుపయోగించారు. ఈ నిర్మాణం ఒక యజమాని ఆధీనంలో వుంటుంది. ఆయన అధీనంలో భార్య, పిల్లలు, బానిసలు వుంటారు. రోమనులలో కుటుంబ యజమానికి (తండ్రికి) తన అధీనంలోనివారిని చంపెయ్యడానికూ్కడా హక్కువుంది.

"గ్రీకులూ లాటిన్‌తెగలూ వేరుపడడం జరిగాకనే లాటిన్ తెగలలో భూములు సేద్యం చేయబడడం, బానిసత్వం చట్టసమ్మతం చేయబడడంలాంటి వ్యవస్థ వచ్చింది. అటుతర్వాతనే ఈ పేరూ దానికి వచ్చింది."-[మోర్గన్ - ప్రాచీన సమాజం, పుట. 478.]

మోర్గన్ వ్యాఖ్యకు మార్క్స్ మరో రెండు మాటలు జతపరిచాడు :

"ఆధునిక కుటుంబంలో బానిసత్వమేకాదు, దాసత్వంకూడా బీజరూపంలో మనకు కనిపిస్తుంది. ప్రారంభంనుంచీ వ్యవసాయపు పనులకోసమే ఇది వచ్చింది. తర్వాత తర్వాత సమాజంలోనూ, రాజ్యాంగంలోనూ, విస్తృతరూపంలో బయటపడిన వైరుధ్యాలన్నీ దీనిలో సూక్ష్మరూపంలో కనిపిస్తున్నాయి." (మార్క్స్)

'జంట కుటుంబం' 'దంపతీ కుటుంబం' వీని మధ్యకాలంలో ఏర్పడిన అంతర్దశ ఇది. భార్య పాతివ్రత్యాన్ని ధృవపరచడానికీ, బిడ్డల తండ్రితనం స్థిరపరచడానికీ స్త్రీని ఏవిధమైన షరతులూ లేకుండా భర్తకు స్వాధీన పరిచారు. ఆతడామెను చంపేసినా దిక్కులేదు. ఆతనికా అధికారం వుంది.

పితృస్వామిక కుటుంబకాలంనుంచీ మనకు లిఖిత చరిత్ర లభిస్తుంది. న్యాయ సూత్రాలను సమన్వయం చేయడంద్వారా ఇక్కడ మనకెంతో విషయం లభిస్తుంది. ఈ విషయంలో మనకెంతో సమాచారం

లభ్యమయిందికూడా. ఈ సందర్భంలో మనకు మాక్సిం కోవాలేవ్‌స్కీ* ఎంతో సహాయంచేశాడు. ఈ నాటికికూడా సెర్బులలోనూ, బల్గర్లలోనూ జాద్రూగా (మిత్రకూటమి అంటే దాని అర్థానికి దగ్గరలో వుంటుంది.) అనే వ్యవస్థవుంది. దానినే బ్రాట్‌స్వో (భ్రాతృబృందం) అని కూడా అంటారు. ప్రాచ్యదేశీయులలో ఇదే కొద్ది రూపభేదంలో కనిపిస్తూంది ఇవన్నీ గుంపుపెళ్ళి నుంచి వచ్చినమాతృస్వామిక కుటుంబానికీ, జంట కుటుంబానికిమధ్య ఏర్పడిన అంతర్దశలని ఆయన నిరూపించాడు. పాత ప్రపంచభాగంలోని ఆర్యనులు, సెమైట్లు మొదలయినవారిలో ఈ దశ నిరూపించబడినట్లు భావించవచ్చును.

ఇల్లాంటి సమష్టి కుటుంబం వుండేదనడానికి దక్షిణ స్లావులలో వున్న జాద్రూగా ప్రత్యక్షమైనవుదాహరణ. ఒక మూలపురుషుని సంతానం కొన్ని తరాలమంది తమ తమ భార్యలతో, బిడ్డలతోకలసి సమష్టిగా ఒకే యింట నివసిస్తారు. వారు సమష్టిగానే కుటుంబపుభూముల్ని సాగుచేస్తారు. కుటుంబ సమష్టినుంచి కావలసిన బట్టా పాతా తీసుకుంటారు. అదనపు వస్తువులు వారందరవీను. కుటుంబపు పెద్ద (డోమాచిన్) పర్యవేక్షణలో కుటుంబ వ్యవహారాలన్నీ నడుస్తాయి. కుటుంబానికి వెలుపల ఆయన కుటుంబ ప్రతినిధి. డబ్బుకు సంబంధించిన వ్యవహారాలన్నీ చూసు కుంటాడు. చిన్నచిన్నవస్తువులు బేరం పెడతాడు కుటుంబధనానికీ, వ్యాపారాలకీ బాధ్యత అతనిది. ఈయనను పెద్దగా ఎన్నుకుంటారు. కుటుంబపెద్ద వయస్సులోకూడా పెద్దయే గావాలనే నియమం ఏమీలేదు. ఇక స్త్రీలంతా గృహస్వామిని (డోమాచిట్సా) అధీనంలో వుంటారు. ఆమె నిరీక్షణలో పనిపాటలు సాగిస్తారు. సాధారణంగా గృహస్వామిని కుటుంబంలోని పెద్దభార్యమే అయివుంటుంది. కుటుంబంలోని ఆడపిల్లల పెళ్ళిళ్ళవిషయంలో ఆమెమాట నిర్ణయం అనవచ్చును. కాని సర్వాధికారం కుటుంబసమితిది. కుటుంబంలోని వయస్సువచ్చిన స్త్రీ పురుషు లంతా

---

* మాక్సిమ్ మాక్సిమోవిచ్ కోవాలేవ్‌స్కీ. రష్యన్ న్యాయ శాస్త్రవేత్త. సమాజశాస్త్రజ్ఞుడు, చరిత్రకారుడు. రాజకీయవేత్త భాషా శాస్త్రవేత్తాను.

దానిలో సభ్యులు. ఈ సమితికి కుటుంబ పెద్ద సమాధానం చెప్పుకోవాలి. ప్రధాన నిర్ణయాలు దానిద్వారా జరుగుతాయి. కుటుంబసభ్యులలో తప్పు చేసినవారికి దండన విధిస్తారు. భూములు కొనడం అమ్మడం లాంటి ప్రధానమైన ఇచ్చి పుచ్చుకోవడాలు దాని ద్వారానే జరుగుతాయి.

రష్యాలోకూడా ఇంకా ఇటువంటి పెద్దకుటుంబాలు అమలులో వున్నాయని పదేళ్ళ క్రితమే బయటపడింది. గ్రామ పంచాయితీ (అబ్‌ష్చినా) మాదిరిగనే ఈ సమష్టి కుటుంబ పద్ధతికూడా రష్యనుల ఆచారాలలో ఒకభాగంగా వుంది. అతి ప్రాచీనమైన రష్యన్ న్యాయ సూత్రాలైన యారోస్లావ్ *ప్రావ్దాలోనూ, దాల్మాటియాలోని చట్టాల లోనూ ఒకేపేరున (వెరోజ్) దీని ప్రసక్తి కనిపిస్తూంది. పోలండ్, జెక్ దేశాల చారిత్రక గ్రంథాలలోకూడ వీని ప్రసక్తి కనబడుతూంది.

జర్మనులలోకూడ సమాజంలోని ఆర్థిక యూనిటుమనం ఇప్పుడు వ్యక్తికుటుంబం అనిపిలిచేదిగాదనీ; సమష్టి కుటుంబం మాత్రమేననీ హేస్లరు ♦ వ్రాశాడు. ఎన్నో తరాలజనం, ఎన్నో విడికుటుంబాలూకలిసి ఈ సమిష్టి కుటుంబం ఏర్పతుందని ఆయనవ్రాసాడు. ఈ కుటుంబంలో బానిసలుకూడా భాగమే. ఇటువంటి కుటుంబ వ్యవస్థనుంచే రోమను కుటుంబంకూడా బయలుదేరివుంటుందని భావిస్తున్నారు. దానికి ఫలితంగా, ఇంతవరకూ వూహిస్తున్నమాదిరిగా ఇంటిపెద్దకు సర్వాధికారాలూ వుండడమూ, మిగిలినవారికి ఏ అధికారాలూ లేకపోవడమూ నిజమేనా అని యిటీవల కొందరు గట్టిగా ప్రశ్నించారు. ఐర్లండులోని కెల్టు జాతి

---

* యారోస్లోవ్ దిగ్రేట్. క్రీ. శ. 978 – 1054 మధ్య జీవించాడు. కీవ్ ప్రభువు. ఆయన పాలనాకాలంలోనే రూస్కాయాప్రాద్దా (రష్యనుల సత్యవచనం) కూర్చబడింది. రష్యన్ ధర్మసూత్రాలలో ఇదే ప్రాచీనం.

♦ హేస్లర్. పూర్తిపేరు అండ్రియాస్ హేస్లర్ (1834–1921) స్విట్జర్లండ్ న్యాయవాది. స్విస్, జర్మన్_న్యాయశాస్త్రగ్రంథాలు చాలా వ్రాశాడు. ఆయన వ్రాసిన Institutionen des deutschen Prevatrechts అనే పుస్తకాన్నిక్కడ ఏంగిల్సు ఉదహరిస్తున్నాడు.

వారిలోకూడ ఇటువంటి సమష్టి కుటుంబాలే వుండేవని వూహిస్తున్నారు. ఫ్రెంచి విప్లవకాలంవరకూ ఫ్రాన్సులోని 'నివెర్నిస్' * ప్రాంతంలో పార్సోన్నెరిస్ అనే పేరుతో ఈ కుటుంబ పద్ధతి అమలులో వున్నట్లు తెలుస్తూంది. ఫ్రాంకే-కామ్టే ♦ లో ఈనాడుకూడా వుంది. లోహె జిల్లాలో (Saone et Loire) ఒకే కుటుంబానికి చెందిన అనేక తరాలవారు నివసిస్తున్న పెద్దపెద్ద ఎత్తయిన ఇళ్ళు కనిపిస్తున్నాయి. ఇంటికి మధ్యన ఒక పెద్ద మండువా వుంటుంది. చుట్టువారా ఎత్తుగా పడకగదు లుంటాయి. గదిలోకి వెళ్ళాలంటే, ఏడెనిమిది మెట్లు ఎక్కవలసివుంటుంది.

అలగ్జాండర్ ది గ్రేట్ కాలంనాటి నియార్కసు † భారతదేశంలో సమష్టి కుటుంబా లున్నాయనీ, సాగుభూములు వాని సమష్టి స్వాధీనంలో వున్నాయనీ వ్రాశాడు. ఆ ప్రాంతాలలో అంటే పంజాబు, వాయువ్య సరిహద్దురాష్ట్రాలలో ఈ నాటికీ ఆ ఆచారం కొనసాగుతూవుంది. కాకేషస్‌లో ఈ ఆచారం వున్నదని కోవాలేవ్‌స్కీ వ్రాస్తున్నాడు. అల్జీరియాలోని "కాబూలే" తెగలో ఇది వుంది. అమెరికాలోకూడా దాని వుదాహరణ లున్నాయంటున్నారు. ప్రాచీనకాలపు మెక్సికోలో కనిపించిన "కాల్‌పుల్లీ" ‡ ఇటువంటిదేనని జూరిటా § వ్రాస్తున్నాడు. పెరూ దేశాన్ని ఆక్రమించే నాటికి అక్కడ 'మార్కు' వ్యవస్థను పోలిన వ్యవస్థ ఒకటి

---

* ఫ్రాన్సు మధ్యభాగంలో వున్న ఒక రాష్ట్రాన్ని ప్రాచీన కాలంలో ఈ పేరున పిలిచేవారు.

♦ ఫ్రాన్సులోని ప్రాచీనరాష్ట్రాలలో ఒకటి. బెసాన్సోరాష్ట్ర ప్రధాన నగరం.

† క్రీస్తు పూర్వం నాలుగో శతాబ్దంనాటివాడు. అలగ్జాండరు సహయోధుడు. ఆయన నౌకాసైన్యానికి అధిపతిన్నీ. భారతదేశంమీాదకు దండెత్తి వచ్చినప్పుడు అలగ్జాండరుతో ఆయనా వున్నాడు. ఈ దండయాత్రనుగురించి ఆయనవ్రాసిన వానిలో అక్కడక్కడ కొన్ని భాగాలులభిస్తున్నాయి.

‡ అజ్టెక్ తెగల సమష్టి కుటుంబానికి పేరు.

§ అల్ఫాన్ జోడే జూరిటా 16 వ శతాబ్దపు మధ్యకాలపు వాడు. స్పెయిన్ దేశీయుడు. రచయిత. చరిత్రకారుడు. మెక్సికోను

వున్నదనీ, వ్యవసాయపుభూమిని అప్పటప్పట కొత్తగా వాటాలుపెడుతూ వ్యవసాయానికి వ్యక్తులకిస్తూంటారనీ క్యూనో * (ఆస్లాండ్ అనే పత్రిక సం-42-44 లు. 1890లో) స్పష్టంగా ధృవపరిచాడు.

సమష్టిగా భూమి కలిగి, వుమ్మడిగా వ్యవసాయం చేసే సమష్టి కుటుంబాని కిప్పుడొక ప్రత్యేక ప్రాముఖ్యం ఏర్పడించనడంలో స దేహంలేదు. ప్రాచీన ప్రపంచభాగంలోని నాగరిక ప్రజలలో మాతృస్వామిక వ్యవస్థనుంచి దంపతీకుటుంబం ఏర్పడేసంధిదశలో సమష్టికుటుంబం ఎంతో ప్రముఖపాత్ర వహించింది. ప్రప్రథమంలో కొద్ది కాలంపాటు సాగు భూమినీ, పచ్చికబీళ్ళనూ పంచి వప్పచెప్పడంతో ప్రారంభించి, క్రమంగా వాటిని కుటుంబాల శాశ్వత హక్కుగా ఇచ్చివేసిన గ్రామాలు, మార్కు సంస్థలు ఏర్పడడానికి పూర్వం ఇటువంటి సమష్టికుటుంబాలే వుండేవని కోవాలేవ్‌స్కీ వ్రాస్తున్నాడు. ఆ వివరాలు తర్వాత తీసుకుందాం.

ఈ సమష్టి కుటుంబాలలోని జీవిత పద్ధతులను గురించి. ఇతరత్రా ఎల్లా వున్నా. రష్యాలో మాత్రం గృహస్వామి తనకున్న అధికారాన్ని దుర్వినియోగం చేసుకొన్నాడు. ఇంట్లో వున్న పడుచుపిల్లల్ని, ముఖ్యంగా కోడళ్ళని బలాత్కరించి పక్కలోకి తెచ్చుకొనేవాడు. ఈ విషయాన్ని తెలిపే పల్లెటి పాటలు రష్యాలో చాలావున్నాయి.

'తల్లిహక్కు' ను రద్దుచేశాక దంపతీవ్యవస్థ అతి వేగంగా వృద్ధిపొందింది. దానినిగురించి వ్రాసేముందు బహుభార్యాత్వం, బహుభర్తృత్వంగురించి కొద్దిమాటలు చెప్పడం అవసరం. ఈ రెండూకూడ ఎక్కడో అరుదుగా కనబడతాయేగాని వేరుకాదు. ఈ రెండూ ఒకే దేశంలో ఒకదానిప్రక్క మరొకటి ఒకే కాలంలో కనిపిస్తేతప్ప వానిని చరిత్రలో యెక్కడోగాని చూడం. బహుభార్యాత్వంనుంచి

---

జయించిన ప్రప్రథమ యోధులలో ఒకడు. 1540-'60 ల మధ్య మెక్సికోలో అనేక ప్రధానోద్యోగాలను నిర్వహించాడు.

* హెన్రిచ్ క్యూనో (1862-1936) జర్మన్ సోషలిస్టు డెమాక్రటిక్ పార్టీ సిద్ధాంతవేత్తలలో ఒకడు. రివిజనిస్టు. ప్రాచీన సమాజ చరిత్రను గూర్చి చాలా పుస్తకాలు వ్రాశాడు.

మినహాయించబడిన మగవాళ్లు. అలాగే బహుభర్తృత్వంనుంచి మినహాయించబడిన ఆడవాళ్ళతో సంతృప్తి పడి వూరుకోవడం జరగదు.

ఏమంటే ఇంతవరకూ సామాజిక వ్యవస్థ ఏదయినా సమాజంలో స్త్రీ పురుషుల సంఖ్య సమానంగానే వుంటూంది. అందుచేతనే బహుభర్తృత్వం, బహుభార్యాత్వం ఏ ఒక్కటీకూడా సాధారణాచారంగా ఏర్పడలేదు. ఒక్కొక్కడు ఎక్కువమంది భార్యల్ని పెట్టుకోవడం బానిస వ్యవస్థ లక్షణం. ప్రత్యేకహోదా వున్నవారే ఎక్కువమంది భార్యల్ని కలిగివుండేవారు. మిగతావారు ఒక్కొక్క భార్యతోనే తృప్తి పడేవారు. ప్రాచ్యదేశాలన్నింటా ఇదే ఆచారం నేటికీ వుంది. యూదు పితృస్వామిక కుటుంబాల్లో గృహస్వామి మాత్రమే బహుభార్యల్ని కలిగి యుండేవాడు; కొన్ని సందర్భాల్లో అతనికి చెందిన యిద్దరుముగ్గురు కొడుకులుకూడా యీ పద్ధతిని చేబట్టేవారు. మిగతావారు ఒక్కొక్కభార్యతో సంతృప్తి పడవలసివచ్చేది. ధనవంతులకీ, రాజవంశీకులకూ మాత్రమే పెక్కుమందికి భార్యల్ని చేసుకునే హక్కువుంది. సాధారణంగా వీరు ఆడుబానిసల్ని కొనుక్కొని భార్యలనుగా చేసుకొనేవారు. సాధారణ ప్రజఅందరూ దంపతీ వివాహంతోనే వుంటారు. భారతదేశంలోనూ, టిబెట్‌లోనూ కనిపించే, బహుభర్తృత్వ పద్ధతికూడా ఇల్లాంటి అరుదయిన ఆచారమే. వీటికి మూలం గుంపుపెళ్ళి ఆచారమేఅయి వుండొచ్చు. కాని దాని విషయమై ఇంకా పరిశీలన జరగవలసివుంది. మహమ్మదీయుల అంతఃపురాలలో కనిపించే ఈర్ష్య ఇక్కడ కనిపించదు. భారతదేశంలోని నాయర్లలో ఒక ఆచారం వుంది. వారిలో ముగ్గురునలుగురు కలిసి ఒక భార్యను కట్టుకొంటారు. మళ్ళీ వారిలో ప్రతిఒక్కడూ మరో ముగ్గురు నలుగురితో కలిసి జట్టుగా ఏర్పడి మరో స్త్రీతో సంబంధం పెట్టుకొంటాడు. ఈ విధంగా వారు ఎందరినైనా చేసుకోవచ్చు. ఈ మాదిరి వివాహాన్ని మాక్లెన్నాన్ జట్టుపెళ్లి అన్నాడు. ఈ జట్టుపెళ్లి నిజంగా బహుభర్తృత్వంకాదు. గిరా టులాన్ చెప్పినట్లు గుంపు పెళ్ళిళ్ళలో ఆదొక తరహా. పురుషులు బహు భార్యాత్వంలోను, స్త్రీలు బహు భర్తృత్వంలోను జీవిస్తారు, ఆ పద్ధతిలో.

# 4. దంపతీ వివాహం

అనాగరికయుగపు నడిమిదశకూ - పై దశకూ సంధికాలంలో జంటకుటుంబ పద్ధతినుంచి దంపతీ వివాహం అభివృద్ధి పొందిందని పైన తెలిపాను. దీని విజయం నాగరికతయొక్క ప్రారంభదశకు చిహ్నం. ఇందులో మగవానిది ప్రాధాన్యం. జన్మకారకుడైన తండ్రి విషయంలో సందేహం లేకుండా చేసుకోవడం దీని ముఖ్యోద్దేశం. తండ్రి అనంతరం ఆయన ఆస్తికి ఆయన బిడ్డలే వారసులు కావాలనేది అక్కడున్న అవసరం. వివాహబంధంయొక్క గట్టిదనమే జంటపెళ్ళికీ, దీనికీ తేడా. ఈ నూతన వ్యవస్థలో దంపతులలో ఎవరుకోరినా వివాహాన్ని ఛేదించడం సాధ్యపడదు. కాని, ఆచరణలో మాత్రం మగవాడు వివాహబంధాన్ని త్రెంచి, భార్యను తోసేయగలడు. దాంపత్య ధర్మాన్ని అతిక్రమించే హక్కుకూడా అతనికే మిగిలింది. [ఉంపుడుకత్తెను ఇంట్లో పెట్టనంత వరకూ మగవాడు దాంపత్య ధర్మాన్ని మీరగల హక్కును నెపోలియన్ న్యాయసూత్రాలు స్పష్టంగా అంగీకరిస్తున్నాయి.] సంఘం అభివృద్ధి పొందినకొలదీ మగవాడు తన హక్కును ఉత్తరోత్తరాభివృద్ధిగా అమలు పరచుకొంటూ వచ్చాడు. భార్య మాత్రం గత కాలపు దాంపత్య జీవిత రూపాల్ని జ్ఞాపకం చేసుకొన్నా, పునరుద్ధరించబోయినా అతి కఠోర శిక్షలకు గురిఅవుతుంది.

గ్రీకు ప్రజలలో ఈ వివాహ పద్ధతి అతి కఠోరరూపంలో కనబడుతుంది. గ్రీకుపురాణగాథలలోని దేవకాంతలు ఎక్కువ గౌరవాన్నీ, స్వాతంత్ర్యాన్నీ అనుభవిస్తున్నా, గ్రీకు వీరయుగంనాటి కప్పుడే మగవాని పెత్తనం స్థిరపడింది. బానిసకన్యలతోడి పోటీలో భార్యలు అవమానితలయ్యేస్థితి కనబడుతూంది అన్నాడు మార్క్సు. తెలమేచసుడు * తల్లిని దుయ్యబట్టి ఆమెనోరు నొక్కడం మనకు "ఒడిస్సే"♦ లో కనబడుతుంది. పట్టుబడిన పడుచులు విజేతల ఆనందవిలాసాలకు గురికావడం

* తెలమేచసు - ఒదస్యేసు కొడుకు. గ్రీకు పురాణగాథలలో.

♦ ఒదస్యేసుగురించి హొమరు వ్రాసిన కావ్యం.

హోమరు రచనలలో కనబడుతుంది. సైన్యాధిపతులు తమతమ హోదాల ననుసరించి వరుసక్రమంలో తమకు నచ్చినవారిని ఆ పడుచులనుంచి ఏరు కొనేవారు. ఆవిధంగా ఏరుకొన్న ఒక బానిసయువతికోసం అగమెమ్నాన్ అఖిల్లసులమధ్య ఏర్పడిన జగడంగురించే 'ఇలియడ్'లో మనం చూస్తాం. కాస్త పేరుగల వీరుణ్ణిగురించి ప్రస్తావించినప్పుడల్లా హోమరు ఆవీరుని గుడారంలోనూ, శయ్యలోనూ, భాగస్వామినియైన యువతినిగురించికూడా తప్పకుండా వ్రాస్తాడు. ఆ పడుచుల్ని ఆ వీరులు గ్రీసు దేశానిక్కూడా తీసుకుపోయేవారు. భార్యతోపాటు ఒకే యింట్లో కాపురం పెట్టించేవారు. కసండ్రాను అగమెమ్నాన్ తన యింటికి తీసుకెళ్ళినట్లు ఎస్కిలస్ వ్రాశాడు. ఈ పడుచులకు సంతానం కలిగితే వారికికూడా తండ్రి ఆస్తిలో కొంతవాటా ఇచ్చేవారు. వారిని స్వతంత్రులుగానే పరిగణించేవారు. తెలెమాన్*కు ఒక దాసీకన్యయందు పుట్టినవాడే తుక్రోస్. ♦ అతడు తండ్రిపేరు పెట్టుకోడానికి అనుమతించారట. కట్టుకున్న భార్య వీటన్నిం టినీ భరించాలి. అంతేగాని తాను తప్పుదారి తొక్కరాదు. నాగరిక యుగంలోకన్న వీరయుగంనాడే గ్రీకు స్త్రీలు ఎక్కువ గౌరవాన్ని అనుభ వించారు. ఏమంటే ఆమె ఔరసులును కంటుంది. గృహస్వామి తాను తెచ్చే బానిసస్త్రీల నామె పర్యవేక్షణలో వుంచుతాడు. వారిలోంచి కొందరిని వుంపుడుకత్తెల్ని చేసుకొంటే అదివేరు. దంపతీ వ్యవస్థతోపాటు ప్రక్కప్రక్కనే బానిసత్వం సాగుతూండడమూ, ఇంట్లో అందమైన పడుచు బానిసలు వుండడమూ, వారిమీద అధికారం మగవాడిదే కావడమూ వలన ప్రారంభంనుంచీ దంపతీ వివాహంలో పాతివ్రత్యం స్త్రీకే విధి.

---

* తెలెమాన్. గ్రీకు పురాణగాధలలోని వ్యక్తి. సోఫోక్లిస్, యురిపిడిస్‌ల నాటకాలలో ఒక పాత్ర.

♦ తుక్రోస్. గ్రీకు పురాణగాధలలోని వ్యక్తి. సలామిస్ నగర పౌరుడు. తెలెమాన్ కొడుకు. ట్రాయ్ నగరాన్ని ముట్టడించిన గ్రీకు సైన్యాలలో చాలా సమర్థుడైన విలుకాడు. సోఫోక్లిస్, యురి పిడిస్‌ల నాటకాలలో పాత్ర.

మగవాడికి ఏకపత్నీత్వం నిబంధన కాదు. అదే ఈనాటికీ కొనసాగు తూంది.

తర్వాతికాలంనాటి గ్రీకుల్ని గురించి వ్రాయదలవస్తే, ఇయోనియ మ*ల్నీ, దోరియన్ల**నీ వేరువేరుగా తీసుకోవలసివుంటుంది. దోరియన్లలో హోమరు వర్ణించినవానికన్నా, ప్రాచీనము లనదగిన వివాహసంబంధా లుండేవి. దానికి మంచి ఉదాహరణ స్పార్టా•. అక్కడ అనాడు సర్వ సాధారణంగా కనిపించేది జంటవివాహ పద్ధతి. అనా డక్కడుంటూవచ్చిన భావాల కనుగుణంగా దానిలో కొద్దిమార్పు లున్నాయనుకోండి – ఆ జంట వివాహాలలోకూడ గుంపుపెళ్ళిళ్ళ తాలూకు అవశేషాలు కనిపిస్తున్నాయి. దంపతులకు పిల్లలు కలగకపోతే వివాహం రద్దుఅవుతుంది. క్రీ పూ. 650 సంవత్సరంనాటి అనాగ్జాండ్రిదాస్ † రాజు మొదటి భార్యకు పిల్లలు కలగలేదని రెండో ఆమెను చేసుకొని రెండు కుటుంబాలను పెట్టాడు. అదే శతాబ్దంనాటి స్పార్టారాజు అరిస్టోనెస్ ఇద్దరు భార్యలకూ పిల్లలు కలగక పోతే మూడో ఆమెను చేసుకొన్నాడు. మొదటి ఇద్దరిలో ఒకామెను వదిలి వేశాడు. ఇదిటువేపున వుండగా రెండోవేపున అనేకమంది సోదరులు ఉమ్మడిగా ఒక భార్యను చేసుకోవచ్చును. ఎవరికన్నా మిత్రుని భార్యమీద మక్కువ ఏర్పడితే ఆతనితో కలిసి ఆమెను అనుభవించవచ్చును. ఆబోతు లాంటి వ్యక్తికి–పౌరుడు కాకపోయినాసరే ఆతనికి – తన భార్య నివ్వ డంలో తప్పులేదని వారు భావించేవారు. తనవెంట విడవకుండా తిరుగు

---

* ప్రాచీన గ్రీకు ప్రజలలో ఒక ముఖ్యమైన శాఖ. అత్తికా, ఆశియా మైనరు సముద్రతీరము (దీనినే ఇయోనియా అంటారు), అజియన్ సముద్రంలోని పలుదీవులూ వీరి నివాసం.

** దోరియన్ తెగలు ప్రాచీన గ్రీకు తెగలలో వారు. హెల్లాస్ దక్షిణ భాగంలో నివసించేవారు.

• ప్రాచీనకాలపు గ్రీకు రాజ్యాలలో ఒకటి. అక్కడ నివసించే వారిని స్పార్టసు లంటారు.

† ఒక స్పార్టా రాజు.

తున్న ప్రేమికుడిని ఒకణ్ణి ఒక స్పార్టను వనిత తన భర్తతో మాట్లాడి రమ్మని పంపినట్లు ప్లూటార్క్* ఒకచోట వ్రాశాడు. అది ఆనాటి స్త్రీం కధిక స్వాతంత్ర్యం వున్నట్లు సూచిస్తూందని షోమన్† వ్రాశాడు. కాబట్టి, అసలైన భర్తృద్రోహం, భర్తకు తెలియకుండా ఇతరులతో సంగమించడం ఆరోజులలో వినబడదు. రెండోవేపున - ఆ రోజుల్లో స్పార్టాలో గృహదాసీలు లేరు. దాసీలైన 'హెలాట్'లు పొలాల లోనే వుండేవారు. అందుచేత స్పార్టనులకు 'హెలాట్' వనితల ఆకర్షణ' వారితో సంబంధాలు తక్కువ. గ్రీసులోకన్న స్పార్టన్లలో స్త్రీల కెక్కువ గౌరవం లభించిందంటే కారణం ఇదే. గ్రీసుదేశపుస్త్రీలలోకల్లా స్పార్టన్ స్త్రీలూ, ఏథీనియను దేవదాసీలూ మాత్రమే గౌరవించబడేవారు. వారి మాటకు మన్నన వుండేది.

ఇయోనియన్ల స్థితివేరు. ఆ విషయానికి ఏథెన్సును ఉదాహరణగా తీసుకోవచ్చు. వడుకు, నేత, కుట్టుపని, మహా అయితే కొద్దిపాటి వ్రాయనూ, చదువనూ మాత్రమే అక్కడి ఆడపిల్లలు నేర్చుకొనేవారు. వారి నెవ్వరితోనూ కలియనిచ్చేవారు కాదు. స్త్రీలమధ్య మాత్రమే తిరుగుతూ వుండాలి. ఇంట్లో ఆడవాళ్ళుండే భాగం వేరుగా వుంటుంది. మగవాళ్ళు, ముఖ్యంగా పైవాళ్ళు సులకనగా ఆ భాగంలో ప్రవేశించడం సాధ్యం కాదు. ఆ భాగం మేడమీదనో, ఇంటి వెనుకభాగంలోనో వుంటుంది. పై మగవాళ్ళెవరైనా ఇంటికివస్తే, స్త్రీలు తమ భాగంలోకి తప్పుకొనేవారు. దాసీసపడుచు తోడులేనిదే బడుది వీధిలోకి పోరాదు. ఇంటివద్ద కూడా వారిమీద గట్టి కాపలా వుండేది. విటుల్ని దూరంగా వుంచేటందుకు

---

* రమారమి క్రీ. పూ. 46 - 120 సంవత్సరాలనాటివాడు. మతం, తత్వశాస్త్రం, చరిత్ర గ్రంథాలెన్నో వ్రాశాడు. సుప్రసిద్ధులైన గ్రీకు, రోమను రాజకీయవేత్తల చరిత్రలు 46 వ్రాశాడు. గ్రీకు రచయిత.

† జార్జి ఫ్రెడరిక్ షోమన్ (1793-1879) జర్మన్ తత్వవేత్త. ప్రాచీన చరిత్రకారుడు.

మొలేషియన్ పక్కల్ని పెంచేవారని అరిస్టోఫేనిస్ * వ్రాశాడు. ఆసియా నగరాలలో స్త్రీలమీద కాపలాకోసం కొజ్జాలని నియోగించేవారు. హెరోడోటస్ ** కాలంనాటికే చియాస్‌లో పెద్దఎత్తున కొజ్జాల్ని తయారుచేసి ఎగుమతి చేయడం సాగుతుండేది. ఈ కొజ్జాల్ని కొనేది ఒక్క అనాగరిక దశలోని ప్రజలు మాత్రమేకాదని వాక్స్మత్ ♦ వ్రాస్తున్నాడు ఆడుదానికి 'ఓకురెమా' (ఇంటిని చక్కబెట్టే ఒక పదార్థం) అనే నపుంసక లింగ శబ్దాన్ని వాడాడు యురిపిడీయస్ †. అథీనియన్ మగవానికి ఆడుది పిల్లల్ని కనడం, ఇంటి నౌకిరీ చెయ్యడంకోసమే. మగవాడికి ఆటలూ, పాటలూ, ప్రభుత్వ వ్యవహారాలూ వుంటాయి. వానిలో భార్యకు ప్రమేయం వుండదు. మగవాడికి బానిస ఆడవాళ్లు దగ్గర వుంటారు. ఏథెన్సు మంచి ఉచ్ఛదశలో వున్నప్పుడు, వ్యభిచారాన్ని హెచ్చుగా అభిమానించారు. ప్రభుత్వమే దానిని ప్రోత్సహించింది. గ్రీకు స్త్రీలలో కొందరు అభివృద్ధి పొంది తెలివితేటలలోనూ, విజ్ఞానంలోనూ స్పార్టా స్త్రీలలాగే ఉచ్ఛ దశకు రావడానికి కారణం ఈ వ్యభిచార వ్యవస్థయే. రాణించగలగాలంటే ఆడుది వ్యభిచారిణి కావలసి వుండడం అథీనియను కుటుంబానికే అప్రతిష్ఠాకరం. ఒక్క ఇయోనియన్లలోగాక, గ్రీసుదేశం అంతటిలోనూ, దాని వలసలలోనూకూడ అథీనియను కుటుంబమునే కాలక్రమేణా ఆదర్శముగా తీసుకొన్నారు. కాని, ఇన్ని తాళాలూ, కాపలాలూ వున్నా

---

* అరిస్టోఫేనిస్. రమారమి క్రీ. పూ. 450–385 నాటివాడు. గ్రీకు నాటక రచయిత. సామయిక రాజకీయ సమస్యలపై ప్రహసనాలు వ్రాశాడు.

** హెరోడోటస్. రమారమి క్రీ. పూ. 484–425 నాటివాడు. గ్రీకు దేశపు చరిత్రకారుడు.

♦ విల్హెల్మ్ ఎర్న్‌స్ట్ వాక్స్మత్. (1784 – 1866) లీప్జిగ్‌లో చరిత్రాచార్యుడు. ప్రాచీనకాల చరిత్రగూర్చి, ఫ్రెంచి బూర్జువా మహా విప్లవకాలంనాటి యూరపు చరిత్రగూర్చి చాలా పుస్తకాలు వ్రాశాడు.

† యురిపిడీస్. (క్రీ.పూ. 480–406) గ్రీకు నాటక రచయిత.

గ్రీకు స్త్రీలు ఏదో అవకాశం చూసుకొని భర్తల్ని మోసగిస్తూనే వుండే వారు. తమ భార్యలయెడ మక్కువ చూపడానికి సిగ్గుపడే మగవాళ్ళు వ్యభిచారిణులతో సాహసల్లాపాలు సాగించేవారు. స్త్రీలకు సంభవించిన పతనం మగవాళ్ళకీ చుట్టుకొంది. . వారిని కూడా పతనం పొందించింది. చివరకు మగకుర్రవాళ్ళతో సంగమించేటంత అధోగతి పాలయ్యారు. అంతతో కూడా సరిపడలేదు. గాని మెడే * కథ ద్వారా తమ దేవతల్ని కూడా తమ దుస్థితికి తెచ్చారు.

ప్రాచీనకాలంలో బాగా నాగరికత పొంది, అభివృద్ధిచెందిన ప్రజలను పరిశీలించగా అది దంపతీ వ్యవస్థకు మూలంఅని బోధపడుతుంది అది వ్యక్తులమధ్య ప్రేమకు ఫలితంగా ఏర్పడిందికాదు. దానికి దీనికి సంబంధమేలేదు. ఇప్పటికీ వివాహాలు పూర్వం మాదిరిగా అవసరం కోసరమే జరుగుతున్నాయి. సహజపరిస్థితులమీదగాక, ఆర్థిక పరిస్థితుల మీద ఆధారపడిన కుటుంబరూపాలలో ఇది మొదటిది. ప్రాచీనకాలంనాటి సహజ, సమష్టిస్వత్వంపోయి వ్యక్తిగతాస్తి హక్కు ఏర్పడడాని కిది ఫలితం. గ్రీకు లీ విషయాన్ని దాపరికంలేకుండా ఒప్పేసుకొన్నారు. మగవాడికి కుటుంబంలో పెత్తనం. ఆతని సంపదకు వారసుల య్యేటందుకై ఆతనికేపుట్టిన బిడ్డల్ని చూపడం ఈ దంపతీ వివాహాల వుద్దేశాలు. మిగిలిన వారు వివాహంచేసుకోవడం ఓ భారం ఎత్తుకోవడంగానూ, దేవ కార్యంగా, పితృకార్యంగా, ప్రభుకార్యంగానూ, తప్పనిసరియై చేసుకొంటున్నదిగానూ చెప్పుకొంటారు. ప్రతి మగవాడూ పెళ్ళి చేసుకుతీరాలనీ. కనీస దాంపత్యధర్మాల్ని నిర్వర్తించాలనీ అథీనియనులు భావించారు.

కాబట్టి స్త్రీ పురుషులమధ్య సహృదయతకు ఫలితంగా తల ఎత్తలేదు దంపతీవివాహం. సహృదయత కది ఉత్తమరూపమసలేకాదు. అసలు స్థితి దానికి పూర్తిగావ్యతిరేకం. స్త్రీ జాతిని పురుషుడు తన ఆధీనంలోకి

---

* గాని మెడే గ్రీకు పురాణాలలోని వ్యక్తి. చాల అందమైన వాడు. దేవదేవుడైన జియెస్ ఆ కుర్రవానిని మోహించి ఒలింపస్‌కు ఎత్తుకు పోయాడు. అక్కడ ఆతడు దేవదేవుని సేవలో నియమించబడ్డాడు.

తెచ్చుకొనడంతో అది వచ్చింది. ఆదిమకాలంలో స్త్రీ పురుషులమధ్య ఎన్నడూ కనిపించివుండని ఘర్షణ దానిలోవుంది. 1746 లో మార్క్స్- నేనూ కలిసి వ్రాసిన ఒక అముద్రిత గ్రంథంలో ఈమాట కనిపిస్తుంది.

"స్త్రీ పురుషుల మధ్య ప్రప్రథమంగా జరిగిన శ్రమ విభజన సంతానోత్పత్తికోసం" * దానికి నాడు ఈ వాక్యంకూడా చేరుస్తాను. "దంపతీ వివాహంలో స్త్రీ. పురుషుల మధ్య పెంపొందిన వైషమ్యమూ మొట్టమొదటి వర్గ వైషమ్యమూ చరిత్రలో ఏకకాలంలో తల ఎత్తాయి." స్త్రీ జాతిని పురుషజాతి అణచివేయడమే మొట్టమొదటి వర్గపీడనం. దంపతీ వ్యవస్థ చారిత్రకంగా ఒక అభివృద్ధే. బానిసత్వం. వ్యక్తిగత ఆస్తితోపాటు ఇదొక నూతనయుగాన్ని ఆరంభించింది. ఆ యుగమే ఈనాటికీ సాగుతూంది. ఈ యుగంలో ముందుకు వేసిన ప్రతి ఒక అడుగూ సాపేక్షక దృష్టిలో వెనుకడుగే. ఇందులో కొందరు దారిద్ర్యాన్నీ. హీనతనూ అనుభవించడంద్వారా కొందరు సంపదలూ, అభివృద్ధీ అనుభవిస్తారు. ఈ వివాహ వ్యవస్థ నాగరిక సమాజంయొక్క సూక్ష్మరూపం. ఆ సమాజంలో కనబడే వైషమ్యాలూ, వైరుధ్యాలూ మన కిందులోకూడా కనిపిస్తాయి.

జంటపెళ్ళిళ్ళు, దంపతీ వివాహం పరిపాటిలోకి వచ్చినంత మాత్రంచేత ఆదిమకాలంలో దాంపత్య సంబంధాలలో వుంటూవచ్చిన స్వేచ్ఛ అంతరించలేదు.

"ప్యునలాన్ దశాలు క్రమంగా అదృశ్యం అయాయి. ఆదిమకాలంలో వుంటూవచ్చిన దాంపత్య సంబంధాల స్వేచ్ఛ క్రమంగా సన్నగిల్లుతూ వచ్చింది. అయినా అది వృద్ధిపొందుతున్న కుటుంబ వ్యవస్థను అంటిపెట్టుకొనే వుంది. దానిని అంటిపెట్టుకొని నాగరికతా యుగపు

---

* 1845 – 46 లలో మార్క్స్ – ఏంగిల్సులు బ్రసెల్సులో వ్రాసిన 'దూషే ఐడియాలజీ' లోని వాక్యం ఇది. తర్వాత ఎనభయ్యేళ్ళకు దీనిని మార్క్స్–ఏంగిల్సు – లెనిన్ ఇన్స్టిట్యూటు (మాస్కో) ప్రకటించింది. 'జర్మన్ ఐడియాలజీ' పేరుతో దానిని 1939 లో ఇంటర్నేషనల్ పబ్లిషర్సు, న్యూయార్కు ప్రకటించారు.

అంచెలవరకూ వచ్చి.... చివరకు కొత్తమాదిరి వ్యభిచారంలోకి పరివర్తన పొందింది. కుటుంబాన్ని నీడలా ఆవరించుకొని నాగరకతా యుగంలో మానవజాతిని వెంటాడుతూనే వుంది."

[మోర్గన్. ప్రాచీన సమాజం]

దంపతీ వివాహంతోపాటు, వివాహబంధానికి వెలుపల మగవాళ్ళకూ, కన్యలకూ వుండే దాంపత్యసంబంధాలుండే ఆచారాన్ని మోర్గన్ వ్యభిచారం (హెటియారిజం) అన్నాడు. ఇది నాగరికయుగం అంతటిలో వివిధ రూపాల్లో కనబడుతూంది. అంతకంతకు అది బాహాటంగా వ్యభిచారంగా పరిణమించింది. అసలీ హెటియారిజానికి మూలం గుంపుపెళ్ళి. తన పవిత్రతను కొనుక్కొనేటందుకోసం స్త్రీ తన్ను నామకః సమర్పించుకొనే ఆచారంలోంచి ఇది బయలుదేరింది. ధనంకోసం సంగమించడం మొదట మతధర్మంగా బయలుదేరింది. ఇల్లాంటి సంగమాలు ప్రేమదేవతల దేవాలయాలలో జరిగేవి. ఆ సంగమాలద్వారా సంపాదించింది ఆ దేవాలయాలకు చెందేది. ఆర్మీనియాలోని అనైతిస్. కోరింథిలోని ఆఫ్రోదితీ దేవాలయాలలోని కన్యలు (హైరోదులే). భారతదేశపు దేవదాసీలు. బాయాదెరే లనబడేవారు (బహుశా నాట్యకత్తె అనే అర్థం ఇచ్చే బైలాదిరా. డన్స్యాజే అనే పోర్చుగీసు మాటలకు అపభ్రంశం అయివుండొచ్చు) మొట్టమొదటి వ్యభిచారిణులు. ప్రారంభంలో సమాజంలోవున్న ప్రతి ఆడుదీ చేసి తీరవలసిన పనిని ఈ అర్చకురాండ్రు మాత్రమే స్త్రీజాతి ప్రతినిధులుగా నిర్వహించేవారు. ఇతర ప్రజలలో వివాహానికి పూర్వం ఆడపిల్లలకుగల సాంగత్య స్వేచ్ఛనుంచి "హెటియారిజం" పుట్టింది. అందుచేత ఇదికూడా గుంపుపెళ్ళికి అవశేషమే. అయితే అవి రూపొందిన పద్ధతులుమాత్రం భిన్నం. అనాగరికయుగపు ఎగువదశలోనే వ్యక్తుల ఆస్తులలో తేడాలు ఏర్పడ్డాయి. అప్పటికే బానిసలశ్రమతోపాటు అక్కడా అక్కడా కూలికి పనిచేయడంకూడా ప్రారంభమయింది. అదే సమయంలో దానితో సంబంధం కలిగి బలవత్సంగమానికి లోబడవలసిన బానిస స్త్రీలతో పాటు. వ్యభిచారవృత్తితో జీవించే స్వతంత్రురాండ్రైన స్త్రీలుకూడా వచ్చారు.

గుంపుపెళ్ళినుంచి నాగరికతకు సంక్రమించిన ఈ వారసత్వం ద్విముఖం. నాగరికత సృష్టించిన ప్రతిదానికీ రెండు ముఖా లున్నాయి. రెండు నాలిక లున్నాయి. అన్నీ ఆత్మవిఘాతకాలు. పరస్పర విరుద్ధాలున్నూ. ఒకవేపున దంపతీ వివాహం, రెండోవేపున ఉదగ్రరూపంలో సాగే వ్యభిచారం. 'హెటీయారిజం' మిగతా అన్నింటిలాగే ఒక సాంఘిక సంస్థ. ఆదిమ కాలపు సాంగత్య స్వేచ్ఛ మగవాళ్ళకు దానిలో లభిస్తుంది. వాస్తవానికి దానిని సహించడమేకాక, ముఖ్యంగా పాలకవర్గాలు చాలా ఉత్సాహంగా దాన్ని అమలు జరుపుతున్నప్పటికీ దాన్ని మాటల్లో అంతా ఖండించేవారే.

అయితే ఈ పనిలో అపనింద అంతా ఆడవాళ్ళదే. మగవాళ్ళ కేమీలేదు. ఆడువాళ్ళమీద మగవాళ్ళ సర్వస్వాధికారాన్ని సమాజం ప్రధానసూత్రంగా అంగీకరించింది. ఈ విషయాన్ని ధృవపరుస్తున్నట్లు స్త్రీలను వెలిపెడుతున్నారు. అసహ్యించుకొంటున్నారు.

రెండో వైరుధ్యం దంపతీవివాహం లోపలనే బయలుదేరింది. హెటీయారిజాన్ని ఆచరిస్తూన్న భర్తపక్క అతనిచే నిరాకృతయైన భార్య. ఏ వైరుధ్యంలోనూ ఒక సగంలేకుండా రెండో సగం వుండదు. పండులో సగం తినేశాక చేతిలో పూర్తి పండువుండదు. అయితే మగ వాళ్ళకాజ్ఞానం వున్నట్లుతోచదు. భార్యలు గట్టిగా పాఠంచెప్పేవరకూ వారు తమ చేతిలో పూర్తిపండే వుందనుకొన్నారు అప్పవరకు సమా జంలో ఎన్నడూ కనబడని రెండు తరహాల వ్యక్తులు దంపతీ వివా హంతో ప్రత్యక్షమయ్యారు. ఒకడు రంకుమగడు. రెండవవాడు జారిణి భర్త. ఆడదాన్ని మగవాడు లొంగదీశాడు.అయితే విశాలహృదయంతో విజేతలకు కిరీటాలు తగిలించే కార్యం విజితలు తీసుకున్నారు. దంపతీ వివాహం హెటీయారిజంతో పాటు వ్యభిచారంకూడా ఒక సాంఘికవ్యవస్థ అయింది. దానిని నిషేధించారు. కఠోరశిక్షలు విధించారు. కాని దానిని నిలపడం అసాధ్యం. పిల్లలకు తండ్రి ఎవరనేది వెనకటిలాగే ఇప్పుడూ నైతికవిశ్వాసం మీదనే ఆధారపడి నిర్ణయించవలసివచ్చింది. పరిష్కరించడం అసాధ్యంఅయిన ఈ సమస్యను పరిష్కరించేటందుకు నెపోలియన్ న్యాయశాస్త్రం 312 వ ఆర్టికలులో ఈ విధంగా వుంది.

"వివాహిత దశలో కడుపునపడిన బిడ్డకు భర్తయే తండ్రి." మూడువేల సంవత్సరాలపాటు దంపతీవ్యవస్థ కొనసాగిన వెనుకకూడా పరిస్థితి ఇది.

నాగరికత ప్రారంభ మైనప్పటినుంచీ వర్గాలుగా విడిపోయిన సమాజంలోని వైరుధ్యాలూ, వైషమ్యాలూ సూక్ష్మరూపంలో దంపతీ వ్యవస్థలో కనబడతాయి. మగవాని ఏకచ్ఛత్రాధిపత్యానికి ఫలితంగా స్త్రీ పురుషుల మధ్య తీవ్రసంఘర్షణలో ఆ వ్యవస్థకు మూలం అయిన చారిత్రక దశ ప్రతిబింబిస్తూంది. ఆ వైరుధ్యాల నది పరిష్కరించుకో లేము. అతిక్రమించనూలేదు, ఆ వివాహ వ్యవస్థయొక్క ప్రాథమిక లక్షణా లన్నింటితో వైవాహిక జీవితాన్ని గడుపుతూ భర్తయొక్క పెత్తనానికి ఎదురుతిరిగే భార్యలున్న దంపతీ కుటుంబాలను గురించే నే నిది వ్రాస్తున్నా. అన్ని వివాహాలూ ఇదేమాదిరిగా వుండవు. ఈసంగతి జర్మను ఛాందసులకు బాగా తెలుసు. అతడు బయట ప్రభుత్వంలోనూ. ఇటు ఇంట్లోనూకూడా తన పెత్తనాన్ని విశ్వసించుకోలేడు. భార్యలే మొగపిరి చూపిస్తారు. అయితే చీటికీమాటికీ స్త్రీ చేతిలో పరాభవంపొందే ఫ్రెంచి మగవానికన్న తానే నయమని అతని సంతృప్తి.

దంపతీ కుటుంబం గ్రీకుల్లోమాదిరిగా అంత కఠోరరూపంలో అన్నిచోట్లా, అందరిలోనూ కనబడదు. భవిష్యత్తులో ప్రపంచవిజేతలు కానున్న రోమనులు అంత నాగరికం కాకపోయినా దూరదృష్టిని ప్రకటిం చారు. వారిలో స్త్రీకి గ్రీకు స్త్రీలకన్న ఎక్కువమర్యాద, స్వాతంత్ర్యం వుంది. తన భార్యను చంపెయ్యడానిక్కూడా అతనికి హక్కువుంది. ఆ హక్కే ఆమె పాతివత్యానికి పెట్టనిగోడ అని అతని అభిప్రాయం. వారిలో భార్యకూడా భర్తతో సమంగా తన ఇష్టానుసారం వివాహబం ధాన్ని తెంచేసుకోగలదు. జర్మనులు చారిత్రకరంగంలో అడుగుపెట్టిన తర్వాతనే దంపతీవివాహంలో గొప్ప అభివృద్ధి వచ్చింది. బహుశా ఇది దారిద్ర్యానికి ఫలితంగానే అయివుంటుంది.వారిలో జంటపెళ్ళి పద్ధతినుంచి దంపతీ వివాహ వ్యవస్థ పూర్తిగా విడిపడి వుండలేదు.అదే ఆ అభివృద్ధికి కారణం. టాసిటసు పేర్కొన్న మూడు అంశాల్ని పట్టి నేను దీనిని వూహిస్తున్నా. ఒకటి: వివాహం ఒక పవిత్రకర్మగా భావించబడుతూంది.

అయినా "ప్రతి మగవాడూ ఒక అడుదానితో తృప్తిపడి వుంటున్నాడు. స్త్రీ పవిత్రంగా వుంటూంది"-తెగ పెద్దలూ, హోదాగలవారూ ఎక్కువ మంది భార్యల్ని కలిగివుంటున్నారు. జంటపెళ్లిళ్ల పక్షపాటిగా వున్న అమెరికనులలోకూడా ఇదే పరిస్థితి. రెండోది; తల్లి హక్కునుంచి తండ్రి హక్కులోకి మార్పు కొద్ది కాలంక్రితమే వచ్చివుంటుంది. ఏమంటే ఆనాటికింకా వారిలో తండ్రికంటే మేనమామదగ్గరవాడుగా భావించబడుతున్నాడు. తల్లి హక్కుప్రకారం గణాలలోని మగవారిలో సన్నిహిత బంధువు తల్లి సోదరుడు. అమెరికను, ఇండియనులలో కూడ ఇదే పరిస్థితి కనబడుతుంది. మన ఆదిమకాలపు చరిత్రను అర్థం చేసుకొనేటందుకు వీలు కలిగించే కీలకం దొరికిందని మార్క్స్ దీనిని గురించే అనేవాడు. ఇంక మూడోది : జర్మనులలో స్త్రీలకు అధికమైన మర్యాద ఇచ్చేవారు. సార్వజనిక వ్యవహారాలలో కూడా వారికి పలుకుబడివుండేది. దంపతీ వ్యవస్థలో మగవాడిది ప్రాముఖ్యం. ఈ రెండూ పరస్పరవిరుద్ధాలు. ఈ అన్ని విషయాలలో జర్మనులకు స్పార్టనులతో పోలికవుంది. ఆ స్పార్టనులలో జంట పెళ్ళి పద్ధతి అంతరించి వుండలేదని మనం పైనచూశాం. ఆ విధంగా జర్మనులరాకతో ఒక నూతన అంశం ప్రపంచ ప్రాముఖ్యాన్ని గడించింది. రోమక సామ్రాజ్య శిథిలాలమీద విభిన్నజాతులు సమ్మేళనమయాయి. ఆ సమ్మేళనలో దంపతీ వివాహం ఒక నూతన రూపంలో అవతరించింది. దీనిలో మగవాని అధికృత అంతభయంకర రూపంతో వుండదు. పై చూపులకే అయినా స్త్రీలస్థితి వెనుకటి కాలంలోకన్న చాల గౌరవాన్వితంగానూ, స్వేచ్ఛాయుతంగానూ వుంటుంది. అతః పూర్వం ప్రపంచానికి తెలియని ఆధునిక వ్యక్తిగత ప్రేమ ప్రప్రథమంగా తల ఎత్తింది. దీనికి మూలం దంపతీ వివాహమేనని చెప్పాలి. దంపతీ వివాహంలో గొప్ప నైతిక పరిణామం వచ్చేందుకు అవకాశం ఏర్పడింది. అయితే ఆ ప్రేమ వివాహంతోపాటు పుట్టిందా, వివాహంలోపల ఏర్పడిందా లేక వివాహానికి వెలుపలా అనేది ఆయా పరిస్థితులను పట్టి వుండేది.

జర్మనులు అప్పటికి జంట కుటుంబ వ్యవస్థలోనే జీవిస్తూ వుండడం. ఆ కుటుంబాలలో స్త్రీలకుండే హోదావంటి హోదానే దంపతీ వ్యవస్థలో

కూడా ప్రవేశపెట్టడమూ ఈ అభివృద్ధికి కారణాలు. దంపతీ వ్యవస్థలో కొట్టవచ్చినట్లు కనబడే వైషమ్యాలు జంట పెళ్ళిళ్ళలో కనబడవు. అదే అభివృద్ధికి మూలం. అంతేగాని, జర్మనులలో ఏదో అద్భుతమైన నైతిక పారిశుధ్యం వుండడమూ, నిరుపమానమైన సచ్ఛీలత వుండడమూ వలన కాదు. అసలీ పారిశుద్ధ్యమూ, సచ్ఛీలతా జంట పెళ్ళిళ్ళలో వుండే స్వాతంత్ర్యమే తప్ప వేరుకాదు. నిజం చెప్పాలంటే జర్మనులు తమ సంచారాలలో - ముఖ్యంగా ఆగ్నేయదిశగా నల్లసముద్ర ప్రాంతాలకు పోయినప్పుడు-అక్కడి మైదానాలలోని సంచార జాతులనుంచి గుర్రపు సవారీతో పాటు ఎన్నో వ్యసనాలనుకూడా నేర్చుకొన్నారు. గోథ్కి తెగలలో ఒకటైన తైఫాలీని గురించి అమ్మియానసు * వ్రాసినదానిలోనూ, హెరులీ ‡ ను గురించి ప్రోకోపియసు ♦ వ్రాసిన దానిలోనూ ఇది చాల స్పష్టంగా వుంది.

దంపతీ వివాహంలోనే మనం చెప్పే ఆధునిక స్త్రీ పురుష ప్రేమ ఏర్పడగలదు. దాని అర్థం వివాహితులయిన దంపతులమధ్యనే ప్రేమ ఏర్పడిందనిగాని, వారిలోనే హెచ్చుగా వుండేదనిగాని కాదు. మగవానికి సర్వాధిపత్యంవుండే దంపతీవివాహపు స్వభావమే ఆ ప్రేమ పుట్టడానికి అభ్యంతరకరం. పాలకవర్గాలన్నింటా వివాహం అనేది

* అమ్మియానసు మార్సెల్లినస్, క్రీ. త. రమారమి 330-400 ప్రాంతంవాడు. గ్రీసుదేశీయుడు. రోమ్ క్షీణదశకు సంబంధించిన చరిత్ర వ్రాశాడు.

‡ హెరులీ-జర్మను తెగలకు చెందిన జనం. బహుశా వీరు డేనిష్‌దీవులకు చెందివుంటారనీ, అటునుంచి యూరపునకంతటికీ పాకి వుంటారనీ వూహించబడుతూంది. 5 వ శతాబ్దం ఆఖరున ఎగువ తిసానదీ ప్రాంతంలో (హంగరీ) ఒక ప్రత్యేక ప్రభుత్వాన్ని నెలకొల్పారు. అది ఆరవ శతాబ్దంలో ధ్వంసమయింది. వారి భాష ఏమిటోకూడ తెలియదు.

♦ ప్రోకోపియసు - క్రీ. శ. 5 శ శతాబ్దం ఆఖరునుంచి 562. బైజంటైన్ న్యాయాధికారి. చరిత్రకారుడు. బెలిసారియసు దండయాత్రలలో పాల్గొన్నాడు. వాటిని గురించి వ్రాశాడు.

జంటపెళ్ళిళ్ళ కాలంనుంచీ జరుగుతున్నట్లు ప్రయోజనాల నుద్దేశించి జరుగుతున్నదేగాని వేరుకాదు. ఇప్పుడుకూడా వివాహాల్ని తల్లిదండ్రులే కూడుస్తున్నారు. దాంపత్యప్రేమ చరిత్రలో ప్రప్రథమంగా మోహం రూపంలో కనబడుతుంది. ఏ వ్యక్తికైనా – కనీసం పాలకవర్గాల వారందరికీ-దానిని అనుభవించే అధికారం వుంది. దాంపత్యవాంఛకది ఉత్తమ రూపంగా గుర్తించబడింది. ఆ మోహానికి గమ్యం దాంపత్యవాంఛయే. మధ్యయుగాలనాటి వీరయోధుల గాథలలో మనం చూసేది ఈ మోహాన్నే. అది అసలు వైవాహిక ప్రేమ కానేకాదు. పైపెచ్చు ఆ మోహం ప్రొవెన్కాలులలో భర్తృద్రోహానికే దారితీసింది. దానిని గురించే కవులెన్నో గీతాలు వ్రాశారు. ప్రొవెన్కాలుల కవితలలో చాల ఉత్తమమైనవి 'అల్బాస్' (ప్రభాతగీతికలు). వీరుడు తన ప్రేమికురాలయిన మరొకని భార్యతో విశ్రమిస్తున్నాడు. వాకిట సేవకుడు కాపలావున్నాడు. ఉషః కాంతులు విరుస్తూంటే అతడు యజమానుణ్ణి లేపుతాడు. ప్రేయసీ – ప్రేమికులు విడువలేక విడువలేక విడిపోతారు. ఔత్తరాహిక ఫ్రెంచిప్రజలూ, జర్మను యోగ్యపురుషులుకూడ ఈమాదిరి గేయాల్నీ, వానిని అనుసంధించి వుండే సాహసిక ప్రేమనూ అభిమానించారు. మన వోల్ఫామ్ వాన్ ఈసెన్‌బాక్ * ఈ కథా వస్తువుతోనే మూడు ప్రభాత గీతికలను వ్రాశాడు. నా వుద్దేశంలో ఆయనవ్రాసిన మూడు మహాకావ్యాల కన్న ఈ మూడు గీతికలే బాగున్నాయి.

ఈనాడు బూర్జువావివాహాలు రెండుపద్ధతులలో జరుగుతున్నాయి. కాథలిక్ దేశాలలో తల్లిదండ్రులే తమ కొడుకుకు ఒక కన్నెను వెతికి చేస్తారు. దాని ఫలితంగా దంపతీవివాహంలో సహజంగా వుండే వైరుధ్యాలు పూర్తిగా విజృంభిస్తాయి. భర్త కులటలతో కులుకుతుంటాడు. భార్య వ్యభిచారానికి ఎగబడుతుంది. చావుకిలాగే వ్యభిచారానికికూడా మందులేదనే అభిప్రాయంతోనే కాథలిక్ చర్చి విడాకుల్ని నిషేధించి వుండాలి. ఇంకా ప్రొటెస్టెంట్ దేశాలలో, అక్కడ బూర్జువా కుటుంబాల

---

* వోల్ఫ్రామ్ వాన్ ఈసెన్‌బాక్ – 1170–1220 జర్మనీ దేశపు కవి.

యువకుడు తన వర్గంలోంచి తనకు నచ్చిన వధువును చేసుకొనేటందుకు యింత మించు స్వాతంత్ర్యం వుందనే చెప్పవచ్చు. ఫలితంగా ఇక్కడ వివాహాలకు ప్రేమ కొంతవరకు కారణం అయి వుంటుందనుకోవచ్చు. అయితే ప్రొటెస్టెంట్లు తమ కాపట్యాన్ని దాచిపెట్టుకొని, మర్యాదకోసం ప్రేమ ఎల్లప్పుడూ పెళ్ళిళ్ళకు కారణంఅంటారు. ఇక్కడ భర్త కులటల వెంటబడడం, భార్య వ్యభిచారానికి పాల్పడడం సార్వత్రికం కాదు. వివాహం ఏ పద్ధతిలో జరిగినా మనుష్యులు మనుష్యులే. పెళ్ళి కాక పూర్వం వున్న మనిషే పెళ్ళి అయాకా వుంటాడు. పైగా ప్రొటెస్టెంటు దేశాల పౌరులు వర్తి ఛాందసులు. అందుచేత, వారిలో బాగా ఫలించా యనుకొనే వివాహాలలో మంచివి ఏరిచూసినా, ప్రొటెసెంట్ల ద పతీ వివాహం సాధించిందల్లా శయ్యా సమభాగిత్వాన్ని మాత్రమే. విసుగునూ, అసహ్యాన్నీ గార్హస్థ్య సౌఖ్యం పేరుతో దాచిపెట్టుకొంటారు. నవలలలో మనం ఈ రెండు తరహాల వివాహాలను అద్దంలో చూసినట్లు చూడవచ్చును. ఫ్రెంచినవల కాథలికు పద్ధతినీ, జర్మను నవల ప్రొటెస్టాంటు పద్ధతినీ చూపిస్తుంది. ఈ రెండింటా కథానాయకుడు సంచితార్థాన్ని సంపాదిస్తాడు. జర్మను నవలలో యువకుడు భార్యను సంపాదిస్తాడు. ఫ్రెంచి నవలలో భర్త కొమ్ములు * మొలిపించుకుంటాడు. ఈ యిద్దరిలో ఎవరి దెక్కువ దౌర్భాగ్యమో ఒక్కొక్కప్పుడు చెప్పడం కష్టం. అందుచేతనే జర్మను నవలలోని పేలవత్వంచూసి ఫ్రెంచి బూర్జువా అపహాస్యంచు కొంటాడు. ఫ్రెంచి నవలలోని 'అవినీతి'ని చూసి జర్మను ఛాందసుడు వెలపరించుకొంటాడు. ఇప్పుడు బెర్లిను "ప్రపంచ నగరం" అవు తూంది. కనక జర్మను నవలాకారులు కొంత జంకు విడిచి, తమకు చిర పరిచితములయిన హెటీయారిజాన్నీ, వ్యభిచారాన్నీ కథా వస్తువుగా తీసు కుంటున్నారు.

ఈ రెండు సందర్భాలలోనూ కూడ వధూవరుల వర్గస్థితిని పట్టి వివాహాలు జరుగుతాయి. అందుచేత ఇవి కూడా ఒక ప్రయోజనాన్ని

---

*వ్యభిచరించు భార్య భర్తకు కొమ్ములు పెడుతుందని పాశ్చా త్యులు అపహాస్యం చేస్తారు.

వుద్దేశించి జరుగుతున్నవిగానే వుంటున్నాయి. ప్రయోజనాలకు జరిగే ఈ రెండు తరహాల వివాహాలూ తరచు వట్టి వ్యభిచారాలే ననాలి. ఒక్కొక్కప్పుడు ఇద్దరూ వ్యభిచారానికే దిగుతారు. భార్య విషయంలో ఆ మాట సర్వసాధారణంగా యధార్థం. అయితే మామూలు వ్యభిచారిణికీ ఆమెకూ ఒక్కటే తేడా. కంట్రాక్టు కూలిలాగ ఎప్పటికప్పుడు కొంత డబ్బు తీసుకొని కొంతకాలంపాటు తన శరీరాన్ని అమ్ముకోవడంగాక, శాశ్వతంగా ఆమె తన శరీరాన్ని అమ్ముకొంటుంది. ప్రయోజనాన్ని వుద్దేశించి జరిగే పెళ్ళిళ్ళనుగూర్చి ఫొరియరు * చెప్పిన ఉపమానం సరిగ్గా వుంది. "వ్యాకరణంలో రెండు నైయర్థకాలు ఒక అస్త్యర్థాన్ని తెలుపుతాయి. అలాగే వైవాహిక నియమాలలో రెండు వ్యభిచారాలు ఒక పాతివ్రత్యంగా లెక్క". పీడిత వర్గాలలో మాత్రమే అనగా నేటి శ్రామిక వర్గంలో మాత్రమే భార్యాభర్తల మధ్య దాంపత్య ప్రేమ సర్వసాధారణం అయ్యే అవకాశంవుంది. చట్టాలు అంగీకరించడమూ, అంగీకరించక పోవడమూ వేరుమాట. ఈ వర్గం దగ్గరకు వచ్చేసరికి దంపతీ వివాహానికి మూలంఅయిన కారణాలన్నీ తొలగిపోయాయి. ఈ వర్గానికి ఆస్తి అనేది ఏమీ ఉండదు. ఆస్తికి వారసుల్ని కనేటందుకే గదా దంపతీ వివాహం వచ్చింది? మగవాని అధికారమూ దానికే గద! ఆస్తి లేనప్పుడు మొగవాని పెత్తనానికి బలమూ వుండదు. ఈ అధిపత్యాన్ని కాపాడేటందుకే బూర్జువా చట్టాలు. ఆ చట్టాలు ఆస్తిపరులకే. శ్రామికులను అణచిపెట్టడం వాటి వుద్దేశం. చట్టాలంటే డబ్బుతోపని. పనివాడు దరిద్రుడు. అందుచేత ఆతడు వాని వుపయోగాన్ని పొందలేడు. ఇక్కడ వ్యక్తిగత, సమాజ గత పరిస్థితులది ప్రాబల్యం. పైగా, పెద్ద పెద్ద పరిశ్రమలు వచ్చి స్త్రీని ఇంట్లోంచి బయటికి తెచ్చాయి. ఆమె తన శ్రమను అమ్ముకొనేటట్లు ప్రోత్సాహం ఇచ్చాయి. ఫ్యాక్టరీలలో ఆమెను ప్రవేశపెట్టాయి. తరచు కుటుంబంలో తిండికి డబ్బు సంపాదించేది ఆమె ఒక్కర్తే అవుతూంది. ఆ విధంగా మగవాడి పెత్తనానికి మూలం

---

* ఛార్లెస్ ఫొరియర్ (1772-1837) ఫ్రెంచివాడు. ఉటోపియన్ సోషలిస్టులలో బాగా పేరున్నవాడు.

అయిన కారణాలన్నీ తుడుచుకుపోతున్నాయి. అయితే దంపతీవివాహం వచ్చేక మగవాడికి బాగా అలవాటయిన చెయ్యిచురుకుతనం కొంత వుంటుంది. శ్రామిక కుటుంబంలోని వధూవరులిద్దరికీ ప్రగాఢమైన ప్రేమ, పరస్పరానుబంధమూ వుండొచ్చు. మతాధికారుల, ప్రభుత్వాధికారుల ఆశీస్సులూ, అనుమతులూ వారికి లభించవచ్చు. అయినా, దానిని దంపతీవివాహం అని నిశ్చితంగా చెప్పడానికి వీలులేదు. అందుచేత దంపతీ వివాహాన్ని తప్పనిసరిగా వెంటాడుతూవుండే హెటియారిజమూ, వ్యభిచారమూ యించుమించు లేకుండాపోతాయి. స్త్రీకి విడాకులు పొందే అధికారం లభించింది. భార్యాభర్తలకు పొత్తుకుదరకపోతే విడిపోతారు. అంటే శ్రామికుల వివాహాన్ని శబ్దార్థరీత్యా దంపతీ వివాహం అనగలమే గాని, చారిత్రకార్థంలో ఆ మాట చెల్లదు.

చట్టాలద్వారా వస్తున్న అభివృద్ధివల్ల స్త్రీల బాధలు అంతకంతకు తొలగిపోతున్నాయని న్యాయశాస్త్రవేత్తలు అంటున్నారు. వధూవరులు ఇద్దరూ తమ ఇష్టంమీదనే వివాహం చేసుకోవాలనీ, వివాహానంతరం కూడా వారి హక్కులూ, బాధ్యతలూ, సమానంగానే వుండాలనీ, ఆధునిక నాగరిక న్యాయశాస్త్రాలు క్రమంగా అంగీకరిస్తున్నాయి. ఈ రెండూ నిక్కచ్చిగా చెల్లుబడి అయితే, స్త్రీలకు కావలసినవన్నీ లభించినట్లేనని వారి వాదన.

అతివాదులైన రిపబ్లికన్ బూర్జువాలుకూడా ఈ వాదననే శ్రామికవర్గం విషయంలో తెచ్చి వారిని డిస్మిసు చేస్తారు. ఉభయపక్షాలూ ఇష్టాపూర్తిగ పని ఒప్పందం చేసుకొన్నట్లు భావించబడుతుంది. ఉభయపక్షాలూ సమానులేనని కాగితంమీద అంగీకరిస్తేచాలు. ఆ ఒప్పందానికిద్దరూ ఇష్టాపూర్తిగా అంగీకరించినట్లేనని చట్టం అంటుంది ఉభయులలో ఒకరు తమ వర్గస్థాన బలిమిచేత రెండోవారిమీద ఒత్తిడి తెస్తారు. ఆర్థికంగా ఇద్దరిదీ సమానమైన హోదాకాదనే విషయం చట్టానికిపట్టదు. ఆ ఒప్పందం అమలులో వున్నంతకాలమూ ఉభయపక్షాలవారికీ సమాన హక్కులుంటాయనీ, అందులో ఏ ఒక్కరైనా ఆ ఒప్పందాన్ని రద్దుపరచవచ్చుననీ చట్టం చెప్తుంది. కార్మికుని ఆర్థికస్థితి అటువంటిది. నామ

మాత్రంగా వున్న హక్కుల్నికూడా వదులుకోక తప్పనిస్థితిని అది తెచ్చి పెడుతుంది. చట్టాని కదేమీ పట్టదు.

ఇంక పెళ్ళి విషయం. ఎంతో అభివృద్ధి పొందిన దేశాలలోని చట్టాలుకూడా వధూవరులు తాము ఇష్టా పూర్తిగా వివాహం చేసుకొంటు న్నామని నమోదు చేయించుకొంటే చాలు, సంతృప్తి పడతాయి. ఈ చట్టాల తెరవెనుక నిజజీవితంలో ఏం జరుగుతూ దో, ఈ ఇష్టా పూర్తిగానే పెళ్ళి చేసుకోవడం ఎలా తటస్థ పడిందో చట్టానికిగాని, న్యాయశాస్త్ర వేత్తలకుగాని పట్టదు. న్యాయశాస్త్రాల ప్రాథమిక సూత్రా లలో వున్న తేడాపాడాలను చూస్తే, ఈ వివాహ ఒప్పందం ఎంత ఇష్టాపూర్తిగా జరుగుతూందో తెలుసుకోవచ్చు. జర్మనీలోనూ, ఫ్రెంచి చట్టాలు అమలుజరిగే దేశాలలోనూ తండ్రుల ఆస్తి కొడుకులకు విధిగా సంక్రమిస్తుంది. వారసత్వం వారికి లేకుండా చేయడానికి వీలులేదు. కాని ఆ దేశాలలో బిడ్డలు వివాహవిషయంలో తల్లిదండ్రుల అంగీకారాన్ని పొంది తీరాలి. ఇంగ్లీషు చట్టాలు చెల్లే దేశాలలో వివాహానికి తల్లిదండ్రుల సమ్మతిపొంది తీరాలని లేదు. కాని, అక్కడ తల్లిదండ్రులు తమ ఆస్తిని తమ ఇష్టం వచ్చినట్లు చేసుకొనేటందుకు హక్కువుంది. నామకః వారికో పైసా ఇచ్చి మిగిలింది సున్న చుట్టవచ్చు. దీనివలన తేలేది ఏమిటి? ఆస్తి పరుల కుటుంబాలలో వివాహ విషయంలో స్వేచ్ఛ అన్ని దేశాలలో – అమెరికా, ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సు ఎక్కడాకూడ – ఒకేవిధంగా వుంటూంది.

వివాహానంతరం భార్యాభర్తలకు చట్టరీత్యా సమాన హక్కులున్నా యనేదికూడా ఇంతే. ఉభయపక్షాల మధ్యావున్న అసమానత గత సమాజ పరిస్థితులకు ఫలితంగా వచ్చింది మాత్రమే స్త్రీలను అధికంగా అణచి వుంచడం ఫలితంగా వచ్చిందేగాని దానికిది కారణంకాదు. ప్రాచీనకాలం నాటి సమష్టి గృహవ్యవస్థలో ఎంతోమంది జంటలు, తమ సంతానంతో కలిసి జీవించేవారు. ఆ ఇండ్లలో గృహనిర్వహణ అంతా స్త్రీలది. మగవాని ఆహార సంపాదనకార్యంలాగే గృహనిర్వహణకార్యం కూడా ఒక సాంఘికకర్మ. సాంఘికావసరకర్మ. కాని పితృస్వామిక

కుటుంబం వచ్చాక, అంతకంటేనూ దంపతీవివాహ వ్యవస్థ ఏర్ప డ్డాక పరిస్థితులలో మార్పు వచ్చింది. గృహనిర్వహణకి అంత వరకూ వుంటూవచ్చిన సాంఘిక స్వభావం పోయింది. అదిప్పుడు సాంఘిక కర్మకాదు; స్వంతపని. సాంఘికోత్పత్తిలో ఆమెకు వుంటూ వచ్చిన సానంపోయింది. ఇంట్లోని పనికత్తెలలో ఆమె పెద్ద. అంతే. పెద్ద పెద్ద ఆధునిక పరిశ్రమలు వచ్చాకనే, ఆమె తిరిగి సాంఘికోత్పత్తి రంగంలో అడుగు పెట్టడానికి అవకాశం లభించింది. ఆ అవకాశమైనా కార్మికస్త్రీకి మాత్రమే లభించింది. ఆమె తన కుటుంబపు స్వంతపనులు నిర్వహించవూనుకొంటే సాంఘికోత్పత్తిలో పాల్గోలేదు. ఏమీ సంపా దించలేదు. సాంఘికకర్మలో పాల్గొని స్వతంత్రంగా జీవించదలచిందా కుటుంబబాధ్యతలను నిర్వర్తించలేదు. ఫ్యాక్టరీలలో పనిలాగే ఇతర వృత్తులు – వైద్యం, లాయరు వృత్తివరకూ అన్నింటా ఒకటే పరిస్థితి. ఈనాటి వ్యక్తికుటుంబాలలో భార్య గృహదాసి. ఆ దాసీత్వం నిగూఢం కావచ్చు. బహిరంగంగావచ్చు. ఈ కుటుంబవ్యవస్థకు మూలమే అది. నేటి సమాజంలో వ్యక్తికుటుంబాలు అణువులు. ఆ అణువుల సమూహమే ఈనాటి సమాజం. చాలా కుటుంబాలలో–ముఖ్యంగా ఆస్తి వున్న కుటుంబాలలో కుటుంబానికి తిండితెచ్చి పోషించవలసిన బాధ్యత మగవానిది. కుటుంబంలో అతని ఆధిక్యతకు మూలం అదే. దానికి ప్రత్యేకంగా చట్టాలు అక్కర్లేదు. కుటుంబం లోపల ఆతడు బూర్జువా; భార్య శ్రామికురాలు. పారిశ్రామిక ప్రపంచంలో శ్రామికుని అణచి పెడు తున్న ఆర్థిక పీడన చూడదలచుకొంటే పెట్టుబడిదారీ వర్గానికి న్యాయ చట్టాలలో కలిగించిన ప్రత్యేక సౌకర్యాలు రద్దుపరచాలి. ఉభయవర్గా లకూ చట్టరీత్యా పూర్తి సమానత్వం అమలుజరపాలి. ప్రజాతంత్ర రిపబ్లికు సమాజంలోనివర్గాల మధ్య నున్న వైషమ్యాలను అంతం పొందించదు. పైగా ఆ వైషమ్యాలను అమీ తుమీ తేల్చుకొనేటందుకు అవసరమైన రంగాన్ని సృష్టిస్తుంది. అదేవిధంగా ఆధునిక కుటుంబంలో భార్యమీద భర్తకున్న ఆధిక్యతను రద్దుపరచాలన్నా, వారిరువురిమధ్యా సరిసమానమైన సాంఘిక సమానత్వం కల్పించాలన్నా ఉభయులకూ

న్యాయశాస్త్రరీత్యా సమానమైన హక్కుల్ని కలిగించాలి. స్త్రీజాతి నంతనూ తిరిగి పారిశ్రామిక రంగంలోకి తీసుకొచ్చినప్పుడే వారు నిజంగా స్వతంత్రులవుతారని దీన్నిబట్టి బోధపడుతుంది. ఇందుకు కుటుంబం సమాజానికి ఆర్థికయూనిటుగా ఉండే ఆ స్థితిని రద్దుపరచాలి.

* * *

ఈ విధంగా మానవుని ప్రధాన అభివృద్ధిదశలు మూడింటిలోను మూడు విధములైన కుటుంబవ్యవస్థలు మనకు కనబడుతున్నాయి. ఆటవిక యుగంలో గుంపుపెళ్ళి; అనాగరికయుగంలో జంటపెళ్ళి; నాగరిక యుగంలో దంపతీవివాహం, దానితోడుగా వ్యభిచారమూను. అనాగరిక యుగపు ఎగువదశలో జంటపెళ్ళికీ, దంపతీవివాహానికీ నడుమ ఒక స్థితిలో బానిసస్త్రీలమీద మగవానికిపూర్ణాధికారం ఏర్పడింది. బహు భార్యాత్వాన్ని అనుసరించాడు.

ఈ పరిణామాన్నంతనూ చూస్తే మన కొకటి కనిపిస్తూంది. గుంపుపెళ్ళిలో వున్న సాంగత్యస్వేచ్ఛ క్రమంగా స్త్రీకి తగ్గించబడుతూ వచ్చింది. కాని మగవాడు పూర్వం మాదిరిగా దానిని అనుభవిస్తూ న్నాడు. నిజం చెప్పాలంటే మగవాడీనాడుకూడా గుంపుపెళ్ళిహక్కుల్ని అనుభవిస్తున్నాడు. మగవాడికి గౌరవప్రదంగా భావించబడుతున్న యీ పనినే స్త్రీ చేసిందంటే గొప్ప నేరంచేసినట్లే చట్టం శిక్షిస్తుంది. సంఘంలో అనేక ఇబ్బందులు. ఈ పనే మగవాడికి గౌరవకరం. మహా అయితే అదో చిన్నమచ్చ. ఆ మచ్చని అతడు సంతోషంతో స్వీకరిస్తాడు పెట్టు బడివారీ విధానంలో సరుకుల ఉత్పత్తి వ్యవస్థఏర్పడింది. దానితోపాటు పూర్వకాలపు 'హెటియారిజమ్' మార్పుచెందింది బహిరంగ వ్యభిచారం వచ్చింది. ఈ మార్పు చాలా దుష్ఫలితాలను తెచ్చింది. ఇది ఆడ వాళ్ళలోకన్న మగవాళ్ళలో ఎక్కువ దుష్పరిణామాన్ని కలిగించింది. వ్యభిచారానికి లోబడినవాళ్ళు మాత్రమే స్త్రీ జాతిలో పతితలవుతారు. అదైనా అందరూ భావించేటంత ఎక్కువ దుష్పరిణామం కాదు. కాని, రెండోవేపున మగజాతిస్వభావమే కలుషితమైపోతూంది. ప్రధానకాలం సుదీర్ఘంగా వున్న సందర్భాలలో పదింట తొమ్మిదిమంది ఒకరి కన్ను గప్పి ఒకరు వ్యభిచరించడం నేర్చుకొంటున్నారు.

మనం ఇప్పుడొక సామాజిక విప్లవానికి సన్నిహితంగా వున్నాం. దంపతీ వివాహానికీ, దానికి అనుబంధంగా వచ్చిన వ్యభిచారానికీ పునాదిగావున్న ఈనాటి ఆర్థిక పరిస్థితులు అంతర్ధానం అవుతాయి. చాలా సంపద ఒకే వ్యక్తిచేతిలో - మగవానిచేతిలో - చేరడం, దానిని తన పిల్లలకే సంక్రమింపచెయ్యాలనుకోవడంనుంచి దంపతీ వివాహం వచ్చింది. దీనికోసం దంపతీవివాహంలో స్త్రీవైపునుంచి పాతివ్రత్యం ముఖ్యం; మగవానికి ఏకపత్నీవ్రతం ముఖ్యంకాదు.అందుచేతనే మగవాడు రహస్యంగానో, బహిరంగంగానో బహుపత్నీత్వాన్ని అనుసరించడానికి స్త్రీ పాతివ్రత్యం ఆటంకంకాలేదు. ఆస్తిలో హెచ్చుభాగాన్ని, ముఖ్యంగా వారసత్వంగా సంక్రమించే స్థిరాస్తిని, అంటే ఉత్పత్తి సాధనాలను సామాజిక ఆస్తిగా మార్చివేస్తే అది వారసత్వం విషయంలో వచ్చే తాపత్రయాన్ని చాలవరకు తగ్గించేస్తుంది. అయితే ఆర్థిక కారణాలనుంచి జన్మించిన దంపతీవివాహం ఆ ఆర్థిక కారణాలు తొలగగానే అంతరించి పోతుందా ?

అంతరించిపోవడానికి బదులు దంపతీవివాహం పూర్తిగా అమలులోకి రావడం ప్రారంభమవుతుంది. ఉత్పత్తి సాధనాలు సామాజిక ఆస్తిగా పరివర్తన పొందగానే కూలికి పనిచేసేవాళ్లు-అంటే శ్రామికవర్గం అదృశ్యం అయిపోతుంది. దానితోపాటు కొందరు స్త్రీలు శరీరాన్ని అమ్ముకోవలసిన అవసరమూ రద్దుఅవుతుంది. వ్యభిచారం అంతరిస్తుంది దంపతీ వివాహం క్షీణించడానికి బదులు వాస్తవ విషయంగా రూపొందుతుంది. మగవాళ్ళుకూడా ఏకపత్నీవ్రతాన్ని పాటిస్తారు.

మొత్తం మీద మగవాని స్థితిగతులు బాగా మారుతాయి. కాని ఆడవాళ్ల స్థితి, ఆడవాళ్ళందరి స్థితి చాలా మారిపోతుంది. ఉత్పత్తి సాధనాలు సామాజిక ఆస్తిగా మారడంతో ఒంటి కుటుంబం, సమాజానికి ఆర్థిక యూనిట్‌గా వుండడంపోతుంది. స్వంత ఇంటి నిర్వహణ సామాజిక కర్మగా మారుతుంది, పిల్లల చదువూ, పెంపకమూ సామాజిక ధర్మం అవుతుంది. వివాహితుల సంతానాన్నీ, అవివాహితుల సంతానాన్నీ కూడ సమాజం సమానశ్రద్ధతో చూస్తుంది. ఈనాడు కన్య తన మనసిచ్చిన

వానితో జీవించడానికి ఆటంకంగా వున్నది, దాని ఫలితాలు ఎలా వుంటాయోనన్న భయమే. ఆ భయం పోతుంది. దీనితో క్రమక్రమంగా సాంగత్య సంబంధాలలో నిషేధాలు, ఆటంకాలు పోతాయి. దానితో కన్యాత్వమర్యాద, స్త్రీ సహజమైన సిగ్గు విషయమై ప్రజలు సహనం చూపడం నేర్చుకొంటారు. ఆధునిక ప్రపంచంలో పరస్పర విరుద్ధాలైన దంపతీ వివాహమూ, వ్యభిచారమూ ప్రక్క ప్రక్కనే వున్నాయి. రెండూ ఒకే సామాజిక పరిస్థితుల రెండు అంచులు. ఈ రెండూ, విడదీయ రానివి. అందుచేత, వ్యభిచారం అంతరిస్తుందంటే, దానితోపాటు దంపతీ వివాహంకూడా అంతరించదా ?

ఇక్కడ ఒక కొత్తఅంశం అవతరిస్తుంది. అదే వ్యక్తులమధ్య ప్రేమ. ఇది గతంలో దంపతీ వ్యవస్థలో బీజరూపంలో వున్నదే.

మధ్య యుగానికి పూర్వం వ్యక్తులమధ్య ప్రేమ అనేదేలేదు. అందం, సాన్నిహిత్యం, సమానభావాలు మొదలైనవి స్త్రీ పురుషుల మధ్య సాంగత్య వాంఛను రేపెట్టాయి. అందులో తేడా లేదు. ఎవరైతే నేమిలేయని కనిపించినవారిని కట్టుకొన్నారనీ కాదు. కాని, ఈనాడు మనం చెప్పే వ్యక్తి ప్రేమకూ, ఆనాటి వాంఛకూ పోలికలేదు. ప్రాచీన కాలంలో తల్లి దండ్రులు తమ బిడ్డలకు వివాహాలను కూర్చేవారు. వధూ వరులు మాట్లాడకుండా వప్పుకొనేవారు. ఆ కాలంలో దంపతుల మధ్య కనబడే కొద్దిపాటి ప్రేమకు మూలం ఆత్మీయాభి రుచికాదు. దాంపత్య ధర్మంగా వచ్చినది మాత్రమే. అదీ వివాహానికి కారణంకాదు; వివాహంతో పాటు వచ్చినది మాత్రమే. ప్రాచీనకాలంలో మనం ప్రేమఅని చెప్పేది కుటుంబానికి వెలుపలనే కనబడుతుంది. థియోక్రిటసు, మోస్కసు * లు ప్రేమికులైన గోపాలుర ఆనంద విహారాలను వర్ణించారు. ఆ గోపాలురూ లాంగసు † వర్ణించిన దాఫ్నె, క్లోయీలూ ఆనాటి రాజ్యాంగంలో ఏవిధ మైన హక్కులూలేని బానిసలు. బానిసలలో తప్ప ఇతర స్వతంత్ర

* మోస్కసు : క్రీ. పూ. 2 వ శతాబ్దినాటి గ్రీకుకవి.

† లాంగసు : క్రీ. శ. 3 వ శతాబ్ది ప్రారంభం. గ్రీకు రచయిత దాఫ్నె – క్లోయీలనే కావ్యం వ్రాశాడు.

పౌరులలో కనిపించే ప్రేమ ప్రాచీన సమాజ శైథిల్యానికి ఫలితంమాత్రమే. ఏథెన్సు క్షీణదశలో వున్నప్పుడూ, చక్రవర్తులచేతిలో రోము పరిపాలించ బడుతున్నప్పుడూ అక్కడకు వచ్చిన విదేశీయస్త్రీలలోనూ, స్వతంత్రం పొందిన బానిసస్త్రీలలోనూ మాత్రమే ఈ ప్రేమ కనబడుతుంది. స్వతంత్రు డైన మగవానికీ, పౌరసత్వంవున్న స్త్రీకీ మధ్య ప్రేమకలాపం సాగిం దంటే అది వ్యభిచారరూప లో సాగవలసిందే. ప్రాచీనకాలంలో ప్రేమ గీతాలు వ్రాసినకవి అనాక్రియాన్ * ప్రేమ అనేదానికీ మనం సాంగత్య ప్రేమగా భావించేదానికీ సంబధమేలేదు. తాను ప్రేమిస్తున్నవారి లింగ భేదంతోకూడ ఆయనకు ఎట్టి ప్రసక్తిలేదు.

ప్రాచీనకాలంనాటి ఈరోల సాంగత్య వాంఛకూ, మనంచెప్పే ప్రేమకూ చాలా తేడావుంది. మొదటిది – మనం చెప్పే ప్రేమ ఎదుటి వారి నుంచి ప్రతి ప్రేమను కోరుతుంది. ఇక్కడ ఆడుదానిది మగవానితో సమానమైన హోదా, కాని, ఈరోలలో స్త్రీ అభిప్రాయాన్ని తెలుసు కోవడం చాల తక్కువగా జరిగింది. రెండోది, మనంచెప్పే ప్రేమలో తీవ్రతా, స్థిరత్వమూ వుంది. ప్రేమికులు వియోగాన్ని భరించడం చాల కష్టం. ఒకరి నొకరు పొందడానికి ఎన్నికష్టాలకైనా సిద్ధపడతారు. ప్రాణ త్యాగానికికూడా జంకరు ఇటువంటి ఘటనలు ప్రాచీనకాలంలోనూ జరిగాయి. కాని, అవి వ్యభిచారంలోనే జరిగాయి. ఇక ఆఖరుది – సాంగత్య సంబంధాలను ఏర్పరచుకోవడంలో మనంచెప్పే ప్రేమకు ఒక నూతన నైతిక ప్రమాణం ఏర్పడింది. ఆ సాంగత్య సంబంధం ఏర్ప రచుకొన్నది వివాహితులా, వివాహం వెలుపలనా అనే దొక్కటేకాదు ఇప్పటి ప్రశ్న. స్వతస్సిద్ధంగా ప్రేమవుండి సంబంధం పెట్టుకొన్నారా, లేకుండానేనా–అనేదికూడా ప్రశ్న అవుతూంది. ఫ్యూడల్, బూర్జువా సమా జాలలో ఈ నూతన నైతిక ప్రమాణం, ఇతరనైతిక ప్రమాణాలన్నింటి లాగే నిర్లక్ష్యం చేయబడుతూంది. వానికి పట్టినగతే దీనికీ పట్టింది అంతే.

* అనాక్రియాన్ : క్రీ. పూ. రమారమి 580–495 మధ్య జీవించాడు. గ్రీసుదేశపు గేయకవి.

వాటి అన్నింటిలాగే దీనినీ కాగితంమీద స్వీకరిస్తారు. అంతకంటె అధికం కోరడం ఇప్పట్లో సాధ్యంకాదు.

సాంగత్యప్రేమ జన్మించడంతో అతిప్రాచీనయుగం ముగిసింది. వ్యభిచారంతో మధ్యయుగం ప్రారంభమయింది. ప్రాభాత గీతాల జన్మ నికి కారణం అయిన వీరప్రేమనుగురించి పైనచెప్పాను. వివాహ సంబంధాలను విచ్ఛిన్నంచేసే ఈ మాదిరి వీరప్రేమకూ, వివాహ సంబంధాలకు పునాదిగా వుండగల ప్రేమకూ మధ్య చాలాదూరంవుంది. వీరశృంగారం Chivalry ఆ అగాధాన్ని పూడ్చలేదు. కులాసా స్వభావంగల లాటిన్ ప్రజల మాట అల్లావుంచి, ధర్మనిరతులమనే జర్మనులను తీసుకొన్నా అంతే. నిబెలింజన్‌లీడ్ * అనే పుస్తకాన్ని తీసుకుందాం. దానిలో క్రిమ్‌హిల్డ్ •, సీజ్‌ఫ్రీడ్ †ను ప్రేమిస్తూంది. అతడూ క్రిమ్‌హిల్డ్‌ను బాగా ప్రేమిస్తున్నాడు. అయినా వరుని పేరుకూడా చెప్పకుండా ఆమె నొక వీరునికిచ్చి పెళ్ళి చేయడానికి నిశ్చయించినట్లు గంథర్ ‡ ఆమెకు తెలియబరిచినప్పుడిల్లా అంది: "నన్నడగవలసిన పనిలేదు. తమరు ఏదిచెప్తే దానిని శిరసావహిస్తాను. ప్రభూ! తమరు నాకు ఎవరిని భర్తగా నిర్ణయిస్తే వారినే సంతోషపూర్వకంగా స్వీకరిస్తాను." ఆమెకు సీజ్‌ఫ్రీడ్ ఎడగల ప్రేమనుగురించి ఆలోచించవలసివున్నదనేనా తోచలేదు. కంటితోచూడనన్నా చూడకుండా బ్రన్

---

* నిబెలింజన్‌లీడ్. జర్మన్ దేశపు పురాణ గాథ. నిబెలింజన్ అనే వారు వామనులనీ, వారు నిధులను రక్షిస్తూంటారనీ కథ.

• క్రిమ్‌హిల్డ్ – జర్మన్ పురాణగాథలలో ఒకవ్యక్తి. జర్మను జాతీయ ప్రాచీనగాథ నిబెలింజన్‌లీడ్‌లో ఒక పాత్ర.

† సీజ్‌ఫ్రీడ్ – జర్మన్ పురాణగాథలలో ఒకవ్యక్తి. నిబెలింజన్‌లీడ్‌లో నాయకుడు. ఎన్నో సాహసకృత్యాలు చేశాడు. అతన్ని శత్రువయిన హాగెన్ ద్రోహంచేసి చంపేశాడు.

‡ గంథర్ – జర్మన్ పురాణవీరుడు. నిబెలింజన్‌లీడ్‌లో కథానాయకుడు.

హిల్డ్*ను గంథర్ పెళ్ళిచేసుకుంటాడు. అలాగే క్రిమ్‌హిల్డ్‌ను ఈట్జెల్† పెళ్ళి చేసుకున్నాడు. గుడ్రున్‌లోకూడ మనకిదే కనబడుతుంది. అందులో ఐర్లెండు నివాసియైన సిగెలాంటి •, నార్వేదేశపు ఊటేసీ. హెగెలిసేజన్ నివాసి హెటెల్ ఐర్లండుదేశపు హిల్డెనూ పెళ్ళాడగోరారు. మోర్లండ్ నివాసి సీగ్‌ఫ్రీడ్, ఓర్మానూ నివాసి హార్ట్‌మట్,‡ సీలాండ్ నివాసి హెర్విగ్‌లు†* గుడ్రున్‌ను *† పెళ్ళాడగోరుతారు. అయితే ఇక్కడ గుడ్రున్ తనకు నచ్చిన హెర్విగ్‌ను వరిస్తుంది. ఇటువంటి ఘటన కిదే ప్రథమం. యువ ప్రభువుకు వధువును ఆతని తల్లి తండ్రులే వెతికి చేయడం పరిపాటి. వారు చనిపోయిన ఘట్టంలో ఆతడే తన సామంత వృద్ధుల సలహాతీసుకొని చేసుకొంటారు. ఆ వృద్ధుల మాటలకెంతో విలువనిస్తారు. ఇష్వకతప్పదు కూడా. ఒక వీరుడో, సామంతుడో, ప్రభువో పెళ్ళిచేసుకొంటున్నాడంటే అదొక రాజకీయ విషయం. నూతన బంధుత్వ సంబంధాలతో అధికారాన్ని విస్తరింపజేసుకొనే ప్రక్రియ అది. అక్కడ వంశంయొక్క ప్రయోజనాలకేగాని, వ్యక్తి వాంఛలకు ప్రాముఖ్యం వుండదు. అటువంటిచోట వివాహానికి ప్రేమ కారణం ఎట్లవుతుంది ?

మధ్యయుగంలోని పట్టణాలలోని గిల్డుల సభ్యుల విషయంకూడ అంతే. గిల్డులకు ప్రత్యేక నిబంధనావళులున్నాయి. ఇతరగిల్డులతోనూ,తన

---

* బ్రన్‌హిల్డ్ – జర్మన్ పురాణగాథ నిబెలింజన్‌లీడ్‌లో కథా నాయకురాలు.

† ఈట్జెల్ – నిబెలింజన్‌లీడ్‌లో ఒక ముఖ్యపాత్ర.

• సిగెబాంట్ – జర్మన్ పురాతనగాథ గుడ్రున్‌లో ఒక పాత్ర.

‡ హార్ట్‌మట్ – గుడ్రున్‌లో ఒక పాత్ర.

†* హెర్విగ్ – గుడ్రున్‌లోని మరొక పాత్ర.

*† గుడ్రున్ – జర్మన్ పురాణగాథ గుడ్రున్‌లో కథా నాయకురాలు.

గిల్డులోని ఇతర సహచరులతోనూ, తనవద్ద పని నేర్చుకొంటున్న వారితోనూ, పని నేర్చుకుని స్వతంత్రంగా పనిచేసుకుంటున్న వారితోనూ సంబంధం వుంచుకొనే విషయంలో కృతకమైన హద్దులను ఏర్పరుస్తూ చట్టాలున్నాయి. ఇవన్నీ అతనికి రక్షణనివ్వడానికి ఏర్పడ్డవే. కాని అవే తన కనుకూలవతియైన భార్యను ఏరుకోగల కూటాన్ని పరిమితం చేస్తున్నాయి. ఆ కూటంలో కూడా తగిన వధువును అతని తల్లిదండ్రులే వెదుకుతారు. కుటుంబ ప్రయోజనాలకే గాని, వరుని ఇష్టానిష్టాలకక్కడ స్థానంవుండదు. కనక, మధ్యయుగాల ఆఖరువరకూ వివాహంఅనేది చాలా హెచ్చుసందర్భాలలోప్రారంభదశలోవున్నట్లేవుండిపోయింది. వధూవరుల సమ్మతికి అందులో ప్రాధాన్యం లేదు. ప్రారంభంలో మనుష్యుడు వివాహితుడు గానే పుట్టేవాడు. పురుషులగుంపుకంతకూ స్త్రీ భార్య. అలాగే స్త్రీల గుంపుకంతకూ పురుషుడు భర్త. గుంపుపెళ్ళిలో తర్వాత తర్వాత అనేక మార్పులు వచ్చి కొత్తరూపాలు ఏర్పడ్డాయి. వాటిలో కూడా ఇటువంటి సంబంధాలే వుండివుంటాయి. అయితే ఆ గుంపులు అంతకంతకు పరిమితమయి పోతూ వచ్చాయి. జంటపెళ్ళిళ్ళలో తల్లులే తమ బిడ్డలకు సంబంధాలు కుదిర్చేవారు. ఆ యువదంపతులకు తమ గణంలోనూ, తెగలోనూ బలీయమైన స్థానం ఏర్పడేటట్లు చూసి ఈ సంబంధాలు కుదిర్చేవారు. క్రమంగా సార్వజనిక ఆస్తికన్న వ్యక్తి ఆస్తికి ప్రాముఖ్యం వచ్చింది. తన బిడ్డలకే ఆస్తి సంక్రమింప చెయ్యాలనే ఆదుర్దా కలిగింది. తండ్రిహక్కు, దంపతీ వివాహం ప్రాముఖ్యానికి వచ్చాయి. అప్పుడింక పెళ్ళి ఇంకా యెక్కువగా ఆర్థిక విషయాలమీదనే ఆధారపడి జరిగేది. శుల్కం ఇచ్చి కన్యను కొనుక్కొనే పద్ధతి అంతరించింది. పిల్లవాడికి కూడా విలువ వచ్చింది. ఆ విలువ అతని గుణగణాలకు కాదు. అతనికున్న ఆస్తినిపట్టి ఆ విలువ. వధూవరుల మధ్య పరస్పర ప్రేమే వారి వివాహానికి మూలం కావాలనీ, మిగిలిన ఆలోచనలన్నీ దాని వెనుకనే ననీ పాలకవర్గాలు ఎన్నడూ వూహించికూడా వుండరు. అటువంటి దెక్కడన్నా జరిగిందంటే ఏ పుస్తకాలలోని కథలో అయివుండాలి, లేకుంటే సంఘంలోనివాళ్లుగా పరిగణనచేయబడని పీడిత ప్రజలలో జరిగివుండాలి.

కొత్త భూఖండాలు కనిపెట్టబడినాక పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ప్రపంచవ్యాపారం వస్తూత్పత్తిద్వారా ప్రపంచఆధిపత్యం సంపాదించే టందుకు ప్రయత్నాలు ఆరంభించిన నాటి పరిస్థితులివి. ఆ పరిస్థితులకు ఈ మాదిరి వివాహపద్ధతే సరియైనదని ఎవ్వరేనా అనుకొంటారు. అదే సరియైనదికూడా. చరిత్రగతియొక్క అంతర్యాన్ని వూహించడం సులభం కాదు. పెట్టుబడిదారీ వుత్పత్తి విధానమే ఆ వివాహపద్ధతిని విచ్ఛిన్నం చేయవలసి వచ్చింది. అదీ చిత్రం. ఆ ఉత్పత్తి విధానం ప్రతిఒక్క దానినీ వర్తకపు సరుకు (Commodity) గా మార్చేసింది. ఆ విధంగా అనుశ్రుతంగా వస్తున్న ఆచారాలను, చారిత్రకంగా లభించిన హక్కులను, ప్రాచీన సంప్రదాయాలను తుడిచేసింది. వానిస్థానే కొనుబడి అమ్మకాలనూ. 'స్వేచ్ఛా' యుతమైన ఒప్పందాన్నీ తెచ్చిపెట్టింది. ప్రాచీన కాలంతో పోల్చిచూస్తే మనం చాలా పురోగమించామనీ, వారసత్వంగా వచ్చిన సంబంధాల స్థానే ఇచ్ఛా పూర్వకంగా ఒప్పందాలు కుదుర్చుకొనే దశకు—వచ్చామనీ హెచ్. ఎస్. మెయిన్ అనే బ్రిటిష్ న్యాయశాస్త్ర వేత్త వ్రాస్తున్నాడు. ఆ విషయాన్ని తానేదో గొప్పగా కనుక్కొన్నట్లు ఆయన అనుకొంటున్నాడు. దానిలో ఆ విషయాలన్నీ నిజం వున్నంత వరకు మేము 'కమ్యూనిస్టు ప్రణాళిక'లో ఏనాడో వ్రాశాం.

ఒప్పందాలు కుదుర్చుకోవాలంటే వ్యక్తులు యథేష్టంగా తమరిని, తమ కార్యాల్ని, తమ ఆస్తిని వినియోగించుకోగల స్థితి వుండాలి. ఒకరి నొకరు సమానమయిన షరతులతో కలుసుకోగలగాలి. 'స్వతంత్రులూ,' 'సమానులూ' అయిన వ్యక్తుల్ని సృష్టించడం పెట్టుబడిదారీ వుత్పత్తి విధానంయొక్క ప్రధాన లక్షణాలలో ఒకటి. ప్రారంభంలో ఈపనిఅంత చైతన్యంతో నిర్వహించబడలేదు. పైగా దానికి మతం ముసుగు కూడా వుండేది. కాని. లూథరన్. కాల్వినిస్టు సంస్కరణలు వచ్చాక సంపూర్ణ స్వేచ్ఛతో, మనస్ఫూర్తిగా చేసిన పనులకే మనుష్యుడు బాధ్యుడనే సిద్ధాంతం అమలులోనికి వచ్చింది. అవినీతి కార్యాలు చేయవలసిందిగా తెచ్చే ఒత్తిడిని ప్రతిఘటించడం నైతిక విధి అన్నారు. ఇంతవరకూ అమలులో వున్న వివాహపద్ధతులకు దీనిని సరిపుచ్చడం ఎల్లాగ ?

బూర్జువావర్గంయొక్క అభిప్రాయానుసారం పెళ్ళి అనేది ఒక ఒప్పందం. ఒక చట్టబద్ధం అయిన వ్యవహారం. ఇద్దరు వ్యక్తులను శారీరకంగానూ, మానసికంగానూ జీవితాంతంవరకూ బంధించి వుంచే వ్యవహారం గనక అది చాల ప్రధానమైనది. స్థూలంగా చూస్తే ఐచ్ఛికంగానే ఈ ఒప్పందం చేసుకొంటున్నారన్నది నిజం. ఉభయుల అంగీకారం తీసుకొనే వివాహం జరుగుతూంది. కాని, ఆ అంగీకారం ఎల్లా సంపాదించారు? దాని నెవరు కుదిర్చారు అన్నదందరికీ తెలుసు. ఇతర ఒప్పందాలన్నింటికీ నిజమైన స్వేచ్ఛ వుండాలన్నప్పుడు దీనికిమాత్రం వుండొద్దూ? దంపతులు కాబోతున్న యువతీయువకులు తమరిసీ,తమ శరీరాలనూ.శరీరాంగాలనూ ఇష్టాపూర్తిగా సమర్పించుకొనేటందుకు అధికారం వుండొద్దూ? వీరధర్మం (Chivalry) స్త్రీ పురుష ప్రేమను ఒక ఆదర్శంగా తెచ్చింది. కాని, ఆ వీరపురుషులప్రేమ అన్యకాంతాసక్తం. అలాగాకుండా భార్యాభర్తలమధ్య ప్రేమవుండడం బూర్జువా సమాజంలో ఆదర్శం వివాహితులు ఒకరినొకరు ప్రేమించుకోవడం ధర్మం అయినప్పుడు ప్రేమించుకొన్నవారే పెళ్ళిచేసుకోడం, ప్రేమలేనిచోట పెళ్ళిచేసుకోకుండా ఉండడం మాత్రం ధర్మంకాదూ? తల్లిదండ్రుల, బంధువుల, సంధానకర్తల హక్కులకన్న ప్రేమించుకొన్నవారి హక్కు ఎక్కువదిగదా? స్వాతంత్రంగాపరిశీలించి నిర్ణయించుకొనేహక్కు మతానికీ,చర్చికీ కూడ వర్తించేటప్పుడు యువతరం వారి శరీరాలను ఆత్మలను, ఆస్తిపాస్తులను సుఖదుఃఖాలను పెద్దలే నిర్ణయించాలనే దుష్ప్రాధికారాన్ని సహిస్తారా?

అనుశ్రుతంగా వస్తున్న అభిప్రాయాలు మూలమట్టంగా కదిలిపోయి, ప్రాచీన సామాజిక బంధాలు శిథిలం అయిపోతున్న కాలంలో ఈ ప్రశ్నలు రాక మానవు. ఉన్నట్లుండి ప్రపంచం పదిరెట్లు పెరిగిపోయింది. ఒక అర్ధగోళంలో నాలుగోవంతును మాత్రమే ఎరిగిన పశ్చిమ యూరపు వాసులకు ఒక్కమారు భూగోళమంతా కళ్ళయెదుట కనబడింది. వెంటనే వారా మిగిలిన ఏడు భాగాలనూ స్వాధీనం లోకి తెచ్చుకోడానికై కదిలారు. వారి జన్మభూముల పాతకాలపు, ఇరుకు సరిహద్దులు అదృశ్యమైనట్లే మధ్య యుగాల ఆలోచనా విధానాలు నిర్మించిన వేల సంవత్సరాల

నిషేధాలు కూడా శిధిలమై పోయాయి. మానవుని బహిరంతర్దృష్టుల ముందు అనంతవిశాలదిగంతాలు పరుచుకొన్నాయి. భారత దేశపుసంపదలూ, మెక్సికో, పోటోసీ*ల బంగారపు గనులూ, ఎదుట కళ్ళు కుడుతూ వుండగా గౌరవ మర్యాదలు, వృత్తి కట్టుబాట్లు గురించి పట్టించుకొనే పచుచువాడుంటాడా? బూర్జువా వర్గానికిది వీరయుగం. వాళ్ళ శృంగారం ప్రేమగాధలూ వారి కున్నాయి. కాని, అవన్నీ బూర్జువా పునాదులమీద నిర్మింపబడ్డవే. అంత్య పరిశీలనలో బూర్జువా ఆశయాలలో సాగేవే.

ముఖ్యంగా ప్రొటెస్టాంటు దేశాలలో అంతవరకూ అమలులోవున్న సామాజిక పరిస్థితులు పూర్తిగా కదిలిపోయినాయి. ఆ దేశాలలో బూర్జువా వర్గం వృద్ధిపొందుతూంది. వారు పైనచెప్పిన విధంగా వివాహ ఒప్పందం స్వేచ్ఛాయుతంగా జరగాలనే దానినంతకంత కధికంగా గుర్తించారు.

వివాహం ఒకే వర్గం వారిమధ్య జరుగుతూంది, తమ వర్గానికి సంబంధించిన వారిలోనే తమకు నచ్చిన వారిని ఎంచుకునేటందుకు కొంత వరకు స్వేచ్ఛ ఇస్తున్నారు. పరస్పర ప్రేమలేకుండా, స్వేచ్ఛాయుతమైన అంగీకారంలేకుండా జరిగే పెళ్ళి నీతి దూరమని కాగితాలమీద అంగీకరించారు. పద్యాలలో పాడారు. నైతికసూత్రంగా ఒప్పుకున్నారు. క్లుప్తంగా చెప్పాలంటే, ప్రేమించి వివాహం చేసుకోవడం మానవుని హక్కు అన్నారు. మానవుని హక్కు అన్నప్పుడొక్క మగవాడిదే కాదు. స్త్రీకి కూడా యీ హక్కు నంగీకరించారు. కాని, ఇతర మానవహక్కులకూ, దీనికీ ఒక్క విషయంలో తేడావుంది. ఆ ఇతర హక్కులు ఒక్క బూర్జువా వర్గానికే (పాలకులు) వర్తించుతాయి. ప్రొలిటారియటు (పీడిత, శ్రామికవర్గం) కవి వర్తించవు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వారికి అవి నిరాకరించబడుతున్నాయి. ఈ హక్కు విషయంలో కూడా చరిత్ర తన విభ్రమ విలాసాల్ని ప్రకటించింది. పరిచితమైన ఆర్థిక పరిస్థితుల ప్రభావంతోనే పనులు జరిగిపోతున్నాయి. అందుచేత వారిలో

* పోటోసీ. ఖనిజ సంపద అశేషంగావున్న ఒక రాష్ట్రం. బ్రెజిల్ లోనిది.

ఇష్టాపూర్తిగా జరిగిన వివాహాలు అరుదుగానే కనిపిస్తాయి. కాని, పాలిత ప్రజలలో ఈ వివాహాలు సర్వసాధారణం.

దీనివలన తేలుతున్నదేమిటి ? వివాహంలో పూర్తియైన స్వేచ్ఛ వుండాలంటే పెట్టుబడిదారీ విధానమూ, వుత్పత్తి విధానమూ, దాని ఫలితంగా ఏర్పడిన ఆస్తి సంబంధాలూ రద్దయిపోవాలి. అప్పుడే భార్యాభర్తల ఎన్నికలో ఆర్థిక విషయాలకు ప్రాముఖ్యం ఇవ్వడం తొలగుతుంది. అప్పుడు పరస్పరాకర్షణ తప్ప వివాహానికి మరోకారణం వుండదు.

స్త్రీ పురుషప్రేమ సహజంగానే బహుత్వ నిషేధకం. ఈ నిషేధం ఈనాడు ఒక్క స్త్రీ విషయంలోనే వర్తింప చేస్తున్నారు. అందుచేతనే స్త్రీ పురుషప్రేమమీద ఆధారపడి జరిగే వివాహం చంపతీ వివాహంగా వుంటుంది. గుంపు పెళ్ళిళ్ళనుంచి జంటవివాహంలోకి మార్పు తీసుకువచ్చినది ముఖ్యంగా స్త్రీయేనని బాకోఫెన్ చెప్పినది సత్యమని పైన తెలుసుకొన్నాం. జంట పెళ్లినుంచి దంపతీ వివాహంలోకి మార్పు తెచ్చినది మగవాడు. చారిత్రకంగా చూస్తే ఈ మార్పును తీసుకు రావడం వలన కలిగిన ముఖ్యమైన ఫలితం స్త్రీ అధమస్థితికి రావడమూ, మగవాని యధేచ్ఛా సంచారానికి అవకాశం లభించడమూను. తమ బ్రతుకుతెరువు కోసమూ, బిడ్డల భవిష్యత్తును చూసీ స్త్రీలు మగవానిలో సర్వసాధారణంగా కనిపించే వ్యభిచారగుణాన్ని సరిపుచ్చు కొంటున్నారు. ఆర్థిక విషయాల్ని ఆలోచించవలసిన అగత్యం పోయి స్త్రీ పురుషుల మధ్య సమానత్వం ఏర్పడినప్పుడు జరిగేది – స్త్రీలు బహుభర్తృకలు కావడం కాదు. పురుషులు నిజంగా ఏకపత్నీ వ్రతులవుతారు. గతకాలపు అనుభవంవలన తెలుస్తున్న దది.

ఆస్తి సంబంధాలఫలితంగా వచ్చివుండటంచేత దంపతీవివాహంలో అనేక లక్షణాలు ప్రత్యక్షమైనాయి. ఒకటి మగవాని పెత్తనం. రెండోది వివాహం రద్దుచేయడానికి వీలులేక పోవడం. నూతనదశలో ఈ లక్షణాలు అదృశ్యమై పోతాయి. వివాహంలో మగవాని ఆధిక్యత ఆర్థికంగా ఆతనికున్న పెద్దరికానికి ఫలితమే. ఆ పెద్దరికంతో పాటు ఆధిక్యమూ

రద్దవుతుంది. వివాహ విచ్ఛేదానికి అవకాశం లేకపోవడం రెండు కారణాల వలన తటస్థ పడింది. ఒకటి దంపతీ వివాహానికి మూలం అయిన ఆర్థిక పరిస్థితులు, రెండోది ఆ ఆర్థిక పరిస్థితులకూ, దంపతీ వివాహానికీ గల సంబంధాన్ని సరిగ్గా అర్థంచేసుకోక మతం దంపతీ స్థితికి యివ్వవలసిన దానికంటే అధిక ప్రాముఖ్యం యిచ్చింది. అప్పటినుంచీ అదే ఆచారంగావచ్చేసింది. ఈ నాడు దీనికి సహస్రఛిద్రాలు ఏర్పడ్డాయి. ప్రేమ గలప్పుడే వివాహం జరగడం నీతి అయితే, ప్రేమ వున్నంతకాలమే వివాహబంధం వుండాలనడంనీతికదా! వ్యక్తులమధ్య ఏర్పడే స్త్రీ-పురుష ప్రేమకు కాలవ్యవధి ఆయా వ్యక్తులలో - ముఖ్యంగా మగవారిలో- చాల భిన్నంగా వుంటుంది. ప్రేమ అంతరించాక మరియొకరి మీద ప్రేమ ఏర్పడ్డాక ఆ యిద్దరూ విడిపోవడం వారికీ, సంఘానికీ కూడ క్షేమం. అనవసరంగా విడాకుల కేసుల ఊబిలోపడి గిలజుకోవలసిన బాధ అప్పుడు తప్పుతుంది.

కాబట్టి పెట్టుబడిదారీ వుత్పత్తివిధానం రద్దయాక దాంపత్య సంబంధాలు ఏలావుంటాయనేదానికి బదులు ఏమేమివుండవో మాత్రమే ప్రస్తుతం చెప్పగలుగుతాం. కొత్తగా వచ్చేది దేమిటి? నూతనతరం బయలుదేరినప్పుడు వారే దానికి సమాధానం చెప్పగలుగుతారు. ధనంతోగాని, సామాజికాధికారంతోగాని ఆడుదానిని స్వాధీనపరచుకోవడం మగవాడు ఎరగనప్పుడు, నిజమైన ప్రేమలో తప్ప ఆడుది మగవానిచెంత చేరవలసిన అవసరం లేనప్పుడు, ఆర్థికావసరాలకొద్దీ ప్రేమికులు కలియలేని పరిస్థితులు తొలగినప్పుడు-దానికి సమాధానం దొరుకుతుంది. ఆ మాదిరి జనం పుట్టాక, ఈనాడు మనం ఇచ్చే సలహాలకి వారు చిల్లిగవ్వ విలువ కూడా ఇవ్వరు. తమ అలవాట్లని తామే నిర్ణయించుకొంటారు. వ్యక్తుల ఆచరణకు అనుకూలంగా జనాభిప్రాయాన్ని తామే సృష్టించుకొంటారు.

మోర్గన్‌నువదలి మనం చాలా దూరం వచ్చేశాం. నాగరికయుగం నాటి సామాజిక రూపాల పరిశోధన ఆయన పుస్తకంలో లేదు. అది దాని పరిధిలోదీ కాదు. అందుచేత ఆయన దానిలో దంపతీ వ్యవస్థయొక్క ప్రస్తుత స్థితిని సంగ్రహంగా చెప్పిపూరుకొన్నారు. దంపతీ వ్యవస్థ

సామాజిక పురోగమన ఫలితమేనని ఆయన వొప్పుకొన్నారు. దీనిలో ఇంచుమించు స్త్రీ పురుషులమధ్య పూర్తి సమానత ఏర్పడుతుం దన్నారు. ఆ సమానత ఇంతవరకూ ఏర్పడలేదనే అన్నారు.

"కుటుంబం అనేది నాల్గు దశలు గడిచి అయిదో దశలో వుందని మనం ఒప్పుకుంటే, ఈ దశ మాత్రం స్థిరమాయనే ప్రశ్న వస్తుంది. దాని కొక్కటే సమాధానం. గతంలోలాగానే భవిష్యత్తులోకూడ సమాజంలో మార్పువచ్చినప్పుడల్లా దానితోపాటు అదీ మారుతుంది. దానిని సామాజిక వ్యవస్థ సృష్టించింది. కనక సామాజిక సంస్కృతి దానిలో ప్రతిబింబిస్తూం టుంది. నాగరికయుగం వచ్చాక దంపతీ వ్యవస్థలో ఎంతో మార్పు వచ్చింది. ఈ మధ్యనీమధ్య చాల ముఖ్యమైన అభివృద్ధివచ్చింది. దీనిని పట్టి స్త్రీ పురుషులమధ్య సమానత్వం సాధించబడేంతవరకూ దానిలో ఇంకా మార్పులువచ్చే అవకాశం వుందనుకోవచ్చు. సుదూరభవిష్యత్తులో దంపతీ వివాహం సామాజికావసరాలకు సరిపడకపోవచ్చు .... దాని తర్వాత ఏ వ్యవస్థ వస్తుందో జోస్యం చెప్పడం అసాధ్యం."*

---

* మోర్గన్ - ప్రాచీన సమాజం. పుట 499

# 3

# ఇరాక్వ్యా గణాలు

ప్రస్తుతం మనం మోర్గన్ కనిపెట్టిన మరో విషయానికి వద్దాం. రక్తసంబంధాలను పట్టి కుటుంబంయొక్క ఆదిమ రూపాల్ని నిర్ధారణ చేయడమంత ముఖ్యమైనదే ఇదీను. గ్రీకులలోని గెనేలు, రోమనులలో గెంటెస్ అనబడేవి, అమెరికన్ ఇండియన్లలో జంతువులపేర్లతో పిలవబడే రక్తసంబంధీకుల సంస్థలు ఒకటేనవి ఆయన స్పష్టపరిచాడు. అమెరికాలోని వ్యవస్థ గణంయొక్క ప్రాథమిక రూపంఅనీ, గ్రీకులదీ, రోమనులదీ అటుతర్వాతి రూపాలనీ చూపించాడు. ప్రాచీనకాలంలో గ్రీకుల్లోనూ, రోమనులలోనూ కనిపించే సామాజికవ్యవస్థ అంతా సోదరకూటాల తెగల గణాలరూపం ధరించింది. అలాంటి వ్యవస్థే అమెరికను ఇండియనులలో కూడా కనబడుతోందని నిరూపించాడు. ఈనాటివరకు మనవద్దనున్న సమాచారాన్ని పట్టి నాగరిక దశకు చేరుతున్న అనాగరిక తెగలందరిలో గణసంస్థ వున్నదని చూపించాడు. దీనితో - ప్రాచీన కాలపు గ్రీసు - రోములచరిత్రలలో ఇంతవరకు కొరకబడకుండా వున్న భాగాలు ఒక్కమాటు స్పష్టం అయాయి. అదే సమయంలో రాజ్యాంగం అనేది ఏర్పడక పూర్వం ఆనాటి సామాజిక వ్యవస్థలోవున్న ప్రధాన లక్షణాలన్నీ దానిలో తలవనితలంపుగా స్పష్టంగా కనిపించాయి. చూస్తే అదంతా అతి సాధారణమైన విషయంగా కనిపిస్తుంది. కాని, ఈమధ్యనీమధ్యనే మోర్గన్ దానిని కనిపెట్టాడు. అంతకు పూర్వం

1869 లో ప్రచురింపబడిన పుస్తకం వ్రాసేనాటికి * ఆయన ఇంకా ఆ రహస్యాన్ని గ్రహించలేదు. మామూలుగా ఎంతో గర్వంగా, సర్వజ్ఞులమనుకొంటూండే ఆంగ్లేయ ప్రాచీన చరిత్ర పండితులు మోర్గన్ ఈ రహస్యాన్ని బయటపెట్టాక, కొంతకాలంపాటు బెల్లంకొట్టిన రాళ్ళల్లాగ చల్లగా వూరుకున్నారు.

అమెరికన్ ఇండియన్ తెగలలోని ఈ రక్త సంబంధీకుల గుంపును మోర్గన్ 'గెన్స్' అనే లాటిన్‌పేరుతో పిలిచేడు. ఈ 'గెన్స్' అనే మాటా, అదే అర్థం ఇచ్చే గెనోస్ అనే గ్రీకు మాటా ఆర్యనుల 'గణ' అనే మాటలోంచి పుట్టాయి. [ఆర్యను భాషలోని 'గ' జర్మన్‌లో 'క' గా మారుతుంది అని ఒక సూత్రంవుంది.* ఆ విధంగా 'గ' 'క' గా మారి గణ అనేది జర్మనులలో కణ్ అయింది] ఆర్యనులలోని గణ అనే మాటకు 'కను' అని అర్థం. గెన్స్, గెనోసీలు, సంస్కృతంలోని 'జనః', గోథిక్ భాషలలోని 'కుని' (పైన చెప్పినసూత్రం ప్రకారం), ప్రాచీనకాలంనాటి నార్డిక్ తెగలలోనూ, ఆంగ్లో - శాగ్జన్ తెగలలోనూ వున్న 'కిన్', ఇంగ్లీషువాళ్ళ 'కిన్', మధ్య జర్మనీలోని పీఠభూములలోని ప్రజలు వాడే కున్నే ఇవన్నీ ఒకే మాటలోంచి వచ్చాయి. ఇవన్నీ జిమ్మా (clan) అనే అర్థం ఇచ్చే మాటలే. ఒకే వంశకర్తనుంచి వచ్చేమని చెప్పుకునే రక్తసంబంధీకుల గుంపులకే గెన్స్ అని లాటిన్‌లోనూ, గెనోస్ అని గ్రీకులలోనూ వుపయోగించబడింది.

ఈ గెన్స్, గెనోస్‌లు ఒక మూలపురుషుడినుంచి వచ్చినవి. ఏవో కొన్ని సామాజికమైన మతసంబంధమైన వ్యవస్థలద్వారా ఇవి

---

* Systems of Consanguinity and Affinity of the Human Family (1859) అనే పుస్తకం గురించిన ఉదాహరణ; స్మిత్సోనియన్ ప్రచురణలు, సం 17 ... సంపా.

* ఇండో - యూరపియను భాషలలో హల్లుల మార్పులకు సంబంధించిన గ్రిమ్ సూత్రాన్ని ఇక్కడ ఏంగెల్సు వుద్దేశించేడు ... సంపా.

ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రత్యేక జిమ్మాగా ఏర్పడతాయి. ఈ జిమ్మాలు ఏమిటో, వాని మూలం ఏమిటో ఈ మధ్యవరకూ మన చరిత్రకారులకు అగమ్యగోచరంగా వుండిపోయింది.

వెనకటి ప్రకరణంలో ప్యునలాన్ కుటుంబాన్నిగురించి చెప్పి నప్పుడు, మొట్టమొదట గణం (గెన్స్) ఎలా ఏర్పడిందో తెలుసు కున్నాం. ప్యునలాన్ వివాహపద్ధతి కారణంగా, ఆ దశలో వుండే అభిప్రాయాల ప్రకారం పూర్వీకురాలు ఒకామె వంశకర్తగా గుర్తించ బడుతుంది. ఆమెయొక్క వంశీకులు 'గణం'గా ఏర్పడతారు. ఈమాదిరి కుటుంబ వ్యవస్థలో పిల్లలతండ్రి ఎవరో చెప్పడం సాధ్యంకాదు.. గనక ఈ గణాలలో స్త్రీలవేపునుంచే వంశపారంపర్యం గుర్తించబడుతుంది. మగవాళ్లు-సోదరులు, తమ సోదరీలనే పెళ్ళాడడం వుండదు - మరొక వంశంలోని వాళ్ళనే పెళ్ళాడుతారు. తల్లి పరంపరప్రకారం ఆ స్త్రీలకు పుట్టిన సంతానం తండ్రుల గణాలలోకి రాలేరు. అందుచేత ప్రతితరం లోనూ కూతుళ్ళ సంతానం మాత్రమే గణంలో వుంటారు. కొడుకులకు పుట్టినవాళ్ళు వాళ్ళ తల్లులగణంలోకి పోతారు. ఈ విధంగా రక్త సంబంధీకులంతా ఒక ప్రత్యేకమైన గుంపుగా ఏర్పడ్డాక, (తెగలో ఇదే మాదిరిగా అనేక గుంపులు ఏర్పడతాయి) ఏమవుతుంది?

ఇరాక్వ్యాలలో, ముఖ్యంగా సెనెకా తెగలోవున్న గణాల(గెన్స్)ను మోర్గన్ మొట్టమొదటి ప్రామాణిక రూపంగా తీసుకున్నాడు. సెనెకా తెగలో ఎనిమిది గణాలు వున్నాయి. వాటిలో ఒక్కొక్కటి ఒక్కొక్క జంతువు పేరుతో పిలవబడుతుంది. (1) తోడేలు, (2) ఎలుగు, (3) గువ్వ, (4) బీవర్, (5) దుప్పి, (6) సీటికాకి, (7) కొంగ, (8) డేగ— ప్రతి గణంలోనూ ఈ క్రింది అలవాట్లు వుండేవి:

1. గణం సాకెమ్‌నూ (శాంతికాలంలో పెద్ద), నాయకుణ్ణీ (యుద్ధ రంగంలో సేనాధిపతి) ఎన్నుకొంటుంది. సాకెమ్‌ను గణసభ్యులలోంచే ఎన్నుకోవాలి. ఆ వుద్యోగం వంశపారంపర్యంగా సంక్రమిస్తుంది. అంటే దాని వుద్దేశం, ఆపదవి ఖాళీకాగానే వెంటనే భర్తీచేయాలనే. అంతవరకూ సాకెమ్‌గావున్న అతని కొడుక్కు ఆ అధికారం లభించదు. ఏమంటే

ఇరాక్వ్యాలలో తల్లిపరంపరే అమలులోవుంది. అందుచేత అతని కొడుకు మరో గణానికి సంబంధించినవాడవుతాడు. సాధారణంగా పూర్వపు సాకెమ్ తమ్ముణ్ణో, మేనల్లుణ్ణో యెన్నుకొంటారు. ఎన్నికప్పుడు అందరూ - స్త్రీలూ, పురుషులూ కూడ - వోటుచేస్తారు. అయితే ఆ ఎన్నికను మిగిలిన ఏడుగణాలూ ధృవపరచాలి. అటుతర్వాత ఎన్నుకోబడిన వ్యక్తిని ఆ వుద్యోగంలో స్థిరపరచడం తంతు జరిగిస్తారు. ఈ తంతు జరపడానికి యావత్తు ఇరాక్వ్యా సమాఖ్యకూ సంబంధించిన జనరల్ కౌన్సిలు సమావేశమవుతుంది దీని వుద్దేశం ఏమిటో తర్వాత వ్రాస్తాను. గణంలోపల సాకెమ్ సోదరభావంతో కూడిన అధికారాన్ని మాత్రమే నిర్వహిస్తాడు. అది కేవలం నైతికాధికారం. తన పెద్దరికాన్ని అమలు జరిపేటందుకు ఆయనవద్ద బలగం వుండదు. గణం పెద్దగా ఆయన సెనెకాతెగ కౌన్సిల్‌లోనూ, ఇరాక్వ్యా సమాఖ్య కౌన్సిల్‌లోనూ సభ్యుడు అవుతాడు. సైనికవ్యవహారాలలో మాత్రమే యుద్ధనాయకుడికి సంబంధం వుంటుంది.

2. గణం తనకు ఇష్టం లేకంటే సాకెమ్‌నూ, యుద్ధనాయకుణ్ణి కూడ తొలగించ వచ్చును. ఈ తొలగింపు కార్యక్రమాన్ని కూడా గణంలోని స్త్రీ పురుషులంతా కలిసే చేస్తారు. ఉద్యోగంనుంచి తొలగించబడినవారు మిగిలినవారందరిలాగే సామాన్య వ్యక్తులూ, సాధారణ యోధులుగా పరిగణించబడతారు. గణంయొక్క ఇష్టానికి వ్యతిరేకంగా తెగకౌన్సిలు సాకెమ్‌లను వారి పదవులనుంచి తొలగించవచ్చును.

3. గణసభ్యులు ఎవ్వరూ గణంలోనివాళ్ళని పెళ్ళి చేసుకోకూడదు. గణం యొక్క మూలసూత్రం ఇదే. దానిని కలిపి వుంచుతున్న సూత్రం యిదే. రక్త సంబంధం కలిసిన వ్యక్తులే గణంలో వుంటారనే అభిప్రాయాన్ని ఈ సూత్రం రెండో కొసనుంచి వ్యక్తీకరిస్తుంది. అతి సామాన్యమైన ఈ చిన్న విషయాన్ని బయటకు తెచ్చి, మోర్గన్ గణంయొక్క స్వభావాన్ని స్పష్టపరిచాడు. ఇంత క్రితం ఈ విషయం తెలియదు. ఆటవికుల్నీ, అనాగరికుల్నీ గురించిన వార్తలలో వారి గణ వ్యవస్థకు సంబంధించిన వివిధ సంస్థ లన్నింటికీ

వుండే తేడాలను ఎరగక తెగ, కులం, ఫమ్ మొదలయిన పేర్లను అన్నింటినీ ఒకే విధంగా వాడిన పద్ధతి చూస్తే ఇది రుజువు అవుతుంది. ఈ సంస్థ లన్నింటి మధ్యా వివాహ సంబంధాలు నిషిద్ధం అని చెప్పిన పట్టాలు కూడా వున్నాయి. వీటన్నింటి ఫలితంగా ఎంతో గంద్రగోళం ఏర్పడింది. మధ్యలో మా క్లెన్నాన్ అవతరించి అంతిమ నిర్ణయాలు ఇచ్చేశాడు. అంతర్వివాహాన్ని అంగీకరించినవీ, అంగీకరించనివీగా తెగ లన్నీ విభజించాడు. ఆ విభజన నిర్ణయించేశాక వాటిలో ఏది ఆదిమం, ఏది తర్వాతది - అని అర్థంలేని పరిశీలన ప్రారంభించాడు. రక్త సం బంధీకులలో గణాలు ఏర్పడ్డాయనీ, గణ సభ్యుల మధ్య వివాహం నిషిద్ధమనీ బయల్పడ్డాక గాని ఈ గొడవ అణగలేదు. మనకు ఇరాక్యూలు కనబడిన నాటి కప్పుడే వారి గణాలలో అంతర్వివాహం ఖచ్చితంగా నిషేధించబడింది.

4. మరణించిన వ్యక్తుల ఆస్తిని గణంలో మిగిలినవారు పంచుకునే వారు - అది గణంలోనే వుండిపోవాలి. ఇరాక్యూలకు వున్న ఆస్తి స్వల్పమే. గనుక వ్యక్తి వదలిపోయిన వారసత్వ ఆస్తిని గణంలోని అతని దగ్గర బంధువులకు పంచేవారు. అందువల్ల ఒకమగవాడు చని పోతే అతడి సహజ సోదరులు, సోదరీలు, అతడి మేనమామ అతని ఆస్తిని తీసుకొనేవారు. ఒకస్త్రీ చనిపోతే ఆమె బిడ్డలు, సహజ సోద రీలు ఆమెఆస్తిని తీసుకునేవారు. అంతేగాని ఆమెసోదరులకు దానిని తీసు కునే హక్కుండేదికాదు. ఇందువల్ల ఒకవిషయం బోధపడుతుంది. భార్యా భర్తలు ఒకరి ఆస్తికి మరొకరు వారసత్వం వహించరు. అలాగే తండ్రి ఆస్తికి బిడ్డలువారసత్వం వహించరు.

5. గణంలో సభ్యులు పరస్పర సహాయం యిచ్చుకోవాలి: ముఖ్యంగా యితరులవల్ల తమవారికి జరిగిన అక్రమాలకు ప్రతీకారం చేయడంలో సహాయం చేయాలి. వ్యక్తి తనరక్షణకు గణంమీద ఆధార పడేవాడు, ఆధారపడగలిగేవాడు. ఎవరైనా అతడిని గాయపరిస్తే, గణాన్ని గాయపరచినట్లే ఎంచుకునేవారు. దీనినిబట్టి - గణసభ్యులమధ్య రక్త సంబంధాలు వున్నాయనీ - రక్తానికి రక్తం ప్రతీకారం తీర్చుకోవాలనే

సంప్రదాయాన్ని బేషరతుగా ఇరాక్వాయిలు గుర్తించేవారని ద్యోతకమవుతుంది. గణసభ్యుని ఇతరులెవరైనా చంపితే. మరణించిన వ్యక్తికి సంబంధించిన గణం అంతా రక్తప్రతీకారం తీర్చుకోవాలనే నిబంధనవుండేది. మొదట మధ్యవర్తిత్వం కొరకు ప్రయత్నం జరిగేది. ముద్దాయికి సంబంధించిన గణం సమావేశమై మరణించిన వ్యక్తికి సంబంధించిన గణానికి కొన్ని సూచనలు చేసేది - సాధారణంగా క్షమాపణతోపాటు కొంత విలువైన బహుమతులను పరిహారమివ్వడానికి సంసిద్ధతను తెలిపేవి. వీటిని అంగీకరించితే తగాదా అంతటితో పరిష్కారమైనట్లుగానే ఎంచబడేది అంగీకారం కుదరనిచో వ్యక్తిని కోల్పోయిన గణం ఒకరినిగాని కొందరు సభ్యులనుగాని కక్ష తీర్చుకునేందుకు నియమించేది. ఖూనీ చేసినవానిని వెంబడించి చంపివేయడం వారి కర్తవ్యం. ఇలా జరిగినపుడు ముద్దాయికి సంబంధించిన గణానికి ఎలాంటి ఆక్షేపణా చేసేహక్కు లేదు. ఆ విషయం అంతటితో సర్దుబాటయినట్లుగానే ఎంచబడేది.

6. గణానికి ప్రత్యేకమైన పేర్లు, లేక పేర్ల జాబితా వుండేది. మొత్తం తెగ అంతటిలో ఆ గణానికి సంబంధించినవారే ఆ పేర్లను ఉపయోగించే హక్కు వుంటుంది. ఇందువల్ల వ్యక్తి పేరునుబట్టి అతడు ఏ గణానికి చెందినవాడో తెలసికోవచ్చు. గణం పేరును కలిగివుండట మంటే దానితోపాటు గణం హక్కులనుకూడ అతడు కలిగివుంటాడు.

7. గణం కొత్తవ్యక్తులను తనలో చేర్చుకోవచ్చు; తద్వారా తెగ మొత్తంలో చేరినట్లుగా ఎంచబడతారు. యుద్ధ ఖైదీలలో చంపగా మిగిలినవారిని చేర్చుకోవడంద్వారా సెనెకా తెగలో వారు సభ్యులయేవారు. తత్ఫలితంగా వారికి గణ హక్కులు, తెగహక్కులుకూడ సంప్రాప్తమయేవి. గణంలోని సభ్యులు కొందరు కోరడంవల్లనే కొత్తవారిని గణంలోకి స్వీకరించేవారు. కొత్తవ్యక్తిని తన సోదరునిగానో, సోదరిగానో స్వీకరించుతానని మగసభ్యుడు కోరతాడు. స్త్రీ అయితే తనబిడ్డగా స్వీకరించుతానని గణాన్ని కోరుతుంది. స్వీకారం ఖాయమవాలంటే సంప్రదాయం ప్రకారం గణసమావేశం ఆమోదముద్ర వేయడం అవ

సరం సభ్యుల సంఖ్య చాలా తగ్గిపోయిన సందర్భాలలో, ఇతర గణాల అనుమతితో వారి సభ్యులను తమలోకి స్వీకరించడం తరచు జరుగుతుంటుంది. ఇరాక్వ్యాలలో గణంలోనికి ఇతరులను స్వీకరించే తంతును తెగకౌన్సిల్ జరిపే బహిరంగసభలో సాగించేవారు : ఆచరణలో యిదొక మతకర్మవలే జరిగేది.

8. ఇండియన్ గణకూటాలలో ప్రత్యేకంగా మతసంబంధమైన కర్మకాండ ఉన్నాయని రుజువుచేయడం చాలాకష్టం — ఐనప్పటికీ ఇండియనులు జరిపే మత కర్మకాండలన్నీ గణాలకు సంబంధించినవే. ఇరాక్వ్యాలలో సంవత్సరానికి ఆరు మతోత్సవాలు జరిగేవి. వాటిలో వివిధ గణాలకు చెందిన సాకెమ్‌లు, యుద్ధనాయకులు అధికారయుతమైన "మత రక్షకులుగా" ఎంచబడేవారు: పురోహితుల బాధ్యతను నెరవేర్చేవారు.

9. గణాలకు ఉమ్మడి శ్మశానంవుండేది. న్యూయార్కు రాష్ట్రంలోని ఇరాక్వ్యాల శ్మశానం, తెల్లవాళ్ల గమనుకు రావడమువల్ల యిపుడు అంతర్ధానమయింది; కాని యిదివరకు వుండేది. ఇతర ఇండియన్ తెగలలో ఉమ్మడి శ్మశానాలు ఇప్పటికీ వున్నాయి : ఉదాహరణకు ఇరాక్వ్యులకు సన్నిహితంగావుండే టస్కారోరాస్ తెగలో ఉన్నాయి. వారిపుడు క్రిస్టియన్లు ఐనప్పటికీ వారిలోని ప్రతిఒకగణానికి గోరీలదొడ్డిలో వేర్వేరు పంక్తులు ప్రత్యేకించబడ్డాయి. బిడ్డల గోరీలున్న పంక్తిలోనే తల్లి గోరీ కూడ ఏర్పాటుచేస్తారు; తండ్రి శవాన్నిమాత్రం ఆ పంక్తిలో పాతిపెట్టరు. ఇరాక్వ్యులలోకూడ గణ సభ్యులందరూ విచారంతో అంత్యక్రియలలో పాల్గొంటారు; గోరీని తయారుచేస్తారు; అంత్యోపన్యాసాలు వగైరా తంతు సాగిస్తారు.

10. గణంలోని యుక్తవయస్కులైన స్త్రీ పురుషులందరికీ సమానహక్కులుంటాయి. వారంతా కలసి గణకౌన్సిల్‌ను (పంచాయతీని) ఎన్నుకుంటారు. సాకెమ్‌ను, యుద్ధనాయకుని ఎన్నుకునేందుకు, పదవులనుంచి తొలగించేందుకు కౌన్సిల్‌కు అధికారముంటుంది. ఇతర మత రక్షకుల విషయంలో కూడ యిదేపద్ధతి అవలంబించబడుతుంది. చంప

బడిన గణసభ్యులకు ప్రతీకారదీక్షను లేక రక్తప్రతీకారాన్ని ఎవరు వహిం చాలో కూడ కౌన్సిలే నిర్ణయించుతుంది. కొత్తవారిని గణంలోనికి స్వీక రించుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే గణంలో సర్వంసహాధికారం కౌన్సిల్ దే.

ఒక ప్రత్యేక ఇండియన్ గణానికి ఈ క్రింది హక్కులున్నాయి. "ఇరాక్వ్యా గణంలోని సభ్యులందరూ వ్యక్తిగతంగా స్వతంత్రులు. ఒండొరుల స్వాతంత్ర్యాన్ని రక్షించే బాధ్యతకూడ వారికి వుంది. సభ్యులందరి వ్యక్తిగత హక్కులు, ప్రయోజనాలు సమానమే. సాకెమ్కు, యుద్ధనాయకునికి వీటి విషయంలో ఆధిక్యత ఏమీలేదు. వారంతా రక్త సంబంధమున్న సోదరబృందం. అలా నిర్వచింపనప్పటికీ స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం గణంలోని సభ్యులందరిని బంధించే సూత్రాలు ...సామాజిక విధానానికి ప్రాథమిక యూనిట్‌గా గణంవుండేది. ఆ పునాదిపైనే ఇండియన్ సమాజమంతా నిర్మింపబడింది..... ఇండి యన్లలో సర్వసాధారణంగా ప్రదర్శితమయ్యే స్వాతంత్ర్యానికి, వ్యక్తి హుందాతనానికి ప్రాతిపదిక ఈ సామాజిక యూనిట్‌లోనే వుంది."

ఉత్తర అమెరికాలోని ఇండియన్లను కనుగొన్న సమయానికి వారందరూ మాతృస్వామిక గణాలలో సంఘటితమై వుండేవారు. డకో టాస్ లాంటి కొన్ని తెగల్లోమాత్రమే గణవ్యవస్థ శిథిలమయింది: ఓజిబ్వా, ఓమహా వగైరా మరికొన్ని తెగలలో జనులు పితృస్వామిక గణాలుగా సంఘటితమయి వుండేవారు.

ఐదు లేక ఆరు గణాలను కలిగివున్న ఇండియన్ తెగలు అనేకం వుండేవి. వీటిలో మూడు, నాలుగు గణాలు ఒక ప్రత్యేకబృందంగా కలసి వుండేవి. ఈ ప్రత్యేక గ్రూపునకువున్న ఇండియన్ పేరును మోర్గన్ జాగ్ర త్తగా గ్రీకుపదం "ఫ్రేట్రీ" (సోదర కూటం) లోనికి అనువదించాడు. ఈ విధంగా సెనెకాతెగలో రెండు కూటాలుండేవి. మొదటివాంట్లో ఒకటి నుంచి నాలుగు గణాల వరకు. రెండోదాంట్లో ఐదునుంచి ఎనిమిదవ గణం వరకు వుండేవి. జాగ్రత్తగా పరిశీలించిన మీదట ఈ కూటాలు ప్రధానంగా – ఆ తెగ ప్రారంభదశలో ఏ యే గణాలలోకి చీలి

పోయిందో - వాటికే ప్రాతినిధ్యం వహించుతూ ఉండేవని బోధ పడుతుంది: ఏమంటే గణాలలో అంతర్వివాహం నిషేధించబడిన తరువాత ప్రతితెగకు - అది స్వతంత్రంగా మనగలగాలంటే - కనీసం రెండు గణాలు అయినా వుండటం అవసరమయింది. తెగ పెరిగేకొలదీ ప్రతి గణం తిరిగి రెండు లేక మూడు గణాలుగా విభజించబడేవి. అలా ఏర్పడినవి యిపుడు వేర్వేరు గణాలుగా వుండగా ప్రారంభదశలో ఒకే గణంలోనుంచి విడిపోయిన వాని నన్నిటినీకలిపి సోదర కూటంగా ఎంచే వారు. సెనెకాస్ తెగలోనూ, ఇతర ఇండియన్ తెగల్లోనూ కూడ, కూటంలోవున్న గణాలు అన్నీసోదర గణాలుగా ఎంచబడేవి:ఇతర కూటా ల్లోవున్న గణాలు కజిన్ (వివాహయోగ్యమైన) గణాలుగా ఎంచబడే వి. అమెరికన్ ఆదిమ సామాజిక విధానంలో ఈ పేర్లు రక్తసంబంధాలను సూచించుతాయని మనకు తెలుసు. వాస్తవానికి ప్రారంభదశలో సెనెకా తెగలో ఒకే కూటంలో అంతర్వివాహాలు నిషేధించ బడ్డాయి: కాని ఈ నిషేధం చాలకాలం క్రిందటనే తొలగిపోయి, కేవలం ఒకేగణం లోని, అంతర్వివాహాలపై నిషేధం మాత్రమే నిలచివుంది. ఎలుగు (బియర్) లేడి (డీర్) పేర్లుకలిగిన గణాలు సెనెకా తెగలో మొట్టమొదట విభజింపబడినవనీ, తక్కినవన్నీ వాటి పునర్విభజనవల్ల ఉత్పన్నమైన గణాలు అనీ సాంప్రదాయంవల్ల తెలుస్తూంది. ఈ కొత్త వ్యవస్థ ఒక సారి గట్టిగా వేళ్లు పాదుకున్న తర్వాత, అవసరాన్ని బట్టి దాన్ని మార్చు కుంటూ వచ్చారు. ఒక కూటంలోని గణాలు చనిపోయినపుడు ఇతర కూటంలోని కొన్ని గణాలను మొత్తంగా దానిలోకి మార్చుకోవడం జరిగేది. వేర్వేరు తెగల్లోని వివిధ కూటాలలో ఒకేపేరుగల గణాలు వుండటానికి యిదే కారణమని బోధపడుతుంది.

ఇరాక్వ్యాలలో సామాజిక, మత బాధ్యతలలో కొంతభాగం కూటా నికి అప్పగించబడింది. (1) బంతిఆటలో రెండు కూటాల మధ్య పోటీ జరిగేది; ప్రతి కూటం తనకున్న మంచి ఆటగాళ్ళను ఎంచుకొనేది: వారు ఆడుతుండగా తక్కినవారంతా ప్రేక్షకులుగా చూసేవారు; తమ తమ పక్షాలు గెలుస్తాయని పందాలు కాచేవారు. (2) తెగకౌన్సిల్

సమావేశంలో ప్రతి తెగకు చెందిన సాకెమ్, యుద్ధ నాయకుడు ఒకేచోట కలసి కూర్చునేవారు; రెండు గ్రూపులు ముఖాముఖి ఎదురుగా కూర్చుని వుండగా ప్రతి ఉపన్యాసకుడు వేర్వేరుగా కూర్చున్న సోదర కూట ప్రతినిధులను ఉద్దేశించి మాట్లాడేవారు. (3) తెగలో ఒక ఖూనీ జరిగి నట్లయితే, ఒకవేళ చనిపోయినవాడు చంపినవాడు ఒకే కూటానికి చెంది వుండకపోతే నష్టపడిన గణం తన సోదర గణానికి విజ్ఞప్తి చేసేది: కూటమి కౌన్సిల్ సమావేశం జరిపి, రెండో కూటానికి సమిష్టిగా విజ్ఞప్తి చేసేది; తగాదాను పరిష్కరించుకోడానికి కౌన్సిల్ సమావేశం పిలువ మని కోరేది. దీన్నిబట్టికూడ కూటమే మొదటి గణంఅనీ, దానిలోనుంచి విడిపోయిన ప్రత్యేక బలహీన గణంకంటే, కూటమే కృషిచేస్తే విజయావకాశం ఎక్కువగావుందనీ బోధపడుతుంది. (4) ప్రముఖవ్యక్తి చనిపోయినపుడు ఆ కూటానికి చెందినవారంతా విచారంలో వుండగా, అంత్యక్రియల ఏర్పాటును రెండో కూటంవారు చేస్తారు. సాకెమ్ చని పోయినట్లయితే ఆ ఖాళీనిగురించి రెండోకూటం ఇరాక్వ్యాల ఫెడరల్ కౌన్సిల్కు తెలియజేస్తుంది. (5) కూటమి కౌన్సిల్ రంగంలోకి వచ్చి సాకెమ్ ఎన్నిక జరిపింపుతుంది. ఈ ఎన్నికను ఆ కూటంలోని సోదర గణాలుకూడ ఆమోదించినట్లే సాధారణంగా ఎంచబడుతుంది; కాని ఇతర కూటానికి చెందిన గణాలు వ్యతిరేకించవచ్చు. అలాంటి సందర్భంలో ఆ కూటమి కౌన్సిల్ సమావేశమై చర్చించాలి; ఒకవేళ అదికూడ వ్యతిరేక తను సమర్థించితే సాకెమ్ ఎన్నిక రద్దవుతుంది. (6) ఇతకుముందు ఇరాక్వ్యాలకు ప్రత్యేక మత క్రియలుండేవి; వాటిని "వైద్య మందిరాలు" అని తెల్లవాళ్ల పిలిచేవారు. సెనేకాతెగలో ప్రతికూటానికి ఒకటిచొప్పున రెండు ప్రత్యేక మతవ్యవస్థలు ఈ తంతును నిర్వహించేవి: కొత్త సభ్యు లను స్వీకరించేటపుడు మంత్రాలను వల్లించేవారు. (7) 1521 లో కోర్ టీస్ మెక్సికోను జయించినపుడు ట్లాక్స్కాలాలో వున్న నాలుగు విభాగా లలో నివసించే నాలుగువంశాలు వాస్తవానికి నాలుగు కూటాలని దాదాపు రుజువయింది; గ్రీకుల్లోనూ, అదేవిధంగా రక్త సంబంధీకులైన జర్మన్ల లోనూవున్న సంప్రదాయాలనుబట్టికూడ ఈకూటాలు మిలిటరీ విభాగాలుగా

కూడ వుండేవని బోధపడుతుంది. ఈ నాలుగు వంశాలు స్వంతనాయకుల ఆధ్వర్యాన వేర్వేరుదుస్తులు, జెండాలతో యుద్ధంలోకి వెళ్ళేవి.

కొన్ని గణాలు కలసి ఒక కూటంమైనట్లే, కొన్ని కూటాలు కలసి ఒక తెగగావుండేవి. దాగా బలహీనబడిన తెగలలో మధ్యనుండే కూటం లోపించిన ఉదాహరణలు చాల వున్నాయి. అమెరికాలోని. ఇండియన్ తెగ ప్రత్యేకతలేమిటి ?

1. స్వంతప్రాంతాన్ని అధీనంలో వుంచుకోవడం, స్వంత పేరును కలిగివుండటం. ప్రతితెగ వాస్తవంగా తాను నివసించుతున్న ప్రాంతంతో పాటు వేటాడేందుకు, చేపలు పట్టేందుకు తగినంత అదనపు ప్రాంతాన్ని కూడ కలిగివుండేది. దీని తరువాత ఈ తెగ అధీనంలోవున్న ప్రాంతానికి మరో తెగకు అధీనంలోవున్న ప్రాంతానికి మధ్య తటస్థప్రాంతముండేది. పరిసరంలోవుండే రెండు తెగలు మాట్లాడే భాషలు దగ్గర సంబంధం కలిగినవిగా వున్నప్పుడు ఈతటస్థప్రాంతం తక్కువ విస్తీర్ణంకలిగివుండేది. భాషలకు సాన్నిహిత్యంలేనపుడు తటస్థప్రాంత విస్తీర్ణంఎక్కువగావుండేది. అలాంటి తటస్థప్రాంతం జర్మన్ తెగలమధ్య సరిహద్దు అడవిగా వుండే సీజర్ సూయిబీ తన అధీనప్రాంతం చుట్టూవదలిన పడావుభూమి కూడ అలాంటి తటస్థ ప్రాంతమే. జర్మనులకు డేన్సుకు మధ్యవుండే ప్రాంతాన్ని (డేనిషు ప్రజలు జారిన్వోడ్ అనీ, జర్మన్లు లైమ్స్ దాని కూస్ అనీ,) ఐసరన్ హోల్డ్ అని పిలిచేవారు. జర్మనులకు స్లావ్ తెగలకు మధ్యవుండే తటస్థప్రాంతాన్ని జర్మనులు 'బ్రానిబోర్' అని పిలచేవారు – దీనినుంచే బ్రాండన్ బర్గ్ అనే పేరు వుత్పన్నమయింది; స్లావొనిక్ జాతులు దీనినే రక్షణ అడవి అని పిలచేవారు. అస్పష్టమైన సరిహద్దుల మధ్యవున్న ప్రాంతాన్ని తెగయొక్క ఉమ్మడి భూమిగా ఎంచేవారు : ఇరుగు పొరుగు తెగలు ఆ విషయాన్ని గుర్తించేవి. పరుల ఆక్రమణనుంచి తెగ తన ప్రాంతాన్ని రక్షించుకునేది చాల సందర్భాలలో సరిహద్దులు అస్పష్టంగా వున్నందున, జనసంఖ్య ఎక్కువగా పెరిగి నపుడు మాత్రమే, ఆచరణలో ఇబ్బంది కలిగేది. తెగలపేర్లు, వుద్దేశ్య పూర్వకంగా ఎంచుకున్నవి కాదనీ, కేవలం యాదాలాపంగా సంభవిల్లి

నవి మాత్రమేననీ అనిపించుతుంది. కాలక్రమేణా కొత్తతెగ ఏర్పడి నపుడు ఇరుగుపొరుగు తెగలు తమ పేర్లలోంచి గాక మరోపేరును కొత్త దానికి సూచించడం సహజంగా తటస్థించేది: ఉదాహరణకు కెల్ట్స్ తెగ తమ పొరుగు తెగకు జర్మన్స్ (జర్మనేన్) అనే చారిత్రకమైన పేరు పెట్టగా, జర్మన్స్ తెగ కొత్తగా ఏర్పడిన తెగకు "డైడూషెన్" అని నామకరణం చేసింది.

2. ఈ తెగకు ప్రత్యేకమైన మాండలికం వుంటుంది; వాస్తవానికి తెగ, మాండలికం దాదాపు ఒకేసారి ఉద్భవించినట్లు కల్పించుతుంది. పాతతెగల పునర్విభజన ద్వారా కొత్తతెగలు, మాండలికాలు ఏర్పడటం అమెరికాలో ఈ మధ్యకాలంవరకు జరుగుతుండేది. ఇప్పటికైనా ఈ పరిణామం ఆగిపోయిందనలేము. బలహీనపడిన రెండు తెగలు ఒకటిగా కలిసిపోయినపుడు – అరుదుగా మాత్రమే యిలా జరుగుతుంది – ఆ తెగలో రెండు సన్నిహితమైన మాండలికాలు కనిపించుతుంటాయి. అమెరికా తెగల సగటు జనాభా రెండు వేలకు లోపుగా వుంటుంది. ఐతే "చెరొకీస్" అను తెగలో దాదాపు ఇరవైఆరువేల జనాభావుంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఒకే మాండలికం మాట్లాడే తెగలన్నిటిలోకి యిదే పెద్దది.

3. గణాలు ఎన్నుకున్న సాకెమ్‌లను, యుద్ధనాయకులను ఖాయ పరచే హక్కు తెగకువుంది.

4. గణం అంగీకరించకపోయినప్పటికి వారినితొలగించే హక్కు కూడ తెగకు వుంటుంది. ఈ సాకెమ్‌లు, యుద్ధనాయకులు తెగ కౌన్సిల్లో సభ్యులుకాబట్టి వీరి ఎన్నికను ఖాయపరచడం, తొలగించడంలో తెగకు వున్న హక్కును అర్థంచేసుకోవడం సులభమే. ఎచటనైనా తెగల సమాఖ్య ఏర్పడితే పై హక్కులు ఆ సమాఖ్యకు దఖలుపడతాయి.

5. ఉమ్మడి పురాణగాథలు (మైథాలజీ) పూజా పునస్కారాలు తెగకు ప్రత్యేకంగా వుంటాయి. "ఆటవిక తెగల ప్రజ లందరివలెనే అమెరికన్ ఇండియన్లుకూడ మతవిశ్వాసం కలవారు"* వారి పురాణాలను

* మోర్గన్ ప్రాచీన సమాజం 117 పేజీ.

యింకా ఎవరూ విమర్శనాత్మకంగా పరిశీలించలేదు. తమ మత విశ్వాసా లన్నిటికీ వారు అప్పటికే రూపాలిచ్చారు.— అనేక రకాల భూతాలను మానవరూపంలో ఊహించుకున్నారు.-కాని అప్పటికింకా వారు ఆటవిక దశ దిగువస్థాయిలో వున్నందున తాము పూజించే దేవతలకు ప్రాతినిధ్యం వహించే ప్రతిమలను-విగ్రహాలను తయారుచేయలేదు. ప్రకృతిని, పంచ భూతాలను పూజించే విధానంనుంచి బహుదేవతల పూజాపద్ధతి పరిణామం చెందుతూంది. వివిధ తెగలకు క్రమబద్ధంగా వచ్చే పండుగల్లో ప్రత్యేక పూజావిధానాలు, ముఖ్యంగా నృత్యాలు, ఆటలు వుంటాయి. అన్ని మత వుత్సవాల్లోనూ నృత్యం తప్పనిసరిగా వుంటుంది. ప్రతి తెగ వాటిని ప్రత్యేకంగా నిర్వహించుకుంటుంది.

6. ఉమ్మడి వ్యవహారాలను తెగ కౌన్సిలే పరిష్కరించుతుంది. అన్ని గణాలయొక్క సాకెమ్‌లు, యుద్ధనాయకులు ఈ కౌన్సిల్లో సభ్యులుగా వుంటారు. వీరిని ఎన్నుకునేందుకు, ఎన్నికను రద్దుచేసేందుకు గణాలకు అధికారమున్నందున వీరిని గణాలకు నిజమైన నాయకులనుగా ఎంచవచ్చు. తెగలోని సభ్యులఎదుట బహిరంగంగానే తెగకౌన్సిల్ చర్చలుజరిగేవి; తెగ సభ్యులు ఈ చర్చల్లోపాల్గొనవచ్చు. తమ అభిప్రాయాలను తెలుపవచ్చు. నిర్ణయాధికారం మాత్రం కౌన్సిల్ సభ్యులకే వుంటుంది. హాజరుగావున్న ప్రతివక్తాడూ కౌన్సిల్‌కు తమ అభ్యర్థిని చెప్పుకోవచ్చు. స్త్రీలు సైతం తాము కోరుకున్న ప్రతినిధిద్వారా తమ అభిప్రాయాలను తెలుపవచ్చు అంతిమ నిర్ణయాలన్నీ ఏకగ్రీవంగా చేయాలనే సంప్రదాయం ఇరాక్వ్యాలలో వుంది, జర్మన్ మార్క్ తెగలలోకూడ చాలా నిర్ణయాలు యిదే పద్ధతిలో జరిగేవి. ముఖ్యంగా ఇతర తెగలతో సంబంధాలనుగురించి నిర్ణయం తీసుకునే బాధ్యత తెగ కౌన్సిల్‌ది. రాయబారవర్గాలను స్వీకరించడం. పంపడం, యుద్ధం ప్రకటించడం, శాంతిసంధి చేసుకోవడంవంటి బాధ్యతలను తెగకౌన్సిలే నిర్వహించేది.యుద్ధంసంభవించినపుడు ప్రధానంగా స్వచ్ఛంద సైనికులే (వాలంటీర్లు) పోరాడేవారు. శాంతిసంధి చేసుకున్న తెగలుతప్ప యితర తెగలన్నిటితో సూత్రప్రాయంగా యుద్ధపరిస్థితి వున్నట్లుగానే ఎంచబడేది. అలాంటి శత్రువులపై సైనికదాడులు ఎక్కు

పగా పేరుపొందిన వీరుల ఆధ్వర్యాన నిర్వహించబడేవి. యుద్ధనృత్యాన్ని ఏర్పాటు చేసేవారు. ఆ నృత్యంలోచేరిన వారంతా సైనిక చర్యల్లో పాల్గొనేందుకు అంగీకరించినట్లుగా ఎంచబడేది. వెంటనే పోరాటానికి సైన్యం ఏర్పాటయి ముందుకు సాగిపోయేది. తెగనివశించే ప్రాంతంపైదాడి సపుడు అదేవిధంగా స్వచ్ఛంద సైనికులే (వాలంటీర్లు) ప్రధానపాత్ర వహించి రక్షణ బాధ్యతను నిర్వహించేవారు. యుద్ధసైన్యాలు తరలి వెళ్లేటప్పుడు, తిరిగివచ్చినపుడు బహిరంగోత్సవాలు జరిపేవారు. అలాంటి దాడులకు తెగకౌన్సిల్ అనుమతి తీసుకోవాలసిన అవసరంలేదు. అను మతి అడగడం, యివ్వడం అనే పద్ధతేలేదు. టాసిటస్ వర్ణించినట్లుగా జర్మన్ సేనలు జరిపే స్వంతదాడులవలె వుండేవి. ఐతే జర్మన్ సేనలకు అప్పటికే వాలంటీర్లలక్షణాలు పోయి, సర్వకాలం-శాంతిసమయంలోకూడ సంఘటితమై వుండే కేంద్రీకృత సైన్యం చుట్టూ యుద్ధ సమయంలో వలంటీర్లను సమీకరించే పద్ధతి అమల్లోకి వచ్చింది. అమెరికన్ ఇండి యన్ల యుద్ధసేనలు అరుదుగా మాత్రమే ఎక్కువ సంఖ్యలో వుండేవి. సాధారణంగా తక్కువ సంఖ్యలో వుండేవి. దూరప్రాంతాలకు వెళ్ళి దాడిచేసిన ఇండియన్ల ప్రముఖ దండయాత్రల్లో కూడ బహుకొద్ది పోరాట సేనలు మాత్రమే పాల్గొన్నాయి. ఒక ముఖ్యయుద్ధంలో అలాంటి దాడిసేనలు ఎక్కువగా పాల్గొన్నపుడు ప్రతిసేన తన నాయకుని ఉత్తరువులను శిరసావహించేది. యుద్ధ నిర్వహణలో వుండాలిసిన ఐకమత్యాన్ని కాపాడేందుకు నాయకుల కౌన్సిల్ బాధ్యత వహించేది. రైన్‌నది ఎగువప్రాంతంలో అలామన్ని నాలుగవ శతాబ్దంలో ఇలాంటి యుద్ధనిర్వహణ పద్ధతినే అవలంబించాడని అమ్మియానూన్ మార్సెల్లినూస్ వర్ణించాడు.

7. కొన్ని తెగలలో స్వల్పమైన కొన్ని ప్రత్యేకాధికారాలతో ముఖ్యనాయకుడు వుండేవాడు. సాకెమ్‌లలో ఒకడు ఈ పదవిలో వుండి, తక్షణమే చర్య తీసుకోవలసిన విషయాలపై నిర్ణయాలను చేసేవాడు: కౌన్సిల్ సమావేశమయ్యాక అంతిమ నిర్ణయం చేసేది. ఈ పద్ధతిలో కార్యనిర్వాహకోద్యోగిని సృష్టించాలనే ప్రయత్నం ద్యోతక మవుతుంది;

ఐతే ఈ ప్రయత్నం ఫలించలేదని తరువాత చరిత్ర నిరూపించింది. చాలా సందర్భాలలో - అన్నిసందర్భాల్లో కాకపోయినా-ముఖ్య సైన్యాధ్యక్షుడే అలాంటి వుద్యోగిగా అభివృద్ధిచెందేవాడు.

అమెరికన్ ఇండియన్లలో అత్యధిక సంఖ్యాకులు తెగనిర్మాణ దశను మించి అభివృద్ధిచెందలేదు. సంఖ్యలో చిన్న తెగలుగా వుంటూ ఒకదాన్నుంచి మరొకటి విస్తృతమైన సరిహద్దుప్రాంతాలవల్ల వేరుపడి వుండేవి. నిరంతర యుద్ధాలవల్ల బలహీనపడి, కొద్దిమంది జనం విశాల ప్రాంతంలో నివసించుతుండేవారు. తాత్కాలిక అవసరాల నిమిత్తం బంధుత్వం కలిగిన తెగలమధ్య ఒడంబడికలు జరిగేవి. ఆ అవసరం గడచిపోయాక ఒడంబడిక రద్దయిపోయేది. కొన్నిప్రాంతాలలో ఒకే శాఖకు చెందిన తెగలు, తరువాత విడిపోయి వేర్వేరు తెగలుగా నివసించినప్పటికీ, తిరిగి సమాఖ్యగా ఏకమైన వుదాహరణలు వున్నాయి. జాతులుగా రూపొందడానికి ప్రథమ ప్రాతిపదిక ఈ విధంగాఏర్పడింది. అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ఇరాక్వా తెగలోనే ఇలాంటి సమాఖ్య ఉన్నతరూపం మనకు కన్పించుతుంది. మిస్సిసిపీనదికి పశ్చిమాన నివసించే డకోటా వంశానికిచెందిన ఒకశాఖయే ఇరాక్వాలు అయివుండొచ్చు. అచటనుండి వలసవెడలి, అనేకచోట్ల తిరిగి ప్రస్తుత న్యూయార్క్ రాష్ట్రంలో చివరకు నివాసమేర్పరచుకున్నారు. అచట ఐదు తెగలుగా సెనెకా, కాయుగా, ఓనందగా, ఓనీదా, మోహాక్ అనే తెగలుగా విడిపోయారు. చేపలు పట్టడం, వేటాడడంపై జీవించేవారు. చెట్లపెంపకం కూడ స్వల్పంగా తెలుసు. చుట్టూ రక్షణకంచెలున్న గ్రామాలలో నివశించేవారు. ఐదు తెగలకు సంబంధించిన ఉమ్మడి గణాలు వుండేవి. మొత్తం 20 వేలకు లోపు జనాభా వుండేది. ఒకే భాషకు చెందిన మాండలిక పదాలను వాడుతుండేవారు. ఐదు తెగలు ఒకే ప్రదేశాన్ని పంచుకున్నందున వారు నివసించే ప్రాంతాలుకూడ ఇరుగు పొరుగున అనుకునే వుండేవి ఈ ప్రాంతం కొత్తగా జయించబడినది గాన తరిమి వేసిన వాళ్ళనుంచి రక్షించుకునేందుకు ఈ ఐదు తెగలమధ్య సహకారం అవసర మయింది. పదిహేనవ శతాబ్దం ఆరంభంలో ఈ సహకారం

"ఎల్లకాలంవుండే ఐక్యత"గా, సమాఖ్యగా అభివృద్ధి చెందింది. ఈ కలయికలో వున్న బలాన్ని తక్షణమే గుర్తించి, పరాక్రమణ దృష్టి ఏర్పడింది. సమాఖ్య అధికారం అత్యున్నతదశలో వుండగా- 1675 - సంవత్సరం ప్రాంతంలో - చుట్టూవున్న విశాలప్రదేశాన్ని జయించింది; కొన్ని తెగలను తరిమివేసింది; మరి కొన్నిటినుండి కప్పం వసూలుచేసింది. అమెరికన్ ఇండియన్లు అందరిలోకి ఉన్నతమైన సామాజిక విధానాన్ని ఇరాక్వాతెగల సమాఖ్య నిర్మించింది; అనాగరిక యుగపు దిగువదశ నుండి అమెరికన్ ఇండియన్లు (మెక్సికన్లు, న్యూ మెక్సికన్లు, పెరూవియన్లను, మినహాయించితే) యింకా బయటపడలేదని తేలుతుంది. ఇరాక్వా సమాఖ్యయొక్క ప్రధాన లక్షణాలు యివి.

1. రక్త సంబంధాలు కలిగిన ఐదు తెగలు—తమ ఆంతరంగిక వ్యవహారాల్లో సమానత్వం, స్వాతంత్ర్యం అనే ప్రాతిపదికను అంగీకరించుతూ—సర్వకాలం వుండే సమాఖ్యగా ఏర్పడ్డాయి. ఈ తెగలమధ్య వున్న రక్తసంబంధాలే ఈ సమాఖ్యకు నిజమైన పునాది. ఈ అయిదు తెగల్లోనూ మూడింటిని తండ్రి తెగలని పిలిచేవారు.అవి పరస్పరం సోదరులుగా ఎంచబడేవి. తక్కిన రెండుతెగలను కొడుకు తెగలని పిలిచేవారు. అవి కూడ పరస్పరం సోదరులుగా ఎంచబడేవి. అన్నిటికంటె పురాతనమైన మూడుగణాల ప్రతినిధులు మొత్తం ఐదు తెగల్లోనూ వుండేవారు. మరో మూడు గణాల ప్రతినిధులు మూడు తెగల్లో వుండేవారు. ఈ గణాలకు చెందిన సభ్యులు ఐదుతెగల్లో వున్నప్పటికీ వారంతా సోదరులే. మాండలిక భేదాలున్నప్పటికీ ఉమ్మడిభాషను వాడుతున్నారంటే వారంతా ఒకే వంశం నుంచి అభివృద్ధి చెందిన వారేనని ద్యోతకం అవుతుంది.

2. సమాఖ్య వ్యవహారాలను నిర్వహించేందుకు ఫెడరల్ కౌన్సిల్ వుండేది. సమానహోదా, అధికారంగల యాభైమంది సాకెమ్‌లు దీన్లో సభ్యులుగా వుండేవారు. ఈ కౌన్సిలే సమాఖ్య వ్యవహారాలన్నిటిలోనూ నిర్ణయాధికారం కలిగివుండేది.

3. సమాఖ్య ఏర్పడిన సమయంలో ఈ యాభైమంది సాకెమ్‌లు వివిధతెగలలోనూ, గణాలలోనూ వుండేవారు. సమాఖ్యలక్ష్యాలకు అను

గుణంగా ప్రత్యేకంగా ఏర్పరచిన కొత్తవుద్యోగాల బాధ్యతలను నిర్వ ర్తించేవారు. ఖాళీ ఏర్పడినప్పుడల్లా ఆయా గణాలు కొత్తవారిని ఎన్ను కునేవి. వారిని తొలగించే అధికారంకూడ వాటికుండేది. ఐతే సమాఖ్య వుద్యోగాల్లో వారిని నియమించే హక్కుమాత్రం ఫెడరల్ కౌన్సిల్‌కు వుండేది.

4. సమాఖ్యయొక్క సాకెమ్ లందరూ తమ తమ తెగల్లోకూడ సాకెమ్‌లుగా వుండేవారు. తెగ కౌన్సిల్లో సభ్యత్వ వోటింగుహక్కు వారికుండేవి.

5. ఫెడరల్ కౌన్సిల్ నిర్ణయాలన్నీ ఏకగ్రీవంగా జరిగేవి అయి వుండాలి.

6. వోటింగ్ తెగలవారీగా జరిగేది. అంటే ముందుగానే ప్రతి తెగకు చెందిన కౌన్సిల్ సభ్యులు ఒక అంగీకారానికి వచ్చిన తర్వాతనే అందరూ పాటించి తీరాలిసిన నిర్ణయం జరిగేది.

7. ఐదు తెగల కౌన్సిళ్ళకు వేరేవేరే ఫెడరల్ కౌన్సిల్ సమా వేశాన్ని పిలిచే హక్కు వుంది; కాని తనంతట తానే సమావేశమయ్యే అధికారం ఫెడరల్ కౌన్సిల్‌కు లేదు.

8. దాని సమావేశాలు బహిరంగంగా ప్రజల యెదుటనే జరిగేవి. ఇరాక్వ్యూ ప్రజల్లో ప్రతివారికీ వాక్స్వాతంత్ర్యం వుండేది. నిర్ణయాధికారం కౌన్సిల్‌కు మాత్రమే వుండేది.

9. సమాఖ్యకు అధికార హోదాగల అధిపతి లేడు. ముఖ్య కార్యనిర్వాహక అధికారి లేడు.

10. ఐనప్పటికీ సమానహోదా, అధికారంగల ఇద్దరు ముఖ్య యుద్ధనాయకులు సమాఖ్యకు వుంటారు. (స్పార్టన్స్‌లో ఇద్దరు రాజులు, రోమనులలో ఇద్దరు కాన్సల్స్ వున్నట్లుగా)

నాలుగువందల సంవత్సరాలకుపైగా ఇరాక్వ్యూ ప్రజలు నివశించిన సామాజిక విధానమిది. ఇప్పటికీ వారావిధంగానే జీవించుతున్నారు. మోర్గన్ తెలిపిన విషయాలను కొంత వివరంగానే యిచట వుదహరిం

చాను. ఏమంటే రాజ్యాంగం యింకా ఏర్పడని అప్పటి సామాజిక విధానాన్ని పరిశీలించడానికి అవి ఉపకరించుతాయి. ప్రతి సందర్భంలోనూ పాలితులనుండి వేరుపడిన ప్రత్యేక అధికారవర్గం వుండటమే ప్రభుత్వ యంత్రాగానికి చిహ్నం. ఈ వాస్తవిక దృష్టిలోనే జర్మన్ల మార్క్స్ నిర్మాణం కేవలం సామాజిక వ్యవస్థేననీ, తరువాతదశలో అది రాజ్యాంగానికి పునాదిగా వినియోగపడినప్పటికీ మొదట్లో రాజ్యాంగంతో నిమిత్తంలేని సామాజికవ్యవస్థే అనీ మారెర్ (జర్మను చరిత్రకారుడు) గుర్తించాడు. అందుచేత మార్క్సులు, గ్రామాలు, గడీలు, పట్టణాలువగైరా ఆదిమ సామాజిక సంస్థలతోపాటు క్రమక్రమంగా వాటిప్రక్కనే ప్రభుత్వాధికారం ఏవిధంగా తలయెత్తిందో తన రచనల్లో మారెర్ పరిశీలించగలిగాడు. ఉత్తర అమెరికా ఇండియన్లు ప్రారంభంలో ఒకే ఆదిమతెగకుచెందినప్పటికీ క్రమంగా విస్తరించి విశాల భూఖండంలో ఎలా వ్యాప్తిచెందారో; చీలిపోయిన తెగలు మరల గ్రూపులుగానూ, ప్రజలుగానూ ఎలా రూపొందాయో; భాషలు మార్పుచెందుతూ ప్రారంభంలోని ఏకత్వం కనబడకుండాపోయి చివరకు ఎలా పరస్పరం అర్థంగాని ప్రత్యేక భాషలుగా రూపొందాయో; తెలుస్తుంది. అదే సమయంలో తెగలలోని ఒక్కొక్క గణం అనేక గణాలుగా ఎలా విభజన అయ్యాయో; ఆదిమ మాతృస్వామిక గణాలలో సోదరత్వం ఎలా కొనసాగిందో: చాలాకాలం క్రిందటనే విడిపోయిన తెగల్లో దూరదూరాన వుంటున్నప్పటికీ పాతగణాలయొక్క పేర్లు అదే విధంగా ఎలా కొనసాగుతున్నాయో తెలుస్తుంది. ఉదాహరణకు తోడేలు, ఎలుగుబంటి పేర్లు కలిగిన గణాలు అధికసంఖ్యాక ఇండియన్ తెగలలో ఇప్పటికీ వున్నాయి. పైన వర్ణించిన సామాజిక విధానం వాటన్నిటికీ మొత్తంమీద వర్తించుతుంది. ఐతే వాటిలో చాలాతెగలు యింకా రక్త సంబంధం కలిగిన తెగల సమాఖ్యను ఏర్పరచుకునే దశకు రాలేదు.

కాని సామాజిక వ్యవస్థగా గణాలను పరిగణించితే గణాలు ఫ్రేట్రీస్ (సోదర సమాజాలు), తెగలు తప్పనిసరిగా వీటినుండే అభివృద్ధి చెందాయనే విషయాన్ని సహజంగా మనం గమనించి తీరుతాం. ఇవి మూడుకూడ వేర్వేరు నిష్పత్తిలో రక్తం సంబంధం కలిగిన గ్రూపులే;

ప్రతిదీ స్వంత వ్యవహారాలను స్వయంగా పరిష్కరించుకునే సంపూర్ణ వ్యవస్థగా మనుతూ, తక్కినవాటికి అనుబంధంగా వుండేది. అనాగరిక యుగపు దిగువ దశలోపే సామాజిక సమస్యలన్నిటినీ పరిష్కరించుకునే బాధ్యత వాటిపై వుండేది. అందుచేత ఎచటనైనాసరే ఒక ప్రజల్లో గణం సామాజిక వ్యవస్థగా వుంటే, పైన వర్ణించిన మాదిరి తెగ వుందేమో మనం పరిశీలించవలసి వుంటుంది. తగినన్ని ఆధారాలు లభ్యమయితే-ఉదాహరణకు గ్రీకులు, రోమన్లలో - మనం వాటిని స్పష్టంగా తెలసికో వచ్చు. ఒకవేళ ఆధారాలు దొరక్కపోతే అమెరికన్ సామాజిక నిర్మాణంతో పోల్చిచూడటంవల్ల చాల క్లిష్టమైన అనుమానాలను, సందేహాలను తొలగించుకోవచ్చు.

ఈ గణ సామాజిక వ్యవస్థ మానవజాతి బాల్యదశను తెలుపుతూ ఆశ్చర్యం కొల్పేదిగా వుంటుంది. సైనికులు పోలీసులు లేకుండా, ప్రభువులు, రాజులు, గవర్నర్లు న్యాయాధీశులు లేకుండా, బందిఖానాలు విచారణలు లేకుండా ప్రతిదీ మృదువుగా నడిచిపోతుంది. అన్ని పోట్లాటలు, తగాదాలు అందుకు సంబంధించిన వారిందరిచేత పరిష్కరించబడేవి. గణం లేక తెగ లేక ప్రతి గెంటేస్ ఆంతరింగిక సమస్యలను స్వయంగా పరిష్కరించుకునేవి. రక్త ప్రతీకారం తీర్చుకోవడంలాంటి తీవ్రసమస్య చాల అరుదుగానేవచ్చేది. ప్రస్తుత నాగరికసమాజంలో అమలుజరుగుతున్న మరణశిక్ష కేవలం దానికి ప్రత్యామ్నాయరూపమేగాక, నాగరికత, యొక్క మంచిచెడ్డలకు నిదర్శనంగావుంది. ప్రస్తుతంకంటే అపుడు ఉమ్మడి సమస్యలు చాల ఎక్కువగా వున్నప్పటికీ కొన్ని కుటుంబాలు కలసి ఒకే ఉమ్మడి ఇంట్లో సామూహికంగా నివశించేవారు; భూమి తెగయొక్క ఆస్తిగా వుండేది. తోటలను మాత్రం తాత్కాలికంగా సమష్టి కుటుంబాలకు యిచ్చేవారు. ఇప్పటివలె విస్తృతమైన క్లిష్టమైన పరిపాలనా యంత్ర వుండేదికాదు. ప్రతి సమస్యను అందుకు సంబంధించినవారే పరిష్కరించుకునేవారు, అనేక సందర్భాలలో శతాబ్దాలనుండి వస్తున్న సంప్రదాయంప్రకారం నిర్ణయించబడుతుంది. సమాజంలో బీదవారు, అన్నార్తులు వుండేవారుకాదు. వృద్ధులు, రోగులు, యుద్ధంలో గాయపడినవారి

యెడల కర్తవ్యమేమిటో గణాలకు తెలుసు. స్త్రీలతో సహా గణసభ్యులంతా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవించేవారు. అప్పటికింకా బానిసలు ఏర్పడేందుకు అవకాశంలేదు. జయించిన ఇతర తెగలను బానిసలుగా చేసే పద్ధతియింకారాలేదు. ఇరాక్యూలు 1651 లో ఈరీలనూ "తటస్థ జాతులనూ" జయించినపుడు తమతోపాటు సమానులుగా సమాఖ్యలో చేరమని ఆహ్వానించారు. ఓడిపోయినవాళ్ళు నిరాకరించిన తర్వాతనే వారిని ఆ ప్రాంతంనుంచి తరిమివేశారు.

అలాంటి సమాజంలోని స్త్రీ పురుషులను చూసినపుడు తెల్లవాళ్ళంతా మెచ్చుకున్నారు. అవినీతి ఎరుగని వ్యక్తిగత హుందాతనాన్నీ, నిజాయితీని, నైతిక బలాన్నీ, ధైర్య స్థయిర్యాలను ప్రదర్శించుతారనీ ఆటవికులైన ఇండియన్లను కలిసికొన్న తెల్లవాళ్లు ఒప్పుకున్నారు.

ఆఫ్రికాలో ఈమధ్యనే ఆటవికుల ధైర్యానికి మచ్చుతునకలయిన ఉదాహరణలను మనం చూశాం. కొలదిసంవత్సరాలక్రితం జులూకాఫిర్సు, రెండునెలలక్రితం నూబియన్సు*—ఉభయుల్లోనూ గణ సామాజికవ్యవస్థ యింకా నశించలేదు— ఏ యూరోపియన్ సైన్యమూ చూపని ధైర్య సాహసాలను కనబరచారు. గునపాలు, బల్లాలు మాత్రం ధరించి, ప్రేలుడు ఆయుధాలులేకుండా ఈ ఆటవిక తెగలు ఆంగ్లేయుల తుపాకిగుళ్ళ వర్షాన్ని లెక్కచేయకుండా, భుజంభుజం కలిపి పోరాడారు. ప్రఖ్యాత ఇంగ్లీషు కాల్బలాల బాయినెట్లను ఎదుర్కొని, గందరగోళపరిచారు. ఒకసారి కంటే ఎక్కువగానే వారిని వెనక్కి తరుమగలిగారు. ఆయుధాలలో విపరీతమైన తేడా వున్నప్పటికీ, మిలిటరీ సర్వీసు, మిలిటరీ తర్ఫీదు అంటే ఏమిటో ఎరుగని ఆటవికులు అలా చేయగలిగారు. ఇంగ్లీషువాళ్లు తమ కంటే కాఫిర్ త్వరగా వెళ్లగలడనీ, ఇరవైనాలుగు గంటల్లో గుర్రం కంటే ఎక్కువ దూరం ప్రయాణం చేయగలడనీ గోల పెట్టారు. ఆటవికుల ధైర్యస్థైర్యాలకు, సహనశక్తికి యిది నిదర్శన

* 1879 లో బ్రిటిష్ సేనలకు జులూస్‌కు జరిగిన యుద్ధాన్ని 1881–83 లో బ్రిటిష్‌వాళ్ళకు నూబినియన్స్‌కు జరిగిన యుద్ధాన్ని గురించి ఇచట ఉదహరించబడింది.

మనవచ్చు ఆటవికుల చిన్న కండరాలు ఉక్కువలె గట్టిగా వుంటాయనీ. కొరడావలె సాగుతాయనీ ఇంగ్లీషు చిత్రకారు డొకడు మెచ్చుకున్నాడు.

వర్గ విభజనలు ఏర్పడకముందు మానవజాతి, మానవసమాజం అంత హుందాగా వుండేది. అప్పటివారి పరిస్థితులను ప్రస్తుత నాగరిక సమాజంలో అత్యధిక సంఖ్యాకుల స్థితితో మనం పోల్చిచూస్తే, ప్రస్తుత శ్రామికులు చిన్న రైతులకూ ఆదిమగణ సమాజంలోని ప్రాచీనులకు మధ్య బ్రహ్మాండమైన అంతర ముందని బోధపడుతుంది.

చిత్రపటంయొక్క ఒక భాగమిది. ఐతే ఈ నిర్మాణం నశించి పోవడం తప్పనిసరనే సంగతికూడ మనం మరచిపోరాదు. ఏమంటే ఇది ఎన్నడూ తెగదశను మించి అభివృద్ధి చెందలేదు. తెగల సమాఖ్య ఏర్పడటంలో దీని పతనావస్థ ప్రారంభమయిందన్న సంగతి ఇకముందు తెలిసికుంటాం. ఇతరులను జయించి తమ అధీనంలో వుంచుకోవాలనే ఇరాక్వ్యాల ప్రయత్నాలలోనే యిది ద్యోతకమవుతుంది. తెగ పరిధికి బయట వున్నవన్నీ శాసన పరిధికి బయటవున్నట్లుగా ఎంచబడేవి. స్పష్టమైన శాంతి ఒడంబడిక లేనపుడు తెగలమధ్య నిరంతరయుద్ధం కొనసాగేది; ఇతర జంతువు లన్నిటినీ మించిన క్రూరత్వంతో మనిషి యుద్ధంచేసేవాడు. తన ప్రయోజనాలకు విరుద్ధమైనపుడే మానివేసేవాడు. అమెరికన్ ఇండియన్లలో మనం గమనించినట్లుగా ఉత్పత్తివిధానం చాలవెనుకబడిన దశలో వున్నప్పుడే గణసమాజవిధానం పూర్తిగా వికసించివుంది. అనగా విశాలమైనప్రాంతములో తక్కువ జనాభా నివసించుతూ, బాహ్యప్రకృతి మానవునిపై తన యిష్టానుసారం పెత్తనం చెలాయించుతున్నపుడు, ప్రకృతి శక్తులను అర్థంచేసుకోలేనందున శైశవ దశయందున్న మానవమేధస్సుపై మత విశ్వాసాల రూపంలో అవి ప్రతిబింబించుతున్నపుడు గణసమాజం వర్ధిల్లింది. తనకు ఇతరులకు సంబంధించినంతవరకు మానవుని అభివృద్ధికి తెగయే పరిహద్దుగా వుండిపోయింది. తెగ. గణము వాటికి సంబంధించిన వ్యవస్థలు పవిత్రంగాను, దాటరానివిగాను వుండేవి. అంతకంటే బలాధిక్యత కలిగిన సహజప్రకృతిశక్తులముందు బలహీనుడుగానూ, మనోవాక్కాయ కర్మలలో

పూర్తిగా బానిసగానూ మానవుడు వుండిపోయాడు. ఆదిమ యుగంలోని ప్రజలు మనకు ఆకర్షణీయంగా కన్పించినప్పటికీ, వారిలో ఒందొరులమధ్య ఏమంత తేడావుండేదికాదు. కార్ల్‌మార్క్స్ చెప్పినట్లు ఆదిమ సమాజం యొక్క బొడ్డుతాడుకు అతడు సంధించబడివుండేవాడు ఈ ప్రాచీన సమాజంయొక్క బంధనాలను త్రెంచి వేయాలిసివుంది; అవి తెంచివేయ బడ్డాయి. ప్రాచీన గణసమాజంయొక్క నైతిక ఆధిక్యతనుంచి పతన మైనట్లుగా కన్పించే శక్తులచేత ఆ బంధనాలు త్రెంచివేయబడ్డాయి. స్వార్థ ప్రయోజనాలైన దురాశ, క్రూరమైన కామేచ్ఛ, దురాపేక్ష సమష్టి ఆస్తిని దోచుకునే స్వార్థం వగైరా నాగరిక వర్గసమాజ సహజలక్షణాలు ప్రవే శించాయి. దొంగతనం, మానభంగం, ద్రోహం వగైరా అత్యంత క్రూరపద్ధతులద్వారా వర్గరహితమైన పాత గణసమాజం నాశనం చేయ బడింది. మరియు తత్ఫలితంగా రూపొందిన 2,500 సంవత్సరాల మాతన జీవితంలో అణచివేయబడిన అత్యధిక సంఖ్యాకులను దోచుకోవడం ద్వారా అల్పసంఖ్యాకులు అభివృద్ధి చెందుతూ వచ్చారు. ఈ రోజుల్లోనైతం యిదివరకటికంటే మరింతగా అదే పద్ధతి కొనసాగుతూంది.

# 4

# గ్రీకుల గణాలు

గ్రీకులు, వారితోపాటు పెలాస్ గియన్సు, ఒకేమూల తెగనుండి అభివృద్ధిచెందిన ఇతర ప్రజలూ చారిత్రక దశకు ముందుకాలంలో - అమెరికన్లవలెనే - సామాజిక వ్యవస్థలను నిర్మించుకునేవారు; గెన్స్, ఫ్రాట్రీ, తెగ, తెగల సమాఖ్యలాంటి నిర్మాణాలనే కలిగివుండేవారు. కొన్ని సమాజాల్లో ఫ్రాట్రీ (సోదర గణాల కూటమి) లోపించవచ్చు, ఉదాహరణకు డోరియన్స్‌లో యివిలేవు. అలాగే కొన్ని సమాజాల్లో తెగల సమాఖ్యలు ఏర్పడకపోవచ్చు. కాని ప్రతి సమాజంలోనూ గణ నిర్మాణం మాత్రం వుండితీరేది. గ్రీకులు చారిత్రకదశ ప్రారంభమయ్యే సమయానికి నాగరికతా ప్రాంగణములో వున్నారు. పై అధ్యాయంలో వివరించిన అమెరికన్ ఇండియన్లకు గ్రీకులకు మధ్య రెండు పెద్ద సామాజిక దశల అంతరం వుంది. ఇరాక్వ్యాలకంటె వీరుల యుగానికి చెందిన గ్రీకులు రెండుదశలను అధిగమించారు. ఈ కారణంవల్లనే ఇరాక్వ్యా గణాలలో కన్పించే లక్షణాలు గ్రీకుల గణాలలో కన్పించవు. గుంపు వివాహ పద్ధతి కొంతవరకు చెదరిపోయింది.

మాతృస్వామ్యం స్థానే పితృస్వామ్య హక్కు అమల్లోకి వచ్చింది. స్వంత ఆస్తి ఏర్పడటం వల్ల గణ సమాజ నిర్మాణానికి మొదటి గండి పడిపోయి, మొదటి దానివెంట సహజంగా రెండో గండి పడింది. పితృస్వామిక హక్కు ఏర్పడటంతోటే భాగ్యం కలిగిన వారసు

రాలిని పెళ్ళాడిన భర్తకు ఆమె సంపద దఖలుపడటం - అనగా ఒక గణానికి చెందిన ఆస్తి మరో గణంలోనికి తరలించుకు పోవడం - ప్రారంభమయింది. అంటే గణ సమాజ శాసనాలకు (నియమాలకు) పునాది బ్రద్దలైపోయింది. అలాంటి సందర్భాలలో ఆ యువతి గణంలోని వానినే వివాహమాడుటకు అనుమతి లభించడమేగాక, ఆస్తి గణంలో వుంచుకునే దృష్టితో, అలా వివాహమాడ్డం తప్పనిసరి అయింది.

గ్రీసుదేశ చరిత్రను వ్రాసిన గ్రోటే, ఏ విధంగా అథీనియన్ గణాల ఐక్యత కాపాడ బడిందో తెలుపుతూ, అందుకు ముఖ్య కారణాలను యిలా వుదహరించాడు :

1. ఉమ్మడి మత కర్మలను నిర్వహించడం పురోహితుల ప్రత్యేక హక్కు. గణంయొక్క ఆదిమ మూలపురుషుడుగా భావించబడే ఒక ప్రత్యేక దేవుణ్ణి పూజించడం పురోహితుని విధి; దానికి చిహ్నంగా ప్రత్యేక వంశనామం (ఇంటిపేరు) కలిగివుంటారు :

2. ఉమ్మడి సమాధిస్థలం (డిమోస్థనీస్ వ్రాసిన యూబిలైడ్స్ చూడాలి)

3. పరస్పర వారసత్వ హక్కులు.

4 పరస్పరం సహాయం చేసుకొనేందుకు, రక్షించుకునేందుకు, నష్టాలకు ప్రతిక్రియ చేసేందుకు గణసభ్యులు బాధ్యత వహించాలి.

5. కొన్ని సందర్భాలలో ముఖ్యంగా తలిదండ్రులను కోల్పోయిన కుమార్తెను లేక సంపదకు వారసురాల్ని గణంలోనే వివాహం చేసుకునేందుకు పరస్పర హక్కును గుర్తించాలి.

6. కనీసం కొన్ని సందర్భాలలోనైనా ఉమ్మడి ఆస్తిని కలిగి వుండటం, గణంలో ఒక న్యాయాధీశుని, కోశాధికారిని కలిగి వుండటం.

కొన్ని గణాలను ఒక గ్రూపుగా సమీకరించుతున్న సోదరగణాల కుటుంబంలో అంత సన్నిహిత సంబంధాలు వుండేవికావు. కాని ఇచట కూడ పరస్పరం పాటించుకునే హక్కులు, బాధ్యతలు ఒకేరకంగా వుండేవి. ముఖ్యంగా సోదరగణాలకూటమి సభ్యులందరూ కలసి

పాటించే మతకర్మలు, తమలో ఒకనిని చంపినవుడు తీసుకొనే ప్రతీకార చర్యలు ఒకేవిధంగా ఉండేవి. అలాగే తెగకుచెందిన సోదరగణాల కూటములన్నీ కలిసి నిర్ణీత సమయాల్లో ప్రభువులనుంచి ఎంచుకోబడిన న్యాయాధీశుని ఆధ్వర్యాన పవిత్రకర్మలు సమష్టిగా నిర్వహించేవి.

గ్రోటే వ్రాసిన ప్రాచీన గ్రీసు చరిత్రలోని విషయాలను గమనించాం. వీటినిగురించి మార్క్స్ యిలా అన్నాడు : "గ్రీకుల గణాలలో (ఇరాక్వాలలో లాగే) ఆటవిక లక్షణాలు స్పష్టంగా గోచరించుతాయి". మనం యింకా లోతుకు పోయి పరిశీలించినప్పుడు ఈ సంగతి మరింత నిస్సందేహంగా నిరూపిత మవుతుంది.

గ్రీకుల గణాలకు క్రింది లక్షణాలు కూడ వున్నాయి ;

7. తండ్రినుంచి వారసత్వ హక్కు పొందడం.

8. పెద్ద ఆస్తులకు వారసురాళ్ళయ్యే యువతుల విషయంలోతప్ప గణాలలో అంతర్వివాహం నిషేధింపబడింది. ఈ మినహాయింపు దానిని విధిచేయడమూ చూస్తే పూర్వపు నిబంధనలు సత్యమేనని తెలుసుకోవచ్చు. దీనినిపట్టి వివాహానంతరం స్త్రీ తాను పుట్టిన గణంలోని మత సంబంధమైన కర్మలను వదలుకొని భర్తయొక్క గణానికి చెందిన మత కర్మలను స్వీకరిస్తుందనీ ఆయనకు చెందిన సోదర కూటంలో చేర్చుకోబడుతుందనీ ఇదొక సర్వసాధారణ సూత్రమనీ తెలుసుకోవచ్చు. డికెయార్కస్ * వ్రాసిన ఒక విషయాన్నీ, దీనినీ చూస్తే గణానికి వెలుపల నే వివాహం జరిగేదని తెలుస్తుంది. స్త్రీ పురుషు లెవ్వరికీ తమ గణంలోనే వివాహమాడేహక్కు లేదని బెకెర్ † తన 'కారికెల్స్'లో వ్రాశాడు.

---

* డికెయార్కస్ — క్రీస్తుపూర్వం 4వ శతాబ్ది. గ్రీకు చరిత్రకారుడు, అరిస్టాటిల్ శిష్యుడు. భూగోళ, అర్థశాస్త్రవేత్త.

† విల్హెల్మ్ అడోల్ఫ్ బెకెర్ — (1796 – 1846) జర్మను చరిత్రకారుడు, లీప్జిగ్‌లో పురాతత్వ శాస్త్రాచార్యుడు.

9. గణంలోకి కొత్తవారిని దత్తుతెచ్చుకోవడం. ప్రత్యేక సందర్భా లలోనే దత్తు జరిగేది. దత్తు తెచ్చుకొనేది కుటుంబంలోనికే. కాని, సామూహిక కర్మకాండ కొంత వుంటుంది.

10. నాయకులను ఎన్నుకొనే హక్కూ, తొలగించే హక్కూ ప్రతి గణానికి ఒక ఆర్కన్ * వుండేవాడని మనం ఎరుగుదుం. అయితే ఈ ఉద్యోగం ఏవో కొన్ని కుటుంబాలలో వంశ క్రమాగతంగా వుంటుం దనే మాట ఎక్కడా చెప్పబడలేదు. అనాగరిక యుగం ఆఖరువరకూ ఈ హోదాలు వంశ క్రమానుగతాలుగాఉన్నాయని చేప్పేటందుకు అవకాశం లేదు. గణంలో ధనికులకూ, బీదలకూ సమానహక్కులే వుంటూ వచ్చిన. ఆనాటి పరిస్థితులలో అటు వంశ క్రమాను గతములైన హోదాలు వుండే అవకాశం లేదు.

ఒక్క గ్రోటేయేకాదు వీబుర్, మామ్‌సెన్ వగైరా ప్రాచీన కాలపు చరిత్రకారు లెవ్వరూ ఈ గణాల సమస్యకు పరిష్కారం చూప లేకపోయారు. విస్పష్టములయిన వాటి లక్షణాలు కొన్నింటిని వారు సరిగ్గానే వ్రాశారు. కాని, మొత్తంమీద వారు గణం అనేది కొన్ని కుటుంబాల సమూహంగా భావించారు. అందువలన దాని స్వభావాన్నీ, దాని మూలాన్నీ పట్టుకో లేకపోయారు. గణనిర్మాణంలో కుటుంబం ఒక యూనిట్‌గా వుండలేదు. ఏమంటే కుటుంబంలోని స్త్రీ పురుషు లిద్దరూ తప్పనిసరిగా చెరో గణానికీ సంబంధించినవారై వుంటారు. గణం యావత్తూ సోదర కూటంలోనూ, సోదరకూటాలు తెగలోనూ అంతర్భా గాలుగా వుంటాయి. కాని కుటుంబంలో సగం మగవాని గణానిదీ, సగం ఆడుదాని గణానిదీను రాజ్యాంగంకూడా కుటుంబాన్ని (పబ్లిక్) చట్టరీత్యా గుర్తించదు. సివిల్ చట్టాలలోనే దాని అస్తిత్వం. అయినా దంపతీ కుటుంబం నాగరికయుగంతోడిదే. అయినా ఆదే బీజంగా దాని చుట్టూ సమాజమూ, రాజ్యాంగమూ ఏర్పడి దృఢపడినాయవి లిఖితచరిత్ర

* ప్రాచీన కాలంలో ఏథెన్సు నగరంలో తొమ్మిదిమంది ఛీఫ్ మేజస్ట్రేటు లుండేవారు. ఆ వుద్యోగి పేరు ఆర్కన్ (Archon).

ఒక అర్థరహితమైన ప్రతిపాదన తెచ్చింది. 18 వ శతాబ్దంలో దానిని దురతిక్రమణీయంగా భావించారు.

"గ్రీకులు తమ గణాలను పురాణగాధలకు ముడిపెట్టినా పురాణాల లోని దేవతలూ, దేవసమానులూ కన్న గణాలే ప్రాచీనమనీ, ఆ దేవతలను వారే కల్పించుకొన్నారనీ గ్రోటే గుర్తించడం మంచిది." -అన్నాడు మార్క్స్.

ప్రముఖుడూ, విశ్వసనీయుడూ అయిన సాక్షిగా గ్రోటేను మోర్గన్ తరుచుగా వుదహరిస్తుంటాడు. ఆయన ఏథెన్సులోని ప్రతి గణాన్నీ సుప్రసిద్ధుడైన పూర్వపురుషుని పేర పిలిచేవారని వ్రాస్తున్నారు. తన ఆస్తి విషయమై ఏర్పాటు చేయకుండా మనిషి మరణిస్తే ఆయన గణంవారికే ఆస్తి సంక్రమించేది. ఏ వ్యక్తిఅయినా హత్యచేయబడితే అతని తగ్గిర బంధువులు. వారులేకపోతే అతని గణంలోనివారూ, వారు కాకుంటే సోదర కుటుంబంవారూ దోషిని న్యాయస్థానానికితెచ్చేహక్కు బాధ్యత కలిగి వుంటారు." అతిప్రాచీనముతైన అధీనియన్ చట్టాలు గణ సోదర కూట విభజనలమీదనే ఏర్పడివున్నట్లు కనబడుతుంది ..." [మోర్గన్]

రువ్వులేసి వల్లించింది తప్ప మారు ఎరుగని చాందసులకు గణ సభ్యులందరికీ మూలపురుష డొకడే అంటే అర్థంకాదు -అన్నాడు మార్క్స్. ఒకే పూర్వపురుషుడి సంతానం అనేది వట్టి పురాణగాధ అని వారి అభిప్రాయం. అందుచేత పరస్పర సంబంధం లేని కుటుంబాలనుంచి గణ వ్యవస్థ ఎలా ఏర్పడిందో వారు చెప్పలేకున్నారు. ఇంక మాటల సుడిగుండంలోపడి సుళ్ళు తిరుగుతున్నారు "మూలపురుషుడు అభూత కల్పనే. కాని, గణం అన్నది సత్యం" అనేమాట ఒక్కటే వల్లిస్తున్నారు.

గౌరవనీయులు, ఉన్నతులు అయిన కొంతమంది విషయంలో మాత్రమే అరుదుగా ఈ మూలపురుషులనుగురించి వింటూంటాము. కాని. సాధారణులయిన గణ సభ్యులు ఒకేవిధమైన కర్మకాండ నాచరిస్తారు. [చిత్రం కాదా? గ్రోటే] ధనవంతులవు లాగే వారందరికి మూలపురుష

డొకడే. వారందరికీ అతిమానవుడైన పూర్వపురుష డొకడుంటాడు. [సాధారణ గణ సభ్యులకిది వుండడం ఎంత విచిత్రమయ్యా, గ్రోటే] అందరిలోనూ పద్ధతి, ఆదర్శప్రాతిపదికా ఒక్కటే... [ఆదర్శం కాదు మహాశయా! కేవలం రక్త - మాంసాలున్నదే]" - * అన్నాడు గ్రోటే. దీనికి మోర్గన్ ఇచ్చిన సమాధానాన్ని క్రోడీకరించి మార్క్స ఇల్లా వ్రాశాడు :

"గణాల ప్రప్రధమ రూపానికి అనుగుణమైన రక్త సంబంధాల వ్యవస్థ ఇతర మానవులందరిలో వలెనే గ్రీకులలోకూడా వుండేది. అది గణ సభ్యులందరిలో వారి పరస్పర బంధుత్వ పరిజ్ఞానాన్ని భద్రపరుస్తుంది. చిన్నతనంనుంచీ అలవాటుగా ఈ అతి ప్రధాన విషయాన్ని నేర్చుకొంటారు. దంపతీ వ్యవస్థ వచ్చాక ఇది మూలబడింది. గణ నామంతో ఒక వంశానికి ఒక మూల పురుషుడు లభించేవాడు. దానితో పోల్చి చూస్తే దంపతీ కుటుంబం గొప్ప తనమే కనబడదు. ఆ పేరుగల వారందరికీ పూర్వ పురుష డొక్కడేనని ఆ పేరు గుర్తు చేస్తూంటుంది. కాని గణాలలో వంశవృక్షాలు బాగా దీర్ఘం అయిపోయాయి. వాటిలోని సభ్యులిప్పుడు తమ పరస్పర బంధుత్వాన్ని చెప్పుకోవడంకూడా కష్టమైపోయింది. ఏవో కొద్దిసందర్భాలలో కొద్ది కాలంక్రితమే వున్న మూల పురుషుల్ని మాత్రమే చెప్పుకో గలుగుతారు. దత్తత చేసుకొన్న సందర్భాలలో తప్ప ఆ పేరే వారందరికీ మూల పురుష డొకడేనని చెప్పే టందుకు బలమైనసాక్ష్యం. గ్రోటే, నీబుర్‌లు గణసభ్యులమధ్య బంధుత్వం లేదనడంతో అసలు గణాలే అభూతకల్పనగా త్రోసేసినట్లయింది. పుస్తకాల పురుగుల్లాంటి 'ఆదర్శ' విజ్ఞానవేత్తలే ఇటువంటి పనిచెయ్యగలరు. దంపతీ వ్యవస్థ రాకతో తరతరాలుగా పేర్కొనేవంశవృక్షం మరీ దూరం అయిపోయింది. గత కాలంనాటి విషయాలన్నీ ఇంక పురాణ గాధలలో ప్రతిబింబించ వలసినదే. ఫలితంగా కాల్పనిక వంశ వృక్షాలే గణాల్ని సృష్టించాయనే అభిప్రాయానికి వచ్చారీ అజ్ఞానులు. ఇప్పటికీ అదే వల్లిస్తున్నారు. [కారల్ మార్క్స]

* బ్రాకెట్లులోని వ్యాఖ్యలు మార్క్సవి.

అమెరికనులలో లాగ ఏక మాతృకమయిన గణం. అనేక దుహితృగణాలుగా విడివడి సోదరకూటం అయింది. విడిపోయిన గణాలను కలుపుతూ. వారికందరకూ మూలవ్యక్తి ఒక్కరేననే విష యాన్ని అది జ్ఞాపకం చేస్తుంది. "హెకాటియన్ సోదర కూటంలో ఈ నాడున్న వారందరూ పదహారు పురుషాంతరాలక్రితం ఒకే దేవుడినుంచి వచ్చార"ని గ్రోటే వ్రాశాడు. * అందుచేత ఈ సోదర కూటం లోని గణాలన్నీ అక్షరశః సహోదర గణాలే. హోమరు ఈ సోదర కూటాన్ని ఒక సైన్యదళం (యూనిట్)గా పేర్కొన్నాడు. నెస్టర్ ‡ అనేవాడు ఆగమెమ్నాన్‌కు చేసిన హితోపదేశం ఇది. "సైన్యాలను తెగలవారీగానూ, సోదర కూటాలవారీగానూ విభజించు. అప్పుడు సోదర కూటం సోదరకూటానికీ, తెగ తెగకూ వత్తాసునిస్తాయి." తోటి సోదరకూటం వాడిని చంపినప్పుడు హంతకుణ్ణి న్యాయాధిపతిముందు పెట్టడం సోదరకూటంయొక్క ధర్మం, హక్కూ కూడ.

ప్రాచీనకాలంలో సోదర కూటానికి ప్రతిక్రియా బాధ్యత వుండే దనడానికిది నిదర్శనం. అంతేకాదు, ఆ కూటమిలోని వారందరికీ - మతకర్మలూ మతోత్సవాలూ ఒక్కటే. ప్రకృతిని ఆరాధించే ప్రాచీన కాలపు ఆర్య సంస్కృతినుంచి గ్రీకు పురాణగాథా శతం పరిణతి పొంద డానికి మూలం యీగణాలూ, సోదరకూటాలే. వానిద్వారా, వానిలోనే ఇవి వృద్ధి పొందాయి. సోదర కూటానికి అధిపతి (ఫాట్రియార్కోస్) వుంటాడు. సోదర కూటాల సమావేశాలు చేసే నిర్ణయాలను అందరూ పాటించవలసిందేననీ, అది ఒక పాలక సంస్థగా, న్యాయ వివాదకర సంస్థగా వ్యవహరిస్తుందనీ, దేకౌలాంజెస్ వ్రాస్తున్నాడు. తర్వాత తర్వాత ఏర్పడిన రాజ్యాంగ వ్యవస్థ గణాలను ఉపేక్షించినా, సోదర కూటాల కున్న సార్వజనిక క్రియా కలాపాన్ని వానికే వదలి పెట్టింది.

---

* మోర్గన్ ప్రాచీన కుటుంబంలోవుదహరించాడు. పుట-242.

‡ నెస్టర్ - ట్రోజన్ యుద్ధరంగంలో అకియన్ సేనానులలో ప్రముఖులు.

సన్నిహిత బంధుత్వం వున్న సోదరకూటాలు కొన్ని కలిసి తెగ అవుతుంది. అత్తికాలో నాలుగు తెగలుండేవి. ఒక్కొక్క తెగలో మూడేసి సోదర కూటాలుండేవి. ఒక్కొక్క సోదర కూటంలో ముప్ఫయ్యేసి గణాలుండేవి. దానంతటదే రూపొందుతున్న నిర్మాణంలో బుద్ధిపూర్వకంగా కలగచేసుకొని ఒకపద్ధతి ప్రకారం దానిని ఏర్పాటు చేశారన డానికి గణాలూ, సోదర కూటాలా విభజన ఇంత ఖచ్చితంగా వుండడాన్ని పట్టి గ్రహించవచ్చును. ఈపని ఎప్పుడు జరిగింది? ఎల్లా జరిగింది? అనే విషయాన్ని గ్రీసుదేశపు చరిత్ర చెప్పదు. ఏమంటే వీరయుగానికి పూర్వంనాటి విషయాలు గ్రీకులకే జ్ఞాపకం లేవు.

గ్రీకు ప్రజలు ఒకచిన్న దేశంలో చాల ఒత్తుగా నివసించేవారు. అందుచేత వారి మాండలికాలలో తేడా అంత విస్పష్టంగా కనబడలేదు. విశాలమైన అమెరికన్ అడవులలో జీవించిన వారిలో ఈ తేడా చాలా స్పష్టంగా కనిపిస్తుంది. అయినా గ్రీసులోకూడా ఒకే ప్రధాన మాండలికం మాట్లాడే తెగలు ఐక్యంగా జీవిస్తాయి. ఆఖరుకి చిన్న అత్తికాకుకూడా ఒక ప్రత్యేకమైన మాండలికం వుంది. అదే క్రమంగా గ్రీసుదేశపు వచన సాహిత్యంలో ప్రధాన భాషగా రూపొందింది.

హోమరు వ్రాసిన పురాణ గ్రంథాలను చదివితే, ఆనాటికే గ్రీకు తెగలు చిన్నచిన్న రాజ్యాలుగా ఏకం అయ్యాయనీ, అయినా ఇంకా గణాలూ, సోదరకూటాలూ, తెగలు తమతమ స్వాతంత్ర్యాన్ని పూర్తిగా అనుభవిస్తూనే వున్నాయనీ కనబడుతుంది. అప్పటి కానాటికే వారు పట్టణాలకు గోడలు కట్టుకొంటున్నారు. మందలు, వ్యవసాయం వృద్ధిపొందింది, చేతి వృత్తులు ప్రారంభం అయినాయి. దానితో జన సంఖ్య పెరిగింది. సంపన్నతలో హెచ్చుతగ్గులు అధిక మయాయి. తత్ఫలితంగా ప్రాచీనకాలపు ఆదిమ ప్రజాతంత్ర వ్యవస్థలో కులీనులంటూ కొందరు తల ఎత్తారు. మంచి భూమికోసమూ, దోపిడికోసమూ చిన్న చిన్న రాజ్యాలు నిరంతరం యుద్ధాలు చేస్తూండేవి. యుద్ధంలో చేజిక్కిన వారిని దాసీసలుగా అట్టే వుంచుకోవడం ఆనాటికే వచ్చింది.

ఈ తెగలలోనూ, చిన్న రాజ్యాలలోనూ నిర్మాణం ఈ దిగువ మాదిరిగా వుండేది.

1. సమితి (బౌలే) ది శాశ్వతమైన పెత్తనంగా సాగేది. గణ నాయకులు ప్రథమంలో సమితి సభ్యులుగా వుండేవారు. కాలక్రమేణా వారి సంఖ్య బాగా పెరిగింది. ఇంకసమితిలోకి సభ్యుల్ని ఏరితీసుకొనేవారు. దానితో కులీనశక్తులు బయలుదేరారు. క్రమంగా బలపడ్డారు. వీర యుగం నాటి సమితిలో ప్రఖ్యాత వ్యక్తులు సభ్యులుగా వుండేవారని దియోనిసస్ * స్పష్టంగా వ్రాస్తున్నాడు. ప్రధాన విషయాలన్నింటా సమితిది అంతిమ నిర్ణయాధికారం. ఎటియోక్లసు † శరీరాన్ని యావత్తు మర్యాదలతో ఖననం చెయ్యాలనీ, పోలినీసెస్ ‡ శరీరాన్ని కుక్కలు పీక్కు తినేటట్లు పారెయ్యాలనీ థెబెస్‌లోని సమితి ఆజ్ఞాపించినట్లు అస్కిలస్ వ్రాశాడు. తర్వాత కాలక్రమేణా రాజ్యాంగం ఏర్పడ్డప్పుడు ఈ సమితి శాసనసభగా మార్పుచెందింది.

2. ప్రజాసభ (అగోరా) - ఇవాక్యూ ప్రజ స్త్రీ పురుష లందరూ సమితి సమావేశం అప్పుడు చుట్టూ నిలబడి వుండే వారనీ, చర్చల లో క్రమబద్ధంగా పాల్గొంటూ దాని నిర్ణయాలు రూపొందడంలో సాయపడే వారనీ మనం చూశాం. హోమరుకాలంనాటి గ్రీసుదేశీయులలో ఇది ఒక పూర్తిప్రజాసభగా పరిణతిపొందింది। ప్రాచీనకాలపు జర్మన్లలోనూ అంతే. వారిలో ఈ మహాసభను 'ఉమ్‌స్టాండ్' అనేవారు. ఇదొక ప్రాచీన కాలపు జర్మను న్యాయశాస్త్రంలోని పారిభాషికపదం. ఈ శబ్దానికి అర్థం "చుట్టూ

* హాలికార్నాసస్‌నివాసి దియోనిసస్ క్రీ.పూ. 1 వ శతాబ్దం నాటి వాడు. గ్రీకు జాతి వాడు. అలంకారం శాస్త్రం, చరిత్రలలో పండితుడు.

† ఎటియోక్లస్ ‡ పోలినీ సెస్. అన్నదమ్ములు, గ్రీకు పురాణ గాథలలోనివారు. థెబెస్ రాజు ఎడిపెస్ కొడుకులు. అన్నదమ్ములు కలహించుకొని ఒకరినొకరు చంపుకొన్నారని కథ. దీన్ని అస్కిలసు "థేబెస్‌మీదికి ఏడుగురిదాడి" అనే గ్రంథంలో వర్ణించాడు.

నిలబడినవారు" అని. ప్రధానమైన విషయాలను నిర్ణయించవలసి వచ్చి నప్పుడు సమితి ఈమహాసభను సమావేశపరిచేది. దానిలో ప్రతిఒక్కరికీ మాట్లాడేహక్కు వుంది. చేతులు ఎత్తడం ద్వారా సమ్మతి తీసుకొనే వారు. (నివేదనలో ఆస్కిలస్ చెప్పినట్లు) ఒకప్పుడు ఔను - కాదు ద్వారా తేల్చేవారు. ఈ మహాసభది అంతిమ నిర్ణయం. ఈ విషయాన్నే సోక్మన్ "ప్రాచీనకాలపు గ్రీసు" అనే దాంట్లో ఇల్లా వ్రాశాడు: "ప్రజల సహకారం అవసరమయ్యే విషయాన్ని చర్చించినప్పుడు, వారి కిష్టంలేని దానిని నెత్తిన రుద్దినట్టు హోమరు ఎక్కడా చెప్పలేదు. ఆ రోజుల్లో తెగలో వయసువచ్చిన ప్రతి మగవాడు ఒక యోధుడు. ప్రజలకు అతీతంగా, వారికి వ్యతిరేకంగా వుండే ప్రభుత్వం ఏదీ అప్పటికి లేదు. ప్రాచీన ప్రజాతంత్ర వ్యవస్థ మంచి ఉచ్ఛదశలో వుంది. సమితియొక్క బాసిలస్ యొక్క అధికారం, హోదా తెలుసుకోవాలంటే దీనిని గమనించాలి.

3. సైనికాధికారి (బాసిలస్) : ఈ విషయమై మార్క్సు చేసిన వ్యాఖ్యయిది : "జన్మాదీ రాజవంశీకుల నౌకర్లుగా వ్యవహరిస్తున్న యూరపు ఖండపు విద్వాంసులు బాసిలస్‌ను రాజుగా [ఈనాటి అర్థంలో] పేర్కొంటున్నారు. అమెరికా దేశీయుడైన మోర్గన్ [రిపబ్లిక్ పక్షపాతి] కాదంటున్నాడు. "వీరయుగంనాటి గ్రీకుసేనాధిపతులను గ్లాడ్‌స్టన్ పెద్ద మనిషి లక్షణాలున్న రాజులూ, రాజకుమారులూ అంటున్నాడు." — అంటూ ఆయన గ్లాడ్‌స్టన్‌నూ, ఆయన లాంటివారినీ ఎగతాళి చేశాడు."

ఇరాక్వాలలోనూ, ఇతర ఇండియనులలోనూ సాకెములా, నాయకులా సాంప్రదాయతను గురించి పైన తెలుసుకున్నాం. వుద్యోగు లందర్నీ చాలావరకు గణాలలోనే ఎన్నుకొనేవారు, కనుక అవి ఆ గణాలనుంచే వారసత్వంగా వచ్చేవి. ఖాళీవచ్చినప్పుడు దానిలో వెనుకటివాని సన్నిహిత గణబంధువును నియమించడం క్రమంగా వచ్చింది. సాధారణంగా తమ్ముణ్ణో, సోదరి కొడుకునో నియమించేవారు, ఏదోపెద్ద కారణం వుంటేతప్ప అతనిని కాదనడం వుండేదికాదు. గ్రీసులో తండ్రి హక్కు గుర్తించబడడంచేత ఆ హక్కు ప్రకారం బాసిలసు హోదా

కొడుక్కూ కొడుకుల్లో ఒకనికి సంక్రమించేది. అంటే తర్వాత అధికారిని ప్రజలు ఎన్నుకొన్నా సాధారణంగా కొడుకులనే ఎన్నుకొనేవారని దానినిపట్టి గ్రహించవచ్చును. అయితే ప్రజలు ఎన్నుకొనవసరం లేకుండా చట్టరీత్యాగానే వారసత్వం కొడుక్కూ వచ్చేస్తూందనుకోకూడదు. గ్రీకులలోనూ, ఇరాక్వ్యాలలోనూ కూడ గణాలలోనే ప్రత్యేకంగా కులీన కుటుంబాలు ఏర్పడడానికి ప్రాతిపదిక ఇక్కడ మనకు కనబడుతూంది. గ్రీకులలో నాయకత్వమూ, రాజరికమూ భవిష్యత్తులో వంశపారంపర్యం అయ్యేటందుకు కావలసిన ప్రాతిపదిక ఏర్పడ్డట్టే కనబడుతుంది. వారిలో బాసిలసును ప్రజలు ఎన్నుకొంటున్నారనుకోవలసి వుంది. కనీసం రోమనులలో రాజువిషయంలో జరిగినట్లు సమితియో, ప్రజాసభో - సర్వాధికారం వుందన్న సంస్థ ఏదో ఒకటి ఆ అధికారాన్ని ధృవపరచ వలసి వుండేది.

ఇలియడ్ కావ్యంలో అగమెమ్నాన్ గ్రీకుప్రజలకు సర్వాధికారి అయిన రాజుగా గాక, ఒక నగరాన్ని ముట్టడిస్తున్న ఫెడరల్ సైన్యాల సర్వ సైన్యాధ్యక్షుడుగా కనిపిస్తాడు. గ్రీకులలో అంతఃకలహం వచ్చి నప్పుడు ఒడెస్సస్ ఈ విషయాన్నే పేర్కొంటాడు : బహుజన పరి పాలన క్షేమంకాదు. ఒకరిని పరిపాలకుడుగా పెట్టుకుందాం - అన్నాడు. [రాజదండం మాట తర్వాత తర్వాత చేర్చిన ప్రక్షిప్తం.] దీనిమీద మార్క్స్ ఇల్లా వ్యాఖ్యానించాడు. "ప్రభుత్వం ఏ రూపంలో వుండాలనే విషయం మీద ఒడెస్సస్ ఇక్కడ ఉపన్యసించడంలేదు. యుద్ధరంగంలో సర్వసేనాధిపతి ఆజ్ఞలకు కట్టుబడి వుండాలని కోరుతున్నాడాయన. ట్రాయ్ నగరం ముందు గ్రీకులు సైనికులుగా వచ్చారు. ప్రజాసభ కార్య క్రమాలు ప్రజాతంత్ర పద్ధతులలోనే సాగుతున్నాయి. బహుమతులను - అంటే దాడులలో చేజిక్కినవానిని పంచిపెట్టవలసి వచ్చినప్పుడు అఖిల్లసు ఆ పనిని అగమెమ్నాన్‌కో, మరోబాసిలసుకోగాక 'అకాయియనుల సంతా నానికి'-అంటే ప్రజలకు వప్పచెప్తున్నాడు. 'జియస్‌వంశీకుడ'నీ 'జియస్ పరిపోషితుడ'నీ ఎవరికన్నా విశేషణం తగిలించినందువలన వచ్చే ప్రత్యేకత ఏమీలేదు. ఏమంటే, ప్రతి గణమూ ఎవరో ఒక దేవుని

సంతానమే. తెగ నాయకుని గణం ఒక ప్రసిద్ధుడైన దేవత సంతానంగా భావించేవారు. ఇక్కడ అప్రసిద్ధుడైన దేవుడు 'జియస్.' ఇలియడ్ తర్వాత చాలాకాలానికి వ్రాయబడిన ఒడెస్సే కావ్యంలో కూడా పందులకాపరి ఎమయుస్‌వంటి క్రీతదాసుల్ని కూడా దైవాంశ సంభూతులు అనే వర్ణించారు. చారణుడైన మిలియసునూ, అంధగాయకుడు డెమొడోకసునూ 'హెరో'లని పిలవడం ఒడెస్సే కావ్యంలో కనబడుతుంది. హోమరు రాజులనుగా వర్ణించిన వారిని గ్రీకు రచయితలు 'బాసిలస్'లని పేర్కొంటున్నారు. [ఏమంటే హోమరు వర్ణించిన రాజుల ప్రధాన లక్షణం సైన్యాధిపత్యం.] ఈ రాజులతోపాటు సమితీ, ప్రజాసభా కూడ పనిచేస్తూండేవి దీనినిపట్టి అవొక 'సైనిక ప్రజాతంత్రం' అనుకోవలసి వుంది."

బాసిలసుకు సైనిక బాధ్యతలేకాదు. పురోహితుడూ, న్యాయాధికారీ కూడ ఆయనే. న్యాయాధికారిగా నిర్వహించవలసిన బాధ్యతలనుగురించి స్పష్టంగా ఎక్కడా చెప్పబడలేదు. కాని తెగయొక్క ముఖ్య ప్రతినిధిగానో, తెగల సమాఖ్యయొక్క ముఖ్యప్రతినిధిగానో ఆయన పురోహితుని బాధ్యతలను నిర్వర్తించవలసి వుంటుంది. పౌర, పరిపాలనా బాధ్యతలనుగురించి ఎక్కడా చెప్పలేదు. కాని, సమితిలో ఆయన ఉద్యోగ రీత్యా ప్రతినిధిగా (ఎక్స్ అఫీషియో) పాల్గొంటాడు. శబ్దశాస్త్రరీత్యా చూస్తే బాసిలస్ అనే మాటను 'కింగ్' అని అనువదించడం సరియైనదే. కింగ్, కునింగ్ అనేవి కుని, కున్నే అనే పదాలనుంచి వచ్చాయి. వాటికి అర్ధం గణానికి నాయకుడు. అయితే ప్రాచీనకాలంనాటి గ్రీకు దేశీయుల బాసిలసుకు ఈనాడు మనం 'కింగ్' అనే మాటకు చెప్పే అర్ధంచెల్లదు. థూసిడైడెస్ * ప్రాచీనకాలపు బాసిలసులను పాత్రికే (పితరులు) అని స్పష్టంగా పేర్కొన్నాడు. అంటే ఆతనికా అధికారం గణంనుంచి లభించిందన్నమాట. ఆ వుద్యోగి అధికారాలు నిర్దిష్టం చేయబడ్డాయని, అంటే పరిమితం చేయబడ్డాయని ఆయన వ్రాశాడు వీరయుగంనాడు బాసిలసు

* థూసిడైడెస్ రమారమి క్రీ. పూర్వం 455-396 నాటివాడు. గ్రీకు చరిత్రకారుడు.

స్వతంత్ర ప్రజమీద నాయకుడు అనీ. ఆతడు సైన్యాధిపతి, న్యాయాధిపతి, ప్రధాన పురోహితుడుగా వ్యవహరిస్తాడనీ అరిస్టాటిల్ వ్రాస్తున్నాడు. అందుచేత బాసిలసుకు ఈనాడు మనం చెప్పే అర్థంలో ప్రభుత్వాధికారం లేదు. *

ఈ విధంగా వీరయుగంనాటి గ్రీకు వ్యవస్థలో ప్రాచీన కాలపు గణ సంఘపద్ధతి ఇంకా బలీయంగా వున్నట్లే మనకు తెలుస్తూంది.

అయితే రెండో వేపున అడిశిథిలం అవుతున్న లక్షణాలుకూడా కనబడుతూనే వున్నాయి. తండ్రి హక్కు ఏర్పడింది. మగవాని సంతానానికేఆస్తి వారసత్వంవచ్చింది దానితోకుటుంబంలో ఆస్తిపోగుపడింది. ఆ ఆస్తి బలంతో గణంకన్న కుటుంబం దృఢపడింది. ఆస్తిలో హెచ్చు తగ్గులతో సాంఘిక నిర్మాణంలో కూడా మార్పు వచ్చింది. వంశక్రమాగతమైన కులీన వ్యవస్థకూ, రాజరికానికీ ప్రాతిపదికలు ఏర్పడ్డాయి. బానిసత్వం ప్రత్యక్షమయింది. మొట్టమొదట యుద్ధ ఖైదీలకు మాత్రమే

---

* గ్రీకు దేశీయుల బాసిలసును గురించి చెప్పినట్లే అజ్ టెక్ తెగవారి సేనానాయకుణ్ణి కూడా అధునాతనార్థంలో రాజు అని పేర్కొన్నారు. ప్రారంభంలో ఈ విషయం సరిగ్గా అర్థ గాక స్పెయిన్ దేశీయులు అతిశయోక్తులు చెప్పేరు. దానితర్వాత తర్వాత బుద్ధిపూర్వకంగానే తప్పు చెప్పారు. ఈ రిపోర్టులను మొట్టమొదటి మారుచారిత్రక దృష్టితో విమర్శించినవాడు మోర్గనే. మెక్సికోవాసులు అనాగరిక యుగపు నడిమిదశలో జీవిస్తున్నారనీ, అయితే న్యూమెక్సికోలోని పాబ్లో ఇండియనులకన్న ఉన్నత దశలోనే వున్నారనీ చెప్పాడు. సందర్భశుద్ధి లేకుండా వున్న రిపోర్టుల్నిపట్టిచూస్తే వారి నిర్మాణం ఈవిధంగా వున్నట్లు కనబడుతూంది: మూడు తెగల సమాఖ్య (కాన్ఫెడరసీ) ఏర్పడివుండేది. తదితర తెగలు యెన్నో ఆ సమాఖ్యకు అనుబంధించివుండేవి. ఈ సమాఖ్యకు ఒక ఫెడరల్ కౌన్సిలు, ఫెడరల్ సైన్యాల నాయకుడు వుండేవారు. స్పెయినువారా నాయకుణ్ణే "చక్రవర్తి" అన్నారు. — [ఏంగిల్సు వ్రాసిన పాదపీఠిక.]

ఇది పరివ్యాప్తం. క్రమంగా తమ తెగలోనివారినీ, తమ గణంలోని వారినీ కూడ బానిసల్ని చేయసాగారు. పూర్వం తెగల మధ్యనే ఘర్షణలు వుండేవి. ఇప్పుడు జీవనాధారం కోసం, పశువుల్నీ బానిసల్నీ, ఇతర సంపదల్నీ దోచి తెచ్చుకొనేటందుకోసం పనికట్టుకొని దాడులూ, దండయాత్రలూ సాగిస్తున్నారు. సంగ్రహంగా చెప్పాలంటే సంపదలకు మెప్పు లభించింది ధనం సర్వసమ్మాన్యం అయింది. సంపదలను బలాత్కారంగా దోచుకొనేటందుకు వెనుకటి గణ సంఘ అంగాలనే వుపయోగించుకొంటున్నారు. అప్పటికున్నలోపం అల్లా వొక్కటే. గణసంఘంలోని సామూహిక పద్ధతులకు వ్యతిరేకంగా వ్యక్తులు పోగు చేసుకొన్న ఈ కొత్త సంపదలను కాపాడే వ్యవస్థకావాలి. గతంలో ఎంతో చులకనగా చూసే వ్యక్తిగత ఆస్తిని పవిత్రమైనదిగా స్థిరపరచాలి. ఆ పవిత్రతను కాపాడడమే మానవ సమాజంయొక్క ప్రధానగమ్యంగా ప్రకటించాలి. అంతేకాదు కూడా. ఆస్తులు సంపాదించేటందుకు అనుసరిస్తున్న నవీన పద్ధతులకు, సంపదల నిరంతరాభివృద్ధికి సమాజంయొక్క ఆమోదం లభించాలి. సమాజంలో కొత్తగా తలయెత్తుతున్న వర్గవిభజననే కాకుండా, ఆస్తిపరుల వర్గం ఆస్తిలేని వర్గాలను దోచుకొని, పాలించే హక్కునుకూడా శాశ్వతంగా సాగనిచ్చే సంస్థ కావాలి.

ఆ మాదిరి సంస్థ ఏర్పడింది. "రాజ్యాంగం" సృష్టించబడింది.

# 5

# అథీనియను రాజ్యాంగం అవతరణ

రాజ్యాంగం అనేది ఏవిధంగా క్రమంగా అభివృద్ధి పొందిందో ప్రాచీనకాలంలో ఏథెన్సులో జరిగిన పరిణామాల్ని చూస్తే అర్థం అవుతుంది. గణవ్యవస్థకు చెందిన కొన్ని అంగాలు మారాయి. వానిలో కొన్నింటిస్థానే నూతనాంగాలు ఏర్పడ్డాయి. చివరకు అన్నింటినీ తొలగించి ప్రభుత్వోద్యోగులు ఆధిపత్యం వహించారు. సాయుధులైయిన ప్రజలు గతంలో గణాలు, సోదరకూటాలు, తెగలద్వారా ఆత్మరక్షణ చేసుకొనేవారు. ఇప్పుడు ప్రభుత్వాధికారుల అధీనంలో, ప్రజానీకానికి వ్యతిరేకంగా వుపయోగించుటకై సాయుధమైన 'ప్రభుత్వబలగం' ఒకటి ఆ సాయుధప్రజ స్థానాన్ని ఆక్రమించింది. ఈ మార్పులన్నీ ప్రాచీన కాలపు ఏథెన్సుకేసి చూస్తే బాగాతెలుస్తాయి. వస్తూవున్న ఈ మార్పుల స్వరూపాన్ని చాలాభాగం మోర్గన్ వర్ణించాడు. ఆ మార్పులకు కారణభూతమైన ఆర్థిక ప్రాతిపదికను నేను చేర్చాను.

అథీనియను తెగలు నాలుగూ వీరయుగంనాటికి ఇంకా అత్తికా ద్వీపకల్పంలో వేర్వేరు భాగాలుగా నివసిస్తూ వుండేవి. ఆ తెగలతాలూకు పన్నెండు సోదరకూటాలు సెక్రోప్స • నిర్మించిన పన్నెండు నగరాలలో

---

• సెక్రోప్స – గ్రీకు పురాణగాథలలో సగం మనిషీ, సగం పాముగా వర్ణించబడిన దేవత. ఈయన అత్తికాలో పన్నెండు పట్టణాలను నిర్మించాడనీ, అత్తికాకు ధర్మచట్టాన్ని వ్రాశాడనీ కథ.

వేరువేరే నివసిస్తున్నాయి. వీరయుగంనాటి నిర్మాణమే వానికుంధేధి: ఒక ప్రజాసభ. ప్రజా ప్రతినిధుల సమితి, బాసిలను వుండేవారు. లిఖిత రూపంలో చరిత్ర లభిస్తున్న కాలంనాటికి అప్పుడే భూమి పంపిణీ జరిగి పోయింది. అది వ్యక్తి ఆస్తిగా పరివర్తన పొందింది. అంటే అనాగరిక యుగపు ఎగువదశ ముగిసే కాలంనాటికి అనుగుణమైన దశ అది. ఆ నాటికి వర్తకపు సరుకుల వుత్పత్తి బాగా పరిణతిపొందింది. దానికి అను గుణంగానే వ్యాపారమూ వృద్ధి పొందింది. కాయ ధాన్యాలను పండించ డానికితోడు ద్రాక్షాసవం, నూనెతీయడం జరుగుతూంది. అరేబియన్ సముద్ర వ్యాపారం అంతకంతకధికంగా ఫొనీషియనుల*చేతినుంచి అథీనియనుల చేతికిజారిపోతూంది. భూముల్ని అమ్ముకోవడం, కొనుక్కోవడం, వ్యవ సాయం-చేతివృత్తులూ విడిబడడం, వ్యాపారం, నౌకాయానం మొదలయిన వానికి ఫలితంగా గణాలు, సోదర కూటాలు, తెగలలోని ప్రజలు పర స్పరం కలిసిపోయారు. సోదర కూటాలకూ, తెగలకూ చెందిన మండ లాలలోకి పైవారు చాలమంది వచ్చి చేరారు. ఆ విధంగా చేరినవారు స్వదేశీయులే అయినా ఆ నిర్మాణాలకు చెందినవారుకారు. అందుచేత తమయింట్లోనే వారు పరాయివారుగా పరిగణించబడతారు. శాంతికాలంలో ఏథెన్సులోని బాసిలసునుగాని, ప్రజాప్రతినిధి సభనుగాని సంప్రతించ కుండానే తెగలూ, సోదర కూటాలూ తమ పనులను తాము చక్కబెట్టు కొనేవి. అయితే ఆ తెగకూ, సోదర కూటానికీ సంబంధించని జనానికి వాని నిర్వహణలో పాత్ర వుండక పోవడం సహజమే.

ఈవిధంగా, గణ సంఘానికిచెందిన పరిపాలనాంగాలు క్రమపద్ధ తిలో పనిచేస్తూండేవల్లా వీరయుగం నాటికే గంద్రగోళంలో పడ్డాయి. వానిని మార్చుకోవలసిన అవసరం ఏర్పడింది. నూతన వ్యవస్థను ప్రవేశ

---

* ఫొనీషియాలోని ప్రజలు ఫొనీషియనులు. మధ్యధరా సము ద్రాన్ని అనుకొనివున్న ఉత్తర ఆఫ్రికా తూర్పుప్రాంతం ఫొనీషియా అని పిలువబడేది.

పెట్టారు. దీనిని తీస్యూస్ * ఏర్పరచాడంటారు. ఏథెన్సులో కేంద్రపరిపాలనా సంస్థను ఏర్పరచడం ఈ మార్పులోని ప్రధానాంశం. అంటే ఇంతవరకూ తెగలు తమంత తాముగా చూసుకొంటున్న బాధ్యతలను కొన్నింటిని, అందరికీ సంబంధించిన వ్యవహారాలనుగా ప్రకటించారు. వాని బాధ్యతను ఏథెన్సులో వుండే సార్వజనిక సమితికి వప్పచెప్పారు. అమెరికాలోని ఆదివాస ప్రజలెవ్వరూ ఎప్పుడూ వేసివుండని ముందడుగు అధీనియమును వేశారు. ఇరుగు పొరుగు తెగలు కలిసి ఏర్పడిన సాధారణ సమాఖ్య పోయింది. దాని స్థానంలో తెగలన్నీ కలిసి ఒకరాజ్యంగా ఏర్పడడం వచ్చింది. దీనితో అందరికీ వర్తించే అధీనియను న్యాయశాస్త్రం ఏర్పడింది. తెగలు, గణాలూ అనుసరిస్తున్న న్యాయశాస్త్ర సంప్రదాయాలకిది అతీతం. ఏథెన్సు పౌరులయిన వారికి అది కొన్ని హక్కుల నిస్తూంది. తమతెగకు సంబంధించని ప్రాంతంలో కూడా జనులకు న్యాయరక్షణ అదనంగా లభిస్తూంది. గణ నిర్మాణాన్ని శిధిలమొనర్చిన చర్యలలో యిది మొదటిది.

అత్తికా తెగలకు చెందని. వారి గణవ్యవస్థకు సంబంధించని బయటి ప్రజలను తర్వాత తర్వాత క్రమంగా దానిలో చేర్చుకొన్నారు. దానికిది నాంది. గణాలు, సోదర కూటాలూ, తెగల విభజనతో నిమిత్తం లేకుండా అధీనియను ప్రజలందరినీ తీస్యూస్ మూడువిభాగాలుగా చేశాడంటారు. యూపాట్రేలు. అంటే కులీనులు. జియోమోరే-అంటే భూమి దున్నేవారు. డెమియూర్గీ - అంటే చేతిపనివృత్తులవారు. ప్రభుత్వోద్యోగాలను నిర్వహించే ప్రత్యేకాధికారం కులీనులకే విధించారు. అయితే వివిధ వర్గాలమధ్య న్యాయశాస్త్ర విభేదాలను సృష్టించకపోవడంచేత ఈ విభజన కార్యరూపం ధరించనేలేదు. అయితే దీనిని గమనించడం అతిముఖ్యం. చాపక్రింద నీరులాగ సమాజంలో అడుగుపెడుతున్న నూతన శక్తుల స్వరూపం వీటిలో కనబడుతూంది. గణాలలోని కొన్ని కుటుంబాలు ఆచారం రీత్యా అధికారంలో వుండడం అనేది అప్పటికే వచ్చింది.

* తీస్యూస్ గ్రీకు పురాణగాధలలోని వీరుడు. ఏథెన్సు నగరాన్ని మొదట పాలించినవాడు. బంగారు వున్ని కథలో నాయకుడు.

ఇంచుమించు ఆ ప్రత్యేకాధికారాన్ని ప్రశ్నించేవారు కూడా లేరనేది కన బడుతూంది. ఈ కుటుంబాలు సంపన్నములు. అందుచేతనే బలవంతా లూను. ఇవి గణంతో నిమిత్తం లేకుండా ప్రత్యేక సౌకర్యాల ననుభ విస్తున్న వర్గంగా ఏకంకావడం ప్రారంభమయింది. అప్పుడే తలఎత్తిన రాజ్యాంగం వా రీవిధంగా ఆపోశన పట్టడానికి అంగీకరించింది. మరో సంగతికూడా తెలుస్తూంది. వ్యవసాయదారులకూ, చేతివృత్తులవారికీ మధ్య పని విభజన బాగా స్పష్టపడిపోయింది. అందుచేత సమాజాన్ని గణాలుగానూ, తెగలుగానూ విభజించే పాత పద్ధతి పనికిరాదనే స్థితి ఏర్పడింది. అన్నింటికన్నా ప్రధానమైనది మరొకటుంది. రాజ్యాంగానికీ గణ వ్యవస్థకీ ఏమాత్రం పొత్తు వుండదని అది చూపుతూంది. రాజ్యాం గాన్ని నిర్మించే మొదటి ప్రయత్నంలోనే గణాలను విడగొట్టేశారు. గణ సభ్యులు అగ్ర అధమ వర్గాలుగా విభజింపబడ్డారు ప్రథమంలో. తర్వాత అధమవర్గాన్ని వృత్తులనుబట్టి రెండు వర్గాలుగా విభజించారు. ఆ విధంగా ఒక వర్గాని కొకవర్గాన్ని పోటీపెట్టారు.

అక్కడనుంచి సోలోన్ * కాలంవరకు ఏథెన్సు రాజకీయ చరిత్ర అంతగా తెలియరావడంలేదు. బాసిలసు హోదా నిరుపయోగ దశకు వచ్చింది. కులీనులనుంచి ఎన్నుకోబడిన ఆర్కనులు ప్రభుత్వాధిపతు లయ్యారు. కులీన పరిపాలన అంతకంతకు బలపడుతూవచ్చి కొసకు క్రీ. పూ. 600 ప్రాంతంలో దుర్భరమైపోయింది. ప్రజల స్వాతంత్ర్యాన్ని నులిపివేయడానికై వారు ప్రధానంగా ధనమూ, వడ్డీ వ్యాపారమూ నుపయోగించారు. కులీనులు ముఖ్యంగా ఏథెన్సులోనూ, ఆ చుట్టుపట్లనూ నివసించేవారు. సముద్ర వ్యాపారమూ, మధ్య మధ్య సముద్ర దొంగ తనాలూ తో వారు సంపన్ను లయ్యారు వారి చేతులలో ధనం సమకూడింది. సహజమైన ఆర్థిక వ్యవస్థపై ఏర్పడిన పల్లెటి గ్రామాల జీవితంలో యీ ధనం ప్రవేశించి, వానిలోని సమిష్టితత్వాన్ని విశీర్ణం చేసేసింది. గణ

* సొలోన్ – రమారమి 638–558 (క్రీ. పూ.) నాటి గ్రీకు రాజకీయ నాయకుడు. క్రీ. పూ. 594 ప్రాంతంలో ఆయన ప్రకటించిన చట్టాలే అథీనియన్ రాజ్యాంగానికి ప్రాతిపదిక.

నిర్మాణానికీ ద్రవ్య విధానానికీ పొత్తు ఉండదు. కొద్దిపాటి భూములను కేటాయించి యిచ్చిన అథీనియన్ రైతులు వినాశంకావడమూ, వారికి రక్షణనిస్తున్న గణ సంబంధాలను శిథిలపరచడమూ ఏకకాలంలో జరిగాయి. అనాటికి అప్పుడే అథీనియన్లు తనఖా పద్ధతిని కనిపెట్టారు, అప్పు పత్రాలుగాని, తనఖాపత్రాలుగాని గణాలనూ, సోదర కూటాలనూ లెక్కచేయవు. పూర్వకాలపు గణవ్యవస్థ ధనాన్ని ఎరగదు. పరపతి, ధనరూపమైన రుణం దానికి తెలియదు. అందుచేత కులీనులు సాగించే ధన పరిపాలన విస్తరించినకొద్దీ నూతన చట్టాలు కావలసిన వచ్చాయి. రుణం తీసుకొన్నవానినుంచి రుణదాతకది రక్షణ నిస్తుంది. ధనస్వాములు చిన్న రైతుల్ని దోచుకొనేటందుకది అధికారం ఇస్తుంది. ఈ భూమి ఫలానావారికి ఫలానా మొత్తానికి తనఖాపెట్టివున్నదనే మాటలు కట్టిన రాటలు ఆత్తికా ప్రాంతంలో ఎక్కడచూసినా ప్రత్యక్షమైనాయి. అలాంటి రాటలు పాతివుండని భూములు చాలవరకు వడ్డీ ఇవ్వనందుకో, తనఖాకాలం దాటిపోవడంచేతనో అమ్మడై, కులీనులయిన వడ్డీ వ్యాపారుల ఆస్తులలో కలిసిపోయినవే. అంతవరకూ భూమికామందుగావున్న రైతును కౌలుదారుగా ఆ భూమినే చేసుకోనిస్తే గొప్పమాటే. పండించినదాంట్లో కొత్త యజమానికి ఆరింట అయిదు వంతులు చెల్లించాలి. మిగిలిన ఒక వంతుతో అతడు బ్రతకాలి. అసలది అంతతో కాలేదు. తనఖా భూమి అమ్మగా వచ్చిన ధనంతో రుణం తీరకపోతే దాని కింకా వున్న భూమిని తనఖా పెట్టాలి. అలా పెట్టేటందుకేమీలేకపోతే రుణం తీర్చేటందుకోసం తన సంతానాన్ని విదేశాలలో బానిసలనుగా అమ్మేసి రుణం తీర్చాలి. తండ్రి తన బిడ్డల్నే అమ్ముకోవడం! తండ్రి హక్కుకూ, దంపతీ వివాహానికీ ప్రధమంగా కలిగిన లాభంఇది! ఆ రక్తపిపాసి కంతకూ తృప్తికలగకపోతే, అప్పుతీసుకొన్న వానిని కూడా అతడు బానిసగా అమ్మివేయవచ్చు. అథీనియను ప్రజలలో నాగరికత ఈ విధంగా ప్రారంభమయింది.

గణవ్యవస్థకు అనుగుణంగా ప్రజల జీవితం సాగుతూన్నరోజుల్లో ఇటువంటి విప్లవం సాధ్యంకాదు. కాని, ఇక్కడ వచ్చేసింది ఏలా

వచ్చిందో ఎవరికీ తెలియదు. ఒక్కమారు ఇరాక్వ్యాలవంక చూద్దాం. అథీనియన్లకు తెలియకుండానే, వారి ఇష్టానికి విరుద్ధంగా అక్కడ వచ్చిన పరిస్థితులవంటివి ఇరాక్వ్యాలలో వూహించనుకూడా సాధ్యంకాదు. వారిలో ఉత్పత్తి పద్ధతులు ఏళ్ళుగడిచినా మారడంలేదు. అందుచేత వ్యవస్థ బయటనుంచివచ్చిన ఆ మాదిరి ఘర్షణలు అక్కడ రాలేవు. ధనికులకూ బీదలకూ, దోపిడీచేసేవారికీ చేయబడేవారికీ మధ్య వైషమ్యాలు అక్కడ తలఎత్తలేవు. ప్రకృతిశక్తుల్ని అదుపులో పెట్టుకోగల శక్తి ఇరాక్వ్యాలలో ఏర్పడలేదు. దానికింకా చాలకాలం పడుతుంది. అయితే ప్రకృతిసిద్ధమైన పరిమితులలోనే వారు తమ వుత్పత్తికి తామే అధికారులుగా వుంటున్నారు. వారికున్న చిన్న చిన్న పెరళ్ళలోనే పంటకాపు సరిగ్గా లేకపోయినా, తమ చెరువుల్లోనూ, వాగుల్లోనూ చేపలు దొరక్కపోయినా, అడవుల్లో వేటదొరక్కపోయినా ఏం జరుగుతుందో వా రెరుగుదురు. ఆహారం దండిగా వుండడమో, దరిద్రంగా వుండడమో మాత్రమే వా రెరుగుదురు. వారి వుత్పత్తి పద్ధతికంతే ఫలితం. అంతేగాని సమాజంలో వూహించని వుత్పాతాలేవీ రావు. గణబంధాలు తెగిపోవు. గణసభ్యులూ, సోదరకూటంలోని సభ్యులూ పరస్పర విరుద్ధవర్గాలుగా విభజించబడిపోయి ఒకరితో నొకరు ఘర్షించడం జరగదు. చాలాచాలా పరిమితం అయిన హద్దుల్లో వుత్పత్తి జరుగుతుంది. కాని, తాము వుత్పత్తిచేసినదానికి తామే యజమానులు. అనాగరికయుగపు వుత్పత్తివిధానంలోవున్న గొప్ప సౌకర్యం అదే. నాగరికయుగం ప్రవేశించడంతో అది పోయింది. ప్రకృతిశక్తులమీద ఈనాడు మానవునికున్న ప్రభుతా ఈనాడు సంఘంలో సాధ్యం అవుతున్న స్వేచ్ఛాతో ఆ సౌకర్యాన్ని తిరిగి సంపాదించుకోగలం. కాని, అది ముందు తరాలవారి కర్తవ్యం.

గ్రీకులలో అలాగ కాదు. పశువులూ, విలాస వస్తువులూ వ్యక్తిగత ఆస్తిగా వుండడంచేత వారిలో వస్తువుల మార్పిడి ప్రారంభమైంది. వస్తువులు వర్తకపు సరుకులుగా, మార్పుచెందాయి. తర్వాత వచ్చిన విప్లవాని కంతకూ మూలం ఇక్కడుంది. ఉత్పత్తిదారులు తమ

వస్తువులను సరాసరి వాడుకోలేక మార్పిడిద్వారా చేతులు దాటిపోనిచ్చారు. ఆ విధంగా వానిమీద వారికి పెత్తనం జారిపోయింది. ఇంక అదేమి అయిందో వారికి తెలియదు. ఉత్పత్తి అయిన వస్తువు ఉత్పత్తివారులకే ఎదురుతిరిగింది. వారిని దోచుకునే, అణచివేసే సాధనంగా మార్పు చెందేందుకు అవకాశం ఏర్పడింది. అందుచేత వ్యక్తులమధ్య మార్పిడి పద్ధతిని అంతరింపచేస్తేతప్ప ఏ సమాజమూ దీర్ఘకాలం తన వుత్పత్తిని తన యాజమాన్యంలో వుంచుకోలేదు. ఉత్పత్తిక్రమంలో వచ్చే సామాజిక ఫలితాలను అదుపులో వుంచుకోలేదు.

వ్యక్తులమధ్య మార్పిడి స్థిరపడి, వస్తువులు వర్తకపు సరుకులుగా మార్పుచెందాక వుత్పత్తిఅయిన వస్తువులే వుత్పత్తిదారులమీద పెత్తనం చేస్తాయన్న విషయం అథీనియనులకు త్వరలోనే తెలిసివచ్చింది. వర్తకపు సరుకుల వుత్పత్తితో రైతులు ఎవరికి వారు తమ తమ స్వంతానికి భూములు దున్నుకోవడం ప్రారంభమయింది. దానితో భూమిమీద వ్యక్తి స్వత్వంవచ్చింది. వెనువెంట ధనం వచ్చింది ధనం అనేది విశ్వజనీనమైన వర్తకపుసరుకు. అది ఇచ్చి ఏ వర్తకపు సరుకునైనా తెచ్చుకోవచ్చు. మానవుడు ధనాన్ని సృష్టిస్తున్న సమయంలో తా నొక నూతన సామాజిక శక్తిని సృష్టిస్తున్నానని ఎ`గడు ఈ విశ్వజనీన శక్తిముందు ప్రపంచమంతా మోకరించవలసివుంటుందని ఎరగడు. తన సృష్టికర్తల కిష్టం లేకుండా, వారికి తెలీకుండానే హఠాత్తుగా అవతరించిన యీ నూతన శక్తి, మహా క్రూరంగా అథీనియన్లను అదిమివేసింది. ఇక చేసేదేముంది? ధనంయొక్క విజయయాత్రను ప్రాచీన గణ వ్యవస్థ నిలపలేకపోయింది. ధనం, అప్పులవాళ్లు, ఋణగ్రస్తులు, బలాత్కారంగా ఋణాల వసూళ్లు మొదలైన వానిని ఆ వ్యవస్థ ఏమాత్రం తనలో ఇముడ్చుకోలేదు. అయితే ఒక ప్రబలమైన నూతన సామాజిక శక్తి వచ్చి కూర్చుంది. నీతిబోధలూ, గతకాలపు మేలుకోసం కలవరించడాలూ ధనాన్నిగాని, వడ్డీ వ్యాపారాన్నిగాని వెళ్ళగొట్టలేవు. దీనికితోడు గణవ్యవస్థలో అనేక చిన్న చిన్న గండ్లుకూడా ఏర్పడ్డాయి. గణ సభ్యులూ సోదర కూటాల సభ్యులూ నిరాటంకంగా ఆస్తికా

అంతటా కలిసిపోయారు. ముఖ్యంగా ఏథెన్సులో మరీను. ఒక్కొక్క తరం గడిచినకొద్దీ యిది పెచ్చు పెరిగింది. ఏథెన్సు పౌరుడు తన భూమిని తన గణానికి చెందని ఇతరులకు అమ్ముకోవచ్చుగాని, ఇంటిని మాత్రం అమ్మకూడదనే నిషేధం వున్నా పైగణాలవాళ్లు ఎక్కువగా ఏథెన్సుకువచ్చి చేరుతూనే వున్నారు. పరిశ్రమలూ, వ్యాపారమూ వృద్ధిపొందినకొలదీ వ్యవసాయమూ. చేతిపరిశ్రమలూ మొదలయిన వివిధ ఉత్పత్తిశాఖల మధ్య పనివిభజన పెంపొందింది. వేర్వేరు వృత్తులలో నేర్పూ. వ్యాపారనౌకాయానమూ మొదలయినవి వృద్ధిపొందాయి. ఇప్పుడు ప్రజలు వారి వారి పనులనుపట్టి నిర్దిష్టములయిన జనసమూహాలుగా విభజించబడ్డారు. ఒక్కొక్క సమూహానికంతకూ కొత్తకొత్త సామూహిక ప్రయోజనాలు ఏర్పడ్డాయి. ఈ సామూహిక ప్రయోజనాలకు గణంలోగాని సోదరకూటంలోగాని తావు లేదు. వానికోసం కొత్తవుద్యోగు లవసరం అయ్యారు. బానిసల సంఖ్యకూడా బాగా పెరిగింది. బహుశా ఆనాటి కప్పుడే స్వతంత్రులయిన అథీనియను ప్రజలకన్న వారిసంఖ్యే ఎక్కువగా వుండి వుంటుంది. ప్రారంభంలో గణ సమాజానికి బానిసత్వం తెలియదు. అందుచేత సంఖ్య పెరిగిపోతున్న ఈ బానిసల్ని అదుపులోవుంచే సాధనం ఆ సమాజంలో లేదు. ఇదిగాక వ్యాపారరీత్యా ఎందరో పైవాళ్ళువచ్చి ఏథెన్సులో కాపురాలు పెట్టారు. అక్కడ డబ్బు చేసుకోవడం సులువు. కనకనే వారంతా వచ్చిచేరారు. వెనుకటి వ్యవస్థ ప్రకారం కొత్తవారి కక్కడ పౌరహక్కు లుండవు. రక్షణ లభించదు. అలవాటుకొద్దీ సహించినా, అక్కడి ప్రజలలో వారు పైవాళ్లుగానే వుండిపోతున్నారు. కలియడమూలేదు.

సంగ్రహంగా చెప్పాలంటే, గణనిర్మాణానికి రోజులు దగ్గరపడ్డాయి. సమాజం రోజు రోజుకూ ఆ నిర్మాణాన్ని మించి పెరుగుతూంది. తన కళ్ళముందే తలఎత్తుతూన్న బాధాకరమయిన దుష్టశక్తుల్ని అది అరికట్టలేక పోతూంది. వాటిని అదుపులోకూడా పెట్టలేకుంది. ఈలోగా చల్లగా రాజ్యాంగం వృద్ధిపొందింది. మొట్టమొదట పట్టణాలకూ, పల్లెలకూ

మధ్య. తర్వాత పట్టణాలలోనే వివిధ పరిశ్రమలమధ్య పని విభజనతో ఏర్పడిన నూతన జనసమూహాలు తమప్రయోజనాల రక్షణకై నూతనాంగాలను నిర్మించాయి. అనేక పనులకు ప్రభుత్వోద్యోగాలు నెలకొన్నాయి. అన్నింటికన్నా ముఖ్యంగా ప్రథమదశలోవున్న యీ రాజ్యాంగానికి యుద్ధబలగం కావాలి. ఏథీనియనులలో సముద్ర వ్యాపారం ప్రాచుర్యం. అందుచేత అప్పుడప్పుడు వచ్చే చిన్న చిన్న యుద్ధాలకోసమూ, వ్యాపార నౌకల రక్షణకోసమూ నౌకాసైన్యాలు ముఖ్యంగా వుండాలి. సొలోన్‌కు పూర్వమే ఎప్పుడో తెగకు పన్నెండు చొప్పున చిన్న చిన్న ప్రాదేశిక విభాగాలు చేశారు. వీనిని 'నౌక్రారీ' లంటారు. ప్రతి నౌక్రారీ ఒక్కొక్క యుద్ధనావను మనుష్యులు, పరికరాలతోసహా సిద్ధంచేసి ఇవ్వాలి. దానితోపాటు యిద్దరు గుఱ్ఱపు రౌతుల్ని కూడా పంపాలి. గణ వ్యవస్థకు ఈ ఏర్పాటు రెండు విధాలుగా దెబ్బ. ఒకటి గణవ్యవస్థలో ఆ గణంలోని ప్రజలందరూ సాయుధులు. అందరూ పోరాటానికి సిద్ధంగా వుండేవారు. కాని, ఇప్పు డల్లాకాదు. ఒక కొత్త ప్రభుత్వ బలగం వారిస్థానే ఏర్పడింది. రెండోది – రక్త సంబంధం వున్న సమూహాల ప్రకారంగాక, ఒకేచోట నివసించడాన్నిపట్టి ప్రభుత్వ కార్యకలాపాలకోసం ప్రజలను మొట్టమొదట విడదీశారు. దీనిఫలితం ఎలా వుంటుందో చూద్దాం.

గణ వ్యవస్థ పీడితప్రజలకు ఏ మాత్రం సాయం చేయగలిగే స్థితిలేదు. అందుచేత వారు అప్పుడే తలఎత్తుతున్న రాజ్యాంగం సహాయం కోసం చూశారు. సొలోన్ రాజ్యాంగ చట్టం రూపంలో వారికి సాయం లభించింది. వెనుకటి రాజ్యాంగ వ్యవస్థ నుపయోగించుకొని అది బలపడింది. క్రీ. పూ. 594లో ఈ సంస్కరణలను ఏవిధంగా తీసుకువచ్చాడనేది మన కిక్కడ అవసరంలేదు. ఆస్తిహక్కును పరిమితంచేస్తూ ఆయన రాజకీయ విప్లవాల నెన్నింటినో తీసుకువచ్చాడు. ఈ నాటివరకూ వచ్చిన విప్లవాలన్నీ ఒక విధమైన ఆస్తినుంచి మరోవిధమైన ఆస్తికి రక్షణ నిచ్చినవే. ఒకదానికి నష్టం కలిగించనిదే రెండవదానికి అవి రక్షణ నివ్వలేవు. ఫ్రెంచి విప్లవం బూర్జువా ఆస్తిని కాపాడేందుకై ఫ్యూడల్ ఆస్తికి సిద్ధపడలింది. సొలోనీస్ తెచ్చిన

విప్లవంలో రుణగ్రస్తుల ఆస్తిరక్షణకై రుణదాతల ఆస్తికి నష్టంగలిగింది. అప్పుల్ని చల్లగా కొట్టిపారవేశారు; ఏం జరిగిందో వివరాలు తెలియవు. కాని, ఆయన పద్యాలు చదివితే తనఖాపెట్టిన భూములలోని రాటల్ని లాగిపారవేస్తారనీ, అప్పులకోసం అమ్మివేయబడినవారూ, దూర దేశం పారిపోయినవారూ తిరిగివచ్చేటట్లు చేశాడనీ తెలుస్తుంది. ఆస్తి హక్కును బాహాటంగా ధిక్కరిస్తేతప్ప ఇది జరగదు. నిజంచేత ఒక రకం ఆస్తిని కాపాడేటందుకై మరొక రకం ఆస్తిని స్వాధీపరచు కోవడమే రాజకీయ విప్లవాల గమ్యం. ఆ విధంగా స్వాధీనపరచు కోవడాన్నే దొంగిలించడంఅని కూడా అంటారు. ఈ 2500 సంవత్సరాల కాలంలోనూ ఆస్తిని నష్టపరచడంద్వారానే వ్యక్తిగత ఆస్తి రక్షించ బడుతుందనేమాట పూర్తిగా యథార్థం.

ఇంక, స్వతంత్రులయిన అథీనియనులను మళ్ళీ బానిసలను చేయ డానికి వీలులేకుండా కొన్నిఏర్పాట్లుచేయవలసివుంది. రుణానికై వ్యక్తులను హామీగావుంచుకొనే పద్ధతిపై జరిగిన ఒప్పందాలను నిషేధించడం వంటి పద్ధతులద్వారా యీ పనిని సాధించారు. రైతుల భూములను స్వాధీనపరచు కొనేటందుకై కులీనవర్గం చూపుతున్న అత్యాశను ఆటంకపరిచారు. ఒక్కొక వ్యక్తి స్వత్వంలోవుండే భూమికి గరిష్ట పరిమితిని ఏర్పర చారు. తర్వాత రాజ్యాంగ సంబంధమైన మార్పులు చేశారు. వానిలో మనం చాల ముఖ్యం అనుకొనేవి ఇవి :

ఒక్కొక్క తెగనుంచి నూరుగురు చొప్పున సమితికి నాలుగు వందలమంది సభ్యులుండాలని నిర్ణయించారు. ఇక్కడ యింకా తెగయే ప్రాతిపదికగా వుంది. నూతన రాజకీయ వ్యవస్థలోకి తీసుకున్న పాత అంశం ఇదొక్కటే. మిగిలినవన్నీ మారాయి. సొలోన్ అథీనియను ప్రజను నాలుగువర్గాలుగా విభజించాడు. వారి ఆధీనంలోవున్న భూమీ, చేతికివచ్చే పంటా ఆ విభజనకు ప్రాతిపదికలు. మొదటి మూడు వర్గాలకూ కనీసం 500, 300, 150 మెడిమ్నోల ధాన్యం పండాలి. (మెడిమ్నో అంటే 1.44 బుషెల్‌కు సమానం. 8 గ్యాలన్లు=బుషెల్) అంతకు తక్కువ భూమిగలవారూ, అసలు భూమిలేనివారూ నాలుగో

వర్గం. మొదటి మూడువర్గాలవారే ప్రభుత్వాధికారాలలోకి అర్హులు. ఉన్నతోద్యోగాలకి మొదటి తరగతివారినే నియమించాలి. నాలుగో తరగతివారు శాసనసభలో మాట్లాడవచ్చు. వోటుచేయవచ్చు. ఈ సభకే ఉద్యోగులు బాధ్యత వహించాలి. ఆ సభలోనే వారి ఎన్నిక జరుగుతుంది. ఇక్కడనే చట్టాలు చేస్తారు. ఈ సభలో నాలుగో తరగతివారిదే అధికసంఖ్య. సంపన్నులకు సౌకర్యాలనే పేరుతో కులీనవర్గాల ప్రత్యేక హక్కులను కొంతవరకూ పునరుద్ధరించారు. నిర్ణయాత్మకమైన అధికారం ప్రజలకేవుంది. యోధదళాల పునఃనిర్మాణానికి ఈ నాలుగు వర్గాలనూ ప్రాతిపదికలను చేశారు. మొదటి రెండువర్గాలూ గుర్రపు సైనికులు. మూడోవర్గం పదాతిదళంలోనే బలమైన ఆయుధాలు కలిగిన విభాగం అవుతుంది. నాలుగోది తేలిక ఆయుధాలు ధరించే కాల్బలంగానో నౌకా సైనికులుగానో పనిచేస్తారు. బహుశా వీరికి జీతాల నిస్తూండి వుంటారు.

ఆ విధంగా వ్యక్తిగత ఆస్తి అనే కొత్త అంశం రాజ్యాంగచట్టం లోకి చొప్పించబడింది. ఆయా వ్యక్తులకుండే ఆస్తినిపట్టి వారివారి హక్కులూ, బాధ్యతలూ తరతమ స్థాయిలో నిర్ణయించబడినాయి. ఆస్తి పరవర్గాలు బలపడినకొద్దీ రక్తసంబంధాలమీద ఏర్పడిన వెనుకటి వ్యవస్థ వెనుకబట్టింది. గణనిర్మాణానికి మరో ఓటమి కలిగింది.

ఆస్తినిపట్టి రాజకీయ హక్కుల తరతమస్థాయిని ఏర్పరచడం రాజ్యాంగానికి అవసరమేంకాదు. వేర్వేరు రాజ్యాంగాల చట్టనిర్మాణ చరిత్రలో దానికి ప్రాముఖ్యంవుండొచ్చు. కాని, చాలా రాజ్యాంగాలకు - అందులోనూ బాగా వృద్ధిపొందినవాటికికూడా-దాని అవసరంలేకపోయింది. ఏథెన్సులోకూడా ఇదొక తాత్కాలిక సంధిదశలో మాత్రమేవుంది. అరిస్టెయిడెస్* కాలంనుంచీ పౌరులందరూ అన్ని వుద్యోగాలకూ అర్హులే.

---

*అరిస్టెయిడెస్ - రమారమి క్రీ. పూ. 540-467 నాటివాడు. గ్రీకు రాజకీయవేత్త, కులీనుల పార్టీ సభ్యుడు. ఏథెన్సునుంచి తరిమి వేశారు.

తరువాత ఎనభయ్యేళ్ళల్లోనూ అథీనియను సమాజంలో వచ్చిన మార్పులు తదనంతర శతాబ్దాలలో బాగా బలపడ్డాయి. సొలోన్‌కు పూర్వం భూముల్లో చట్టా వ్యాపారం బాగా సాగేది. కాని, సొలోన్ దానిని అపుచేశాడు. భూములు విపరీతంగా కేంద్రీకరించిపోకుండా అడ్డుపెట్టాడు. బానిసల శ్రమ నంతకంత కధికంగా వినియోగించుకొంటూ వ్యాపారం, చేతిపరిశ్రమలు, ఉపయోగకరములయిన కళలు నిర్వహించబడుతున్నాయి. క్రమంగా అవి మానవుని కార్యకలాపాలలో ప్రధాన శాఖ లయాయి. ప్రజలలో విజ్ఞానం పెరిగింది. వెనకటల్లే తమ సోదర పౌరులనే బహు క్రూరంగా దోచుకొనేటందుకుబదులు అథీనియనులు ముఖ్యంగా బానిసలనూ, బయటినుంచి వచ్చినవారినీ దోచుకోవడం సాగిస్తున్నారు. చరాస్తి ధనరూపమైన సంపద. బానిసలు, ఓడలు అంతకంతకు పెరిగాయి. ప్రారంభదినాలలో ధనానికున్న పరిమితులలో అది భూములు కొనుక్కునేటందు కో సాధనంగా మాత్రమే వుండేది. ఇప్పుడు దానిని సంపాదించడమే ఒక ఆశయంగా మారింది. దీనితో కులీనవర్గానికి పోటీగా ధనిక వ్యాపారి, పారిశ్రామికవర్గం ఒకటి బయలుదేరింది. దీనితో అదివరకు మిగిలివున్న గణవ్యవస్థ తాలూకు అవశేషాలుకూడా అంతరించాయి. గణాలు, సోదర కూటాలు, తెగలలోని ప్రజ అత్తికా అంతటా ఇరుగు పొరుగులతో కలిసిపోయి నివసిస్తున్నారు. అందుచేత అవి రాజకీయ నిర్మాణాలుగా నిరుపయోగం అయినాయి. అథీనియన్ ప్రజలు చాలా హెచ్చుమంది అక్కడున్న తెగలు వేనికీ చెందరు. వారు బయటినుంచి వచ్చారు. ఇక్కడ వారికి పౌరసత్వం ఇచ్చారు. అంతేగాని రక్తసంబంధాలపై ఏర్పడిన పూర్వ కాలపు నిర్మాణాలలోకి వారిని దత్తు తీసుకోలేదు. వీరుగాక విదేశాల నుంచి వలసవచ్చినవారిసంఖ్య క్రమంగా పెరుగుతూవుంది. చట్టరక్షణ మాత్రమే వారి కుంటుంది. వేరేమీ వుండదు.

ఈ మధ్యకాలంలోనే వివిధవర్గాలమధ్య ఘర్షణలు కొనసాగాయి. కులీనవర్గం తన పూర్వపు ప్రత్యేక హక్కుల్ని తిరిగి సంపాదించుకో చూసింది. కొద్దికాలంపాటు వారు తమ ఆధిపత్యాన్ని సంపాదించుకొన్నారు

కూడా. ఇంతలో క్రీ. పూ. 509లో క్లీస్థనెస్* విప్లవం వచ్చింది. దానితో వారు పూర్తిగా త్రోసివేయబడ్డారు. మిగిలివున్న కొద్దిగొప్ప గణ నిర్మాణం తాలూకు అవశేషాలుకూడా రద్దు అయాయి.

గణాలూ, సోదరకూటాలూమీద నిలపడివున్న వెనుకటి నాలుగు తెగలనూ క్లీస్థెనెస్ తన కొత్త రాజ్యాంగ చట్టంలో వదిలేశాడు. వాని స్థానే సరికొత్త నిర్మాణం ఒకటి ప్రవేశపెట్టబడింది. ఆదివరకే నౌక్రారీల ద్వారా ప్రయత్నించినవిధంగా ప్రాంతాలవారీగా పౌరులను విభజించుతూంది ఈ నూతన నిర్మాణం. రక్త సంబంధాలపై ఏర్పడిన నిర్మాణంలో సభ్యత్వంగాక, నివశించే ప్రదేశాని దీవేళ ప్రాముఖ్యం. ప్రజల్నిగాక ప్రదేశాలను నేడు విభజించారు. రాజకీయంగా చూస్తే దేశవాసులు వారివారి ప్రాంతాలకు అతుక్కుపోయారు.

అత్తికా నంతనూ నూరు పట్టణాలుగా విభజించారు. వీనిని డెమే అంటారు. ఈ పట్టణాలకు స్వపరిపాలనాధికారం వుంది. డెమేలో నివసించే ప్రజలు (డెమాట్స్) ఒక ప్రభుత్వాధిపతిని (డెమార్క్), ఒక కోశాధికారిని, చిన్న చిన్న నేరాలను విచారించేటందుకై ముప్పయిమంది జడ్జీలను ఎన్నుకుంటారు. డెమాట్స్ యొక్క సభదే డెమేలలో అత్యున్నతాధికారం. స్వయంపాలితమైన అమెరికను పట్టణానికిది నకలంటూ మోర్గన్ చెప్పినమాట యథార్థం. ఏథెన్సులో రాజ్యాంగం ప్రారంభమైనదీ యూనిట్‌లోనే. దీని ఉన్నత పరిణామరూపమే ఆధునిక రాజ్యాంగంలో ప్రత్యక్షమయింది. ఆ పరిణామరూపంలో అది పర్యవసితం అవుతుంది.

ఇలాంటి పది డెమేలు ఒక తెగ. దీనికీ, పూర్వకాలం గణ వ్యవస్థనాటి తెగకీ సంబంధంలేదు. దీని నిప్పుడు స్థానిక తెగ అంటున్నారు. ఈ స్థానిక తెగ స్వపరిపాలకమైన రాజకీయసంస్థమాత్రమేకాదు. సైనిక సంస్థకూడాను. అదొక అధిపతిని ఎన్నుకొంటుంది. ఆయనను ఫైలార్థ్ అంటారు ఈయన గుర్రపుదళాలకు నాయకత్వం వహిస్తాడు. కాల్బలనాయకుడైన టాక్సియార్క్‌ను. తెగ ప్రాంతంలో సమకూర్చిన యావత్ సైన్యాలకూ నాయకుడు స్ట్రాటెగోసును ఎన్నుకొంటుంది. అంతేకాదు;

---

*క్లీస్థనెస్ — ఏథెన్సువాసి, గ్రీకు రాజకీయ వేత్త.

సైన్యాధిపతీ సైన్యాలతోసహా తెగ అయిదు యుద్ధనావలను పంపుతుంది. ప్రతి స్థానిక తెగకూ ఒక్కొక్క అత్తికావీరుడు కులదైవంగా నిర్ణయించబడతాడు. ఇంక ఏథెన్సులోని కౌన్సిలుకు ప్రతి తెగా ఏభయిమంది ప్రతినిధులను ఎన్నుకొంటుంది.

అథీనియన్ రాజ్యాంగాన్ని పది తెగలు ఎన్నుకొన్న 500 మంది ప్రతినిధుల కౌన్సిలు పరిపాలించేది. దానికి పైన ప్రజాసభ వుండేది. దానిలో ప్రతి అథీనియను పౌరుడూ పాల్గోవచ్చు; వోటుచేయవచ్చు. ఆర్కనులూ, ఇతర వుద్యోగులూ వివిధ న్యాయపరిపాలనా శాఖలను నిర్వహించేవారు. సర్వాధికారియనేవా దెవ్వరూ ఏథెన్సులో లేడు.

వలసవచ్చినవారూ, స్వాతంత్ర్యంపొందిన బానిసలూ మొదలయిన అధీనప్రజల సంఖ్య అత్యధికం కావడంవల్ల, యీ నూతన రాజ్యాంగచట్టం వల్ల గణవ్యవస్థ తాలూకు పరిపాలనాంగాలు ప్రజా వ్యవహారంనుంచి పూర్తిగా తొలగిపోయాయి. అవి కేవలం కొంతమందికే పరిమితమయ్యే సంస్థలుగాను, మత సంస్థలుగానూ వ్యవహారంలో మిగిలాయి. కాని, వాని తాలూకు నైతిక బలమూ, వెనుకటి గణ నిర్మాణంవున్న నాటినుంచీ అనూచానంగావస్తున్న భావనలూ, అభిప్రాయాలూ చాలకాలంవరకూ మిగిలేవున్నాయి. క్రమంగా గాని అవి అంతరించలేదు. రాజ్యాంగానికి చెందిన మరొక సంస్థలో ఈ విషయం కనబడుతుంది.

ప్రజానీకంకన్న భిన్నమైన ప్రభుత్వబలగం వుండడమనేది రాజ్యాంగంయొక్క ప్రధాన లక్షణమని పైన చూశాం. ఆ రోజులలో ఏథెన్సులో సైనిక పోలీసు బలగం ఒకటుండేది. ప్రజలు సన్నద్ధపరచిన నౌకా సైన్యం వుండేది. బయటి శత్రువులనుంచి ఆత్మరక్షణకూ, బానిసలను అదుపులోవుంచడానికీ ఇవి వుపయోగించేవి. ఆనాటి కప్పుడే దేశ జనాభాలో బానిసలే అత్యధిక సంఖ్యలో వుండేవారు పౌరుల విషయంలో ఈ ప్రభుత్వ బలగం పోలీసు బలగం రూపంలో మాత్రమే వుండేది. ఈ పోలీసు బలగం మొదట రాజ్యాంగంతోపాటు వచ్చినదే. కనుకనే అమాయకులయిన 18వ శతాబ్దపు ఫ్రెంచి రచయితలు కొందరు నాగరిక జాతుల్ని గురించి 'పోలీసులున్న జాతులం'టూ పేర్కొవడం జరిగింది.

ఆవిధంగా అథీనియనులు రాజ్యాంగంతోపాటుగనే పోలీసుల్ని ఏర్పరచుకొన్నారు. కాల్బంట్లూ, పిల్లంబులతోడి గుర్రపు రౌతులూ ఈ పోలీసు బలగంతో వుండేవారు. (దక్షిణ జర్మనీ, స్విడ్జర్లండులలో లాండ్ జాగెర్ అనేది వీరినే) ఈ పోలీసులంతా బానిసలే. పోలీసు పనిని స్వతంత్రుడైన అథీనియను పౌరుడెంతో నీచంగా భావించేవాడు. ఆపనిచేసేకన్న బానిసచేతిలో అరెస్టు కావడం మేలని భావించేవాడు. వెనుకటి కాలపు గణసంస్థలనాటి మనస్తత్వం ఇది. రాజ్యాంగానికి పోలీసు బలగం వుండాలి. అది లేనిదే పనిజరగదు. అయితే అదింకా ప్రారంభ దశలోవుంది. దానికి తగినంత నైతిక మర్యాద ఏర్పడలేదు. ఆ బలగంలోచేరి పనిచేయడం మర్యాదగా భావించే దశ ఏర్పడలేదు. కనుకనే వెనుకటి గణసంస్థలనాటి మనస్తత్వాని కది అప్రతిష్ఠాకరంగా కనపడుతుంది.

అప్పటికి రాజ్యాంగంయొక్క ప్రధానాంగాలన్నీ ఏర్పడినట్లే. ఇంక అక్కడ సంపద, వ్యాపారం, పరిశ్రమలు అతివేగంగా వృద్ధిపొందాయి. అథీనియనుల సామాజిక పరిస్థితికి అది బాగా సంపన్న వుందనడానికింతకన్నా వేరు నిదర్శనంలేదు. సామాజిక, రాజకీయ వ్యవస్థలకుమూలం కులీనవర్గానికీ, సామాన్య ప్రజలకూమధ్య వర్గవైషమ్యాలు కావు. బానిసలకు – స్వతంత్ర ప్రజకు, పౌరులకూ – అధీన ప్రజలకు మధ్యనున్న వర్గవైషమ్యాలు మూలం అయినాయి. ఏథెన్సు మంచి ఉచ్ఛస్థితిలో వున్నప్పుడు అథీనియను స్వతంత్ర పౌరులు – ఆడ, మగ, పిల్లలంతా కలిసి – తొంభయివేలుండేవారు. ఆడ, మగ బానిసలు మూడు లక్షల అరవయ్యాయిదువేలమంది వుండేవారు. అధీన ప్రజ – స్వేచ్ఛ సంపాదించిన బానిసలూ, వలసవచ్చినవారూ – నలభయ్యాయిదు వేలమంది వుండేవారు. ఆ లెక్కనచూస్తే వయస్సువచ్చిన ప్రతి మగ పౌరుడికీ బానిసలు పద్దెనమండుగురు చొప్పున, అధీన ప్రజ యిద్దరు చొప్పున వుండేవారన్నమాట పెద్ద పెద్ద సావిళ్ళలో ఓ వర్సీర్ల పర్యవేక్షణ క్రింద చాలమంది బానిసలు చేతిపరిశ్రమలలో పనిచేసేవారు. అందుకే బానిసలసంఖ్య అంత ఎక్కువగా వుంది. వ్యాపారమూ, పరిశ్రమలూ

పెరగడంతో సంపద కొద్దిమంది చేతులలో పోగుపడి, కేంద్రీకరింప బడింది. ఇంకస్వతంత్ర ప్రజలలో అత్యధికభాగం దరిద్రంతోవుండేవారు. చేతిపనులు నేర్చుకొని బానిస పని వారితో పోటీచేయడం అప్రతిష్ఠాసీచమూ నని వారి భావన. అదీగాక వానిలో అంత లాభమూ కనబడదు. అల్లాగని ఆ పనికి దిగఃపోతే పూర్తిగా వీధినపడవలసిందే. మరో మార్గంలేదు. ఆనాడున్న పరిస్థితులలో అత్యధిక సంఖ్యాకులయిన బీద స్వతంత్ర ప్రజ అథీనియను రాజ్యాంగాన్ని తమతోపాటు అధోగతికి ఈడ్చుకుపోయారు. యూరపియను స్కూలు టీచర్లు రాజరిక ప్రభుత్వాలకు కోపం తెప్పించ కుండా వుండేటందుకని ఏథెన్సు పతనానికి కారణం అక్కడ వుండిన ప్రజాతంత్ర వ్యవస్థయేనంటూ మనల్ని నమ్మించ పలుకుతున్నారు. కాని అది యథార్థంకాదు. శ్రమించడం అప్రతిష్ఠాకరమనే భావన స్వతంత్ర ప్రజలలో కలిగింది. అలా కలగడానికి కారణమైన బానిస వ్యవస్థే ఏథెన్సు పతనానికి దారితీసింది.

అథీనియన్లలో రాజ్యాంగం పుట్టినతీరు రాజ్యాంగ నిర్మాణానికి ఒక మంచి వుదాహరణ; బహిరంగంగాగాని. ఆంతరికంగాగాని, ఉత్పాతాలేవో రావడంవలన అది ఏర్పడలేదు. కొద్దికాలం పిసిస్ట్రాటసు * ప్రభుత్వాన్ని ఆక్రమించుకున్నా రాజ్యాంగంమీద దాని ప్రభావం నామరూపాలకూడా లేవు. సరాసరి గణవ్యవస్థలోంచి బాగా పరిణతపొందిన రూపంలో ప్రజాతంత్ర రిపబ్లికు ఉత్పన్నమయింది. దానికి సంబంధించిన ప్రధాన వివరాలన్నీ దీనినుంచే మనకు లభ్యం అయ్యాయి.

---

* పిసిస్ట్రాటస్—ఏథెన్సువాసి. రమారమి క్రీ. పూ. 605–527 నాటివాడు. గ్రీకు రాజ్యాంగవేత్త.

# 6

# రోములో గణవ్యవస్థ, రాజ్యాంగమూ

ఒక తెగగా ఏర్పడిన కొన్ని లాటిన్ గణాలు (వీని సంఖ్య ఒక వందయని కథలు) మొదట నిర్మించుకొన్న గ్రామమే రోమ్ అని దానికి సంబంధించిన స్థలపురాణం చెప్తూంది. తర్వాత వందగణాలున్న సబెల్లియన్ తెగవచ్చింది. ఆఖరున మరోవంద గణాలున్న మరోతెగవచ్చి అక్కడ చేరింది. గణాలే సహజమైన వ్యవస్థలని ఈకథనిబట్టి స్పష్టంగా తెలుస్తూంది. ఆ గణాలు చాల సందర్భాలలో మొట్టమొదటి నివాస భూమిలోనే నివసిస్తున్న తల్లిగణాన్నుంచి పుట్టినవని తెలుస్తూంది. తెగలనేవి కృత్రిమంగా ఏర్పడ్డవేనన్న గుర్తులు కనిపిస్తూనే వుంటాయి. అయినా వానిలో చాలవరకు బంధుగణాలే వుంటాయి. కృతకంగా గాక సహజంగానే ఏర్పడిన ప్రాచీనగణం నమూనాలోనే తెగలు ఏర్పడతాయి. బహుశా పైనచెప్పిన మూడు తెగలలోనూ అసలు తెగ ఏదో బీజంగా వుండవుండదంటే అసంబద్ధంకాదు. ఆ రెంటినీకలుపుతున్న సోదర కూటంలో పదేసిగణా లున్నాయి. దానిని క్యూరియా అంటారు. ఆవిధంగా రోములో ముప్ఫయి క్యూరీ (క్యూరియా ఏకవచనం, క్యూరీ బహువచనమూ) లున్నాయి.

రోమనుగణం గ్రీసులోని గణంలాంటి వ్యవస్థయేనని సర్వసాధారణంగా అంగీకరిస్తున్న విషయం. అమెరికాలోని ఎర్ర ఇండియన్లలో కనిపిస్తున్న ఆదిమ సామాజిక యూనిటువంటిదాని పరిణత రూపమే గ్రీకు గణం అనేటట్లయితే, రోమన్ గణం విషయంలో కూడా

అంతే అనుకోవాలి. అందుచేత దీనిని గురించి క్లుప్తంగా చెప్పుకు పోవచ్చు.

రోమునగరం ఏర్పడిన కొత్తలో అక్కడి గణ వ్యవస్థ ఈవిధంగా వుంది.

1. చనిపోయిన గణసభ్యుల తాలూకు ఆస్తిపై వారసత్వపు హక్కు పరస్పరంగా వుండేది. ఆస్తి గణంలోనే వుండేది. గ్రీషియను గణంలోలాగనే రోమనుగణంలో కూడ తండ్రి హక్కు అమలులో వుంది. అందుచేత స్త్రీ సంతానానికి వారసత్వంలేదు. మనకు తెలిసినంతవరకు "పన్నెండు పట్టికల చట్టం" రోములో లిఖిత పూర్వకంగా లభించే చట్టాలన్నింటిలోకీ అతి ప్రాచీనం. దాని ప్రకారం ఆస్తికి ఔరసులది మొదటిహక్కు. ఔరసులు లేనప్పుడు అగ్నాటెస్‌ది హక్కు (మగవాని తరపు బంధువు). వాళ్లూ లేనప్పుడు గణ సభ్యులది హక్కు. ఏవిధంగానైనా ఆస్తి గణంలోనే వుండేది. సంపదలు పెరగడం, దంపతీవివాహం ద్వారా గణంలోవున్న ఆచారాలలోకి కొత్త కొత్త చట్టనిబంధనలు ప్రవేశించడం మన కిక్కడ కనిపిస్తూంది. మొదట వారసత్వపుహక్కు గణసభ్యులందరికీ సమంగానే వుండేది. దాని నెప్పుడో అగ్నాటెస్‌కి మాత్రమే పరిమితంచేశారు. తరువాత మగసంతానానికీ, వారి సంతానానికీ మాత్రమే పరిమితం చేశారు. అయితే ఈ క్రమం పన్నెండు పట్టికల చట్టంలో విలోమరూపంలో కనబడుతుంది.

2. సామూహికశ్మశానం ఒకటుంటుంది. క్లాడియా పితృస్వామిక గణం-రోముకు రెగిల్లీనుంచి వలసరాగానే, జనం నివసించేటందుకు స్థలమూ, శ్మశాన ప్రదేశమూ కేటాయించారు.

ఆగస్టస్ పరిపాలనలో సైతం, ట్యూటోబర్గ్ అరణ్యంలో మరణించిన వారుస్ * శిరస్సును రోముకు తీసుకువచ్చి, అక్కడి శ్మశానం

---

* వారుస్ అను నతడు రోమన్ చక్రవర్తి క్రింద పనిచేసిన సైన్యాధికారి. జర్మనీలో అతడు రాష్ట్ర పరిపాలనాధికారిగాను, సైన్యాధిపతిగాను ఉండేవాడు. అతడు జరిపిన హింసాకాండ దారుణమైనది. దానికి వ్యతిరేకంగా చెరూస్కన్లు పెద్ద తిరుగుబాటు చేశారు.

దొడ్డిలో పాతిపెట్టారు. దానిని పట్టి అతని గణం క్విం క్టిలియాకు స్వంత శ్మశానంవుందని చెప్పవచ్చును.

3. గణాలకు ప్రత్యేక మతకర్మలు సార్వజనికంగా వుంటాయి. ఇవి అందరకూ తెలిసినవే.

4 గణంలోపల వివాహం చేసుకోకూడదనే నియమం వుంది. ఈ విషయమై రోములో చట్టం అంటూలేదు. కాని, ఆచారంమాత్రం వుంది. అనేకమంది రోమను దంపతులపేర్లు ఆనాటివి ఇప్పుడు వింటు న్నాం. వాట్లలో ఏ ఒక్క జంటలోనూకూడా స్త్రీ పురుషులిద్దరికీ ఒకే గణనామం కనబడదు. వారసత్వపు చట్టంకూడా ఈ విషయాన్ని నిరూ పిస్తూంది. స్త్రీ వివాహం చేసుకొంటే అగ్నాటీయహక్కుల్ని పోగొట్టు కొంటుంది. ఆమె తన గణాన్ని వదలిపెడుతుంది. ఆమెకుగాని, ఆమె సంతానానికిగాని ఆమె తండ్రి ఆస్తినుంచి లేదా ఆమె సోదరుల ఆస్తి నుంచి వారసత్వం సంక్రమించదు ఆలాగ సంక్రమిస్తే తండ్రియొక్క గణంలోంచి ఆ ఆస్తి బయటికి పోతుంది. తన గణంలోని మగవానిని ఆడుది పెళ్ళి చేసుకోకూడదన్నప్పుడే ఈ నియమానికి అర్థం వుంటుంది.

5. భూమిమీద యాజమాన్యపు హక్కు అందరికీ వుంటుంది. ప్రాచీనకాలంలో తెగ ఆధీనంలోని భూమిని మొదట పంచినప్పుడు గణానికి భూమి లభించేది. లాటిన్ తెగలలో, ఈ భూములలో కొంత భాగం తెగ అధీనంలోనూ, కొంతభాగం గణం అధీనంలోనూ వుండేది. మరికొంత భాగం కుటుంబాలక్రింద వుండేవి. ఆ ప్రాచీనదశలో కుటుం బం అంటే ఒంటికుటుంబా లనడానికి అవకాశంలేదు. వ్యక్తులకు మొదట భూములను కేటాయించినవాడు రోమ్యులసు అంటారు. ఆయన ఒక్కొ క్కనికి రెండేసి జుగెరాలు (ఒక హెక్టారు-లేక రెండున్నర ఎకరాలు) ఇచ్చాడట. అయినా అటుతర్వాతకూడా గణాల అధీనంలో భూములున్నట్లు

---

దాన్ని నడిపింది ఆర్మీనియస్. వారుస్ 20,000 సైన్యంతో తిరుగు బాటును అణచేటందుకు వెళ్ళాడు. కాని ట్యూటోబర్గ్ అరణ్యంలో ఆ 20,000 మందినీ తిరుగుబాటుదార్లు చుట్టుముట్టి తుడిచిపెట్టేశారు. వారుస్ కూడా చంపివేయబడ్డాడు. (క్రీ. శ. 9)

కనబడుతుంది. రిపబ్లికు అంతరికచరిత్ర కంతకూ కీలకంగా ప్రభుత్వ భూములుకూడ వుండేవి.

6. గణసభ్యులు పరస్పర సహాయం చేసుకోవడానికీ, ప్రతిక్రియ చేయడంలో ఒకరికొకరు సాయంచేసుకోవడానికీ పూచీపడి వుంటారు. మనకు లిఖిత చరిత్రలో ఈ చట్టం బాపతు అవశేషాలు మాత్రమే కన బడతాయి. ప్రారంభంనుంచీ కూడ రోమక రాజ్యాంగం మంచిబలాన్ని ప్రదర్శిస్తూ వచ్చింది. అందుచేత ప్రతిక్రియచేసే బాధ్యత రాజ్యాంగం మీదనే వుంటూ వచ్చింది. అపియసు క్లాడియసు*ను అరెస్టు చేసి నప్పుడు ఆతనిగణం యావత్తూ, ఆఖరుకి వ్యక్తిగత శత్రువులతో సహా, మైల పట్టారు. రెండో ప్యూనికు యుద్ధంలో ఖైదుచేయబడిన తోడిగణ సభ్యుల్ని విడిపించుకొనేటందుకు గణాలు పరిహారధనం పోగుచేయ డానికి ప్రయత్నించినప్పుడు ఆ పనిచేయరాదని సెనేట్ (శాసనసభ) నిషేధించింది.

7. గణ సభ్యులు గణనామం ధరించే హక్కు వుంటుంది. చక్ర వర్తుల కాలంవరకూ ఇది అమలులో వుంది. స్వతంత్రం పొందిన బానిసలు తమ యజమానుల గణనామం పెట్టుకొనేటందుకు అనుమతించే వారు. కాని ఇతరగణ హక్కు లేవీ వారికుండేవి కావు.

8. గణంలోకి పైవారిని దత్తు తెచ్చుకొనేహక్కు వుండేది. భార తీయులలో మాదిరిగా కుటుంబంలోకి దత్తుతీసుకునేవారు. దానితో వారు గణంలోకి దత్తుతీసుకోబడినట్లే.

9 నాయకుల్ని ఎన్నుకొనేందుకూ, తొలగించేటందుకూ హక్కు వున్నదని ఎక్కడా పేర్కొనలేదు. కాని, రోముఏర్పడిన కొత్తలో రాజును ఎన్నుకొనేవారు. అక్కడినుంచి అన్నిఉద్యోగాలకూ మనుషుల్ని ఎన్నుకోవడమో నియమించడమో జరిగేది. క్యూరీలు (సోదరకూటాలు) తమ పురోహితుల్నికూడా ఎన్నుకొనేవి. దీన్నిబట్టి గణనాయకుల్ని

* అప్పియసు క్లాడియసు – క్రీ. పూ. 5 శతాబ్ది. రోమను రాజకీయ వేత్త. పన్నెండు పట్టికల చట్టాన్ని తయారు చేసినవారిలో ఒకడని ప్రతీతి.

(ప్రిన్సిఫే)కూడా ఎన్నుకొనేవారని మనం వూహించవచ్చు. అభ్యర్థుల్ని ఒక కుటుంబంనుంచి తీసుకొనే ఆచారం ఎంత పాతుకొని పోయినా, ఎన్నుకోవడం అనేది వుండేదని చెప్పడంలో తప్పుండదు.

రోమను గణాలలో వుంటూవచ్చిన హక్కులూ, బాధ్యతలూ ఇవి. తండ్రిహక్కులోకి పూర్తిగా మార్పువచ్చిందనేది తప్ప వానికీ ఇరాక్వ్యూ గణాలలోని హక్కులకూ, బాధ్యతలకూ ఏమీ తేడాలేదు. ఇక్కడకూడా "ఇరాక్వ్యూలు స్పష్టంగా కనబడుతున్నారు."

రోమనుగణాలకి సంబంధించిన సమస్యలను బాగా ఎరుగుదురన్న విఖ్యాత చరిత్రకారులలో కూడా ఎంతో గంద్రగోళం వుందనడాని కొక్క వుదాహరణ చూపుతా. రిపబ్లికు కాలంనాటి, అగస్టను కాలంనాటి రోమను కుటుంబ నామాలనుగూర్చిన పరిశోధన గ్రంథంలో మోమ్సెన్* ఇల్లా వ్రాశాడు.

"గణంలోని అందరు మగవాళ్ళూ - దత్తత తెచ్చుకొన్నవాళ్ళూ, పోషించబడుతున్న వారూ సహా - గణ నామాన్ని ధరించేవారు. ఆడువాళ్లు కూడా ధరించేవారు. ఒక్క బానిసలే మినహాయింపు.... తెగ (స్టామ్ - దీనిని గణం అని మోమ్సెన్ అనువదించాడు)కు ఆదిపురుష డొకడున్నాడనీ, వారంతా ఆయన సంతతి యనీ భావన. ఆ ఆదిపురుషుడు నిజమైన వ్యక్తే కావచ్చు. కేవలం కల్పిత వ్యక్తే కావచ్చు. వారసత్వం, శ్మశాన భూమి, కర్మకాండలు వారిని కలుపుతున్నాయి. స్వతంత్రు లందరూ, స్త్రీలు సహా గణాలలో నమోదు అయి వుండాలి. అయితే వివాహిత స్త్రీ యొక్క గణనామ ధేయాన్ని నిర్ధారణ చేయడంలో కొంత కష్టం కలుగుతూంది. తమగణంలోని వారినేగాని పై వారిని పెళ్ళాడగూడదనే నిషేధం వున్నంత వరకూ ఈ కష్టంలేదు. చాలకాలంపాటు గణంలోపలకన్న వెలుపల మగళ్ళని సంపాదించడం చాలా చాలా కష్టం అయినట్లే కనిపిస్తూంది. బయటివారిని వివాహమాడే

* థియోడోర్ మోమ్సెన్ - 1817-1903, జర్మను న్యాయ శాస్త్రవేత్త, రోమను,చరిత్రనుగూర్చి, రోమను న్యాయశాస్త్ర చరిత్ర గురించీ పలుగ్రంథాలు వ్రాశాడు.

హక్కును ఆరో శతాబ్ది వరకూ ఒక ప్రత్యేక హక్కుగానో, బహూకృతి గానో కలగ చేసేవారు. అయితే ఆ ప్రాచీన కాలంలో ఈవిధంగా గణం బయటివారిని స్త్రీ వివాహం ఆడితే ఆమెను భర్త యొక్క తెగలోకి పంపేసేవారు. వెనుకటి రోజుల్లో మతసంబంధంగా వివాహం చేసుకొన్న ప్పుడు స్త్రీ తన భర్త కుటుంబంలోకి చట్టరీత్యానూ, మతాచార రీత్యానూ కూడ మార్చివేయబడేదనడంలో ఏ మాత్రం సందేహం అవసరంలేదు. వివాహిత స్త్రీ తన గణ సభ్యులనుంచి వారసత్వం పొందే హక్కును పోగొట్టు కొంటుందనీ, ఆమె భర్తకు, పిల్లలకు, ఆయన గణ సభ్యులకు సంబంధించిన వారసత్వపు కూటంలోకి చేర్చుకోబడేదనీ అందరకూ తెలుసు. ఆమె భర్త ఆమెను తన కుటుంబంలోకి తెచ్చుకొన్నప్పుడు. ఆమె ఆతని గణానికి చెందకుండా వుండడమెల్లాగ?" [రోమన్ పరి శోధనలు - పుటలు 9-11; బెర్లిన్ 1864, సంపుటం 1.]

మోమ్సెన్ చెప్తున్నదానినిబట్టి ఒక్కగణానికి చెందిన స్త్రీలు మొదట తమగణంలోని వారినే వివాహమాడేటందుకు స్వాతంత్ర్యం కలిగివుండే వారు. అంటే రోమనుగణాలలో అంతర్వివాహాలే ఆచారం. బహిర్వివా హాలుకాదు. ఇతరప్రజలందరి అనుభవానికి ఈ అభిప్రాయం వ్యతిరేకం. లివీ (పుస్తకం 39. ప్రకరణం 19) లోని ఒకమాట మోమ్సెన్ తెలుపు తున్న పొరపాటు అభిప్రాయానికి చాలవరకు మూలం. అసలావాక్యం మీదనే ఎంతోతర్జన భర్జనవుంది. నగరశకం 568 లో - అంటే క్రీస్తు పూర్వం 186 లో-శాసనసభలుచేసిన నిర్ణయాన్ని ఆ వాక్యంతెలుపుతుంది. "ఫెసెనియా హిస్పల్లో తన ఆస్తిని అంతనూగాని కొంతగాని అమ్మేసు కొనేటందుకు, గణం వెలుపల పెళ్ళిచేసుకొనేటందుకు, ఒక సంరక్షకుని ఏర్పరచుకొనేటందుకూ అధికారంవుంది. ఆధికారిక పత్రంద్వారా ఆ హక్కునామె (మృత) భర్తఇచ్చినట్లే ఆ అధికారం చెల్లుతుంది. ఆమె ఒక స్వతంత్రవ్యక్తిని పెళ్ళిచేసుకోవచ్చును ఆమెను పెళ్ళిచేసుకోవడం అతనికి అవమానముగాగాని, అప్రతిష్ఠగాగాని వుండదు."

పెసెనియా స్వతంత్రం పొందిన బానిస అని స్పష్టంగా తెలు స్తుంది. ఆమెకు తనగణం బయట వివాహమాడే హక్కునిస్తున్నారు.

తన మరణానంతరం గణం వెలుపలివారిని పెళ్ళి చేసుకొనే అధికారాన్ని లిఖితరూపంలో ఆమెకిచ్చేందుకు భర్త హక్కును గలిగి యున్నాడనేది కూడా నిర్వివాదాంశం. అయితే అది యే గణం వెలుపలవారిని ?

మోమ్సెన్ వూహిస్తున్నట్లు స్త్రీ తన గణంలో వానినే పెళ్ళిచేసుకోవలసివుంటే ఆమె పెళ్ళిఅయింతర్వాత గణం విడిచి పోనక్కరలేదు. అసలు గణాలలో అంతర్వివాహాలు అనుమతించ బడేవనే దానికి సాక్ష్యం కావాలి. ఇంక స్త్రీ గణం లోపలివారినే పెళ్ళిచేసుకోవాలంటే మగవాడి కూడా అంతేకదా? లేకుంటేవానికి భార్యదొరకదు. అంటే మగవాడు తనకులేని హక్కును అధికార పత్రం ద్వారా భార్యకు కలుగచేస్తున్నాడన్నమాట. ఇది చాలుమూలంలేని చట్టం. ఈ విషయాన్ని మోమ్సెన్ అర్థం చేసుకోక పోలేదు. అందుకే 'గణానికి వెలుపల వివాహం చేసుకోవాలంటే ఆ అధికారం పొందిన వ్యక్తిమాత్రమే కాదు. గణ సభ్యులందరూ అంగీక రించడం అవసరమయి వుండొచ్చు, బహుశా" (పుట 10 పాద పీఠికలో) అని వ్రాశాడు. ఇది చాలా సాహసంతో కూడిన వూహ. మరొకటి అసలు పుస్తకంలోని మాటను ఈ పాదపీఠిక కాదంటూంది. భర్తయొక్క ప్రతినిధిగా శాసనసభ ఆమెకీ అధికారాన్నిస్తూంది. ఆయన ఇవ్వగల దానికన్న శాసనసభ ఇస్తున్న అధికారం హెచ్చుకాదు. లొచ్చూకాదు. కాని ఆ యిస్తున్నదాంట్లో మినహాయింపు లేవీ లేవు.అందుచేతఆమెను పెళ్ళిచేసుకొనే కొత్తవ్యక్తికి ఏ ఇబ్బందీకలగదు. ఈ హక్కు నుపయోగించు కోవడం వలన ఆమెకెలాంటి బాధలూ కలిగించరాదని శాసనసభ, అప్పుడున్న భవిష్యత్తులో రాబోయే కాన్సలు లనూ. ప్రాటర్లనూ ఆ దేశిస్తూంది. అందుచేత మోమ్సెన్ ఆలోచన కేమీ ఆధారంలేమ.

మరొకటి : ఒక స్త్రీ తన గణంలోనివానిని గాక బయటి గణం వానిని పెళ్ళి చేసుకొంటుందనుకొందాం, అలా చేసుకొన్నాకకూడా తన గణంలోనే వుందనుకొందాం. అటువంటి సందర్భంలో ఆమె భర్తకు ఆమెను తన గణం వెలుపలవానిని పెళ్ళి చేసుకొనేటందుకు అనుమతించే హక్కు ఎక్కడిది? అంటే తనదిగాని గణంలో వ్యవహారాలు చక్క

బెట్టే హక్కు ఆతనికున్నదన్నమాట. అసలీ ఆలోచనకే ఆస్కారంలేదు. దానినిగురించి చర్చించడంకూడా అనవసరం.

ఆ స్త్రీ తన గణంవెలుపలివానిని పెళ్లి చేసుకొని, ఆతని గణం లోకి వెళ్లిపోయిందనుకోవడమే ఇక్కడ సముచితం. అల్లా జరుగుతూం దని మోమ్సెన్ అంగీకరించాడుకూడా. ఆలా అనుకొంటే సర్వం అవ గతం అవుతుంది. వివాహంతో స్త్రీ తన గణంనుంచి బయటికి పంపివేయ బడింది. భర్త తాలూకు గణసంఘంలో చేర్చుకోబడింది. అవిధంగా కొత్తగణంలో ఆమె స్థానానికి ఒక ప్రత్యేకత వుంది. ఆమె గణసభ్యురాలే కాని రక్తబంధుత్వం లేదు. ఆమెను ఆ గణంలో చేర్చుకొన్న విధానం చూస్తే మరో గణంలోని వ్యక్తిని వివాహమాడే పద్ధతి ఎన్నడూ నిషే ధింపబడలేదని బోధపడుతుంది. గణానికి సంబంధించిన వైవాహిక కూటంలో ఆమెను చేర్చుకొన్నారు. అమె భర్త చనిపోతే అతని ఆస్తిలో కొంతభాగం ఆమెకు వస్తుంది. అంటే తనతోడి గణసభ్యుని ఆస్తిలో వాటా ఆమెకూ వస్తుందన్నమాట. ఆ ఆస్తి గణాన్ని విడిచి బయటకు పోకూడదనడంలో అసహజం ఏమీలేదు. అది గణంలోనే వుండాలంటే గణంలోనివానినే పెళ్లి చేసుకోవాలి. పైవానిని చేసుకోకూడదు. ఆ విష యంలో ఆమెకు మినహాయింపు వర్తింపచేయగలవాడు ఆమెకా ఆస్తి నిచ్చిన మొదటి భర్త మాత్రమే. ఆమెకు ఆస్తిలో కొంతభాగం ఇస్తూ, వివాహంద్వారాగాని వివాహానికి ఫలితంగాగాని ఆ ఆస్తిని మరోగణంలోకి తీసుకొని పోవచ్చుననే హక్కు సంక్రమింపచేసిననాటికి అతడు తన ఆస్తికి అధికారిగానే వున్నాడు. అందుచేత ఆతడు తన ఆస్తిని తన యిష్టానుసారం ఖర్చు చేసుకొన్నట్లయిందేగాని వేరుకాదు. ఆమెకూ,ఆమె భర్త గణానికీ మధ్యనున్న సంబంధం – ఆతడామెను తన ఇష్టానుసారం వివాహం చేసుకొని గణంలోకి ప్రవేశపెట్టాడేగాని వేరుకాదు. అందుచేత పెళ్ళి చేసుకొని ఆ గణంలోంచి బయటకు వెళ్ళిపోయే అధికారం ఆమె కివ్వగలవాడామె భర్తమాత్రమే. అంటే రోమనుగణాలలో అంతర్వివాహ పద్ధతి వున్నదనే అభిప్రాయాన్ని వదలివేస్తే విషయం విస్పష్టం అవు

తూంది. గణాలు బహిర్వివాహపద్ధతినే అనుసరించేవని మోర్గన్ చెప్పిన దానినే అంగీకరించాలి.

ఇంక చాలమందిలో మరో అభిప్రాయంవుంది. స్వతంత్రం పొందిన బానిసయువతి గణం వెలుపలవివాహం చేసుకోవాలన్నా, ఆ గణసంఘాన్ని విడిచిపెట్టవలసివచ్చేది. మరోపనిఏదన్నా చేయదలసినా ప్రత్యేకఅనుమతి కావలసివున్నదని లివీ వాక్యంపట్టి గ్రహించవలసి వుందంటున్నారు. (లాంగే *- రోమన్ ప్రాచీనాచారాలు. బెర్లిన్-1856, సంపు 1, పుట 195 లో హుష్కే**నిగూర్చి వ్యాఖ్యానిస్తూ లివీయొక్క పై వాక్యానికి అర్ధంచెప్పాడు.) ఇదే అంగీకరించ వలసివస్తే స్వతంత్రురాండ్రయిన రోమను స్త్రీల హోదా ఏమిటో అర్ధంకాకుండా పోతుంది. గణంలోనే వారు వివాహం చేసుకోవలసి వుంటుందనడానికి అసలే ఆస్కారం కనబడదు.

enuptio gentis గణం వెలుపల వివాహం చేసుకోవాలనే మాట లివీ యొక్క ఈ వాక్యంలో తప్ప రోమను సాహిత్యంలో మరెక్కడా కనబడదు. Enubere (వెలుపల వివాహం) అనేమాట మూడుచోట్లనే కనిపిస్తుంది. అదికూడా లివీ పుస్తకంలోనే. అక్కడకూడాదానికి గణ శబ్దంతో సంబంధంలేదు. రోమను స్త్రీలు తమగణంలోని వారినే వివాహం చేసుకోవలసివుండేదనే అభూతకల్పనకు ఆధారం ఈవాక్యం ఒక్కటే. కాని అదికూడా నిలబడదు. స్వతంత్రంపొందిన బానిస స్త్రీలకుమాత్రమే వర్తించేప్రత్యేక నిబంధనలను గురించినదయివుండొచ్చు. ఆవాక్యం. అదేఅయితే పుట్టుకనుంచీ స్వతంత్రురాండ్రే అయినస్త్రీలకది వర్తించదు. అలాగాక స్వతంత్రంగానే జన్మించిన స్త్రీలకుకూడా అది వర్తించేటట్లయితే, స్త్రీలందరూ తమగణం వెలుపలనే వివాహమాడాలనే

---

* లడ్విగ్ లాంగే 1825-1885-జర్మను భాషాతత్వ వేత్త. చరిత్రకారుడు. లీప్ జిగ్‌లో ఆచార్యుడు.

** ఫిలిప్ ఎడ్వర్డు హుష్కే-1801-1886. జర్మను న్యాయ శాస్త్రచరిత్రవేత్త. రోమను న్యాయశాస్త్రం మీద పుస్తకాలు వ్రాశాడు. బ్రెస్లాలో ఆచార్యుడు.

నిబంధన వుండేదనీ, వివాహానంతరం వారు తమ భర్తగణంలోకి మార్చ బడేవారనీ దాని అర్థం. ఆ విధంగా మోమ్సెన్ అభిప్రాయం తప్పుఅనీ, మోర్గన్ మాటే సరియనీ తేలుతూంది.

ఫేబియన్లు అనే కులీన గణం శాసనసభ అనుమతి పొంది, పొరుగునవున్న వియీ పట్టణం మీద దాడి చేయగలిగిందంటే, రోము ఏర్పడిన మూడువందల సంవత్సరాల తర్వాతకూడా గణ వ్యవస్థ తాలూకు బంధనాలు ఎంతదృఢంగా నిలిచాయో అర్థంచేసుకొవచ్చు. మూడు వందల ఆరుగురు ఫేబియన్లు ఆనగరంమీదికి దాడి వెళ్లారట. యీ నగరవాసులు దారికాచి అందరినీ హతం చేశారు. ఒక్క కుర్రవాడు మాత్రమే తప్పించుకు బయట పడ్డాడు. అతడే ఆ గణానికి మరల జీవం పోశాడు.

పదేసి గణాలు సోదరకూటంగా ఏర్పడతాయనీ, దానినిక్కడ క్యూరియా అంటారనీ, దానికి గ్రీకులలోని సోదరకూటానికి వున్నవాని కన్న ఎక్కువ ప్రధానబాధ్యత లుండేవనీ పైన చెప్పాను. ప్రతి క్యూరి యాకూ వేర్వేరు మతాచారాలుండేవి, పురోహితులు పవిత్ర వస్తువిశేషాలూ దేనికిదానికే వేరు. పురోహితులంతా కలిసి రోమనుమతాచార్యుల పీఠంగా ఏర్పడేవారు. పది క్యూరీలు ఒకతెగ. బహుశా ఆరంభంలో ప్రతి తెగకూ ఎన్నుకొన్న నాయకుడు వుండేవుంటాడు — ఆతడే యుద్ధకాలంలో అధి పతీ, పురోహితుడూకూడ—ఇతర లాటిన్ తెగలలో ఇదె ఆచారంవుండేది. మూడు తెగలూ కలిసి రోమను ప్రజలు అయారు.

రోమను గణాలలో దేనికో ఒకదానికి చెందిన వారే రోమను ప్రజ అవుతారు. అంటే వారేదో ఒక క్యూరియాకూ, తెగకూ చెంది వుంటారు. రోమను ప్రజలకు సంబంధించిన మొట్టమొదటి రాజ్యాంగ చట్టం క్రింది విధంగా వుండేది ప్రభుత్వ వ్యవహారాలను సెనేట్ నిర్వహిం చేది. దీనిలో మూడు వందలగణాలనాయకులూ వుండే వారని నీబుర్* వ్రాసినది నిజం, గణాల పెద్దలుగనక వారిని పాత్రే—పితరులు—అనేవారు,

---

* బార్తోల్ జార్జి నీబుర్ (1776—1831) డేనిష్ జాతివాడు. ప్రాచీన కాలపు చరిత్రను గూర్చి పుస్తకాలు వ్రాశాడు.

వారితో ఏర్పడిన సెనేటస్ పెద్దల సమితి. సెనెక్సు - వృద్ధుడు అనే మాటనుంచి ఏర్పడింది. ఈ పెద్దల్ని ఎన్నుకొనేటప్పుడు కూడా వారిని ఒకే కుటుంబంలోంచి ఎన్నుకోవడం ఆచారం అయింది. ఆవిధంగా కులీన కుటుంబాలు ఏర్పడ్డాయి. వీరు తమ్మో పాట్రేషియస్లు (పెద్ద ఇళ్ళ వారు) అనుకొనేవారు. శాసనసభ సభ్యత్వాలకూ, ఇతర ప్రభుత్వోద్యోగాలకూ తమవరకే హక్కుగలదని చెప్పుకొనేవారు. ప్రజలు ఈ మాటకు అభ్యంతరం చెప్పక పోయేసరికి క్రమంగా అదివారి హక్కుగానే తయారయింది. మొట్టమొదటి (సెనేటర్లు) శాసనసభ్యులకూ, వారి వారసులకూ పాట్రీషియను హోదాలను రోమ్యులస్ స్థిరపరచాడన్న కథ దీనినే చెప్తాంది. ఆధీనియన్ బౌలేకు లాగే సెనేట్‌కు కూడా అనేక వ్యవహారాలలో నిర్ణయాలు తీసుకొనే హక్కువుంది. ప్రధాన విషయాలలో, ముఖ్యంగా కొత్త చట్టాలు చేయవలసి వున్నప్పుడు ప్రాథమిక చర్యలు జరిపే హక్కుదానికివుంది. ప్రజాసభ వానిమీదనిర్ణయాలు తీసుకొనేది. దానికే కమిటియా క్యూరాటియా - (సోదర కూటాల సమావేశం) - అని పేరు. సోదరకూటాలవారీగా ప్రజలు సమావేశం అయేవారు. బహుశా గణాలనుబట్టి గుంపులు గుంపులుగా కూర్చుండి వుంటారు, సమస్యలను నిర్ధారణచేయవలసి వచ్చినప్పుడు ముప్పయి క్యూరీలకూ (సోదరకూటాలకు) ముప్పయి వోట్లు వుండేవి. క్యూరీల సమావేశం చట్టాలుచేయవచ్చు. నిరాకరించవచ్చు. రెక్స (రాజు)అనబడే అధికారితోసహా పెద్ద వుద్యోగులందర్నీ అదే ఎన్నుకొంటుంది. యుద్ధప్రకటనచేసేది. [శాంతికుమర్చుకొనే అధికారం సెనేట్‌కు - శాసనసభకు - వుండేది.] రోమనుపౌరులకు మరణశిక్షలు విధించబడిన సందర్భాలన్నింటా, కక్షిదారులు చేసుకొనే అప్పీళ్లలో అది సుప్రీం కోర్టుగా అంతిమతీర్పునిస్తుంది. శాసనసభ, ప్రజాసభలతోపాటు 'రెక్స' వుండేవాడు. గ్రీకుల బాసిలసువంటివాడే ఈయన. అంతేగాని మోమ్సెన్ చెప్పినట్లు ఆయన నిరంకుశ ప్రభువుకాదు. * రెక్సు సైన్యాధి

---

* లాటిన్ భాషలోని "రెక్స" కెల్టిక్-ఐరిష్ ప్రజల "రై" గోథిక్ ప్రజల "రీక్" ఇవన్నీ ఒక్కటే. దీనికి అర్థం. తెగనాయకుడు.

పతికూడాను. ఆయనే పెద్ద పురోహితుడు. కొన్ని న్యాయస్థానాలలో అధ్యక్షపీఠం అధిరోహిస్తాడు. పౌరజీవితానికి సంబంధించిన అధికారాలేవీ ఆయనకు లేవు. సైన్యాధిపతిగా క్రమశిక్షణ నమలుపరచవలసినంతవరకూ, న్యాయాధ్యక్షుడుగా శిక్షను అమలుపరచవలసినంతవరకూ నే తప్ప అంతకు మిక్కిలి పౌరుల జీవితాలు, స్వాతంత్ర్యం, ఆస్తి మీద అయన కేవిధమైన అధికారం వంశపారంపర్యంకాదు. ఆయనను ఎన్నుకొనేవారు. బహుశా అంతకుపూర్వం ఆ వుద్యోగంలో వున్నవాడు ఆతనిపేరు సూచించేవాడో ఏమో. మొదట క్యూరీలు, ఎన్నుకుంటాయి. తర్వాత ప్రజాసభదానిని స్థిరపరిచేది. టార్క్వినస్ సుపర్బస్*కు పట్టినగతి చూస్తే రెక్సును తొలగించే హక్కుకూడా వుండేదని తెలుస్తుంది.

వీరయుగంనాటి గ్రీకులలో మాదిరిగానే ఈ రాజులనబడేవారి కాలంనాటి రోమనులలోకూడా సైనిక ప్రజాతంత్రవ్యవస్థ వుండేది. గణాలు, సోదరకూటాలు, తెగల వ్యవస్థనుంచే అది పరిణతి పొందింది. వాటిమీదనే ఆధారపడి ఏర్పడింది. క్యూరీలు, తెగలూ అనేవి కృత్రిమము

---

జర్మనుఫరెస్ట్ (Furst) అంగ్లేయుల ఫస్ట్ (First) డేనులఫోరెస్టే (Forste) లాగే ఇదీను. నాలుగో శతాబ్దం నాడు గోధియస్ ప్రజలందరికి సైన్యాధిపతి అయిన వానిని (ఉత్తరదేశభవిష్యత్తులో రాజు అయాడు) "తియూడన్సు" అని పిలిచేవారు. దీనిని పట్టి రెక్స్ రీక్ మొదలయిన వానికి అర్థం గణానికో, తెగకో నాయకుడుఅనే. బైబిలుకు ఉల్ఫిలా వ్రాసిన అనువాదంలో ఆయన అర్తాజెర్జెస్‌నుగాని, హెరోద్‌నుగాని ఎక్కడా "రీకీ"లు అనలేదు. వారిని తియూడనిలు అన్నాడు. టిబెరస్ చక్రవర్తి అధీన దేశాన్ని (రాజ్యం) రీకి అనలేదు. తియూడినస్సును అన్నాడు. గోథిక్ ప్రజలలోని తియూడన్ శబ్దాన్ని రాజు అని అనువదిస్తున్నారు. అది తప్పు. తియోడరిక్ (తియోడ్రక్ జర్మన్లలో డిట్రిచ్) అని రెండుపేర్లు కలిపి పలకాలి. (ఏంజెల్సు)

* రోము రాజులలో 7 వ వాడని జనశ్రుతి. క్రీ. పూ: 534–509 మధ్యరోము పాలించాడట.

లయిన వ్యవస్థలయినా సమాజం సరఫరాచేసిన సబబయిన, సహజమైన నమూనాలనుంచి అవి ఏర్పడ్డాయి. ఆ నమూనావ్యవస్థలు యింకా సమాజంలో చుట్టూ వుండనేవున్నాయి. సహజక్రమంలోనే బలపడిన పాట్రిషియన్ (కులీన) వ్యవస్థ బలవత్తరం అయింది. రెగె (రెక్సు బహువచనం) తమ అధికారాన్ని క్రమంగా విస్తరింపచేసుకొంటూ వున్నా రాజ్యాంగచట్టం యొక్క ప్రధాన, ఆదిమ లక్షణాలలో మార్పు రాలేదు. అదే ప్రధానమైన విషయం.

ఈ మధ్యకాలంలో రోమను భూభాగమూ, రోము జనాభా బాగా పెరిగాయి. కొత్త ప్రాంతాలను ఆక్రమించుకొని భూభాగాన్ని పెంచారు. వారికి స్వాధీనం అయిన లాటిన్ జిల్లాలనుంచి, యితర ప్రదేశాలనుంచి ప్రజలు వలసరావడంతో నగరజనాభా పెరిగింది. ఈ కొత్తజనం అంతా వెనుకటి గణాలకు, సోదర కూటాలకు, తెగలకు చెందినవారు కాదు. అందుచేత వారిని రోమనుప్రజగా లెక్కకట్టరు. వ్యక్తిగతంగా వారు స్వతంత్రులు. భూములు పెట్టుకోవచ్చు. పన్ను లివ్వాలి. సైనికులుగా పనిచెయ్యాలి. కాని, వారికి వుద్యోగా లివ్వరు. సోదరకూట సమావేశాలలో వారు పాల్గొనడానికి వీలులేదు. జయించిన రాష్ట్రాలలోని ప్రభుత్వ భూములను పంచేటప్పుడు వారికి వాటాలుండవు. వారినే ప్లెబియను లంటారు. ప్రభుత్వ వ్యవహారాలలో వారి కెట్టి హక్కులూ వుండవు. క్రమంగా వారి సంఖ్య పెరుగుతూంది. వారికి సైనికశిక్షణ లభించింది. వారివద్ద ఆయుధాలున్నాయి. అందుచేత, కొత్తవారిని చేర్చుకోకుండా తలుపులు బిడాయించుకున్న వెనుకటి జనానికి యీ నూతనులు క్రమంగా ప్రమాదకరంగా తయారయ్యారు. రోమను ప్రజలకూ, ప్లెబియనులకూ భూములు సమానంగానే పంచిపెట్టబడినట్లు తోస్తుంది. పారిశ్రామిక సంపదా, వ్యాపార సంపదా చెప్పదగినంత విశేషంగా లేకపోయినా, ప్రధానంగా అది ప్లెబియనుల చేతులలోనే వుండివుండాలి.

రోము నగరనిర్మాణంగురించీ, ప్రారంభకాలపు చరిత్రనుగురించీ అనేక అద్భుతగాధలు ప్రచారంలో వుండడంవల్ల వానిని అంధకారంలో పెడుతున్నాయి. వానిపై వ్యాఖ్యానించి, నివేదికలు తయారుచేసిన న్యాయ

శాస్త్ర ప్రవీణులవ్రాతలు ఆ అంధకారాన్ని మరింత గాఢంచేస్తున్నాయి. ఫలితంగా ఆ కాలపు పరిస్థితులను గురించి స్పష్టంగా ఏం చెప్పడానికీ వీలులేకుండా వచ్చింది. వెనుకటికాలపు గణవ్యవస్థను నిర్మూలించిన ఆ మహావిప్లవం ఎలా సాగింది ? ఎందుకు జరిగింది ? -చెప్ప లేకున్నాము. ఒకటి మాత్రం ఖచ్చితంగా చెప్పవచ్చు. ప్లెబియన్లకూ,రోమన్ ప్రజలకూ మధ్య జరిగిన ఘర్షణలే ఆ విప్లవానికి కారణం.

నూతన రాజ్యాంగ చట్టాన్ని గ్రీకుల నమూనాలో, ముఖ్యంగా సొలోన్ చట్టం నమూనాలో రెక్స్ సెర్వియస్ తుల్లియస్ తయారుచేసి నట్లు చెప్తారు. ఈ చట్టం క్రింద ఏర్పడిన ప్రజాసభలో రోమను ప్రజలూ, ప్లెబియనులూ కూడ వుంటారు. మరో విధంగా ఇద్దరినీ లేకుండా చేశారు. ఎవరు సైన్యములో ఉన్నారు. ఎవరులేరు అనేదొక్కటే అర్హత అయింది. సైన్యాలలోకి పనికివచ్చే వయస్సున్న మగవాళ్ళందర్నీ ఆస్తిని పట్టి ఆరు తరగతులుగా విభజించారు. మొదటి అయిదు తరగతులకూ ఆస్తులు ఈ విధంగా వుండాలి. 1. లక్షగాడిదలు: 2. 75 వేల గాడిదలు; 3 50 వేల గాడిదలు; 4 25 వేల గాడిదలు: 5.11 వేల గాడిదలు. వీటిని మార్కులలోకి మారిస్తే 1-14000; 2-10,500; 3-7000; 4-3,600; 5-1570 వుంటుందని దురా దే లా మాల్లే* వ్రాస్తున్నాడు. అంతకంటే తక్కువ గల ఆరవ తరగతి ప్రొలిటేరియన్లు (శ్రామికులు) వారికి పన్నులుండవు. వారు సైన్యాలలో పని చేయనక్కరలేదు. ఈ నూతన సభను కమిటియా సెంచురియాటా అన్నారు. సైనికులమాదిరిగా ప్రజలను నూరేసిమందిని ఒక్కొక్క ముఠాగా విడదీస్తారు. ఆ ముఠానే సెంచురియా-(శతం) అంటారు. ప్రతి శతానికి ఒక్కొక్క వోటు వుంటుంది. ఇల్లాంటి శతాలు 193 వుండేవి. వానిలో ఒకటవతరగతి వారివి 80, రెండవ తరగతివి 22,

---

* అడోల్ఫ్ దురా దే లే మాల్లే- (1777-1857) ఫ్రెంచి భూగోళ శాస్త్రజ్ఞుడు. ఆర్థిక శాస్త్రవేత్త, చరిత్రకారుడు, ప్రాచీనకాలపు రోము, ఉత్తరాఫ్రికాల ఆర్థిక పరిస్థితులపై చాలా పుస్తకాలు వ్రాశాడు.

మూడవదానివి 20, నాలుగోదానివి 22, అయిదోదానివి 30 శతాలు. నామమాత్రంగా ఆరోతరగతికి ఒక శతం ఇచ్చారు. దీనికి బాగా ధన వంతులైనవారితో ఏర్పడిన అశ్వసైన్యాలవి 18 శతాలు వుండేవి. అంతా కలిపి 193 శతాలు. అందుచేత మెజారిటీ కావాలంటే 97 ఓట్లు కావాలి. అశ్వసైన్యాలవీ, మొదటితరగతి వారివీ కలిపి 98 వోట్లు వున్నాయి. వారిద్దరూ కలిస్తే ఇతరులతో ప్రమేయం లేకుండానే నిర్ణయాలు చేయ గలుగుతారు.

ఏవో కొన్ని నామమాత్రపు ప్రత్యేకాధికారాలు మినహా వెనుకటి సోదరకూట సమావేశాలకుంటూ వచ్చిన రాజకీయాధికారాలన్నీ కొత్త సెంచురియా (శతం) సమావేశాలకు లభించాయి. ఫలితంగా క్యూరి యాలూ (సోదరకూటాలు), వానిలో వుండే గణాలూ విభిన్న మతాచార సంస్థలుగా మారిపోయాయి. ఆవిధంగానే చిరకాలంపాటు కొనసాగాయి. కాని క్యూరియాల (సోదరకూటాలు) సమావేశం అంతర్ధానం అయిపో యింది. వెనుకటి తెగలు మూడింటినీ రాజ్యాంగంనుంచి తప్పించేటం దుకై నాలుగు ప్రాంతీయ తెగల్ని సృష్టించారు. ఒక్కొక్క తెగకు నగరంలో ఒక్కొక్క భాగాన్ని కేటాయించారు. వానికి కొన్ని రాజ కీయాధికారాల నిచ్చారు.

ఈ విధంగా రాజరికప్రభుత్వం అంటూ చెప్పేది రద్దు కాక పూర్వమే రక్త సంబంధాలమీద ఏర్పడిన వెనుకటి సమాజవ్యవస్థ అంత రించింది. మొదటి ప్రభుత్వ చట్టాన్ని రద్దుచేసి, ప్రాంతీయ విభజనా, సిరి సంపదల హెచ్చుతగ్గులూ మీద ఏర్పడిన కొత్తరాజ్యాంగ చట్టం అమలు జరిపారు. సైన్యంలో పనిచేసి తీరవలసిన పౌరుల ప్రభుత్వ బలగంగా ఏర్పడ్డారు. వారు బానిసలను అణచడానికీ, శ్రామికుల్ని అణచేటందుకూ వుపయోగింపబడతారు. శ్రామికులు ఆయుధాలు పట్టకూడదు సైన్యా లలో చేరనక్కరలేదు.

రాజ్యాధికారాలన్నీ నిజంగా స్వాధీన పరచు కొన్న చివరి రెక్స్ టార్క్విన్‌స్ సుపెర్బస్‌ను తరిమేసి, ఆయనకు బదులు సమానాధికారా లున్న ఇద్దరు సైన్యాధిపతులను (కాన్సల్‌లు) నియమించారు. దీనితో

నూతన రాజ్యాంగ చట్టం మరింత గట్టిపడింది. రోమను రిపబ్లిక్ చరిత్ర అంతా యీరాజ్యాంగ చట్టం పరిధిలోనే గడిచింది. ఉద్యోగాలకోసమూ, ప్రభుత్వం యాజమాన్యంలోవున్న భూములలో వాటాకోసమూ పాట్రీషి యన్లకూ (కులీనులు) ప్లెబియన్లకూ (సామాన్యులు) మధ్య ఎన్నో పోరాటాలు జరిగాయి. క్రమంగా పాట్రిషియను (కులీన)తరగతి కొత్తగా ఏర్పడ్డభూస్వామ్య-ధనస్వామ్యవర్గంలో చేరిపోయింది. సైన్యాలలో చేర డంతో కుంగిపోయిన రైతుల భూములన్నీ ఈ కొత్తవర్గం స్వాధీనంలోకి పోయాయి. ఆ విధంగా తమ చేతికి వచ్చిన భూములను వారుబానిసల తోడ్పాటుతో సాగు చేసుకొన్నారు. ఇటలీ అంతటా జన సమ్మర్దం తగ్గి పోవడానికి కారకులయారు. ఈ విధంగా సామ్రాజ్య పాలనకు మార్గం వేశారు. ఆ తర్వాత జర్మను అనాగరిక తెగలు కూడా ప్రవేశించాయి.

# 7

# కెల్టులూ, జర్మన్లలో గణాలు

అనేకమంది ఆటవిక, అనాగరిక ప్రజలలో ఈనాటికీ చాలవరకు శుద్ధమైన రూపంలో గణసంస్థలు కనిపిస్తూనే వున్నాయి. వాటన్నింటినీ గురించి వ్రాయడానికి ఇక్కడ చోటు చాలదు. ఆసియాలోని నాగరిక జాతుల ప్రాచీన చరిత్రలో కనిపించే ఆ మాదిరి సంస్థల జాడలను వివరించడానికి కూడా చోటు చాలదు. ఏదోఒకటి ఎక్కడోఅక్కడ ప్రతి అడుగునా అగతగులుతూనే వుంటుంది. ఏవో కొద్ది వుదాహరణలిస్తాను. గణవ్యవస్థకు తప్పుఅర్థం చెప్పడంలో విశేషశ్రమ పడ్డ మాక్లెన్నాన్ గణాలంటూ వుండేవని తెలియఃపూర్వమే వానియొక్క ప్రధాన లక్షణాలను చూపాడు. చాల సరిగ్గా వర్ణించాడు. కాల్మకులలోనూ, సర్కేషియనులలోనూ, సామోయెదులలోనూ, వార్లీ, మాగార్, మున్నిపోరీలనే భారతీయ జాతులలోనూ గణసంస్థ వుందని చూపించాడు. షావ్‌లు, ఖెవ్‌షర్‌లు, స్వానెతియన్‌లు మొదలయిన కకేషియను తెగలలో ఈ గణవ్యవస్థ వున్నదని ఈమధ్యనే కోవాలేవ్‌స్కీ కనుక్కొని వర్ణించాడు. కెల్టులూ, జర్మన్లలో వున్న గణసంస్థల్ని గురించి నాలుగు మాటలిక్కడ చెప్పడం నా వుద్దేశం.

ఇప్పటికీ అమలులోవున్న అతి ప్రాచీనకాలపు కెల్టిక్ చట్టాలను చూస్తే ఆనాటికి గణాలు మంచి ఉచ్ఛస్థితిలో వున్నట్లు కనబడుతుంది. ఐర్లండులో. ప్రజల మానసిక ప్రవృత్తులలో ఈనాటికీ అది సజీవంగా వుంది. ఇంగ్లీషువాళ్ళు దానిని బలాత్కారంగా రద్దుచేసినా అది వారి

మనస్సులలోంచి తొలగనేలేదు. గతశతాబ్దం మధ్యవరకూ అది స్కాట్లం డులో మంచి ఉచ్చ స్థితిలోవుంది. అక్కడ కూడా అది బ్రిటిషువాళ్ళ ఆయుధాలు, చట్టాలు, కోర్టుల బలానికి మాత్రమే లొంగిపోయింది.

ఇంగ్లీషువాళ్లు ఆక్రమించడానికి ఎన్నో శతాబ్దాల క్రితమే వ్రాయ బడిన ప్రాచీనకాలపు వెల్షు (వేల్సుదేశపు) చట్టాలు (ఇవి పదకొండో శతాబ్దానికి పూర్వమే వ్రాయబడ్డాయి) చూస్తే గ్రామాలకి గ్రామాలు సమూహంగా వ్యవసాయం చేయడం కనిపిస్తుంది. అది సార్వత్రికం కాకపోయినా, ఒకప్పుడు సర్వత్రా ఆ ఆచారం అనుసరించబడేది. ప్రతి కుటుంబానికీ స్వంతంగా చేసుకొనేటందుకు అయిదేసి ఎకరాలుండేవి. ఆ భూమిగాక అందరూకలిసి వ్యవసాయం చేసుకొని పంటను పంచుకొనే భూమి కొంత వేరే వుండేది. ఐర్లండులోనూ, స్కాట్లండులోనూ కనిపించే ఉదాహరణలనుపట్టి యీ గ్రామసంఘాలు గణాలన్నా అయి వుంటాయి. లేదా వాని శాఖలన్నా అయివుంటా యనుకోవచ్చు. వెల్షు చట్టాలను గురించి నేను వ్రాసుకొన్న అంశాలు 1869 నాటివి. వానిప తిరిగి పరిశీలించడానికి నాకు వ్యవధి లేకుండావచ్చింది. పునఃపరిశీలనచేస్తే పై అంశాన్ని అవి సరాసరి బలపరచక పోవచ్చు. అయితే ఐరిషు, వెల్షు సమాచారాన్ని పరిశీలిస్తే పదకొండో శతాబ్దంనాటి కింకా కెల్టులలో జంట వివాహపద్ధతి పోయి దంపతీ వివాహవ్యవస్థ ఏర్పడలేదని కనిపిస్తుంది. వేల్సులో వివాహ విచ్ఛేదం అసాధ్యం కాలేదు. ఏడేళ్లు జరిగిపోయే లోపున రద్దుకు దరఖాస్తు పెట్టుకోవచ్చు. ఏడేళ్లుకావడానికి మూడే మూడు రాత్రులు తరవాయి వుండగానైనా వివాహితులు విడిపోవచ్చు. అప్పుడు వారు తమ ఆస్తిని పంచుకొంటారు. ఆడుది వాటాలు వేస్తుంది. మగ వాడు ఏరుకుంటాడు. ఇంట్లో సామాన్లు పంచుకోవడం విషయములో చిత్ర చిత్రమైన అలవాట్లున్నాయి. మగవాడు విడాకులు కోరివుంటే ఆడుదానికి ఆమె తెచ్చిన కట్నాన్నీ, సామానుల్నీ తిరిగి ఇచ్చెయ్యాలి. ఆడుది విడాకులు కోరివుంటే ఆమెకు వచ్చేది తగ్గుతుంది. ముగ్గురు పిల్లలుంటే రెండో సంతానాన్ని ఆడుదీ, మిగిలిన ఇద్దర్నీ మగవాడూ తీసుకొంటారు. విడాకులు పొందాక ఆడుది మళ్ళీ పెళ్ళిచేసుకొంటేకూడ

ఆమె మొదటి భర్త ఆమెను పిలుచుకు పోవచ్చు. రెండో మగని మంచం మీద మొట్టమొదటిసారిగా పెట్టి తున్నకాలు తీసి ఆమె మొదటి భర్త వెంట వెళ్ళక తప్పదు. స్త్రీ పురుషు లిద్దరు ఏడేళ్ళపాటు కలిసి జీవిస్తే, పెళ్ళి తంతు జరగక పోయినా వారిద్దరూ భార్యా భర్తలుగానే పరిగణన. వివాహానికి పూర్వం కన్యలకన్యాత్వంగురించి పెద్దపట్టింపులు లేవు. అది రక్షించబడాలనే నియమమూ లేదు. ఈ విషయాన్ని గురించిన నిబంధనలు చాలా అసందర్భంగా కనిపిస్తాయి. బూర్జువా నైతిక నిబంధనలకవి పూర్తిగావిరుద్ధం. స్త్రీ మరొకనితో సంగమిస్తే మగడు ఆమెను కొట్టడం తప్పుకాదు. మూడు సందర్భాలలో మాత్రమే మగడు భార్యను కొట్టవచ్చు. వానిలో ఇదొకటి అలాగ కొట్టడం మగని హక్కులలో వొకటి. అలా కొట్టాక మరి తప్పు వెయ్యడానికి వీలులేదు. ఏ మంటే "ఒక తప్పుకు రెండు శిక్షలు లేవు పరిహారమో, ప్రతిక్రియో-అంతే" ఆస్తి విషయంలో నష్టపడకుండా విడాకులు కావాలనడానికి అనేక కారణాలను ఆడుది చూపవచ్చును. మగవాని నోరు వాసన వేస్తూంటే విడాకులు కోరవచ్చు. మొదటిరాత్రి అనుభవించే హక్కుకు పరిహారంగా తెగనాయకుడికీ, రాజుకూ చెల్లించవలసిన ధనం చట్టాలలో ప్రముఖంగా కనిపిస్తుంది, [గోబ్రి మెర్చి అంటారు దీనిని. మధ్య యుగాలలో దీనిని మార్చెటా అన్నారు. ఫ్రాన్సులో మార్క్వెట్టి అంటారు] ప్రజాసమావేశాలలో వోటు చేసే హక్కు స్త్రీల కుంది. ఐర్లండులో కూడా ఇటువంటి పరిస్థితులే వున్నట్లు కనబడుతుంది. కాలపరిమితిగల వివాహాలు అక్కడా పరిపాటే. విడాకులప్పుడు స్త్రీల విషయంలో ఉదారమైన సౌకర్యాలున్నాయి. వాటిని స్పష్టంగా నిర్దేశించారు కూడా. ఆఖరికి ఇంట్లో చాకిరీ చేసినందుకు ప్రతిఫలంకూడా ఇప్పిస్తారు. అనేకమంది భార్యలలో ఒకామె ప్రధాన భార్యగా వుండేది. చనిపోయిన వాని ఆస్తిని పంచడంలో పిల్లలు చట్టబద్ధంగా పెళ్ళిచేసుకొన్న ఆమెకు కలిగారా, లేదాయనేది పరిగణించేవారుకాదు. ఈ జంటపెళ్ళి నిబంధనలు చూస్తే, ఉత్తర అమెరికా ప్రజలలోని వివాహ నిబంధనలు చాల కఠోరంగా వున్నాయనిపిస్తాయి. సీజరు దండ యాత్రల నాటికి గుంపుపెళ్ళి ఆచారంలో వున్న ప్రజలు పదకొండో శతాబ్దంనాటికీ ఈ ఆచారస్థితిలోనే వున్నారంటే ఆశ్చర్యంలేదు.

ఐరిషుగణాలను (వీరిలో తెగను క్లెయిన్నీ, క్లాన్ అంటారు) గురించి ప్రాచీన కాలపు న్యాయశాస్త్ర గ్రంథాలు చెప్తున్నాయి. వానిని వర్ణిస్తున్నాయి. తెగ తాలూకు భూములను ఇంగ్లీషురాజు రాజ్యభాగాలుగా మార్పించేటందుకు పదిహేడో శతాబ్దంలో అక్కడకు పంపబడిన ఇంగ్లీషు న్యాయశాస్త్రవేత్తలు కూడా దానిని ధృవపరుస్తున్నారు. తెగ నాయకులు తమదంటున్నవి తప్ప మిగిలిన భూములు తెగ అంతటి సొత్తుగా పరిగణించబడుతుండేవి. అప్పటికే నాయకులు భూములు తమ వనడం ప్రారంభమయింది. ఒక గణసభ్యుడు చనిపోయి, ఆ యింటి వాళ్లు చెదిరిపోయినప్పుడు గణనాయకుడు గణంతాలూకు భూమినంతనూ ఇళ్ళవరసన తిరిగి పంచిపెట్టేవాడు. (దీనిని ఇంగ్లీషు న్యాయశాస్త్రవేత్తలు 'కాపుట్ కాగ్నిటియోనిస్' – ఒకే కుటుంబంవారిమధ్య పంపిణీ–అన్నారు) జర్మనీలో అనుసరించిన మాదిరి నిబంధనలవంటి వాని ప్రకారమే సాధారణంగా ఇదీ జరుగుతూ వుండిపుండాలి రన్‌డాల్* పద్ధతులలో భూములను చేసుకొనే గ్రామాలిప్పటికీ కొన్ని వున్నాయి. నలభయి యాభయ్యేళ్ళక్రితం ఇవి చాలా ప్రచురంగా వుండేవి. గణంతాలూకు ఉమ్మడి భూమిగా ఒకప్పుడు వున్నదానిని విడివిడిగా సేద్యం చేసుకుంటూవుండిన రైతులు ఇంగ్లీషువాళ్ళ ఆక్రమణ అనంతరం తమ తమ భూమికి పన్ను ఇచ్చుకోవడం వచ్చింది. అయితే సేద్యానికి పనికివచ్చే భూమినీ, గోభూమినీ కలిపి వాటాలుగా పంచుకొనేవారు. ఆయా భూమివున్నచోటు, దాని మంచిచెడ్డలూ పట్టి పీలికలు చేసేవారు. వీనిని 'గెవన్నే' అని మోసెల్‌లో పిలుస్తారు. ప్రతి గెవన్నేలోనూ ప్రతి రైతుకూ కాస్త కాస్త భూమి ఇస్తారు. (దీనినే రన్‌డాల్ పద్ధతి అంటారు) పచ్చికబీళ్ళూ, చౌడుపర్రలూ సమష్టిగా వుండేవి. ఏభయ్యేళ్ళ క్రితంకూడా అప్పుడూ అప్పుడూ, కొన్నిచోట్ల ఏటేటాకూడా, భూముల నీవిధంగా పంచుకొంటుండేవారు. రండాల్ గ్రామం నక్సా అచ్చంగా జర్మనీదేశపు 'జెహోఫెర్‌స్కాఫ్ట్' (వ్యవసాయ కుటుంబాలసంఘం)నమూనాలాగే కనిపిస్తుంది.

---

* విడివిడి ముక్కలుగా భూమి వ్యక్తుల అధీనంలో సాగుచేసే పద్ధతియని ఛాంబర్సునిఘంటువు.

గణాలు 'ఫాక్షన్‌ల' రూపంలో కనిపిస్తున్నాయి. ఐర్లండులోని రైతులు పార్టీలుగా ఏర్పడే పద్ధతి అర్థంలేని విభజనమీద ఆధారపడివుంది. ఇంగ్లీషువాళ్ళకివి అర్థమేకాదు. ఈ పార్టీలు (ఫాక్షన్‌లు) ఈ స్త్రీలకోసమే వన్నట్లు కనిపిస్తుంది. చావచితకకొట్టుకోవడం వాళ్ళ ఆట. వెనుకటి గణాల అవతారాలివి. పూర్వకాలపు గణవ్యవస్థ తాలూకు భావన వీనిలో ప్రత్యక్షం అవుతూవుంది. ఒకేగణానికి సంబంధించిన సభ్యులు తమ గణ భూములలో కలిసి జీవించడం ఇప్పటికీ అక్కడక్కడ కనిపిస్తుంది. ఉదాహరణకి – పూర్వపు మొనాఘన్ కౌంటీలో నివసిస్తున్న వారిలో అధిక సంఖ్యాకులలో 1830–40 మధ్య నాలుగు కుటుంబనామాలు వుండేవి. అంటే వారంతా నాలుగుగణాలకు, నాలుగే తెగలకు చెందినవా రన్నమాట. *

---

* నాలుగో ముద్రణకు ఏంగెల్సు వ్రాసిన పాదపీఠిక.

కొద్దిరోజులపాటు నేను ఐర్లండులో వున్నప్పుడు గణాలనాటి భావనాధోరణిలోనే గ్రామీణప్రజ జీవిస్తున్నారని చూశాను. రైతు భూస్వామిని తెగ పెద్దగానే భావిస్తున్నాడు. సమష్టి ప్రయోజనాల కోసం ఆయన వ్యవసాయాన్ని తనిఖీ చేస్తుంటాడనీ, ఆ శ్రమకు ప్రతిఫలంగా శిస్తు చెల్లిస్తున్నాననీ అతని భావన. అవసరం వచ్చి నప్పుడు భూస్వామి ఆదుకోవాలని ఆతడి అభిప్రాయం ఆలాగే జరుగు బాటున్న వాళ్ళందరూ కష్టంలోవున్న ఇరుగుపొరుగు బీదవాళ్ళకు సాయపడడం బాధ్యత అనుకొంటున్నారు. ఆ సాయం చేయడం దయాధర్మ భిక్షంగా కాదు. తెగలోని బీదవాడు తెగలోని కలవాళ్ళ నుంచీ, తెగ నాయకుడినుంచీ సహాయం పొందేహక్కు వుంది. ఐరిష్ రైతుల బుర్రలలో ఆధునిక బూర్జువా ఆస్తి భావనలు ప్రవేశ పెట్టడం అసంభవంగా వుందని అర్థిక శాస్త్రవేత్తలూ, న్యాయశాస్త్ర వేత్తలూ గొడవచేస్తున్నది అందుకే. హక్కులేగాని బాధ్యతలులేని ఆస్తి అనేది ఐరిష్‌వాని వూహకే అందదు. ఇంగ్లండు, అమెరికాల లోని పెద్ద పెద్ద ఆధునిక నగరాలలో విభిన్నమైన నైతిక, న్యాయ సంస్కారాలున్న ప్రజలమధ్యకు వచ్చిపడ్డ ఐరిషువాళ్ళు న్యాయం;

1745 తిరుగుబాటును అణచివేసినప్పటినుంచీ స్కాట్లండులో గణ వ్యవస్థ చితికిపోయింది. ఆ వ్యవస్థలో 'క్లాన్' (జిమ్మా)కు వున్న సంబంధం ఎటువంటిదో పరిశీలించవలసివుంది. ఏదో విధమైన సంబంధం వుండడం మాత్రం తథ్యం. స్కాట్లండు మెట్ట భూములలోని "క్లాన్"లను వాల్టర్ స్కాట్ తన నవలల్లో సవిస్తరంగా వర్ణించాడు. మోర్గన్ దానిని గురించి ఇల్లా చెప్పాడు : "నిర్మాణంలోనూ, స్వభావంలోనూ కూడా అది స్వచ్ఛమైన గణం. గణ జీవితానికి గణ సభ్యులపై ఎటువంటి ప్రభావం వుంటుందో అందులో అద్భుతంగా కనబడుతుంది. కుటుంబ కక్షలు, రక్త ప్రతీకారాలు వానిలో కనిపిస్తాయి. గణాల స్థానిక స్వభావాలు, సమష్టిగా భూములు కలిగివుండడం, క్లాన్ పెద్ద యెడసభ్యుల విశ్వాసం, క్లాన్‌లోవాళ్లు ఒకరొకరి యెడ కనబరచుకొనే విశ్వాసం – ఇవన్నీ గణ సమాజంలో తప్పకుండా కనబడే లక్షణాలు... మగవాని వేపున సంతతిని గుర్తిస్తారు. మగవాళ్ళ సంతానం క్లాన్‌లో వుంటారు. ఆడవాళ్ళ సంతానం వాళ్ళ వాళ్ళ తండ్రుల క్లాన్‌లకు చెందుతారు."* స్కాట్లండులోని పిట్ రాజకుటుంబంలో ఆడవాళ్ళవైపునుంచి వారసత్వం వుందని బెదే † వ్రాశాడు. దానిని పట్టి పూర్వకాలంలో స్కాట్లండులో తల్లిహక్కు అమలులో వుండేదని గ్రహించవచ్చు. మధ్యయుగాలనాటివరకూ వెల్షు ప్రజలలోనూ, స్కాటిషు ప్రజలలోనూ ప్యునలావ్ కుటుంబాచారాలు అమలులోవున్నట్లు నిదర్శనాలున్నాయి. వెను

నీతి అనేవి ఏమీ అర్థంగాక తల్లక్రిందులై పోతున్నారన్నా, ప్రజలలోని నిరుత్సాహానికి వారూ పాల్పడిపోతున్నారన్నా ఆశ్చర్యంలేదు.

— ఫ్రెడరిక్ ఏంజిల్సు

* మోర్గన్ – ప్రాచీన సమాజం, పుట 368–369.

† బెడే లేక బెడా. ఈయనను 'బెడే మహాపురుషుడు' అంటారు. రమారమి క్రీ. శ. 672–735 ప్రాంతంవాడు ఇంగ్లీషు బెనెడెక్టయిన్ సన్యాసి; కవి; బహుభాషావేత్త; చరిత్రకారుడు. అనేక కైఫియతులు, జీవితాలూ వ్రాశాడు. ముఖ్యంగా ఇంగ్లీషు చరిత్ర వ్రాశాడు.

కటి భర్తల సమూహానికి ఆఖరు ప్రతినిధిగా క్లాన్ పెద్దో, రాజో ప్రతి పెళ్ళికూతురుతో మొదటిరాత్రి గడిపే హక్కు వుంది. ఆ హక్కునుంచి ప్రతి ఫలం ఇచ్చి పెళ్ళికూతురు బయట పడొచ్చు.

* * *

వలసలనాటి వరకూ జర్మన్లు గణాలుగా ఏర్పడి వున్నారనేది నిర్వివాదాంశం. క్రీస్తుకు కొద్ది శతాబ్దాలకు పూర్వం వారు డాన్యూబు, రైన్, విస్తులానదులకూ ఉత్తర సముద్రానికీమధ్యనున్న భూములలో నివాసం ఏర్పరచుకొన్నారు. సింబ్రీ, ట్యూటొనీతెగల వలస జోరుగా సాగుతూ వుంది. సుయేవీఅ సీజరుకాలంవరకూ స్థిరపడనేలేదు. వారు గణాలుగాను, బంధుకూటాలుగానూ స్థిరపడి నివసిస్తున్నారని సీజరు స్పష్టంగా వ్రాస్తున్నాడు. (జెంటిబస్) జూలియా తెగకు చెందిన రోమను వాని నోట 'జెంటిబస్' మాట వచ్చిందంటే అది ఏదో పొరపాటున జారిందనుకో కూడదు. ఇతర జర్మన్ల విషయంలోకూడా ఇంతే. రోమను రాష్ట్రాలను జయించి జర్మన్లు వానిలో నివాసం ఏర్పరచుకొనేటప్పుడుకూడా గణాలవారీగానే స్థిరపడినట్లు కనబడుతుంది. దిగువ డాన్యూబ్ నదీ ప్రాంతభూములను ఆక్రమించి, అక్కడ స్థిరపడిన వారు గణాలవారీగానే (గెనియాలజీ) స్థిరపడినట్లు అలమన్నియన్* చట్టాలవలన తెలుస్తూంది. తర్వాత కాలంలో మార్కు, డార్ఫు జెనోస్సెన్‌స్కాఫ్ట్ (సామూహిక గ్రామం) అనేమాటలను వుపయోగించిన అర్థంలోనే గెనియాలజి కూడ వుపయోగించబడింది. గెనియాలజి అనేవి పెద్దపెద్ద సామూహిక గృహాలనీ, భూమిని అవి పంచుకొనేవనీ, వాటినుంచే సామూహిక గ్రామాలు పరిణతి పొందాయనీ ఈ మధ్య కోవాలేవ్‌స్కీ వ్రాశాడు. బర్గండియన్లూ, లాంగోబార్డులూ (వీరుగోథిక్, హెర్మినోనియన్ తెగలకు చెందిన వారు) వాడిన "ఫారా" అనేపదం ఇంచుమించు అలమన్నియన్ చట్టాలలో గెనియాలజీని వుపయోగించిన అర్థంలోనే వాడారు. దీనిని గణానికి వుపయో

* అలమన్నీ – జర్మను తెగలలో ఒకటి – ఎగువ రైన్‌నదీ దేశభాగాలలో నివసించారు.

గించారా, సాముహిక గృహకుటుంబానికి వుపయోగించారా అనే విష యాన్ని ఇంకా పరిశీలించవలసి వుంది.

జర్మను లందరిలో గణం అనేదానిని తెలిపే ఒకేపదం ఏమన్నా వుందేమో తెలుసుకోడానికి భాషావివరణలు ఏమాత్రమూ తోడ్పడడం లేదు. భాషాశాస్త్ర రీత్యా గ్రీకుల గెనోస్ లాటిన్ తెగల గెన్స్, గోథిక్‌ల కుని, మిడిల్ హై జర్మన్ల కున్నే ఇవన్నీ ఒకే అర్థంలో వుపయోగించ బడ్డాయి. ఆడుది అనే అర్థంలో గ్రీకులు గినే, స్లావ్‌లు జెనా, గోథిక్‌లు క్వినో, ప్రాచీన నోర్సుతెగలు కోనా, కునా అనే శాబ్దాలు వాడుతారు. వీటన్నింటికీ ఉత్పత్తి ఒక్కటే. ఇవన్నీ మనకు తల్లి హక్కు అమలులో వున్న స్థితిని గుర్తు చేస్తున్నాయి. లాంగోబార్డులూ, బర్గండియన్లూ వాకిన పారాయనేమాట ఫిసాస్ అనేదానినుంచి వచ్చివుంటుందని, ఫిసాన్ అనే మాటకు అర్థం "కనుట" అని గ్రిమ్ వ్రాస్తున్నాడు. సంచరించు అనే అర్థం ఇచ్చేఫారాన్. ఫార్హెన్ అనే మాటనుంచి ఫారా వచ్చిందనడం బాగుంటుందని నాఅభిప్రాయం. సంచారజాతులు కదిలినడి వేటప్పుడు ఆ బిడారులో ఒకొక్క ప్రత్యేక భాగానికి ఆ మాటని నుపయోగిస్తారు. ఆభాగంలో అందరూ బంధువులేవుంటారని వేరేచెప్పనక్కర్లేదు. మొదట తూర్పుదిశగా, అక్కడినుంచి పడమటిదిక్కుగా శతాబ్దాల తరబడిసాగిన ఆ సంచారాలలో ఆ మాట గణ సంఘానికి ప్రత్యామ్నాయంగా వుపయోగంలోకి వచ్చింది. ఇవిగాక గోథికులలో సిబ్జా, ఆంగ్లో - సాక్సన్లలో సిబ్, ప్రాచీన ఎగువ జర్మన్లలో సిప్పియా. సిప్పా, సిప్పే అనే పదాలున్నాయి. ప్రాచీనకాలపు నోర్స్ తెగలలో బహువచన రూపంలో సిప్జార్ అనే మాట వుంది. ఈ మాటకు సిఫ్ అనే ఏకవచనం వుంది. కాని అది ఒకదేవత పేరుమాత్రమే. ఇవిగాక హిల్డెబ్రాండ్ పాటలో మరోపదం వుంది. హిల్డెబ్రాండ్ హదుబ్రాండ్ నీ విధంగా ప్రశ్నించారు: "వీరందరిలో నీ తండ్రి ఎవరు...? నీబంధుకూటం (కిన్) ఏది? క్నువోస్లెస్-)" గణం అనేదానికి జర్మన్లందరిలో వాడకంలో ఏదన్నా ఒకేపదంవుంటే అది గోథికుల 'కుని' అయి వుండాలి. ఆ కుటుంబానికే చెందిన భాషలన్నింటిలో అదే అర్థం ఇచ్చే మాటలన్నిటికీ అది దగ్గరగా వుండడ మొక్క

ఉకాదు. గణనాయకుడు, తెగనాయకుడు అనే అర్థం ఇచ్చే కునింగ్, కోనిగ్ అనే పదాలు దానినుంచే పుట్టాయి. సిబ్జా, సిప్పే అనే మాటల గురించి ఆలోచించనే అక్కర్లేదు. ప్రాచీన నోర్స్ తెగలలో సిబ్జార్ పదానికి రక్తబంధువులు అనేగాక, వివాహరీత్యా కలిసిన బంధుత్వాలకూడా అర్థంలో చేరతాయి. అంటే రెండు గణాలకు చెందిన సభ్యులు ఆ శబ్దార్థంలోకి వస్తారు. ఇంక సిప్ అనేది గణానికి పేరు అయి వుండదు.

మెక్సికనులలోనూ, గ్రీకులలోనూ లాగే జర్మనులలో కూడా యుద్ధవ్యూహాలలో అశ్వదళాలనూ, పదాతి దళాలనూ గణాలవారీగా నిలబెడతారు. "కుటుంబాలవారీగా, బంధుత్వాల వారీగా" అని టాసిటసు అనిర్దిష్ట రూపంలో చెప్పడానికి కారణం ఆయనకాలంనాటి కప్పుడే రోములో గణాలు అంతరించి పోవడమే.

టాసిటస్ రచనలలో ఒక వాక్యం చాల ప్రధానమైనది వుంది: తల్లి సోదరుడు తన మేనల్లుణ్ణి కొడుకులాగే చూసుకొంటాడు. మేనమామకూ మేనల్లునికీ గల రక్త సంబంధం, తండ్రికీ కొడుకుకూ మధ్య వుండే సంబంధంకన్న ఘనిష్ఠమూ పవిత్రమూనంటారు కొందరు. అందు చేతనే హామీగా వ్యక్తులను వుంచగోరినప్పుడు స్వంతకొడుకును కన్న, సోదరి సంతానాన్ని తమ అధీనంలో వుంచమనడం వలన ఎక్కువ హామీ వుంటుందను కొంటారు. ఇది తల్లిహక్కు అవశేషం. జర్మన్ల ప్రత్యేక లక్షణంగా దీనిని చెస్తారు. * ఆ గణ సభ్యుడు తనకు హామీగా తన కొడుకును వప్పచెప్పినప్పుడు మాట తప్పితే ఆ కొడుకు బలిఅయి పోతాడు. ఆ బాధ్యత ఆ తండ్రి ఒక్కడిదే. అలాగాక సోదరి కొడుకును బలిపెట్టేస్తే అతి పవిత్రమైన గణ ఆచారాన్ని అతిక్రమించినట్లే. ఆ బాలుణ్ణో, యువకుణ్ణో రక్షించవలసినబాధ్యత అతని సన్నిహిత

* మేనమామకూ, మేనల్లునికీ మధ్య చాల దగ్గరతనం వుందను కోవడం తల్లిహక్కు అవశేషం. ఇది చాలామంది ప్రజలలో కనిపిస్తుంది. వీరయుగపు పురాణగాథలలో మాత్రమే గ్రీకులు దీనిని ఎరుగుదురు. మెలియాగర్ తన తల్లి అల్తాయియా సోదరుల (థెస్టియసు కొడుకులు) ను చంపాడు. అల్తాయియా దీనిని మహాపాపం

బంధువుది. అతని మరణాని కా బంధువుదే పూచీ. అత నా కు(ర్రవానిని కుదువపెట్టడం తప్పు. కుదువపెట్టినప్పుడు మాట నిలుపుకోవాలి. జర్మన్లలో గణ వ్యవస్థ వుందనేటందుకు ఇతర నిదర్శనాలు కనబడక పోయినా అది వుండేదనడానికి ఈ వాక్యం ఒక్కటే చాలు.

"దేవతల అస్తమయం – ప్రపంచ విలయం" వర్ణించే ప్రాచీన నోర్సు తెగలవారి పాట ఒకటుంది. దాని పేరు వోలుస్పా. టాసిటస్ తర్వాత మరో ఎనిమిదివందల ఏళ్ళనాటిదీపాట. దీనిలో కొన్ని వాక్యాలు గమనించవలసి వున్నాయి. "సీరెస్ దివ్యదృష్టి" అనే ఆ భాగంలో ప్రళయానంతరం ప్రపంచం అంతటా అవినీతీ అనాచారమూ ప్రబలిపోతుందంటూ చెప్తారు. దీనిని బాంగ్,• బుగ్గీ† వివరించి చూపారు.

---

అంటుంది. హంతకుడి (తన కొడుకే) ని నిందిస్తుంది. వాని చావు కోరుతూ ప్రార్థిస్తుంది. "దేవత లామె ప్రార్థనను మన్నించి మెలియాగర్‌ను చంపివేశారని డియోడోరసు వ్రాశాడు (IV. 34).

ఆయనే మరో కథలో – హెరక్లిస్ నాయకత్వాన ఆర్గోనాట్లు థేసియాలో దిగారు. అక్కడ ఫిలియసును చూచారు. ఆ ఫినియస్ తన రెండోభార్య ప్రోత్సాహంతో మొదటిభార్య కొడుకు లిద్దరినీ హింసిస్తున్నాడు. ఫినియస్ మొదటిభార్య క్లియోపాత్రా బోరియాదే తెగకు చెందినది. ఆమె నాతడు విడిచిపెట్టాడు. థేసియాలో దిగిన ఆర్గోనాట్లలో కొందరు బోరియాదే లున్నారు. బోరియాదేలు గనక వారు క్లియోపాత్రాకు సోదరులు. హింసించబడుతున్న ఆ బాలురకు వారు మేనమామలు. ఆ వార్త తెలియగానే వారు తమ మేనల్లుని పక్షాన నిలబడ్డారట. సంరక్షకుల్ని చంపేసి వారిని విడిపించారట. (ఫ్రెడరిక్ ఏంజిల్సు పాద పీఠిక)

• క్రాటినస డొరోథియస్ బాంగ్ – 1822–1898. నార్వే దేశీయుడు. స్కాండినేవియా దేశాల సాహిత్య చరిత్ర పండితుడు; క్రిస్టియానియాలో ఆచార్యుడు.

† ఎల్‌సయెస్ సోఫస్ బుగ్గీ – 1833–1907 – నార్వేజియస్ భాషా తత్వవేత్త; ఓస్లోలో ఆచార్యుడు, ప్రాచీన నోర్సు సాహిత్యాన్ని సవ్యాఖ్యానంగా ప్రచురించాడు.

"సోదరులు సోదరులతో యుద్ధాలు చేస్తారు. ఒకరొకరిని చంపు కొంటారు. చెల్లెలి కొడుకులు ప్రేగు బంధాలను కోసేస్తారు."

పాటలో వుపయోగించిన సిస్టుర్ింగార్ అనే మాటకు పినతల్లి కొడుకు అని అర్థం. సోదరులమధ్య తగవులలో అంతకన్న పాపిష్టికర్మ మరొకటుండదని కవి హృదయం. సిస్టుర్ింగార్ అనే మాటలోవుంది కీలకం. తల్లివేపు బాంధవ్యంలోని ప్రగాఢత్వాన్ని అది తెలియపరుస్తూంది సిస్కినా - బోర్ ఇన్. సిస్కినాసినిర్ (సోదరుల సోదరీల పిల్లలు. కొడుకులు) అనే పదాలను వుపయోగించి వుంటే వేలుఎతంవచ్చి, బంధుత్వం బలపడడానికి బదులు క్షీణిస్తుంది. ఈవిధంగా వోలుస్పా వ్రాయబడిన వైకింగుల కాలంనాటికి స్కాండినేవియాలో తల్లి హక్కును ఇంకా పూర్తిగా మరచిపోలేదు.

ఇంక- టాసిటస్ కాలంనాటికి - ఆయన బాగా ఎరిగిన జర్మన్లలో తల్లి హక్కుపోయి తండ్రి హక్కు ఏర్పడిందని స్పష్టంగా చెప్పవచ్చు. పిల్లలు తండ్రికి వారసులు. పిల్లలులేకపోతే సోదరులు, పినతండ్రులు, మేనమామలు వారసులు. తల్లి సోదరుడికి వారసత్వం వుందనడం ఆ ఆచారాన్ని కాపాడడంగానే భావించాలి. జర్మన్లలో తండ్రి హక్కు ఏర్పడి ఎంతోకాలం కాలేదనడాని కదో నిదర్శనం తల్లి హక్కును సూచించే అవశేషాలు మధ్యయుగంవరకూ కనిపిస్తూనే వున్నాయి. అంతవరకు ముఖ్యంగా దాసులలో (సెర్ఫుల) పితృత్వం ఇంకా సందేహాస్పదమే. ఎవరన్నా దాసుడు నగరంనుంచి పారిపోయి, ఫ్యూడల్ ప్రభువు ఆతనిని వప్పచెప్పమని కోరుతుంటే, పారిపోయినవాడు దాసుడేనని ఆరుగురు రక్తబంధువులు - ముఖ్యంగా తల్లివేపు బంధువులు ప్రమాణం చెయ్యవలసి వుండట. కనీసం ఆగ్స్బర్గ్, బాసెల్, కై జర్ స్లాటర్న్లలో ఈ నిబంధన వున్నదట. (మావ్రర్—1. పుట 381)

రోమనులలో కన్న జర్మనులలో స్త్రీలకు మర్యాద ఎక్కువ. తల్లిహక్కునాటి అవశేషాలలో అదొకటి. ఆ అవశేషంకూడా వేవేగం అంతరించి పోతూంది. జర్మనులు మాటకు నిలబడేటట్లు చేయడానికి కులీనకుటుంబాల యువతుల్ని హామీగా పెట్టుకోవడం ఉత్తమోత్తమంగా

భావిస్తారు. తమ భార్యల్నీ, కూతుళ్ళనీ శత్రువు పట్టుకొని, బానిసల్ని చేస్తాదేమోననే భయంకలిగి నప్పుడు వారు యుద్ధంలో విపరీతమైన తెగువ చూపిస్తారు. స్త్రీని ఎంతో పవిత్రురాలినిగా, ప్రవక్తనుగా గౌరవిస్తారు. ప్రధాన విషయాలలో ఆమె సలహాలు తీసుకొంటారు. బటేవియను తిరుగుబాటుకు మూలకందం వెలెదా అనే బ్రుక్టేరియన్ పురోహితురాలు. ఆతిరుగుబాటులో జర్మన్, బెల్జియన్ తెగలు సివిలిస్ * నాయకత్వాన గాల్‌రాష్ట్రంలో రోమను పరిపాలనను మూలమట్టుగా కదల్చివేశాయి. ఇంటిలో ఆడుదానికి సంపూర్ణాధికారం వున్నట్లు అగుపిస్తుంది. మగవాళ్లు వేటకు పోవడం, త్రాగి తందనాలాడ్డంలో 'కాలం గడుపుతూంటారనీ, స్త్రీలు, ముదుసలులూ చిన్న పిల్లలతో కలిసి ఇంటిపనులు చాకిరీ చేస్తారనీ టాసిటసు వ్రాస్తున్నాడు; అయితే పొలాలలో వ్యవసాయం చేసే దెవరో ఆయన చెప్పలేదు. బానిసలు సుంకం చెల్లించేవారే గాని, వెట్టిచాకిరీ చేయవలసిన పనేమీ లేదని ఆయన విస్పష్టంగా వ్రాశాడు. అందుచేత ఆ కొద్దిపాటి వ్యవసాయపు పనులనేనాయె వయసు వచ్చిన మగవాళ్లు చేసేవారన్నమాట.

వారిలో జంటపెళ్ళి పద్ధతి అమలులో వున్నదనీ, క్రమంగా దంపతీ వివాహంలోకి మార్పు వస్తున్నదని పైన వ్రాశాను. అప్పటికింకా దంపతీ వ్యవస్థ స్థిరంకాలేదు. కులీనులలో బహుభార్యాత్వం అంగీకరించబడుతుంది. మొత్తంమీద, కెల్టులలోవలె కాకుండా జర్మన్లలో కన్యలు చాల కట్టుదిట్టంగా తమ కన్యాత్వాన్ని కాపాడుకోవాలని విధించేవారు. జర్మన్లలో వివాహబంధం చాల పవిత్రంగా భావించబడుతుందని టాసిటసు చాల ఉత్సాహంగా వ్రాశాడు. స్త్రీ వ్యభిచరించడం ఒక్కటే విడాకులు కోరడానికి తగినంత కారణం అవుతుందన్నాడు. కాని, ఆయన చెప్పే దాంట్లో మధ్య మధ్య ఖాళీలు చాలా కనిపిస్తున్నాయి. మరొకటేమిటంటే

---

* జూలియస్ సివిలిస్ — క్రీ. శ. 1 వ శతాబ్దం — బటేవియన్, జర్మన తెగల నాయకుడు. క్రీ. శ. 68 లో రోముపై ఆ తెగలు ఆయన నాయకత్వాన తిరగబడ్డాయి. కొద్దికాలం తిరుగుబాటు విజయవంతం అయినా 70 లో అణచివేయబడింది.

అవినీతి మయజీవితంలో మునిగిపోతున్న రోమనులకు నీతిమయ జీవితాన్ని చూప ప్రయత్నిస్తున్నట్లు ఆయన వ్రాతలవల్ల స్పష్టంగా తెలిసిపోతూంది. ఒకటిమాత్రం వాస్తవం: అడవులలో నివసిస్తున్న జర్మనులు నీతివిషయంలో ఉత్తమాదర్శం చూపుతూండవచ్చు కాని, బయటి ప్రపంచంతో కొద్దిపాటి సంబంధం పెట్టుకొంటే చాలు, అందరు యూరపియన్ల మాదిరిగానే వారూ తయారవుతారు. రోమను జీవితప్రవాహపు సుడిగుండంలో పడేసరికి జర్మను తెగలలో వారి భాషకన్న వేగంగా నీతిపరత్వం అంతరించి వూరుకొంది. తూర్సనగరవాసి గ్రిగరీ రచనలు చదివితే ఆ విషయం తెలుస్తుంది. రోములోలాగ జర్మను మహారణ్యాలలో సున్నితమైన విలాసజీవితం వుండజాలదు. అందుచేత ఈ విషయంలోకూడా జర్మన్లు రోమన్లకంటే గొప్పవారేనని చెప్పవచ్చు. ప్రపంచంలో ఏప్రజలలోనూ లేనంత విలాసమయ జీవితాన్ని వారు గడిపారు.

తండ్రుల, బంధువుల స్నేహాలూ, శత్రుత్వాలూ కూడా కుటుంబంలో పారంపర్యంగా బాధ్యతగా సక్రమించే పద్ధతి గణ వ్యవస్థనుంచి వచ్చింది. హత్యచేసినా, మరోనష్టంకలిగించినా రక్త ప్రతీకారానికి బదులు పరిహార ద్రవ్యం (వెర్‌జిల్డ్) ఇచ్చే పద్ధతికూడా ఆ వ్యవస్థనుంచి వచ్చినదే. ఈ వెర్‌జిల్డ్ పద్ధతి ఒక జర్మనులలోనే వున్నదని ఒక తరం క్రితం భావించేవారు. గణ వ్యవస్థలో అనుసరించబడే రక్త ప్రతీకారానికి ఇది ప్రత్యామ్నాయ రూపమనీ, వందలకొలది ప్రజలలో ఈ ఆచారం వున్నదనీ ఈ మధ్యకాలంలో బయటపడింది. అమెరికను ఇండియనులలో కూడా ఆతిధ్యంలాగే ఇదీ ఒక కర్తవ్యంగా భావించబడుతూంది. జర్మనులు నెరపే ఆతిధ్యాన్ని గురించి టాసిటసు వర్ణించినదీ (జర్మానియా - పుట 21) ఇండియనులలో ఆతిధ్యం గురించి మోర్గన్ వర్ణించినదీ చాలా వరకు ఒక్కలాగే వున్నాయి.

టాసిటసుకాలంలో జర్మన్లు సాగుభూమిని పంచేసుకొన్నారా? ఈ విషయంగూర్చి ఆయన వ్రాసిన మాటలకు ఏం అర్థం చెప్పాలి?—అనే వానిమీద ఎన్నో ఆవేశాలు పెరిగాయి. ఎంతో చర్చ జరిగింది. అదంతా గత చరిత్ర. అన్ని దేశాలలోనూకూడా భూమిని గణం అంతా కలిసి

సాగు చేసేవారనీ, తర్వాత సమష్టి సామూహిక కుటుంబాలు సాగు చేయడం వచ్చిందనీ అందరూ అంగీకరిస్తున్నారు. సమష్టి సామూహిక కుటుంబాలు భూమిని సాగుచేస్తాయనే విషయాన్ని సీజరు సుయేవీ తెగలవారిలో చూశాడు; తర్వాత విడివిడి కుటుంబాలకు భూములు కేటాయించి ఇచ్చేవారు. అప్పుడప్పుడు మళ్ళీ ఏకంచేసి తిరుగా ఇళ్ళవరసన్ని పంచుతూండేవారు. సాగు భూమిని కుటుంబాలకు మధ్య మధ్య తిరిగి తిరిగి పంచేపద్ధతి ఈ నాటికీ జర్మనీలో కొన్ని ప్రాంతాలలో అమలు జరుగుతూంది. ఈ విషయంగూర్చి విశేషం చెప్పనక్కర్లేదు సుయేవీలలో భూమిని పంచుకోవడం, ఎవరికివారు సాగుచేసుకోవడం లేదని సీజరు స్పష్టంగా వ్రాశాడు. జర్మన్లుకూడా అలాగే వుండేవారు. ఆ దశనుంచి ఒక నూట ఏభయ్యేళ్ళలో టాసిటస్ కాలంనాటికి ఎవరికివారు సాగుచేసుకోవడం, ఏటేటా భూములు పంచుకోవడం స్థితికి వచ్చేరంటే అది మంచి అభివృద్ధి అనే చెప్పాలి. అదివరకటి స్థితినుంచి భూమిపై వ్యక్తులకు అధికారం వుండే దశకు అంత స్వల్పకాలంలో బయటివాళ్ళ ప్రమేయం లేకుండా మార్పు రావడం అసంభవం. టాసిటసు వ్రాతలు చూస్తే నాకు అనిపిస్తున్నది: ప్రతి ఏడాదీ సాగుభూములు మార్చి మార్చి పంచుకొనేవారు. అయినా బోలెడంత ఉమ్మడి భూమి మిగిలి వుండేది. ఆనాటి జర్మన్ల గణ వ్యవస్థకు సరిపడే వ్యవసాయస్థితీ, భూమిని అనుభవించే పద్ధతీ అదే.

వెనుకటి మూడు కూర్పులలో వున్నట్లుగానే పైపేరాను యథాతథంగా వుంచేస్తున్నాను. * ఈ లోగా మరో సమస్య ఉత్పన్నమైంది. పితృస్వామిక సామూహిక కుటుంబం సార్వజనికం కాకపోయినా బాగా విస్తృతమైనదేననీ, తల్లిహక్కుతో వుండే సమష్టి కుటుంబానికీ ఆధునికమైన విడికుటుంబానికీ మధ్య నిది వంతెనవంటిదనీ కోవాలేవస్కీ నిరూపించాడు. ఆటు తర్వాత మావ్‌రర్ - వియాస్‌లు ఇప్పటికీ భూమి అందరి సమష్టి అధికారంలో వుండేదా, వ్యక్తిగత ఆస్తిగా వుండేదా

* దిగువ మూడు పేరాలనూ 1891 నాటి నాలుగో ముద్రణలో ఏంగెల్సు చేర్చాడు.

అని చర్చించుకోవడం అర్థంలేదు. సమష్టి అధికారంలో వుండే ఆస్తి ఏ రూపంలోకి మారిందనేదే ఇప్పటి సమస్య. సీజరు కాలంనాడు సుయ్ వీలలో భూమి అందిరి ఆస్తికావడమే కాదు. దానిని అందరికోసం, అందరూ కలిసి సాగుచేసేవారనడంలో సందేహంలేదు. ఇక్కడున్న సమస్య ఆ సమాజంలో ఆర్థిక యూనిటు గణమా? సామూహిక గృహ కుటుంబమా? లేక రెంటికీ నడుమంతరంగా వుండే సమష్టి బంధు కూటమా? లేక ఆ యా భూములలోవున్న పరిస్థితుల్ని పట్టి మూడు పద్ధతులూ ఒక దాని ప్రక్కనొకటి అమలులోవున్నా యా – అనే విషయం మీద చిరకాలం చర్చ జరగక తప్పదు. టాసిటసు వర్ణించిన పరిస్థితులు మార్కు (సామూహిక గ్రామం)లో వుండవనీ, సామూహిక గృహ కుటుంబంలో మాత్రమే వుంటాయనీ, సామూహిక గృహ కుటుంబం బాగా జనాభా పెరిగాక ఎంతో కాలానికి మార్కుగా మారిందనీ కోవాలేవస్కీ చెప్తున్నాడు.

అందుచేత రోమనుల కాలంలో ఆక్రమించుకొన్న జర్మను జనావాసాలూ, తర్వాత రోమనుల నుంచి గెలుచుకొన్న భూములతో వారు ఏర్పరచుకొన్న జనావాసాలూ గ్రామాలు కావనీ, పెద్దపెద్దసామూహిక గృహకుటుంబాలు మాత్రమేననీ, ఆ ఇళ్ళలో ఎన్నోతరాలవాళ్లు కలిసి జీవిస్తుంటారనీ, ఆ ఇంటికి సరిపడేటంత పాటి భూమిని సాగుచేసుకొంటూ, చుట్టూవున్న అడివి భూమిని పొరుగువారితో కలిసి వుపయోగించుకొనేవారనీ చెప్పవచ్చు. ఈ పరిస్థితులలో ప్రతిఏటా భూమిని మార్చేవారంటూ టాసిటసు వ్రాసిన మాటకు వ్యవసాయ సంబంధంగా అర్థంచెప్పుకోవలసి వుంటుంది. ఆ సామూహిక గృహకుటుంబం ఏడాదికో భూమిని సాగుచేసేదనీ, ఈ ఏడాది సాగుచేసిన భూమిని మరు సంవత్సరం బీడు పెట్టేవారనీ, లేదా పడావుగా వుంచేవారనీ ఆమాటకు అర్థంచెప్పుకోవాలి. జనాభా చాలతక్కువగా వుండడంచేత బోలెడంత ఖాళీజాగా వుండేది. అందుచేత భూమికోసం తగాదాలుండేవికావనుకోవాలి. కొన్ని శతాబ్దాలు గడిచి, సామూహిక గృహకుటుంబంలో జనం బాగా పెరిగిపోయారు. అప్పటికున్న ఉత్పత్తి పరిస్థితులలో సమష్టి వ్యవ

సాయం సాధ్యంకాదు. ఫలితంగా సామూహిక గృహకుటుంబాలు విడిపోయాయి. కొత్తగా ఏర్పడిన వేర్వేరు ఇళ్ళవారికి వెనుకటి ఉమ్మడి భూముల్నీ, బీళ్ళనీ పంచిపెట్టారు. మొదట ఈ పంపిణీ కొంత కొంత వ్యవధిలో జరుగుతుండేది. తర్వాత శాశ్వతంగా పంచేసుకొన్నారు. కాని, అడవులూ, గో భూములూ, నీటి నెలవులూ ఉమ్మడి సొత్తుగానే మిగిలిపోయాయి.

అభివృద్ధి ఈ క్రమంలోనే వచ్చినట్లు రష్యా చరిత్రలో నిరూపితం అవుతూంది. జర్మనీలోనూ, తర్వాత జర్మనులు ప్రవేశించిన దేశాలలోనూకూడ ఇదే జరిగిందనడమే టాసిటస్ రచనలలోని మాటలకు సరియైన అర్థంగా తోస్తుంది. టాసిటసు కాలంనాడు సామూహిక గ్రామాలున్నాయనుకోడంలో వచ్చిన ఇబ్బందులనుంచి బయటపడేటందుకిదొక్కటే పద్ధతి. కోడెక్స్ లారెషామెన్సిస్ * వంటి అతి ప్రాచీన పత్రాలను సులభంగా అర్థం చేసుకొనేటందుకు సామూహిక గ్రామాలకన్నా సామూహిక గృహ కుటుంబాలను గణనలోకి తీసుకొంటేనే ఎక్కువ వీలుపడుతుంది. దానితో మళ్ళీ కొన్ని కొత్త చిక్కులూ, కొత్త సమస్యలూ వస్తాయి. వానిని పరిష్కరించవలసి వుంటుందనుకోండి. అది వేరు. ఇంకా పరిశోధన చేసినప్పుడే అవి పరిష్కారం అవుతాయి. జర్మనీ, స్కాండినేవియా, ఇంగ్లండులలో సామూహిక గృహకుటుంబంకూడా ఒక మధ్యంతరదశ మాత్రమేననే అభిప్రాయాన్ని కాదనలేను.

సీజరుకాలానికి జర్మన్లు అప్పుడే స్థిరావాసాలు ఏర్పరచుకొన్నారు. కొంతమంది యింకా స్థిరనివాసాలు వెతుక్కుంటున్నారు. కాని టాసిటస్ కాలంనాటికి వా రప్పుడే స్థిరావాసాలు ఏర్పరచుకొని నూరేళ్ళయింది. తత్ఫలితంగా జీవనాధార వస్తువుల వుత్పత్తి ఎంతో పెరిగింది. అది కనిపిస్తూనేవుంది. దుంగలతోకట్టిన ఇళ్ళలో వారు నివసించేవారు. వెనక అడవుల్లో వున్నప్పుడు ధరించినట్లే వూలు పైబట్టలూ, జంతుచర్మాలూ

* కోడెక్స్ నారెషా మెన్సిస్ – వర్టెన్‌బర్గ్‌లోని లాక్ నగరంలోవున్న బెనెడెక్టయిన్ మఠంలో దొరికిన పత్రాల సంపుటి.

ధరించేవారు. ఆడవాళ్ళూ, ధనికులూ లోపల నూలుబట్టలు ధరించేవారు పాలు, మాంసం, అడవిపళ్ళు తినేవారు. ఓట్స్‌తో చేసిన జావ త్రాగే వారని ప్లినీ వ్రాశాడు (ఐర్లండులోనూ, స్కాట్లండులోనూ కెల్టు తెగల వారి ప్రధానాహారం ఈనాటికీ యీ జావయే). వారి సంపద పశువులు. అవంత మేలుజాతివి కావు. చిన్నవిగా వుండేవి. అంత మచ్చికైనవి కావు. కొమ్ము లుండేవి కావు. వాళ్ళ గుర్రాలు పొట్టివి. అంతవేగంగా పరుగెత్తగలవి కావు. రోమను నాణాలనే ధనంగా వాడేవారు. అదయినా చాలా అరుదుగా వాడేవారు. వెండి, బంగారు నగలు యెరగరు. ఆ లోహాల కంత ప్రాముఖ్యమూ యిచ్చేవారు కాదు. ◆ కనీసం రైన్, డాన్యూబ్ నదులవద్దనున్నవారిలో ఇనుము వాడకం బాగా తక్కువ. ఉన్నదికూడా పైనుంచి తెప్పించుకొన్నదే. రూనిక్, లిపిని (గ్రీకు, లాటిన్ అక్షరాల అనుకరణ) రహస్య లిపిగా వుపయోగించేవారు. ముఖ్యంగా మత సంబంధమైన మంత్రతంత్రాలకు వుపయోగించేవారు. నరబలులు బాగా పరిపాటిగా వుండేవి. సంగ్రహంగా చెప్పాలంటే వారు అప్పు డప్పుడే అనాగరిక యుగపు మధ్యదశ నుండి ఎగువ దశలో అడుగుపెట్టా రనాలి. రోమనులతో సంబంధం పెట్టుకొన్న తెగలు రోమనులనుంచి పారిశ్రామిక వస్తువుల్ని తెచ్చుకొనేవారు. అందుచేత వారిలో బట్టలపరిశ్రమా, లోహపరిశ్రమా స్వంతానివి వృద్ధి పొందలేదు. ఈశాన్యదిశలో బాల్టిక్ సముద్రతీరప్రాంతపు తెగలలో ఈ పరిశ్రమలు వృద్ధిపొందాయి. స్లెస్విగ్ బందలలో దొరికిన పొడుగయిన ఇనుపకత్తి, కవచము, వెండి శిరస్త్రాణం, రెండో శతాబ్దాంతం నాటి రోమను నాణాలూ, వలసల మూలంగా నాలుగువేపులకూ విస్తరించిన జర్మనుపాత్ర సామగ్రులూ చూస్తే, అవి రోమను వస్తువుల నమూనాలో తయారు అయినా మంచిపనితనం కనబరుస్తున్నాయి. ఒక్క ఇంగ్లండుకుతప్ప రోమక సామ్రాజ్యంలో ఏ మూలకు వలసవెళ్ళినవారిలోనూకూడ దేశీపరిశ్రమలు అంతరించక మానలేదు. నిగనిగలాడే కంచు

◆ 16 వ శతాబ్దివరకూ యూరపు ఉత్తరభాగంలో ప్రజలు వాడిన అక్షరాలు.

పొలుసులు (కవచాలమీద బిగించేవి) చూస్తే పరిశ్రమ ఒకే స్థాయిలో ఎల్లా అభివృద్ధి పొందిందో తెలుస్తుంది. ఇంగ్లండులో, స్వీడన్‌లో లభించిన వానిలాగే బర్గండీ, రుమేనియా, అజావ్ సముద్ర గర్భంలోను దొరికిన వస్తువులు కూడా ఒకే మాదిరి కార్ఖానాలలో తయారయినట్లే కనిపిస్తాయి. అవన్నీ జర్మనుల తయారీలే.

వాళ్ళ నిర్మాణం కూడా అనాగరికయుగపు ఎగువదశకు అనుగుణంగానే వున్నాయి. టాసిటను చెప్పిన దాన్నిబట్టి సాధారణంగా నాయకుల (ప్రిన్సిపే) కౌన్సిలు ఒక టుండేది. అంత ప్రధానంకానివిషయాలను యీ కౌన్సిలే పరిష్కరించేది. ప్రధాన విషయాలను ప్రజాసభ నిర్ణయానికి తెచ్చేది. అనాగరికయుగపు దిగువదశలో ప్రజాసభలు గణాల స్థాయిలోనే జరుగుతాయి. కాని, తెగలు, తెగల సమాఖ్యల స్థాయిలో జరగవు. కనీసం అమెరికనులలో చూసిన దానినిపట్టి మనకు తెలిసింది అంతే. కౌన్సిలులోని నాయకులకు (ప్రిన్సిపే). సైన్యనాయకులకు (డ్యూక్) భేదం విస్పష్టంగా కనిపిస్తూంది. ఇరాక్వ్యాలలోనూ అంతే. మాజిస్ట్రేట్లుతమ సహోదరులయిన తెగప్రజలనుంచి ధాన్యం, పశువులూ మొదలయినవానిని బహుమతులుగా తీసుకోవడం, కొంతవరకు ఆ ఆదాయం మీదనే బ్రతకడమూ ఆరంభమయింది. అమెరికాలో లాగనే ఇక్కడ కూడా వీరిని ఒకే కుటుంబంలోంచి ఎన్నుకొంటున్నారు. తండ్రి హక్కులోకి మార్పురాగానే గ్రీసు, రోములలో మాదిరిగా జర్మనులలో కూడా ఎన్నుకోబడవలసిన వుద్యోగాలు వంశపారం పర్యపు వుద్యోగాలుగా మారాయి. దానితో ప్రతిగణంలోనూ కులీనకుటుంబాలు తయారాయాయి. తెగలలో పైకి వచ్చిన ప్రాచీనకాలపు ఈ కులీనకుటుంబాలు వలసల కాలంలోనో, అటుతర్వాత కొద్దికాలం లోపలనో అంతరించి పోయాయి. పుట్టుకను పట్టిగాక సామర్థ్యాన్ని పట్టి సైన్య నాయకుల్ని ఎన్నుకొనేవారు. వారి అధికారం చాలా స్వల్పం. తమ ఆదర్శబలమే వారికున్న బలం. సైన్యాలలో క్రమశిక్షణ పురోహితులద్వారా రక్షించబడుతూందని టాసిటస్ వ్రాశాడు. అసలు అధికారం అంతా ప్రజాసభది. రాజు లేక తెగ నాయకుడు అధ్యక్షత వహిస్తాడు. ప్రజలు నిర్ణయిస్తారు. గొణుగుడు 'నిరా

కరణ'కు గుర్తు. ఉత్సాహధ్వనులూ, ఆయుధాల చప్పుడు అంగీకారానికి గుర్తు. ప్రజాసభే న్యాయస్థానంకూడా. దానికే దరఖాస్తులు పెట్టుకొనే వారు. అదే నిర్ణయాలుచేసేది. పిరికితనం, ద్రోహం, అమానుషములయిన అలవాట్లు. వీనికి మరణశిక్షలు విధించేది. గణాలూ, తదితర శాఖలూ కూడ ఇల్లాగే జనసభలలో విచారణలు జరిపేవి. అక్కడ మాజిస్ట్రేటు అధ్యక్షుడుగా కూర్చుంటాడు. జర్మను కోర్టులన్నింటా జరిగేటట్లే అతడు కార్యక్రమాన్ని నడుపుతాడు. ప్రశ్నలు వేస్తాడు. జనసభ తీర్పు చెప్ప డమే జర్మనులలో ఎప్పుడూ, ఎక్కడా అలవాటు.

సీజరు కాలంనుంచీ తెగలు 'కాన్ఫెడరసీ'లుగా (సమాఖ్యలు) ఏర్పడడం ప్రారంభమయింది. వానిలో కొన్నింటికి అప్పుడే రాజులు ఏర్పడ్డారు. గ్రీకులు, రోమనులలోవలే జర్మనులలోకూడ సర్వసైన్యాధ్య క్షుడు నిరంకుశాధికారం నెలకొల్పడానికి ప్రయత్నిస్తున్నాడు. కొన్నిచోట్ల ఆ ప్రయత్నాలు నెరవేరేయికూడా. అంతమాత్రంచేత వారు నియంత లయి పోలేదు కాని గణవ్యవస్థ తాలూకు బంధనాలను ఛేదించడానికి వారు వుపయోగపడ్డారు. స్వాతంత్ర్యం పొందిన బానిసలు ఏ తెగకూ చెందిన వారు కాకపోవడంచేత తక్కువగానే చూడబడేవారు. కాని, కొత్తరాజుల ప్రాపకంలో పదవులు, సంపదలు, మర్యాదలుకూడ సంపాదిస్తున్నారు. ఆ సైన్యాధిపతులు రోమక సామ్రాజ్యాన్ని ఆక్రమించి పెద్ద పెద్ద రాజ్యా లకు అధిపతులయ్యాకకూడా అదే కొనసాగింది. ఫ్రాంకు తెగవారిలో రాజులవద్దనున్న బానిసలూ, విముక్తి పొందిన బానిసలూ రాజదర్బారు లోనూ, తర్వాత రాజ్యాంగంలోనూ ప్రముఖపాత్ర వహించారు. నూతన కులీనవర్గంలో అధికభాగం వారినుంచి ఏర్పడినదే.

రాజరికాలు తలఎత్తడానికి ప్రధానంగా తోడ్పడినది సొంత సిబ్బంది. గణాలతో నిమిత్తం లేకుండా తమంత తాముగా యుద్ధాలు చేసేటందుకై కొందరు యోధుల్ని సొంత సిబ్బందిగా సమీకరించే పద్ధతి అమెరికాలోని రెడ్ ఇండియన్లలో ఏ విధంగా తల ఎత్తిందో పైన చూశాం. జర్మన్లలో ఈ సిబ్బంది దళాలు స్థిరసైన్యాలుగానే తయా రయాయి. కొంతపేరు సంపాదించుకొన్న సైన్యనాయకుడిచుట్టూ దోపి

డీలు సాగించే అభిలాషతో యువకులు చేరేవారు. ఆ నాయకుడు వారికి తిండిపెట్టేవాడు. బహుమతులిచ్చేవాడు. తరతమక్రమంలో నిర్మాణ పరిచే వాడు. తక్షణావసరాలకీ, చిన్న చిన్న ఘర్షణలకూ దగ్గరనున్న అంగరక్షకులు. కొద్దిబలగమూ సరిపడేది. పెద్ద యుద్ధాలకోసం శిక్షితులయిన సేనానాయకులుండేవారు. సొంత సిబ్బందులు అంత శక్తిమంతాలుకావు. ఆ విషయంఇటలీలో ఓదోవాకర్ * విషయంలో నిరూపితంఅయిందికూడా. ఈ దళాలు అంత శక్తిమంతాలు కాకపోయినా వెనుకటి రోజులలో ప్రజలకున్న స్వాతంత్ర్యాలను విధ్వంసం చేసేటందుకవి బీజాలువేశాయి. వలసల కాలంలోనూ, తర్వాతనూ ఇవి ఆ పనేచేశాయి. ఒకటి – రాజు అధికారంలోకి రావడానికి తగిన వాతావరణం కల్పించాయి. రెండోది – టాపిటసు చెప్పినట్లు వారిని బెదిరిపోకుండా వుంచాలంటే నిరంతరాయంగా యుద్ధాలూ, దాడులూ సాగించవలసిందే. దోచుకోవడం వారికి ప్రధాన గమ్యం అయింది. నాయకుడికి తనచుట్టు ప్రక్కల చేయడానికేమీ కనబడకపోతే అతడు తన సొంత సిబ్బందిని యుద్ధాలు, దోపిడీ అవకాశాలూ వున్న ఇతర దేశాలమీదకు నడిపించేవాడు. రోమను జెండాక్రింద జర్మను సహాయక సేనలు జర్మనులనే ఎదుర్కొని పోరాడిన ఘటనలున్నాయి. వారంతా ఈవిధంగా చేర్చుకొన్న సొంత సిబ్బంది దళాలే. వారి సంఖ్యకూడా ఎక్కువగానే వుండేవి. సైనిక వృత్తి జీవులకు వారే పాతిపదికలు వేశారు. జర్మను జాతికి సిగ్గూ, తలవంపూ తెచ్చిన వృత్తి అది. రోమక సామ్రాజ్యాన్ని జయించాక ఈరాజుల వద్దనున్న సొంతసిబ్బంది, రోమను దర్బారీలు, క్రీతదాసులూ–వీరే భావికాలపు కులీనవర్గంలో అత్యధికభాగం అయ్యారు.

మొత్తంమీద, వీరయుగంనాటి గ్రీకులలోనూ, రాజ నామధారులనాటి రోమనులలోనూ కనిపించేమాదిరి నిర్మాణమే జర్మను తెగలు

---

* ఓదోవాకర్ – 493 క్రీ. శ. మరణించాడు. జర్మను సేనాధిపతి. ఇటలీలోని ఓస్ట్రోగాత్‌లకు 476 లో రాజు చేయబడ్డాడు.

రాజ్యాలుగా ఏర్పడిన రోజులలో వారిలో కూడా కనబడుతూంది. ప్రజా సభలు. గణనాయకుల కౌన్సిళ్లు. రాజరికంవేపు దారి తీస్తున్న సేనానాయకులు-గణవ్యవస్థలో ఏర్పడగల అత్యున్నత నిర్మాణం అది. అనాగరిక యుగపు ఎగువదశలో ఏర్పడే నమూనా నిర్మాణం ఈ నిర్మాణంయొక్క పరిమితులను దాటి. సమాజం ఒక్క అడుగు ముందుకు వేసిందంటే గణ వ్యవస్థ ఛిన్నాభిన్నం అయిపోతుంది. అలాగే విచ్ఛిన్నం అయింది కూడా. ఆ నిర్మాణం స్థానే రాజ్యాంగం ఏర్పడింది.

# 8

# జర్మన్లలో రాజ్యాంగం ఆవిర్భావం

టాసిటను వ్రాసినదానినిబట్టి జర్మనుల జనాభా చాల ఎక్కువ. వేర్వేరు జర్మన్ ప్రజల సంఖ్య రమారమి ఎంత వుంటుందో సీజరు వ్రాసేడు. రైన్‌నది ఎడమగట్టుకి వచ్చిన ఉసిపెటాన్‌లూ, టెన్‌క్టెరానులూ ఆడా - మగా, పిల్లా - పెద్దా అంతాకలిసి లక్షా ఎనభయివేలు వుంటారని ఆయన వ్రాశాడు. మంచి ఉచ్ఛదశలో కూడ ఇరాక్వ్యాలు 20 వేల మందికి మించిలేరు. ఆ 20 వేలమంది వున్నప్పుడే వాళ్లి గ్రేట్ లేక్స్‌నుంచి ఓహియో, * పోటోమాక్‌ల † వరకూ దేశాన్ని దద్దరిల్లి పోయేలా చేశారు అంతకంటే జర్మన్ల సంఖ్య ఒక లక్షకు పైగా ఎక్కువగా వుండేది. • చారిత్రక నివేదికల్ని పట్టి మనకు తెలిసిన రైన్ ప్రాంత ప్రజల్ని దేశపటంమీద గుర్తుపెట్టామంటే ఆ మాత్రం జనం ప్రష్యా ప్రభుత్వ పరిపాలనలోని ఒక జిల్లా అంతమేరలో - అంటే 10 వేల చదరపుకిలో మీటర్ల మేరలో నివసిస్తూండి టంతమంది వుంటారు. రోమనుల కాలంలో 'విశాల జర్మనీ' విస్తులా నదివరకూ

---

* ఓహియో మిస్సిసిపినది ఎడమగట్టున వున్న ఉపనది.

† పోటోమాక్ - సంయుక్త రాష్ట్రాల తూర్పుభాగంలోని నది.

• గాల్‌లోని (ఈనాడు ఫ్రాన్సు అని పిలిచే దేశ భాగానికి రోమనుల కాలంనాటి పేరు-అను.) కెల్టులను గురించి దియోదోరను వ్రాసిన అంశాన్నిబట్టి ఇక్కడ చెప్పిన అంకె సరిగ్గా వుందనే అనాలి.

5 లక్షల చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం కలిగివుండేది. సగటున ఒక్కొక్క తెగలో లక్ష వుంటారనుకొన్నా, విశాల జర్మనీ జనాభా 50 లక్ష లుంటుంది. అనాగరిక దశలోవున్న ప్రజలలో అంతమంది వుండడం అసాధారణమే. అయితే అంతమందివున్నా సగటున చదరపు కిలోమీటరుకు 10 మంది చొప్పునే వున్నట్లవుతుంది. అంటే చదరపు మైలుకి 550 మంది. ఈనాటి పరిస్థితులలో ఆ సంఖ్య చాల తక్కువ. అనాడు జర్మను తెగలన్నీ నివసించినదికూడ ఇక్కడే కాదు. గోథిక్ తెగల తాలూకు బస్తార్నియనులూ. పెయ్‌కినియనులూ తదితరులూ కార్పేదియన్ పర్వతాలలోనుంచి డాన్యూబ్ కంటా నివసించేవారు. వారి సంఖ్య చాల ఎక్కువగా వుండేది. జర్మనులలో అయిదో అధికసంఖ్యగల తెగ అని వారిసి గురించి ప్లినీ వ్రాశాడు. క్రీ. పూ 180 నాటికే వారు మాసిడోనియా రాజు పెర్సియస్ అధీనంలో సైనికులుగా పనిచేస్తుండేవారు. అగస్టసు కాలం నాటివరకూ వారు ఇంకా ఆడ్రియానోపిల్ వరకూ చొచ్చుకు వస్తూనే వున్నారు. వారి సంఖ్య పది లక్ష లుంటుందనుకొన్నా క్రీ శకారంభం నాటికి జర్మను ప్రజల సంఖ్య ఏవిధంగానూ 60 లక్షలకు తగ్గదు.

జర్మనీలో స్థిరపడ్డాక వారు అంతకంతకు వేగంగా పెరిగినట్లు కనబడుతుంది. పైనచెప్పినట్లు వారిలో బాగా పరిశ్రమలు వృద్ధిపొందడమే దానికి నిదర్శనం. ష్లెస్విగ్ బందలలో దొరికిన ఆయుధాలు క్రీ. శకం మూడోశతాబ్ది తర్వాతివని వానితోపాటు దొరికిన రోమను నాణాలను పట్టి గ్రహించవచ్చును. అంటే అనాటికి బాల్టిక్ ప్రాంతంలో

---

*గాల్‌లో అసంఖ్యాకులైన ప్రజలనేకులు నివసిస్తున్నారు. వారి అందరిదీ సరి సమాన సంఖ్యగాదు. అధికంలో అధికం 2 లక్షలమంది వున్నవారూ, తక్కువలో తక్కువ 50 వేలు వున్నవారూకూడా ఉన్నారు (దియోడోరసు సికులస్ V. 25)—అంటే సగటు సంఖ్య లక్షా ఇరవయ్యైదువేలు అన్నమాట. గాల్‌లో నివసించే ప్రజలుబాగా వృద్ధిలో వున్నారు. అందుచేత జర్మనులకన్న ఎక్కువ సంఖ్యలోనే వుంటారు.

(ఫ్రె. ఏంజిల్సు)

లోహ, వస్త్రపరిశ్రమలు బాగా వృద్ధిపొందాయన్నమాట. రోమను సామ్రాజ్యంతో వ్యాపారం బాగా సాగుతూంది. ధనిక తరగతులలో కొద్దిగొప్ప భోగం, విలాసం కనిపిస్తూంది. ఇవన్నీ జనాభా పెరుగుదలకు నిదర్శనలు. సరిగ్గా ఈ సమయంలోనే జర్మనులు రైన్‌నది, రోమన్‌ల గోడ, డాన్యూబ్ నది-పొడుగునా తమదాడి ప్రారంభించారు. పెరిగిపోతున్న జనాభా బయటికి దాటిచూసుకొంటున్న దనడానికిదొక నిదర్శనం. మూడు శతాబ్దాల నిరంతర పోరాటాలలో స్కాండినేవియాలోని గోథ్‌లు, బర్గండియనులు తప్ప మిగతా గోధిక ప్రజలలో ప్రధాన భాగం ఆగ్నేయ దిశగా కదిలారు. సుదీర్ఘ రంగంలో సాగుతున్న దాడులలో వీరు వామ పార్శ్వంగా నిలబడ్డారు. ఎగువ డాన్యూబ్ భాగం మధ్యరంగం. ఇక్కడ హెర్మినోనియన్లు (హైజర్మన్లు) పోరాడుతున్నారు. ఈ నాడు ప్రాంకులనే ఇస్తా యెవోనియన్లు రైన్‌నది వెంబడినే దక్షిణరంగంలో పోరాడుతున్నారు. బ్రిటన్‌ను జయించే పని ఇస్తా యెవోనియన్ల పాలబడింది. అయిదో శతాబ్దం ఆఖరుకి రోమను సామ్రాజ్యం నిర్వీర్యం అయింది. నిశ్శక్తం, నిస్సహాయం అయిపోయింది. జర్మనుల దాడి నాపేశక్తి అక్కడేదీ మిగలలేదు.

గత ప్రకరణాలలో ప్రాచీన గ్రీకు, రోమను నాగరికతల పుట్టుకను చూశాం. ఇప్పుడు వాని అంత్యావస్థను చూస్తున్నాం. రోమను ప్రపంచాధికారం మధ్యధరాసముద్ర ప్రాంత దేశా లన్నింటినీ చెక్కపట్టినట్లు చదును చేసేసింది. సంకీర్ణం అయిపోయిన లాటిను భాషను గ్రీకుగాని ఇతర దేశభాషలుగాని ప్రతిఘటించ లేకపోయినాయి. జాతుల ప్రత్యేకత లేమి మిగులలేదు. గాల్‌లు, ఇబెరియనులు, లిగురియన్లు, గోరికనులు అంతా రోమనులే అయిపోయారు. రక్త సంబంధాలను పట్టి ఏర్పడిన ప్రాచీన వ్యవస్థను రోమను పరిపాలనా, రోమను చట్టాలూ రద్దుపరచివేశాయి. ఆవిధంగా స్థానిక, జాతీయ ఆత్మ వ్యక్తీకరణల అవశేషాలుకూడా రద్దయిపోయాయి. రోమను అనేది ఒక జాతి పేరుకాదు. జాతి శూన్యత కది చిహ్నం. అందుచేత రోమను ననే భావం ప్రాచీన వ్యవస్థ లేని లోపాన్ని భర్తీచేయలేకపోయింది. కొత్త జాతులు ఉత్పన్నమ

కావడానికి కావలసిన బీజాలు సర్వత్రా వున్నాయి. వివిధ రాష్ట్రాలలోవి లాటిన్ మాండలికాలు అంతకంతకు విడిపోతున్నాయి. ఇటలీ, ఫ్రాన్సు, స్పెయిన్, ఆఫ్రికాలను వేర్వేరు దేశాలనుగా చేస్తున్న ప్రకృతి సిద్ధము లయిన సరిహద్దులు అలాగే ఉన్నాయి. ఆ హద్దుల్ని చెరిచివేయడమూ సాధ్యంకాదు. కాని వీనిని కొత్త జాతులనుగా ఏకీకృతంచేయగల శక్తులు ఎక్కడా కూడా లేవు. ఎక్కడా అభివృద్ధికి అవకాశాలు కనిపించవు. సృజనాత్మక శక్తి మాట అటుంచి, శైథిల్యాన్ని నిరోధించగల శక్తి కూడా ఏమాత్రమూలేదు. అంత సువిశాల భూభాగంలోని అసంఖ్యాక ప్రజాకోటిని కలిపి వుంచుతున్న దొక్క రోమను రాజ్యాంగం మాత్రమే. కాలక్రమేణా ఆ రాజ్యాంగమే వారికి శత్రువు, పీడాకరమూ అయింది. రాష్ట్రాలు రోమును ధ్వంసం చేశాయి. రోముకూడ అన్నిటిలాగ ఒక రాష్ట్ర నగరమే అయిపోయింది. దానికి కొన్ని ప్రత్యేకహోదా లున్నాయే గాని అది ఇప్పుడు పాలక నగరంకాదు. ప్రపంచ సామ్రాజ్యాని కది ఇప్పుడు కేంద్రం కాదు. చక్రవర్తులు, ఉప చక్రవర్తులూ అక్కడ వుండడం లేదు. ఇప్పుడు కాన్‌స్టాన్‌టి నోపుల్, త్రెవే, మిలాన్ నగ రాలు వారి మకాములు. రోమన్ రాజ్యాంగం ప్రజలను పీకి పీడించే ఒక బ్రహ్మాండమైన యంత్రం అయిపోయింది. పన్నులు, అనేకరకాల లెవీలు, ప్రభుత్వం వసూలుచేసే అపరాధాలతో ప్రజానీకం అంతకంతకు గర్భదరిద్రులయి పోతున్నారు. ప్రొక్యురేటర్లు*, పన్ను వసూలు చేసే వారు, సైనికులు ప్రజలనుంచి డబ్బు పిండేటందుకు అనుసరించే పద్ధ తులు దుర్భరం అయిపోయినాయి. ప్రపంచ వ్యాప్తంగా అధికారం సంపా దించిన రోమను రాజ్యాంగం పరిస్థితుల నీ గతికి తెచ్చింది. దేశంలో భద్రతను నిలపడం, బయటనుంచి దాడిచేస్తూన్న అనాగరికుల నుంచి రక్షణ కల్పించడం కోసమే అది వుంది. కాని, దేశంలో అది నిలుపు తున్న భద్రత పట్టి అరాజకం కన్న అధ్వాన్నం. పౌరులను అనాగరికుల

---

* రోమను చక్రవర్తుల తరపున రాష్ట్రాలలో ఆర్థికవిషయాల పర్యవేక్షణ జరిపే ఉద్యోగి—అను.

దాడులనుంచి రక్షణ నిస్తున్నట్లు భావించడం ఆత్మవంచన. ఏమంటే పౌరులు అనాగరిక ప్రజలను ఆపదోద్ధారకులనుగా అభినందిస్తున్నారు.

సామాజిక పరిస్థితులు కూడా అంత దుర్భరంగానే వున్నాయి. రిపబ్లికు చివరికాలంలో ఆక్రమించిన రాష్ట్రాలను నిర్దయగా పిండివేయడం ఒక్కటే రోమను పరిపాలన చేసిన పని. చక్రవర్తులు ఈ దోపిడీని రద్దు చేయలేదు. పైపెచ్చు దానినొక క్రమ పద్ధతిలో పెట్టారు. అంతే. సామ్రాజ్యం శిథిలం అవుతున్న కొద్దీ పన్నులు పెరిగాయి. నిర్బంధ చాకిరీ ఎక్కువయింది. ఉద్యోగులు సిగ్గుబిడియాలు విడిచి ప్రజలను అదిరించి, బెదిరించి దోపిడీ చేశారు. రోమను పెత్తందార్లు ఎన్నడూ పరిశ్రమలూ, వ్యాపారమూ ముట్టుకోలేదు. వడ్డీవ్యాపారంలో వారు అందరి తలలూ తన్నారు. అంతటివాళ్లు మరి పుట్టలేదు. పుట్టబోరు. వ్యాపారం, వాణిజ్యం ఏలాగో కొంతకాలం సాగింది. కాని ఉద్యోగుల లంచాల ఆశలో అంతరించి పోయింది. మిగిలిన కొద్దిపాటి వాణిజ్యం ఒక్క తూర్పుభాగంలో గ్రీకు రాష్ట్రంలోనే సాగుతుండేది. ఆవిషయం ఇక్కడ మనకి అప్రస్తుతం. సర్వత్రా దారిద్ర్యం. వ్యాపారం, పరిశ్రమలు, కళలు, చివరకు జనాభాయే క్షీణించాయి. పట్టణాలు పాడుబడ్డాయి. వ్యవసాయం బాగాచితికిపోయింది. రోమనుల ప్రపంచాధిపత్యం యొక్క అంతిమ ఫలితాలివి.

ప్రాచీనకాలంలో ప్రపంచంలో ప్రధానమైన ఉత్పత్తిశాఖ వ్యవసాయమే. నేడు అదే గతి అయిపోయింది. రిపబ్లికు చివరిదశలో ఇటలీ దేశం అంతటా పెద్దపెద్ద ఎస్టేట్లు (లాటిఫుండియా) తలఎత్తాయి. వాటిని రెండువిధాలుగా వుపయోగించేవారు. ప్రజల్నితోలేసి పెద్దపెద్ద బీళ్లపెట్టి పశువుల్నీ, జీవాల్నీ పెంచేవారు. వాటిని మళ్లెయ్యడానికీ, సంరక్షించడానికీ కొద్దిమంది బానిసలు సరిపడతారు. లేదా వాటిలో బానిసల సాయంతో పెద్ద పెద్ద పండ్లతోటలు నాటారు. తోటల యజమానుల భోగవిలాసాలకూ, పట్టణాలలో అమ్మడానికీ వాని ఫలసాయం వినియోగం అయ్యేది. కాలం గడిచిన కొద్దీ యజమానులు చితికిపోవడం, నగరాలు పాడుపడడం మూలంగా తోటలు పాడయి పోయాయి. కాని బీళ్ళు పెరిగాయి బానిసల శ్రమమీద కొనసాగే లాటిఫుండియను ఆర్థిక వ్యవస్థ ఇంక లాభకరంగా

లేదు. చిన్న కమతాల సాగే మళ్ళీ లాభకరం అయింది. ఒక్కొక్క ఎస్టేటునే కమతాలుగా విడదీసి, వంశపారంపర్యంగా వ్యవసాయం చేసుకొనే రైతుల కిచ్చారు. వారు నిర్ణీతమైన మక్తా చెల్లించేవారు. కొంత మంది రైతులకుగాక పార్టియారీలకు (ఉద్దారులకు) ఇచ్చేవారు. వారికి ఏడాదిచేసిన పనికి పంటలో ఆరోవంతో తొమ్మిదోవంతో ఇచ్చేవారు. కాని, ఈ చిన్న కమతాలను ముఖ్యంగా 'కాలోనీ'కి పంచేవారు. వారు ఆ భూమికే అతుక్కుపోయి వుంటారు. ఏటా నిర్ణీతమైన మక్తా చెల్లిస్తారు. వారిని భూములతోసహా అమ్మేసుకోవచ్చు. ఈ 'కాలోనీ' బానిసలు కారు. అటు స్వతంత్రులూ కారు. స్వతంత్ర పౌరులను వారు పెళ్ళిచేసుకోకూడదు. తమ తరగతికే చెందినవారిని చేసుకొన్నా ఆ వివాహాలను గుర్తించరు. బానిసలలోలాగే వీరిలోను స్త్రీని వుంచుకొన్నట్లుగానే లెక్క. మధ్య యుగాలనాటి దాసులకు (సెర్ఫు) వీరు ఆదిపురుషులు.

ప్రాచీనకాలంనాటి బానిసత్వం నిరుపయోగం అయిపోయింది. గ్రామసీమలలోని పెద్దపెద్ద ఎస్టేట్లలోనూ, పట్టణాలలోని పరిశ్రమలలోనూ కూడ శ్రమకుతగ్గ ప్రతిఫలం ముట్టడంలేదు. వాటిని కొనేవాళ్ళే లేరు. సామ్రాజ్యం మంచి వుచ్చస్థితిలో వున్నప్పుడు పెద్దపెట్టున వుత్పత్తి సాగేది. ఇప్పుడు చిన్న కమతాల వ్యవసాయం, చిన్న గృహపరిశ్రమలు ఏర్పడ్డాయి. వాటిలో బానిసలు చాలమంది వుండవలసిన పనిలేదు. ధనవంతుల ఇళ్ళలో పనికీ, ఆడంబరాలకీ మాత్రమే సమాజంలో బానిసల అవసరం మిగిలింది. అయితే బానిసత్వం క్షీణదశలో వున్నా ఉత్పాదక శ్రమనంతనూ బానిస చాకిరీగానే భావించడం పోలేదు. స్వతంత్రులయిన రోమనులకు పనిచెయ్యడం అప్రతిష్ఠాకరం అయింది. ఇప్పుడున్న వారంతా స్వతంత్ర రోమను ప్రజలేనాయె. అవిభక్తంగా అసలే ఎక్కువగా వున్న బానిసలు ఒక మూల పెరిగిపోతున్నారు. వారిని పోషించడం యజమానులకు బరువై పోతూంది. వారికి స్వాతంత్ర్యం ఇచ్చేస్తున్నారు. రెండోవేపున తిండికిలేని స్వతంత్ర ప్రజలు [అమెరికాలోని (మాజీ) బానిస రాష్ట్రాలలో బీదలయిన తెల్లజాతి వారిలాంటి వాళ్లు] 'కాలోనీ'లూ పెరిగిపోతున్నారు. ప్రాచీనయుగపు ఈ బానిస విధానం క్రమంగా అంత

రించి పోవడంలో క్రైస్తవ మతానికి ఏమీ ప్రమేయం లేదు. రోమను సామ్రాజ్యంలో బానిస విధాన ఫలితాలలో మాత్రం అది శతాబ్దాల తరబడి భాగస్వామి అయింది. ఆగామికాలంలో క్రిస్టియను మతస్థులే సాగించిన బానిసవ్యాపారాన్ని అది నిరోధించలేదు. ఉత్తరాన జర్మనులు, మధ్యధరాసముద్రంలో వెనిషియన్లు, తరువాతి కాలంలో నీగ్రో బానిసలతో జరిపిన వ్యాపారాన్ని * అవి ఆపడానికి ప్రయత్నించలేదు. బానిసత్వం వలన లాభంలేదు. కనుక అది అంతరించి పోయింది. బానిసత్వం అంతరించినా ఉత్పాదక మయిన పనిచేయడం అప్రతిష్ఠాకరమనే విషమయ భావనను స్వతంత్ర ప్రజలలో మిగిల్చేపోయింది. రోమను ప్రపంచం దారితెన్నులులేని దుర్గమారణ్యంలో చిక్కుపడింది. ఆర్థికంగా బానిసత్వం నిరుపయోగం స్వతంత్ర ప్రజలలో పనిచేయడం అవినీతి. ఒకటి బ్రతకలేదు. రెండోదానికి బ్రతుకులేదు. అవి సామాజికోత్పత్తిలో ప్రధాన రూపం కాలేదు. పూర్తి విప్లవంవస్తేనే పరిస్థితి బాగుపడ తుంది.

రాష్ట్రాలలో పరిస్థితులింతకన్న మెరుగ్గాలేవు. మనకున్న సమాచారం ఎక్కువగా గాల్ రాష్ట్రానికి సంబంధించింది. కాలోనీ తోపాటుగానే స్వతంత్రులైన చిన్నరైతులు కూడా చాలమంది అక్కడ వున్నారు. ఉద్యోగులు, న్యాయాధీశులు, వడ్డీవ్యాపారులు సాగించే దురంత దోపిడి నుంచి రక్షించుకొనేటందుకు వారు మంచిపలుకుబడీ, అధికారమూ వున్న వారి రక్షణ కోరుతుండేవారు. ఒకళ్ళూ ఇద్దరూ వ్యక్తులుకాదు గ్రామాలకు గ్రామాలు ఈ విధంగా ఎవరో ఒకరి రక్షణలోకి చేరేవి. అది అతి అయ్యేసరికి నాలుగో శతాబ్దంలో చక్రవర్తులు ఆ ఆచారాన్ని నిషేధించారు కూడా. రక్షణ కోరుతూ ఒకరి అండచేరిన వారికాపద్ధతి ఏవిధంగా వుపకరించింది ? ఆ రక్షకుడు తన రక్షణ కోరిన వారంతా తమ భూము

---

* క్రెమోనా నివాసి బిషప్ ల్యూత్ ప్రాండ్ చెప్పినదాన్ని బట్టి పదో శతాబ్దంలో పవిత్ర జర్మను సామ్రాజ్యంలోని వెర్దున్‌లో (నపుంసకుల్ని) కొజ్జాల్ని తయారుచేయడం పెద్ద పరిశ్రమగాసాగింది. వారిని మూర్‌ల అంతఃపురాలకోసం స్పెయినుకు ఎగుమతిచేసి బోలెడు లాభాలు గడించేవారు. (ఫ్రెడరిక్ ఏంజిల్సు)

లను తనకు స్వాధీనం చెయ్యాలనీ. అలాచేస్తే జీవితాంతం వారినే ఆ భూములు చేసుకోనిస్తాననీ హామీకోరి, వాగ్దానంచేశాడు. హోలీ చర్చి ఈ కిటుకును పట్టుకొని తొమ్మిది. పదిశతాబ్దాలలో భగవంతుని కీర్తినీ, చర్చి ఆస్తులనూ విస్తరింప చేసుకొంది. అయితే ఆ మొదటి రోజుల్లో పరిస్థితి వేరు. క్రీ. శ. 475 లో మార్సెలీస్ బిషప్ సాల్వియానస్ ఈ పద్ధతిని వత్తిదోపిడియని నిరసించాడు. రోమనువుద్యోగులూ, పెద్ద భూస్వాములు అనుసరిస్తున్న పద్ధతులను భరించలేక "రోమనులు" ఎందరో అనాగరికులాక్రమించిన జిల్లాలలోకి పారిపోయేవారనీ. అక్కడికి వెళ్ళాక మళ్ళీ రోమను ప్రభుత్వాధి కారం క్రిందికి పోతామనే భయం వారికి వుండేదికాదనీ ఆయన వ్రాశాడు. బీదలు తమ సంతానాన్ని తరచు బానిసలనుగా అమ్మివేసే ఆచారం ఆ రోజుల్లో వుందనడానికి దానిని నిషేధిస్తూ చేసిన చట్టమే సాక్ష్యం.

రోమను ప్రజలను రోమను రాజ్యాంగాధికారం బారినుండి కాపాడినందుకు ప్రతిఫలంగా జర్మన్ అనాగరికులు మూడింట రెండువంతుల భూమిని తాము కాజేసి తమలో తాము పంచేసుకొన్నారు. గణాలవారిగా భూమి పంపకం జరిగింది. ఈ విజేతల సంఖ్య ఎక్కువకాక పోవడంచేత ఎంతో భూమి పంచుకోకుండా మిగిలిపోయింది. దానిలో కొంత గణాల అధీనంలో, కొంత తెగల అధీనంలో, కొంత ఆ ప్రజలందరిదీగా వుండిపోయింది. గణాలు సాగు భూములనూ, బీడు భూములనూ ఇళ్ళపరసన సమానంగా లాటరీ పద్ధతిలో పంచిపెట్టేవారు. వాటిని ఏకంచేసి మళ్ళీ, మళ్ళీ పంచేవారో లేదో మనకు తెలియదు. మొత్తంమీద రోమను రాష్ట్రాలన్నింటా ఈ ఆచారం త్వరలోనే అంతరించి. ఎవరికి పంచిన భూమి వారి స్వంత ఆస్తి అయింది అడవులూ, బీడు భూములూ విభజించ బడకుండా అందరి వుపయోగంలో వుండేవి. ఈ విధంగా వాడుకోవడమూ, పంచుకొన్న భూములను వ్యవసాయంచేసే విధానమూ ప్రాచీనాచారం ప్రకారం, సామూహిక నిర్ణయాను సారంగా జరిగేవి. గ్రామాలలో గణ వ్యవస్థ ఎక్కువకాలం సజీవంగా వున్నకొద్దీ రోమనులూ, జర్మనులూ కలిసిపోయారు. ప్రాదేశిక బంధనాలముందు రక్త సంబంధాలు విశీర్ణమై

పోయాయి. మార్కు (సామూహిక గ్రామం)లో గణం అంతర్లీ నమై పోయింది. అయినా సభ్యుల మధ్య బంధుత్వ చిహ్నాలు కనిపిస్తూనే వుండేవి. ఉత్తర ఫ్రాన్సు, ఇంగ్లండు, జర్మనీ, స్కాండినేవియాలలో (మార్కులలో గణ వ్యవస్థ చిహ్నాలు అవ శేషాలుగా మిగిలిన చోట్ల) గణ నిర్మాణం క్రమంగా ప్రాంతీయ నిర్మాణంగా రూపొందింది. రాజ్యాంగ వ్యవస్థలో అది అంతర్గతం అయింది. అయితే, గణ వ్యవస్థయొక్క ప్రత్యేక లక్షణం అనదగిన సహజ ప్రజాతంత్ర స్వభావం దాంలో మిగిలింది. తర్వాతి శతాబ్దాలలో వచ్చిన క్షీణత్వంలోకూడ గణవ్యవస్థ చిహ్నం కొంత మిగిలింది. మన కాలంలోకూడ పీడిత ప్రజ ఉపయోగించేటందుకు సిద్ధంగా ఒక ఆయుధం ఆవిధంగా మిగిలింది.

దేశాక్రమణకు ఫలితంగా తెగలలోనూ, మొత్తం ప్రజలలోనూ వున్న గణాల తాలూకు సంస్థలు విశీర్ణమైపోయాయి. వానిలోని రక్తబంధుత్వ సంబంధాలు వేవేగంగా అంతర్ధాన మయిపోయాయి. ఓడించిన ప్రజలను పాలించడానికి గణ వ్యవస్థలో అనుకూల్యాలు లేవు. ఆ విషయమే మన కిక్కడ బృహద్రూపంలో ప్రత్యక్ష మవుతూంది. రోమను రాష్ట్రాలను స్వాధీన పరచుకొన్న జర్మను ప్రజలు తమ విజయా లను సంఘటిత పరచుకోవలసి వచ్చింది. అయితే రోమనులు యావ న్మందినీ తమ గణాలలోకి దత్తు తెచ్చుకోలేరు. గణసంస్థల సాయంతో వారిని పరిపాలించనూ లేరు. రోమను స్థానిక పరిపాలనా సంస్థలు ప్రారం భంలో యథాపూర్వంగా పని సాగిస్తూనే వున్నాయి. కాని, వానిపైన అంతవరకూవున్న రోమను రాజ్యాంగానికి బదిలీగా దేనినేనా ఏర్పరచాలి. ఈ ప్రత్యామ్నాయం మరో రాజ్యాంగం అవుతుందేగాని వేరుగాదు. ఆ విధంగా గణ వ్యవస్థ తాలూకు పరిపాలనాంగాల్ని రాజ్యపాలనాంగా ల్నిగా పరివర్తనం పొందించాలి. పరిస్థితుల ప్రాబల్యంలో ఈ పనిని అతి వేగంగా నిర్వహించ వలసివుంది. విజేతల మొదటి ప్రతినిధి సైన్యాధి పతి అయివుంటాడు. జయించిన ప్రదేశాలను బాహ్యాభ్యంతర కల్లోలాల నుంచి రక్షించ గలిగేటందుకు ఆయన అధికారాలను విస్తృత పరచాలి.

సైన్యాధి నాయకత్వాన్ని రాజరికంగా మార్చవలసిన సమయం వచ్చింది. వెంటనే ఆ పని జరిగిపోయింది.

ఫ్రాంకుల రాజ్యాన్ని తీసుకొందాం. ఇది విశాలమైన రాజ్యభాగం. ఇక్కడ పెద్ద చిన్న గావ్‌లకు, మార్కు గ్రామాలకు కేటాయించిన భూములు పోను ఇంకా ఎంతో భూమి వుండిపోయింది. పెద్దపెద్ద అడవి భూము లున్నాయి. అవన్నీ విజేతలయిన సాలియను తెగల అనియమితాధికారంలోకి వచ్చేశాయి. సాధారణ సైన్యాధిపతి ఫ్రాంకుల రాజు కాగానే ఆ ప్రజా ఆస్తిని రాజకుటుంబపు ఆస్తినిగాచేయడమే మొట్టమొదట అతడు చేసిన పని. దానిని తన సొంత సిబ్బందికి వతన్‌దారీలుగా దానం చేశాడు మొదట స్వంత బలగంగా వున్న యోధులూ, తర్వాత చిన్న చిన్న సేనానాయకులూ అతని సొంత సిబ్బందిగా వుండేవారు. క్రమంగా రోమనులుగా మారిన గాల్ తెగవారుకూడా ఆయన వతన్‌దారీ వర్గంలో చేరారు. వారికి చదువనూ, వ్రాయనూ తెలియడమూ, రోమనుభాష, ఆ చట్టాలు, లాటిన్ సాహిత్యంతో పరిచయమూ వుండడంచేత వీరు రాజుకు సన్నిహితులయ్యారు. వీరేగాక ఆయన దర్బారులో చేరిన బానిసలు, దాసులు, స్వతంత్రం పొందిన బానిసలనుంచి కొందరిపైమక్కువ పెంచుకొని వారినికూడా తనఅనుచర వతనుదారులనుగా చేసుకున్నాడు. వీరందరికీ ప్రభుత్వపు భూముల నిచ్చాడు. మొదట బహుమతులుగా ఇచ్చాడు. తర్వాత వతన్‌దారీలుగా ఇచ్చాడు. ప్రారంభంలో చాల సందర్భాలలో రాజు బ్రతికివున్నంతవరకే ఇది చెల్లేటట్లు ఇచ్చాడు. ఈ విధంగా ప్రజల ఖర్చుమీద కొత్తగా ఒక కులీనవర్గం ఏర్పడింది.

అంతేకాదు. వెనుకటి గణ నిర్మాణంద్వారా సుదూరవ్యాప్తమైన సామ్రాజ్యాన్ని పాలించడం సాధ్యంకాదు. తెగనాయకుల కౌన్సిలు పాతబడిపోయింది. కాకపోయినా అన్నప్పుడూ వారు సమావేశం అవుతూండడం సులభంకాదు. అందుచేత త్వరలో శాశ్వతమైన రాజ సిబ్బంది వారి స్థానంలో ఏర్పరచబడింది. వెనుకటి ప్రజాసభ నామమాత్రంగా ఉంది. కాని, క్రమంగా అది ప్రజాసభగా గాక సైన్యాలలోని చిన్న చిన్న నాయకులా, కొత్తగా తలఎత్తిన ప్రముఖులా సభగా రూపొందసాగింది.

నిరంతరాయంగా సాగుతున్న అంతర్యుద్ధాలతోనూ, ముఖ్యంగా చార్ల మెన్ కాలంనాటి దండయాత్రలతోను ఫ్రాంక్ రాష్ట్రంలోని ప్రజాసీకమూ, భూములున్న స్వతంత్ర రైతులూ కటిక దరిద్రంలో కూరుకుపోయారు. ఉన్నదంతా వూడ్చుకుపోయింది; రిపబ్లిక్ చివరి రోజులలో రోమన్ రైతులకు పట్టినదుర్గతే వీరికీ పట్టింది. మొదట వీరే మొత్తం సైన్యాలలో పనిచేసేవారు.

ఫ్రాన్సును జయించాక వీరే సైన్యాలకు మూలపీఠం అయ్యారు. అటువంటి వారంతా ఎంత దరిద్రులు అయిపోయారంటే తొమ్మిదో శతాబ్దం ప్రారంభం నాటికి వారిలో 20 శాతం మందికూడా సైనిక పరికరాల్ని సమకూర్చుకోలేనంత దుస్థితిలో పడ్డారు. వెనుకటి రోజుల్లో రాజు పిలవనంపుతే స్వతంత్రులయిన రైతులు వచ్చి సైన్యాలలోచేరిపోయేవారు. కాని, ఇప్పుడు కొత్తగా ఏర్పడిన సామంత ప్రభువుల భట వర్గం సైన్యాలుగా ఏర్పడుతూంది. ఈ భటవర్గంలో ఎందరో స్వతంత్ర గ్రామీణులు కూడా (విలియన్లు) వుండేవారు. ఒకనాడు వారి పూర్వులే ఏ రాజునూ, ఎవరి పెత్తనాన్నీ అంగీకరించేవారు కారు. తర్వాతి తరాలలో రాజుదే కావి మరెవ్వరి పెత్తనాన్నీ ఒప్పుకొనేవారు కారు. వారి వంశీకులే ఈనాడు ప్రతి సామంతుడిక్రిందా పనిచెయ్యడానికి, ఏ పని చెయ్యడానికైనా సిద్ధంగావున్నారు.

ఛార్ల మేన్ తర్వాత వచ్చిన రాజులకాలంలో అంతర్యుద్ధాలెక్కువయ్యాయి. రైతుల పరిస్థితి మరింత దుర్భరమయింది. రాజు బలహీన పడ్డాడు. ఛార్లమేన్ ఏర్పరచిన గావ్ సామంతులు తమ హోదాను వంశ పారంపర్యపు హక్కుగా చేసుకొనేటందుకు ప్రయత్నించారు. వారితో పాటు ఇతర సామంతులూ ఎవరికివారు తమ అధికారాన్ని సుస్థిరం చేసుకో ప్రయత్నించారు. నార్మనుల దాడులతో రైతులు పూర్తిగా ధ్వంసం అయారు. నాలుగు వందలేళ్ళకిత్రం ఫ్రాంకుల దాడులముందు రోమను సామ్రాజ్యం ఎంత నిస్సహాయస్థితిలో వుందో, ఛార్లమేన్ చచ్చిపోయిన ఏభయ్యేళ్ళనాటికి నార్మన్ల దాడులముందు ఫ్రాంకు సామ్రాజ్యం అంత నిస్సహాయ స్థితిలోకి వచ్చేసింది.

బయటనేకాదు, అంతరికంగా కూడ సమాజంలో అంతటి అ_స్త వ్య_స్తమూ వుంది. తమ పూర్వులైన రోమన్ 'కాలోనీ' వుండిన దుస్థితికి స్వతంత్ర ఫ్రాంక్ రైతాంగంకూడా దిగజారింది. దోపిడులూ యుద్ధాలతో చితికిపోయి, ప్రభుత్వం రక్షణ యివ్వలేకున్న స్థితిలో వారు నూతన ప్రభువుల్నో, చర్చినో తమ రక్షకులుగా ఎన్నుకోవలసి వచ్చింది. కాని యిందుకు చాలా మూల్యం చెల్లించవలసివచ్చింది. తమకు పూర్వం నాటి గాల్ రైతులలాగే వారూ తమ రక్షకుల పేర భూములను వప్ప చెప్పి కౌలుదారులుగా వాటినే చేసుకొనేటందుకు తీసుకోవలసి వచ్చింది. కౌళ్లు పలురకాలు. కాని అన్నింటాకూడా వెట్టిచాకిరీ చెయ్యడమూ, మక్తాలు ఇవ్వడమూసమానలక్షణం. ఒకమారు ఈపరాధీనస్థితికిపాల్పడ్డాక క్రమంగా వారు వ్య_క్తిగత స్వాతంత్ర్యాన్నికూడా కోల్పోయారు. కొన్నితరాలలో వారు దాసులుగా మారిపోయారు. ఆనాడు పారిస్‌కు సమీపంగావున్న (ఈనాడిది పారిస్‌లోనే ఒక పేట అయింది) సెయింట్ - జర్మన్ - దే - ప్రెస్ మఠంతాలూకు ఇర్మినాన్ రికార్డులకేసి చూస్తే స్వతంత్రులయిన రైతులు ఎంతవేగంగా పతనం పొందారో స్పష్టంగా కనిపిస్తుంది. ఈ మఠం భూములు చుట్టుప్రక్కల జిల్లాలలోకంటా వ్యాపించి వుండేవి. ఛార్లమేన్ కాలంనాడుకూడా ఆ భూముల్లో 2788 ఇళ్ళవాళ్లుండేవారు. జర్మన్ పేర్లే గాని, ఇంచుమించు వాళ్లు అందరూ ఫ్రాంకులే. వారిలో 2080 ఇళ్ళవాళ్ళు కాలోనీలు. 35 ఇళ్ళవాళ్ళు లాయెట్*లు, 220 మంది బానిసలు. 8 మంది మాత్రమే స్వంతభూమి హక్కుగలవారు. తన జీవిత పర్యంతం అనుభవించే హక్కును మాత్రం మిగుల్చుకొని సంరక్షకుడికి భూమినంతనూ దఖలు పరిచే ఆచారాన్ని సాల్వియానసు దైవద్రోహం అని నిందించాడు. కాని, ఈనాడు రైతుల నుంచి చర్చి ఆపద్ధతిమీదనే భూములు తీసుకొంటూంది ఫ్యూడల్ దాసత్వం అంతకంతకు రూపం ధరిస్తూంది. రోమనుల కాలంనాటి అంగారియాలాంటి పద్ధతులలోనే ఇది నిర్మించ బడుతూంది. జర్మనుల మార్కు గ్రామాల ప్రజలు సార్వజనిక కార్యాలయిన వంతెనలు నిర్మించడం, రోడ్లనువోయడం వంటి పనులలో పాల్గొన్నట్లే

* అర్ధ స్వతంత్రులైన రైతులు.

రోమనులు ప్రభుత్వ కార్యాలలో వెట్టిపని చెయ్యవలసివచ్చింది. దానినే అంగారియా అనేవారు. ఆ విధంగా ప్రజానీకం నాలుగువందల ఏళ్ళక్రితం ఏ స్థితిలో వుందో అదే స్థితికి వచ్చింది.

దీని వలన రెండు అంశాలు స్పష్టం అవుతున్నాయి; రోమను సామ్రాజ్యపు అవసాన దశలో పరిశ్రమలూ, వ్యవసాయమూలో సాగుతున్న వుత్పత్తి స్థితికి పూర్తిగా అనుకూలమైన రూపంలోనే ఆనాడు సామాజిక విభజనా, అస్తిపంపకమూ జరిగింది. అది తప్పనిసరి. రెండో విషయం: నాల్గువందల ఏళ్లు గడిచినా ఆ ఉత్పత్తిస్థితి అంతగా పెరగనూ లేదు. తరగనూలేదు. అందుచేత మళ్లీ అదే సామాజిక విభజనా, అస్తి పంపకమూ ప్రత్యక్షమయింది. రోమను సామ్రాజ్యపు అంతిమశతాబ్దాలలో పల్లెలమీద పట్టణాలకున్న ఆధిక్యం అంతరించింది. జర్మను పరిపాలన ప్రారంభ శతాబ్దాల్లో ఆ ఆధిక్యతను అవి సంపాదించుకోనేలేదు. దీని అర్థం వ్యవసాయమూ, పరిశ్రమలూకూడ చాల క్రిందిదశలో వున్నాయన్నమాట. ఆ పరిస్థితులలో సామాన్యంగా పెత్తందారు లయిన పెద్ద పెద్ద భూఖామందులూ, పరాధీనులయిన చిన్న రైతులూ బయలుదేరుతారు. ఆ దశలో బానిసల శ్రమతో నిర్వహించబడిన రోమను లాటి ఫుండియను ఆర్థిక వ్యవస్థనుగాని, దాసుల చాకిరీతోసాగే కొత్త రకం పెద్దపెద్ద కమతాల వ్యవసాయ పద్ధతినిగాని ఆనాటి సమాజంలో ప్రవేశ పెట్టడం సాధ్యంకాదు. ఇందుకు ఛార్లమేన్ ఎంతోఖర్చుపెట్టి సుప్రసిద్ధములైన తన రాజరికపు ఎస్టేట్లలో ఎన్నో పరిశోధనలు చేశాడు. కాని ఫలితం ఏమీ మిగల లేదు. ఈ పరిశోధనలను మఠాలు కొనసాగించాయి. వానికి లాభించింది. అయితే మఠాలు బ్రహ్మచారి జీవితం మీద ఆధారపడిన అసాధారణ సాంఘిక సంస్థలు. అవి అసాధారణములయిన పనులే చేయగలవు. కనక వానిని అసాధారణములనుగానే పరిగణించాలి.

అయితేనేం, ఈ నాలుగువందల యేళ్ళలోనూ అభివృద్ధి బొత్తిగా లేకపోలేదు. కొంత ఉంది. ప్రధానములయిన వర్గాలు మొదట ఏవయితే వున్నాయో, చివరకూడా అవే వున్నా, ఆ వర్గాలలోని ప్రజలు మారారు. బానిసత్వం అంతరించింది. పనిచేయడం బానిసత్వం అనుకుంటూ భిక్షం

ఎత్తే స్థితికి వచ్చిన బీద స్వతంత్ర ప్రజా ఇప్పుడు లేరు. రోమన్ 'కాలోనీ'కీ, కొత్తగా వచ్చిన దాసుడికీ నడుమ స్వతంత్రుడైన ఫ్రాంక్ రైతు వచ్చాడు. శిథిలం అయిపోతున్న రోమనుల వ్యవస్థనాటి "అర్థం లేని అహంకారాలూ, నిరుపయోగమయిన కలహాలూ" పూర్తిగా తుడుచుకు పోయాయి. శిథిల నాగరికత తాలూకు విధ్వంసం మధ్యగాక, నూతన నాగరికత తాలూకు డోలీలో తొమ్మిదో శతాబ్దపు కొత్తవర్గాలు రూపొందాయి. కొత్తగావచ్చిన యజమానులూ, సేవకులూ తమకు పూర్వం వున్న రోమను యజమానులతో, సేవకులతో పోలిస్తే మానవు లనివచ్చు. అయితే రోమనుల కాలంనాడు బలవంతులైన యజమానులకూ, చాకిరీచేసే రైతులకూ మధ్య వుంటూండిన సంబంధాలు ప్రాచీన ప్రపంచ క్షీణతకు చిహ్నాలు. ఈ నాటివి నూతనాభివృద్ధికి ఆరంభకాలు. ఈ నాలుగు వందల ఏళ్ళలో కొత్తగావచ్చిందేదీ లేనట్లు అనిపిస్తుంది. కాని, ఒక గొప్ప విషయం ఉత్పన్నం అయింది. పశ్చిమ యూరపులోని జనాభా ఆధునిక జాతులుగా, నూతన సమూహాలుగా విభజితం అయింది. నిజంచేత జర్మనులు యూరపునకు నూతనజీవం పోశారు. అందుచేతనే జర్మన్‌ల కాలంలో రాజ్యాంగాలు శిథిలం కావటం నార్సు - సారాసెన్ జాతుల పరాధీనతకు దారితీయలేదు. రాజపోషితుల, వతన్ దారుల స్థితినుంచి ఫ్యూడలిజంలోకి అభివృద్ధి వచ్చింది. ఈ దశలో జనాభా అత్యధికంగా పెరిగింది. మరో రెండువందల సంవత్సరాలకి ప్రారంభమైన 'క్రూసేడ్ల'లో * ఎంతో జనక్షయం అయినా లెక్కరానంత ఎక్కువగా జనం అభివృద్ధి అయ్యారు.

శిథిలం అయిపోతున్న యూరపునకు కొత్త జీవం ఇవ్వడానికి జర్మన్లు చేసిందేమిటి? దురభిమాన పరులయిన చరిత్రకారులు చెప్తున్నట్లు

---

క్రూసేడ్లు మతయుద్ధాలు. అరబ్బుపాలకుల చేతిలోవున్న జెరూసలెం నగరాన్ని పట్టుకొని తమ మతప్రవక్త అయిన క్రీస్తు స్మారకాన్ని కాపాడడం పేరుతో 11 వ శతాబ్దం ఆఖరునుంచి 13 వ శతాబ్దం చివరివరకూ యూరపు దేశాలనుంచి 7 మార్లు సైన్యాలు దండయాత్రలు చేశాయి. ఈ యుద్ధాలనే క్రూసేడ్లు అంటారు.

జర్మనుజాతిలో ఏదో అద్భుతశక్తి అంతర్గతంగా వుందా? ఏమీకాదు. ఆర్యను తెగలలో జర్మనులు చాలా ప్రతిభగల వాళ్ళనడంలో సందేహం లేదు. అందులోనూ ఆ రోజుల్లో వాళ్ళు మంచి అభివృద్ధిదశలోవున్నారు. అయితే వాళ్ళజాతిలో వున్న ప్రత్యేక లక్షణాలుగాక వారి అనాగరిక వ్యవస్థ- వారి గణ నిర్మాణం - అదే యూరపును పునరుజ్జీవింపచేసింది.

వ్యక్తిగత సామర్థ్యం, వీరత్వం, స్వాతంత్ర్యాభిలాష, పరిపాలనకు సంబంధించిన వ్యవహారాలన్నీ స్వంత వ్యవహారాలుగా భావించే ప్రజాతంత్ర స్వభావం - మొత్తం మీద రోమనులలో లుప్తమైన ఈ గుణాలు జర్మన్లలో ఇంకా అప్పటికి వున్నాయి. రోమను సామ్రాజ్యపు బురద నుంచి నూతన ప్రభుత్వాల్ని ఏర్పరచడానికి, నూతన జాతుల్ని సృష్టించడానికి సమర్థత వీనికే వున్నది. ఇవన్నీ గణనిర్మాణంయొక్క ఫలితాలు. ఎగువదశలో ఉన్న అనాగరిక తెగల ప్రత్యేక లక్షణాలున్నూ.

వెనుకటి దంపతీ వివాహ వ్యవస్థలో వారు మార్పు తెచ్చారు. కుటుంబంలో మగవాని అధికారాన్ని కొంచెం దిగతీశారు. స్త్రీలకు అతఃపూర్వంకన్న హెచ్చు హోదా యిచ్చారు. వారి అనాగరిక స్థితి గణసంస్థనాటి ఆచారాలు తల్లి హక్కు కాలంనాటి అలవాట్లూ కాకపోతే దీనికి వేరు కారణం ఏముంది?

జర్మనీ ఉత్తరఫ్రాన్సు, ఇంగ్లండు - ఈ మూడు అతి ప్రధానమైన దేశాలలోనూ మార్కు గ్రామాల రూపంలో శేషించివున్న సిసలయిన గణవ్యవస్థను వారు భూస్వామ్య వ్యవస్థలోకి పరిణామం పొందించారు. కఠోరమైన మధ్యయుగాల దాసత్వ పరిస్థితులలోకూడ పీడిత రైతాంగం ప్రతిఘటించేటందుకు ఒక ఆధారాన్ని, స్థానికంగా ఐక్యం అయి నిలబడే అవకాశాన్ని కలగజేశారు. ప్రాచీనకాలంనాటి బానిసలకు గాని, ఈ నాటి శ్రామికవర్గానికిగాని ఇటువంటి అవకాశం లేదు. వారు అనాగరిక యుగపు అలవాట్లతో గణాలుగా నివసించడం తప్ప దీనికి మరో కారణం లేదు.

చివరి విషయం ఏమంటే: అదివరకు వారు తమ ప్రాంతాలలో అనుసరించేలాంటి సౌమ్యదాసత్వ పద్ధతిని సర్వత్రా వ్యాప్తం చేశారు.

క్రమంగా రోమను సామ్రాజ్యంలో బానిసత్వం రద్దు అయి దాసత్వ పద్ధతి కాలూనుకుంది. పీడితప్రజ క్రమేణా ఒక వర్గంగా విముక్తి పొందే టందు కిదొక సాధనం అయి-దని ఫొరియరు *చెప్పాడు. [భూమిని దున్నుకొనే రైతులు సమీచీనంగా, క్రమ విముక్తి పొందేటందుకు సాధనం అయింది - అన్నాడు.] అందుచేత ఇది బానిసత్వంకన్న ఎన్నో రెట్లు మెరుగు. బానిసత్వంలో మధ్యంతరదశ అనేది లేకుండా సరాసరి వ్యక్తి విముక్తి పొందేటందుకే అవకాశంవుంది. (తిరుగుబాటు ద్వారా బానిసత్వం రద్దయినమాట ప్రాచీన యుగంలో వినం) కాని మధ్య యుగం నాటి దాసులు ఒక వర్గంగా, మెట్టు తర్వాత మెట్టుగా విముక్తి సాధిం చారు. దీనికి కారణం వా రిఅనాగరిక యుగస్థితే. దాని మూలంగానే వారు యూరపులో ప్రాచీన కాలంలో ఉత్పత్తికోసం వినియోగించిన బానిసత్వం గాని, ప్రాచ్యదేశాలలో అమలు జరిగిన మాదిరి గృహ బానిసత్వంగాని ఎరగరు. ♦

జర్మనులు రోమను ప్రపంచంలో ప్రవేశపెట్టిన ప్రాణశక్తి అనాగరికత తప్ప వేరుకాదు. శిథిల నాగరికతతో మూలుగుతున్న ప్రపంచాన్ని పునరుజ్జీవింపచెయ్యగలవారు ఒక్క అనాగరికులు మాత్రమే. వలసలు బయలుదేరేటందుకు పూర్వం జర్మనులు అనాగరికయుగపు ఎగువ దశలో జీవిస్తున్నారు. అదే ఈ మార్పులు తేవడానికి అత్యంత అనుకూలమైన విషయం, ఆ విషయం. గ్రహిస్తే సర్వం అవగతం అవుతుంది.

---

* ఛార్లెస్ పొరియరు. 1772 - 1832. ఫ్రెంచిదేశపు ఊహాజనిత సోషలిస్టులలో ఒక మహావ్యక్తి.

♦ ప్రాచీన యూరపులో ఉత్పత్తి విధానమంతా బానిసల శ్రమమీద ఆధారపడి యుండేది. వ్యవసాయం, పరిశ్రమలు అన్నీ బానిసల శ్రమఫలితాలు. ఇండియావంటి ప్రాచ్యదేశాలలో అలా కాదు, అక్కడ బానిసలు ప్రధానంగా గృహబానిసలు.

# 9. అనాగరికత: నాగరికత

గ్రీకు, రోమను, జర్మను ప్రజల వుదాహరణలతో గణ వ్యవస్థ ఏవిధంగా శిధిలం అయిపోయిందో మనం పైన చూశాం. ఇంక ఆఖరున అనాగరికయుగపు ఎగువదశలో గణ వ్యవస్థను శిధిలపరచి, నాగరిక యుగం అవతరణతో దానిని పూర్తిగా రద్దుపరచిన ఆర్థిక పరిస్థితులను పరిశీలిద్దాం. దీనికై మార్క్సు వ్రాసిన "కాపిటలు", మోర్గన్ పుస్తకం లాగే అవసరం.

గణ సంస్థ ఆటవిక యుగపు నడిమిదశలో పుట్టింది. ఎగువ దశలో అభివృద్ధిపొందింది. మనకు ఇంతవరకు దొరికిన ఆధారాల్ని పట్టి చూస్తే అది అనాగరికయుగపు దిగువ దశలో మంచిఉన్నతి పొందినట్లు కనబడుతుంది. అందుచేత మన పరిశీలన నా దశనుంచే ఎత్తుకుందాం.

ఇక్కడ అమెరికను ఇండియనులను వుదాహరణకి తీసుకొందాం. వీరిలో గణ సంస్థ పూర్తిగా అభివృద్ధి పొందింది. తెగ ఎన్నోగణాలతో ఏర్పడుతుంది. సాధారణంగామాత్రం దానిలో రెండే గణాలు వుంటాయి. జనాభా హెచ్చిన కొలదీ మొదటి గణాలనుంచి ఎన్నో పిల్లగణాలు వేరు పడతాయి. వానికా తల్లిగణం ఫ్రాట్రీ (సోదర కూటం)గా ఏర్పడు తుంది. ఒక్కొక్క తెగ అనేక తెగలుగా విడిపోయిన సందర్భాలలో కూడా మొదటి గణాలే ప్రత్యక్షమవుతాయి. సన్నిహితాలయిన తెగలు కొన్నిచోట్ల సమాఖ్య (కాన్ఫెడరసీ)గా ఏర్పడతాయి. నిరాడంబరమైన ఈ నిర్మాణం ఆనాడున్న సమాజంలోని పరిస్థితులకు అనుగుణంగా వుంది. ఆదశలో సహజంగా ఏర్పడే సమూహాలు తప్ప ఇవి వేరేమీ కావు. ఆమాదిరిగానే నిర్మాణం పొందిన సమాజంలోని అంతరిక ఘర్షణలను

ఇది సర్దుబాటుచేయగలదు. బయటివారితో ఘర్షణవస్తే దాన్ని యుద్ధం తీరుస్తుంది. ఆ యుద్ధంలో తెగ తుడుచుకుపోయినా పోవచ్చు. అంతేగాని మరొకరి క్రింద అణగి వుండడం జరగదు. ఈ నిర్మాణంలోని లోపమూ, గొప్పదనమూ కూడ అదే. గణనిర్మాణంలో పాలకులూ, పాలితులూ వుండడానికి స్థానంలేదు. తెగలో విధులకూ, హక్కులకూ మధ్య అంతరం ఏర్పడలేదు. సామూహిక విషయాలలో భాగస్వామి కావడం, రక్త ప్రతీకారం, నష్టపరిహారం మొదలయినవి హక్కులా, విధులా అనేది ఇండి యను నెప్పుడూ ఎదుర్కోలేదు. తిండి, నిద్ర, వేట – ఇవి హక్కు లనాలా, విధులనాలా అనే ప్రశ్నలాగే ఇవి కూడా అసందర్భంగా వారికి కనిపిస్తాయి. తెగగాని, గణంగాని విభిన్న వర్గాలుగా విభజించ బడడం అసంభవం. ఎందుకో తెలుసుకోవాలంటే ఆనాటి పరిస్థితుల ఆర్థిక పునా దుల్ని పరిశీలించవలసి వుంటుంది.

జనాభా చాలా పల్చన. తెగల నివాసస్థలాలలోనే జనసాంద్రత. ఆ నివాసస్థలానికి చుట్టూ వేటాడేటందుకు అడవులుంటాయి. వానికి వెలు పల తటస్థప్రాంతపు అడవి. ఆ బయట మరో తెగ వేటాడే అడవి. శ్రమ విభజన చాలా ప్రాథమికదశలో వుంటుంది. స్త్రీ పురుషుల మధ్యనే శ్రమ విభజన. మగవాడు యుద్ధాలకు పోతాడు. వేటకీ, చేపలు పట్టుకో డానికీ వెడతాడు. తిండికి వుపయోగించే ముడివస్తువుల్నీ, వానిని సంపా దించేటందుకు వినియోగించే పరికరాల్నీ సంపాదించుకొంటాడు. ఆడుది ఇల్లుచూసుకొంటుంది. తిండీ, బట్టా తయారుచేస్తుంది. వంట వండు తుంది. కుట్టుపనీ, నేతపనీ చూస్తుంది. స్త్రీ పురుషులకు వారివారి కార్య రంగాలలో సంపూర్ణాధికారం. మగవాడు అడవిలో, ఆడుది యింటిలో – యజమానులు. వారువారు తయారుచేసుకున్నవీ, వాడుతున్నవీ పనిముట్లు, వారి స్వంతం. ఆయుధాలూ, వేటకు – చేపలు వేటకు పనికివచ్చే పని ముట్లూ మగవాడివి. ఇంటి పనిముట్లు ఆడదానివి. చాలా కుటుంబాలు కలిసి సమష్టిగా గృహ నిర్వహణను చూసుకొంటాయి. * ఇల్లు, తోట,

* ముఖ్యంగా వాయువ్య అమెరికాలో. (చూ. బాంక్రాఫ్ట్) క్వీన్‌ఛార్లెటీ ద్వీపాలలోని 'హైదా'లో 7 వందల మంది కలిసి

పడవలాంటివాటిని సమష్టిగా తయారుచేసుకొంటారు. సమష్టిగా అనుభవిస్తారు. అవి సమష్టి ఆస్తి. అందుచేత "తన శక్తితో స్వయంగా సంపాదించుకొన్న ఆస్తిని స్వంతానికి కలిగివుండడం" ఈ కాలంలోమాత్రమే అమలులో వుంది.

ప్రస్తుతపు నాగరిక యుగంలోనే ఇట్టి పద్ధతి అమలులో వుందంటూ న్యాయశాస్త్రజ్ఞులూ, అర్థికవేత్తలూ చెప్పేమాటలు వట్టి బూటకం. ఆధునిక పెట్టుబడిదారీ ఆస్తి ఈ చిట్టచివరి న్యాయశాస్త్ర సంబంధమైన అబద్ధంమీద ఆధారపడివుంది.

కాని, మానవ సమాజం ఏ ప్రదేశంలోనూకూడ ఇదేదశలో నిలిచిపోలేదు. ఆశియాలో మచ్చికచేసి, పెంచడానికి వీలయిన జంతువుల్ని కనుక్కొన్నారు. అడవి దున్నల్నీ, గేదెల్నీ అయితే వేటాడి పట్టుకోవాలి. అదే మచ్చికపడ్డ గేదె అయితే రోజూ పాలిస్తుంది, ఏటా ఓ దూడని పెడుతుంది. బాగా అభివృద్ధిపొందిన ఆర్యను, సెమైట్, బహుశా తురానియన్ మొదలయిన తెగలవారంతా పశువుల్ని మచ్చిక చేయడం, మందల్ని పెంచడం, మళ్ళవేసుకోవడమే వృత్తిగా పెట్టుకొన్నారు. అనాగరిక జనసామాన్యం నుంచి గోపాలక జాతులు విడిపోయాయి. ఇదే మొట్టమొదటి సామాజిక శ్రమ విభజన. గోపాలకులు ఇతర అనాగరిక జాతుల కన్న జీవనావసర వస్తువుల్ని హెచ్చుగా సంపాదించుకో గలిగేవారు. కొత్త కొత్త వస్తువుల్ని తయారు చేసుకొనేవారు. పాలు, పాలనుంచి తయారయిన వస్తువులు, ఉన్ని, గొర్రెబొచ్చువడికి తయారుచేసిన బట్టలు తెచ్చుకోగలిగారు. ముడివస్తువులు అధికంగా లభ్యం అయినకొద్దీ ఈ వస్తువులందరికీ అందుబాటులోకి రాసాగాయి. దీనితో వస్తువుల మారకానికి ప్రప్రథమంగా అవకాశం ఏర్పడింది. ఇతః పూర్వపు దశలలో మారకం కాదాచిత్కం. ఆయుధాల్నీ, పరికరాల్నీ తయారు చేయడంలో ప్రత్యేక నిపుణత ఏర్పడినప్పుడు తాత్కాలిక పనివిభజన అమలులోకి

---

వుంటున్న ఇళ్ళున్నాయి. నూట్కాలలో తెగ అంతా ఒకే వెన్నువాసం క్రింద జీవిస్తారు. —[ఫె. ఏంజెల్సు.]

వచ్చివుంటుంది. కొత్త రాతియుగపు ఆఖరురోజులనాడు రాతి పనిముట్లు తయారుచేసిన కర్మశాల లిప్పుడు చాలచోట్ల మనకు లభ్యం అవు తున్నాయి. ఈ కర్మశాలలలో ప్రత్యేక నిపుణత సంపాదించిన వారు బహుశా గ్రామానికంతకూ కావలసిన వస్తువుల్ని తయారు చేస్తూండి వుంటారు. ఇండియనుల గణవ్యవస్థలో శాశ్వతచేతివృత్తులవారు ఇప్పటికీ అల్లాగే పనిచేస్తున్నారు. ఏది ఎలావున్నా ఈ దశలో మారకం తెగలో వారి మధ్యనే జరుగుతుంది. అదీ అరుదు. కాని గోపాలక జాతులు స్థిర పడినాక వేరువేరు తెగల సభ్యులమధ్య మార్పిడికి అనుకూలమైన పరి స్థితులు ఏర్పడడం కనిపిస్తూంది. అది ఇంకా అభివృద్ధిపొంది స్థిరపడే టందుకు వీళ్లు ఏర్పడ్డాయి. ప్రారంభంలో ఒకతెగవారూ మరో తెగవారూ తమ తమనాయకుల ద్వారా మార్పిడి జరిగించి వుంటారు. కాని మందలు వ్యక్తుల అధికారంలోకి వచ్చేసిన కొద్దీ వ్యక్తుల మధ్య మార్చుకోవడం ఎక్కువై, చివరకా పద్ధతే ఏకైక పద్ధతి అయింది. గోపాలకులు తమ ఇరుగు పొరుగువారితో మార్చుకొనే ప్రధానమైన వస్తువు పశువు. ఇతరవస్తువు లన్నింటి విలువను సరితేల్చుకొనే సరుకు పశువులయినాయి. దానివి ప్రతివారూ అంగీకరించారు - సూక్ష్మంలో చెప్పాలంటే ధనం చేసే పనిని పశువు నెరవేర్చింది. సరుకుల మార్పిడి ప్రాథమికదశలో వున్న ఆ రోజుల్లో ధనం అనే సరుకు యొక్క అవసరం అతివేగంగా వృద్ధిపొందింది.

అనాగరిక యుగపు దిగువ దశలో పండ్లతోటల పెంపకం గురించి ఆసియావాసు లెరుగరు. కాని నడిమిదశనాటికి దానిని నేర్చు కొన్నారు. వ్యవసాయానికి అది నాంది. తురానియను పీఠభూముల్లో శీతాకాలం చాలా నెలలుంటుంది. ఆ శీతోష్ణస్థితిలో పశుగ్రాసం జాగ్రత్త చేసుకొంటే తప్ప పశువుల్ని పోషించుకోవడం సాధ్యం కాదు. అందుచేత ఇక్కడ పశువులమేతకోసం ధాన్యం, గడ్డి సంపాదించడానికై భూమిని సేద్యం చేయవలసిన అవసరం ఏర్పడింది. నల్లసముద్రపు ఉత్తరతీర దేశాలలోకూడ ఇదే పరిస్థితి. ఒకమారు పశువుల కోసం ధాన్యం పండించాక అది మనుష్యులకే ఆహారం అయింది. సేద్యంలోవున్న భూమి తెగ అందరిది. ప్రారంభంలో దానిని గణాలవారీగా పంచేవారు.

తర్వాత గణాలు సామూహిక గృహాలకు పంచాయి. అటుపిమ్మట వ్యక్తుల వుపయోగానికి ఇవ్వసాగారు. ఈ వ్యక్తులకేవో కొద్ది హక్కు ఆ భూమిమీద ఇచ్చారు. కాని, విశేషం ఏమీలేదు.

ఈ దశలో సాధించబడిన పారిశ్రామిక సంపదలో రెండు ఎంతో ప్రధానమైనవి వున్నాయి. ఒకటి మగ్గం, రెండోది లోహాలను కరిగించి, వుపయోగించడమూను. వానిలో రాగీ, తగరమూ, ఆరెంటింటి మిశ్రణం వలన తయారయిన కంచూ అతిముఖ్యమైనవి. కంచుతో ఆయుధాలూ, పనిముట్లూ చేసుకొన్నారు. కాని రాతి పనిముట్లు పూర్తిగా పోలేదు. ఇనుము రావాలి దానికి. అయితే అప్పటికి ఇనుము తీయడం కనిపెట్ట లేదు. నగలకూ, అలంకారాలకూ వెండీ బంగారమూ, వినియోగంలోకి రానారంభించాయి. అప్పటికే వాని విలువ రాగి, కంచుకన్న హెచ్చుగా వున్నదని భావించవచ్చును.

పశువుల పెంపకం, వ్యవసాయం, గృహపరిశ్రమలు మొదలయిన అన్నిశాఖల్లోనూ వుత్పత్తి హెచ్చింది. మనుష్యుని శ్రమ ఆతని పోషణకు సరిపడే దానికన్న హెచ్చుసంపదనువుత్పత్తి చేయగలుగుతూవుంది. గణ సభ్యులు,సాముదాయికగృహాలవారు, ఒంటరికుటుంబాలవారు రోజురోజూ చేయవలసినపని అంతకంతకు హెచ్చింది. ఆదశలో అదనపుశ్రమశక్తి అవసరం అయింది. యుద్ధం ఆ కొరతను తీర్చింది. యుద్ధఖైదీలను బానిసలను చేయ సాగారు. శ్రమయొక్క ఉత్పాదక శక్తి పెరిగింది. తత్ఫలితంగా సంపదలు పెరిగాయి. ఉత్పత్తిరంగాలూ విస్తరించాయి. వీనికి ఫలితంగా ఆనాటి చారిత్రక పరిస్థితులలో మొట్టమొదటి సామాజిక శ్రమవిభజన బానిసత్వాన్ని అనివార్యంగా తీసుకొని వస్తుంది. సంఘంలోని శ్రమ శక్తుల ఈ మొదటి విభజనతో సంఘమే రెండు వర్గాలుగా విభజించబడి పోయింది. యజమానులు–బానిసలు, దోపిడిగాండ్రు – దోచుకొనేవారు ఏర్పడ్డారు.

తెగల, గణాల ఉమ్మడిసొత్తుగా వున్న మందలు కుటుంబపు పెద్దల స్వంత సొత్తుగా మారిందెప్పుడో, అది ఏవిధంగా జరిగిందో ఇప్పుడు చెప్పడం కష్టం. మొత్తంమీద ఈ కాలంలోనే ఇది జరిగివుం

టుంది. మందలూ. ఇతర సంపదలూ అభివృద్ధి పొందడంతో కుటుంబ వ్యవస్థలో ఒక పెద్ద విప్లవమే వచ్చింది. జీవితావసర వస్తువుల్ని సంపాదించే బాధ్యత ఎప్పుడూ మగవాడిదే. ఆ సంపాదన కవసరమైన పరికరాల నాతడే తయారు చేసుకొనేవాడు. అందుచేత ఆ పరికరాలు ఎప్పుడూ అతని స్వంత ఆస్తిగానే ఉండేవి. ఇప్పుడా జీవితావసరాల్ని సమకూర్చే పరికరాలు మందలు. పశువుల్ని మచ్చిక చేసుకోవడమూ, వానిని కాచుకోవడమూ మగవాని పనులు. అందుచేత పశువులు అతడివి. వానిని మార్చుకొని సంపాదించుకొన్న సరుకులూ, బానిసలూ అతని సొత్తు. ఈ జీవితావసర వస్తువుల్ని స్వాయత్తం చేసుకోవడం వలన వచ్చిన అదనపు వుత్పత్తి అంతా మగవాడిది. ఆడుది ఆ వస్తువుల నాతనితో కలిసి అనుభవించగలదు. అంతే వానిపై ఆమెకు అధికారం లేదు. వేటాడి జీవించిన ఆటవిక యోధుడు, ఇంట్లో స్త్రీకి తర్వాతనే. ఆత డంతకంటే ఎక్కువ కోరలేదు. పెద్ద మనిషే అయిన గోపాలకుడు తన ఐశ్వర్యమదంలో, ముందుకు తోసుకువచ్చి, స్త్రీని వెనక్కి నెట్టేశాడు. ఆమె ఏమీఅనలేదు. కుటుంబంలోని శ్రమ విభజన స్త్రీ పురుషుల స్థానాలను నిర్ణయించేది. ఆ శ్రమ విభజనలో ఇప్పుడు మార్పేమీ రాలేదు. కాని, నేడది గృహ సంబంధాల్ని తల్లక్రిందులు చేసేసింది. దీనికి కారణం కుటుంబానికి వెలుపల శ్రమ విభజనలో వచ్చిన మార్పే. స్త్రీ ఇదివరకు ఇంటి పనుల బాధ్యత తీసుకొనేది. అదే ఆమెకు ఇంట్లో పెత్తనం వుండడానికి కారణం. కాని ఇప్పుడదే మగవాని పెత్తనానికి కారణంఅయింది పురుషుడు జీవితావసర వస్తువుల్ని సంపాదించే పనికీ, స్త్రీ వహించే గృహ నిర్వహణ బాధ్యతకూ పోలికేలేదు. మొదటిది అతి ప్రధానం. రెండోది అప్రధానం, అదనపు పనిన్నీ. దీని వలన మనకేం బోధపడుతూంది? స్త్రీ సామాజికోత్పత్తి రంగానికిదూరం అయి, స్వంత ఇంటి పనులలోనే మునిగి వున్నంత కాలమూ ఆమె స్వతంత్రురాలు కాలేదు. మగవానితో సమంగా హక్కుల్ని పొందలేదు. సమాజం మొత్తం మీద స్త్రీ విశేషంగా వస్తూత్పత్తి విధానంలో పాల్గొనాలి. గృహకృత్యాలకు ఆమె వినియోగించేది అత్యల్ప కాలమే కావాలి. ఆనాడే స్త్రీలకు విముక్తి. ఆధునికాలైన పెద్ద పరి

శ్రమలు నేడు అల్లాంటి అవకాశాన్ని కలిగించాయి. అవి విశేషంగా స్త్రీలకు పనిచేసే అవకాశాలను కలిగిస్తున్నాయి. అంతేకాదు, స్త్రీలను పనిలోకి రప్పిస్తున్నాయి. పైగా స్వంత ఇంటిపనుల్ని అంతకంతకు అధికాధికంగా పరిశ్రమలనుగా మారుస్తున్నాయి.

మగవానికి యింట్లోకూడా ఆధిపత్యం చిక్కడంతో అతని పూర్తిపెత్తనసానికిగల ఆఖరు ఆటంకంకూడా తీరిపోయినట్లే. తల్లి హక్కును తోసిపుచ్చి తండ్రిహక్కు ఏర్పడింది. జంటపెళ్ళిపోయి దంపతీ వివాహం వచ్చింది. వానితో అతని నిరంకుశత్వం బలపడ సాగింది. ఇది పూర్వపు గణవ్యవస్థలో గండి కొట్టింది. దంపతీ కుటుంబానిది ఇప్పుడు పెత్తనం. ఆ కుటుంబం పుట్టుకే గణవ్యవస్థకు అపత్కారం.

ఈ మెట్టు దాటితే మనం అనాగరిక యుగపు ఎగువదశలో పాదం మోపుతాం. నాగరిక జాతులన్నింటిలోనూ ఇది వీరయుగం. ఈ యుగంలోనే ఇనుపకత్తి, ఇనుప గొడ్డలి, ఇనుప కరుగోల వచ్చాయి. ఇనుము మానవుడికి లభ్యం అయింది. ఉర్లగడ్డ రాకకు పూర్వం మానవ జాతి చరిత్రలో విప్లవకరపాత్రను నిర్వహించిన ముడిసరుకుల్లో ఇనుమే కడపటిది, అతి ముఖ్యమైనదిన్నూ. ఇనుము విశాల భూభాగాల్ని సేద్యంలోకి తెచ్చింది. ఎండపొడ కనపడని అడవులు బంగిన బయళ్ళుగా మారాయి. రాళ్ళనీ యితర లోహాల్నికూడా ఛేదించగలంత గట్టిదనం, వాడీ వున్న పనిముట్లు ఆతనికి లభించాయి. కాని ఒక్కరోజులో ఈ పనులన్నీ జరిగిపోలేదు. మొదట తయారుచేసిన ఇనుము కంచుకంటేనూ మెత్తనగా వుండేది. అందుచేతనే రాతి ఆయుధాలు క్రమక్రమంగాగాని అంతరించలేదు.

క్రీ. శ. 1066 లో జరిగిన హేస్టింగ్సు యుద్ధంలో కూడా రాతి గొడ్డళ్ళ నుపయోగించారు. కాని, అభివృద్ధి అనేది ఆగదు. ఆటంకాల్నీ, అభ్యంతరాల్నీ దాటుకుంటూ అభివృద్ధి అతివేగంగా జరిగింది. పట్టణాలు వెలిశాయి. రాళ్లూ - ఇటికలతో ఇళ్ళుకట్టడం ప్రారంభమయింది. తెగ లకూ, తెగల కాన్ఫెడరసీలకు ప్రధాన కేంద్రాలయిన నగరాల్ని రక్షించు

కొనేటందుకు రాతి గోడల్లూ. గోపురాలూ. కోటలూ. బురుజులూ నిర్మింపబడినాయి. ఇవన్నీ వాస్తుశాస్త్రంయొక్క అభివృద్ధిని సూచిస్తు న్నాయి. దాడులూ, ప్రమాదాలూ ఎక్కువ అవుతున్నాయనీ, వానినుంచి ఆత్మరక్షణ అవసరమవుతూందనీ ఇవి సూచిస్తున్నాయి. వ్యక్తుల చేతుల లోకి వచ్చేక సంపదలు విశేషంగా వృద్ధిపొందాయి. నేత. లోహపరిశ్రమ. ఇతర పరిశ్రమలూ వృద్ధిపొంది. అనేక రకాల వస్తువులు తయారవు తున్నాయి. వాని తయారీలో ఎంతో నేర్పూ, వైవిధ్యమూ వృద్ధిపొందింది. వ్యవసాయం ఫలితంగా ధాన్యము, పప్పులు, పళ్ళేకాదు లభ్యం అవు తున్నది. నూనె. సారాయికూడ లభ్యం అవుతూంది. వానిని తయారు చేయడం నేర్చుకున్నారు. ఇన్నిరకాల పనుల్ని ఒకే మనిషి చెయ్యలేడు. రెండో సామాజిక శ్రమ విభజన జరిగింది. చేతిపనులు వ్యవసాయం నుంచి విడబడినాయి. ఉత్పాదక శక్తి. ఉత్పత్తి నిరంతరాయంగా అభి వృద్ధి పొందడంతో మానవుని శ్రమశక్తికి విలువ ఎంతగానో పెరిగింది. ఇంతవరకు బానిసత్వం అక్కడా,అక్కడా అతి ప్రాథమిక దశలో వుం డేది. నేడు అదిసామాజిక వ్యవస్థలో ఒకభాగమైఅయింది బానిసలుఉత్ప త్తిలో సాయంచెయ్యడంమాత్రమేనా? పొలాలలోపనిచేసేది వారేఅయ్యేరు. వ్యవసాయం. పరిశ్రమలూ అనే రెండు ప్రధాన విభాగాలుగా ఉత్పత్తి విధానంలో విభజన వచ్చాక కేవలం మారకం కోసమే ఉత్పత్తి జరగడం ఆరంభమయింది. వర్తకపు సరుకులు ఉత్పత్తి అయాయి. దేశంలోపలా, సరహద్దులలోపలా మాత్రమేకాదు. సముద్రాంతర దేశాలతో కూడ వ్యాపారం ఆరంభమయింది కాని. ఇవన్నీ ఇంకా అతి ప్రాథమిక దశ లోనే వున్నాయి. వెండి, బంగారాలు ప్రాముఖ్యానికి వస్తున్నాయి. అన్ని టితోనూ విలువకట్టదగిన. ధనరూపకమైన. సామాన్య వర్తకపు సరుకుగా (General Money Commodity)అవి అప్పుడప్పుడే అమలులోకి వస్తు న్నాయి. తూకాన్ని పట్టి విలువ కడుతున్నారు. అంతేగాని, అప్పటికి నాణేలు రాలేదు.

ఈ కొత్త శ్రమవిభజనకు ఫలితగా సమాజంలో తరగతు లేర్ప డ్డాయి. బానిసలూ - యజమానులతోపాటు బీదలూ - ధనికులూ అంటూ ఏర్పడ్డారు. అప్పటికి క్షీణించగా మిగిలిన సాముదాయక గృహాలలో

ఇంటి పెద్దల స్వంతఆస్తులలో ఏర్పడిన హెచ్చు తగ్గులు పూర్తిగా ఆ వ్యవస్థనే రద్దుపరచాయి, వానితోపాటు ఉమ్మడి వ్యవసాయమూ అంత రించింది. సాగులోనున్న భూమిని మొదట ఇళ్ళవరసన ఏయేటికాయేడు ఎప్పటికప్పుడు పంచిఇచ్చేవారు. తర్వాత శాశ్వతంగానే పంచిపెట్టారు. అయితే అది పూర్తిగా వ్యక్తిగత ఆస్తిగా మారిపోవడానికి చాలాకాలం పట్టింది. జంటపెళ్ళిళ్లు దంపతీ వివాహాలుగా మారడంతో సమంగానే యీమార్పు జరిగింది. ఇప్పుడింక ఒంటరి కుటుంబమే సమాజానికి యూనిటు అయింది.

జనాభా సాంద్రత బాగా పెరిగాక తెగలోని పనులూ, బయటి పనులూకూడ చేసుకోడానికి ఏకీభావం అవసరం. ఈ దశలోనే ప్రతి చోటా తెగలు సమాఖ్యలుగా (కాన్ఫెడరసీలు) ఏర్పడడం ఆవశ్యకం అవుతుంది. క్రమంగా అవీ సమ్మిశ్రం అయిపోతాయి. అనేక వేరు వేరు తెగల భూములు కలిసిపోయి ఒకే జాతియొక్క దేశంగా ఏర్పడుతాయి. సేనాధిపతి (రెక్స్, బాసిలసు, తియూడన్) ఒకడు తప్పనిసరి అవుతాడు ఆ వుద్యోగి లేకపోవడానికి వీలులేదు ఎక్కడెక్కడ అసెంబ్లీలు లేవో అక్కడల్లా అవి స్థాపింపబడ్డాయి.

సేనానాయకుడు కౌన్సిలు, ప్రజాసభ ఇవి గణవ్యవస్థతాలూకు పరి పాలనాంగాలు. ఇవిక్రమంగా సైనిక ప్రజాతంత్రంగా మారాయి. సైన్యం, యుద్ధసన్నాహాలు జాతీయ జీవనంలో ప్రధానాంగాలయిపోయాయి. సంప దలను పోగుచేయడమే జీవితపరమార్థం అనుకొనేవారికి ఇరుగుపొరుగుల ఐశ్వర్యానికి కన్నుకుట్టుతుంది. వారు అనాగరికులుకదా? పనిచేయడంద్వారా కన్న దోచుకొనడంద్వారా సంపన్నులుకావడం సులువూ, గౌరవ ప్రద మూని వారి బావన. తమకేదన్నా అపకారం జరిగినప్పుడు ప్రతిక్రియ గానో, తెగలో జనాభా పెరిగిపోయి కొత్తచోట్ల భూములను సంపాదించు కోవలసివచ్చినప్పుడో గతంలో యుద్ధాలు జరిగేవి. ఇప్పుడవి ఒక పరి శ్రమగా మారాయి. కేవలం దోపిడీకోసమే యుద్ధాలు జరుగుతున్నాయి. కోటల రక్షణ క్రింద నగరాలు పెరిగాయి. కోటగోడల మొదళ్ళలో తవ్విన కందకాలలో గణవ్యవస్థ సమాధి అయిపోయింది. కోట గోడలమీద

బురుజులు నాగరికత నందుకున్నాయి. ఆంతరంగికంగానూ ఇదే స్థితి. ఈ దోపిడికోసం జరుగుతున్న యుద్ధాలలో సేనానాయకులూ, వారి అనుచరులూ బలపడ్డారు. కొత్త ఉద్యోగుల్ని ఎన్నుకోవలసి వచ్చినప్పుడు ప్రజలు అతనిని అతఃపూర్వపు ఉద్యోగికుటుంబంలోంచే ఎన్నుకొనేవారు. ఇప్పుడది మారిపోయింది. ముఖ్యంగా తండ్రి హక్కు ఏర్పడినాక వుద్యోగాలు వంశక్రమాగతం అయాయి. ఈ కొత్త పద్ధతిని ప్రజలు మొదట చూసీ చూడనట్లుగా వదిలివేశారు. క్రమంగా ఆ 'వుద్యోగం మాదేనని అడిగేదశ వచ్చి, చివరకు అది హక్కుగా అనుభవించసాగారు. ఆవిధంగా కుటుంబ క్రమాగతంగా రాజరికమూ, సామంతమూ ఏర్పడ్డాయి. అంతవరకూ ప్రజలలో గణము, సోదరకూటము తెగలలో పాదుకొని వున్న గణసంస్థయొక్క పరిపాలనాంగాలు, అవి తమ పునాదుల్ని తామే నిర్మూలించుకొన్నాయి. గణ నిర్మాణం దానికి పూర్తిగా విరుద్ధమైన నిర్మాణంగా మారిపోయింది. ఇదివరకు ప్రజాభిప్రాయాన్ని అమలుపరిచే సాధనాలుగావున్న గణసంస్థ తాలూకు పరిపాలనాంగాలు, ఇప్పుడు ప్రజల మీద పెత్తనం వహించి వారిని అణచిపెట్టే స్వతంత్రమైన పరిపాలనాంగాలుగా పరిణామం పొందాయి. ధనాశ గణంలోని సభ్యులలో కొందరిని ధనికులనుగానూ, మిగిలినవారిని బీదలుగానూ మార్చివుండకపోతే ఈ మార్పు జరిగేదికాదు. "ఒకే గణంలోని వారి ఆస్తుల హెచ్చుతగ్గులు ఆ గణ సభ్యుల ప్రయోజన సామ్యాన్ని రద్దుచేశాయి. వానిని పరస్పర విరుద్ధాలనుగా మార్చాయి" (మార్క్స్) లేకుంటే ఈ మార్పూ వచ్చేదికాదు. బానిసవిధానం అన్నిచోట్లా వ్యాపించి, చివరకు బానిసలే పనిచేస్తారనే భావం వ్యాపించింది. దోపిడీకన్న, పనిచేయడం నీచమనే వూహవచ్చింది. ఈ ఘటన జరిగివుండకపోతే కొత్త మార్పు వచ్చి వుండేదికాదు.

* * *

ఇప్పటికి మనం నాగరికత ఆరంభం అయిన రోజులలోకి వచ్చేశాం. శ్రమవిభజనలో వచ్చిన కొత్తమార్పులతో నాగరికత ఆరంభం అవుతుంది. అనాగరిక యుగపు దిగువదశలో ప్రజలు తమ ఉపయోగం

కోసం మాత్రమే వస్తువుల్ని ఉత్పత్తి చేసుకొనేవారు. ఏదన్నా మారకం జరిగినా అరుదు. యాదృచ్ఛికంగా లభించిన వస్తువులతోనే మార్పిడిచేసుకొనే వారు. అనాగరిక యుగపు నడిమిదశలో మైదానపుప్రజలవద్దపశువులు కనపడుతున్నాయి. ఈ పశువులమందలు ఒకపరిమితినిమించి అభివృద్ధిఅయినపుడుఅవితెగకు అవసరమయ్యే వస్తువులకుమించి ఉత్పత్తి చేస్తూంటాయి. దీనితో మందలున్న ప్రజలకూ వెనుకబడివున్న తెగలకూమధ్య శ్రమ విభజన జరిగింది. ఒకదానిప్రక్క నొకటిగా రెండు అంతరువులలో వుత్పత్తి జరుగుతూంది. మారకం కొనసాగడాని కవసరమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. అనాగరిక యుగపు ఎగువదశలో మరో శ్రమ విభజన జరిగింది. ఈ మారు పరిశ్రమలూ, వ్యవసాయిమూ విడిపోయినాయి. దానికి ఫలితంగా మారకం కోసమే తయారయ్యే వర్తకపు సరకుల ప్రమాణం ఎక్కువయింది. ఉత్పత్తి సాగిస్తున్న వ్యక్తులు తమ వస్తువుల్ని మార్చుకోవడం ఒక సామాజిక కార్యం అయింది. ఈ శ్రమ విభజనలన్నింటిని నాగరికత స్థిరపరుస్తుంది. బలపరుస్తుంది. వానినింకా నిశితం చేస్తుంది. పట్టణాలకూ, పల్లెలకూ మధ్య విభేదాల్ని పెంపొందిస్తుంది. ప్రాచీన యుగంలో పట్టణాలు పల్లెలమీద ఆర్థికంగా అధికారం చెలాయించేవి. నాగరికత యింతవరకున్న శ్రమ విభజనను స్థిరపచడమే కాకుండా, మరో నూతన విభజనను కూడా సృష్టించింది.

ఈ నూతన విభజన ఎంతో వింతయైనదీ, చాలముఖ్యమైనదీ కూడ. ఉత్పత్తితో ఏ మాత్రమూ సంబంధం లేని ఒక వర్గాన్ని అది సృష్టించింది. వారే వర్తకులు. ఈ వర్తకులకు సంబంధం ఉత్పత్తితో కాదు. మారకంతో. ఇంతవరకు వర్గాలనేవి ఉత్పత్తి రంగంలోనే ఏర్పడ్డాయి. ఆరంగంలో పాల్గొంటున్న వ్యక్తులు పనిచేయించేవారుగా కొందరు, పనిచేసేవారుగా కొందరు విడి పోయారు. పెద్దఎత్తుమీద వుత్పత్తిచేసేవారు. స్వల్ప ప్రమాణంలో వుత్పత్తి చేసేవారుగానూ విడిపోయారు. ఇప్పుడు ఉత్పత్తిలో ఏవిధంగానూ పాల్గోకుండా, ఉత్పత్తి విధానాన్నంతనూ చేతిలోకి తెచ్చుకొని, ఉత్పత్తి దారుల్ని ఆర్థికంగా తన గుప్పిట్లో పట్టుకొన్న వర్గం ఒకటి మొట్ట మొదటి పర్యాయం చరిత్ర

రంగంలో ప్రత్యక్షమయింది. ఇది ఇద్దరు వుత్పత్తిదారుల మధ్య తప్పని సరిగా అవసరమయిన దళారీలాగ వ్యవహరించి, ఉభయుల్నీ దోచు కుంటుంది. ఉత్పత్తిదారులకు మార్పు చేసుకొనే ఇబ్బందీ, నష్టం, బాధా లేకుండా చేస్తున్నట్లు నటిస్తూ, వస్తువులను దూరపు మార్కెట్లకు అందించి ప్రజలకు మహోపకారం చేస్తున్నట్లు నటిస్తూ ఇతరుల కష్టాన్ని దోచు కొని తినేవర్గం ఒకటి తయారయింది. సంఘంలో వీరు "బదనికలు" గా తయారయ్యారు. వారు తాము చేస్తున్న స్వల్పమైన పనికి ప్రతిఫలంగా స్వదేశంలోనూ, విదేశాలలోనూ తయారవుతున్న దాంట్లో సారాన్నంతనూ జుర్రేశారు. అశేషమయిన సంపదలను పోగుచేసుకున్నారు. దానితో బాటు సంఘంలో పలుకుబడి సంపాదించుకొన్నారు. ఈ పలుకుబడితో వారు నాగరికయుగంలో అధికాధికంగా గౌరవాలూ, ఉత్పత్తిమీద ప్రాబల్యమూ సంపాదించుకొన్నారు. చిట్టచివరకు వారుకూడా ఒక వర్తకపు సరుకు తయారు చేయకపోలేదు. ఆ సరుకు పేరే మాటి మాటికి సంభవించే వ్యాపార సంక్షోభాలు.

అభివృద్ధిక్రమంలో మనం చర్చిస్తున్న దశనాటికి ఈ వర్గం చిన్న ప్రాయంలోనేవుంది. తాము పొందగల అభివృద్ధిని ఆ వర్గం ఆ రోజుల్లో వూహించికూడా వుండదు. అయినా అది పురోగమనంలోనేవుంది. దాని అవసరం ఏమీలేదని త్రోసివేయగల స్థితి ఆనాటికే లేదు. అదేచాలు. ఈ వర్గంతోపాటుగానే లోహపు ద్రవ్యం–నాణెంకూడా అమలులోకి వచ్చింది, వృద్ధిపొందింది. ఉత్పత్తిదారుల్నీ, ఉత్పత్తినీ దానితో సంబంధంలేని బయటివారు తమ గుప్పిట ఇరికించుకోగలగడానికి లోహపు ద్రవ్యం (నాణెం) ఒక సాధనం అయింది. వర్తకపు సరుకు లన్నింటినీ కొనగల వర్తకపు సరుకు. ఇతర వర్తకపు సరుకులన్నింటినీ తనలోనే ఇముడ్చుకొన్న వర్తకపు సరుకు, సంకల్ప మాత్రాన వర్తకపు సరుకుగా మారిపోగల ఒక అద్భుతశక్తి రూపొందించబడింది. ఇది చేతిలో వున్నవాడు ఉత్పత్తిని చేతిలో పట్టుకోగలడు, ఇది అధికంగా ఎవరివద్ద వుంది? వర్తకులవద్ద. లక్ష్మీపూజ అతనివద్ద సలక్షణంగా జరుగుతూంది. ద్రవ్యంముందు ఇతర సరుకులూ, వానిని ఉత్పత్తి చేసే

వారూ కూడ సాష్టాంగం చేయవలసిందే నని అతడు స్పష్ట పరచాడు. మూర్తీభవించిన సంపదే ద్రవ్యం. దీనిముందర ఇతర సంపదలు దిగతుడుపేనని అతడు ప్రత్యక్షంగా నిరూపించాడు. ద్రవ్య శక్తి వయస్సులోవున్న నాడు ప్రదర్శించినంత దౌర్జన్యాన్ని, క్రౌర్యాన్నీ మరెప్పుడూ ఎక్కడా చూడం. వర్తకపు సరుకుల ద్రవ్యానికి అమ్ముడుపోవడం ప్రారంభమైనాక అప్పులివ్వడమూ, జట్టీలివ్వడమూ అమలులోకి వచ్చాయి. దానితో వడ్డీలు, వడ్డీ వ్యాపారమూ, వచ్చాయి. ప్రాచీనకాలం నాటి ఏథెన్సు నగరంలోనూ – రోములోనూ, ప్రభుత్వ చట్టాలు రుణదాతకు రుణగ్రస్తుడిని స్వాధీన పరచినప్పటి నిర్దయను మరేకాలపుచట్టాలూ చూపలేదు. ఈ రెండు నగరాల్లోనూకూడా ఈ చట్టాలు ఆర్థిక పరిస్థితుల వొత్తిడిలో తమంతగా తలఎత్తినవే :—

వర్తకపు సరకులు, బానిసలు, ద్రవ్యము, సంపదలతోపాటు భూసంపదకూడా ఏర్పడింది. ప్రారంభంలో తాత్కాలి కోపయోగంకోసం గణాలూ, తెగలూ తమ సభ్యులకు పంచిఇచ్చిన భూఖండాలు, వారి వారి వంశక్రమాధికారం గల ఆస్తిగా మారిపోయాయి. ఈ భూములమీద గణ సంస్థలకున్న అధికారాన్ని తొలగించి, ఎవరికి వారు తమ తమ హక్కులీన్నీ, అధికారాన్నీ స్థిరపరచుకొనేటందుకు తీవ్ర ప్రయత్నం చేశారు. గణ సంస్థకు భూమి మీద హక్కు వుండడం వారిచేతులకు సంకెలు వేసినట్లుంది. ఆ సంకెలబరువు తీరాక చాలమందికి ఆ భూమి బరువు కూడా తీరిపోయింది. భూమి మీద పూర్తి హక్కు ఏర్పడడం అంటే దానిని సంపాదించేటందుకు నియమాలూ, నిర్బంధాలూ లేక పోవడమేనా ? భూమిని పోగొట్టుకో గలగడం కూడా ఆ అధికారంలో భాగమే. భూమి గణ సంస్థహక్కులో వున్నంత కాలం దానిని అమ్ముకొనే హక్కు మనిషికి లేదు గణానికీ, తెగకూ భూమిమీద హక్కు వుండడం భూస్వామికి ఒక పెద్దసంకెల. ఆ సంకెళ్ళను తొలగించడంతో కొత్త యజమానులకు తమ భూములతోవున్న అవిభాజ్య సంబంధాలు తెగిపోయాయి. భూమి వ్యక్తిగత ఆస్తిగా మారిన కాలంలోనే ద్రవ్యమూ కనిపెట్టబడింది. వ్యక్తిగతాస్తి అనే మాటకు అర్థం ఏమిటో అది చూపిం

చింది. భూమికూడా ఒక వర్తకపు సరుకే. దానిని అమ్మవచ్చు, తనఖా పెట్టవచ్చు. అది వ్యక్తిగత ఆస్తిగా మారడంతోనే భూమి తనఖా కూడా వచ్చింది. (ఏథెన్సులో మనకిది కనబడుతూంది) దంపతీ వివాహం వెంట హెటియారిజమూ, వ్యభిచారమూ తరుముకొని వచ్చినట్లే భూమిపై హక్కుతోపాటు తనఖా కూడా వెంటబడింది. మానవుడు భూమి మీద సంపూర్ణాధికారం కావాలన్నాడు, అమ్మివేసే స్వతంత్రం వుండాలన్నాడు. అదిలభించింది, ఇదిగో 'tu l'as voulu. georges Dandin!" *

వ్యాపారం, ద్రవ్యం, వడ్డీ వ్యాపారం, భూమిమీద వ్యక్తి యాజమాన్యం–తనఖా. ఇవి వృద్ధిపొందినకొలదీ ఒక చిన్నవర్గం చేతుల్లో సంపదలు ప్రోగుపడి అతివేగంగా కేంద్రీకృతం కాసాగాయి. ప్రజాసామాన్యంలో దారిద్ర్యం, దారిద్ర్యంలో మునిగివుండే ప్రజలసంఖ్య–దానితోపాటే పెరగసాగింది. ఆదినుంచీ ఈ ద్రవ్యప్రభువులవర్గం, కులీనప్రభువర్గం నుంచి భిన్నంగానే వృద్ధిపొందింది. క్రమేణా వారిని వెనక్కునెట్టివేసింది. [ఏథెన్సు, రోములలోనూ, జర్మనీలలోనూ కూడ ఇదేకనబడుతుంది.] సంపదల హెచ్చుతగ్గుల్నిపట్టి పౌరులలో వర్గాలు ఏర్పడడంతోనే బానిసల సంఖ్య (ముఖ్యంగా గ్రీసులో) విపరీతంగా పెరిగిపోయింది. వారిచేత బలప్రయోగంతో పనిచేయించారు. ఆ పునాదులమీద సమాజం నిర్మించబడింది.

ఈ సామాజిక విప్లవం ఫలితంగా గణసంస్థ ఏమయిందో ఓమారు తెలుసుకుందాం. ఈ నూతన శక్తుల అభివృద్ధితో గణసంస్థకు ఏపాటి ప్రమేయమూలేదు. కనక, దాని విషయంలో గణసంస్థ నిస్సహాయమయిపోయింది. గణ నిర్మాణం సజీవంగా వుండాలంటే కొన్ని పరిస్థితులుండాలి ఒక గణంలోని జనంగాని, కనీసం ఒకే తెగకు చెందినవారుగాని ఒకే నిర్ణీతమైన ప్రదేశంలో జీవించాలి. ఆ ప్రదేశంలో ఇతర తెగల ప్రజలు నివసించకూడదు. కాని ఈ పరిస్థితి మారిపోయి చాలకాలం అయిపోయింది. ఇప్పుడు ఏ ప్రదేశంలో చూసినా అనేక

---

* జార్జి దాండీ అనే మోలీర్ హాస్యనాటకంలోని మాట. "నీ మాటే చెల్లని దాండీ!"—అని దాని అర్థం.

తెగలకు అనేక గణాలకు చెందిన ప్రజలు నివశిస్తున్నారు. ప్రతిచోటా పౌరులతోబాటు బానిసలు, రక్షిత ప్రజలు, విదేశీయులు అందరూ కలిసి పోయి వుంటున్నారు. అనాగరిక యుగపు మధ్యదశయొక్క అంతిమ దినాలలోనే ప్రజలు సంచార జీవితం వదలి స్థిరనివాసాలకు అలవడ్డారు. వ్యాపారం, వృత్తులలో మార్పులు, భూ యాజమాన్యంలో వచ్చిన మార్పులు కారణంగా ప్రజలు తరచుగా చోట్లుమారి నూతన ప్రదేశాలకు వెళ్ళిపోతున్నారు. గణసభ్యులు వెనకటి మాదిరిగా తమ వుమ్మడి వ్యవహారాలను చక్కబెట్టుకొనేటందుకు ఒకచోట కూడడం సాధ్యంకాదు. మత సంబంధమైన ఉత్సవాలవంటి అప్రధాన విషయాలకోసం కేవలం మొక్కుతీర్చుకుందు కన్నట్లు సమావేశమయ్యేవారు, అంతే. కొన్ని పనుల నిర్వహణకై గణసంస్థ ఉద్దేశించబడినాయి. ఆ పనుల నిర్వహణకు అవి చాలు. కాని, నేడు ఉత్పత్తి సంబంధాలు చాలా తారుమారు అయాయి. తత్ఫలితంగా సమాజంలో ఎన్నో మార్పులు వచ్చాయి. వెనుకటివానికి తోడు కొత్త అవసరాల్ని, బాధ్యతల్ని సృష్టించాయి. ఇవి పూర్వపు గణ నిర్మాణానికి సంబంధించినవీ కావు. దానికి అనుగుణమూ కాదు. ప్రతి అడుగులోనూ దానితో భేదిస్తాయి. శ్రమ విభజనతోబాటుగనే అనేక తరహాల చేతి వృత్తులవాళ్ళు బయలుదేరారు. ఒక్కొక్క తరహాకు చెందిన వృత్తిలోనే అనేక గణాలకు అనేక ఫ్రాత్రేలకు (సోదర కూటాలకు), అనేక తెగలకు సంబంధించిన వారు అనేకులు పనిచేస్తున్నారు. అంతేనా, విదేశీయులుకూడా ఎందరో వచ్చి చేరారు. అందుచేత నూతనంగా ఏర్పడిన పరిపాలనాంగాలు గణసంస్థకు వెలుపల, దాని సరసన–అంటే దానితో పోటీగా నిర్మించవలసివుంటుంది. ప్రతి గణసంస్థలోనూ ఈ ప్రయోజన వైరుధ్యం పనిచేస్తూనేవుంది. ఒకే గణంలో ఒకే తెగలో ధనికులు, దరిద్రులు, రుణదాతలు, రుణగ్రస్తులు వుంటున్నారు. మరొకటికూడా జరుగుతూంది. గణానికిచెందని జనం ఎందరో ఆప్రదేశంలో వుండేవారు. రోముసామ్రాజ్యంలో భూములు చాల ఏరకు పైవారి చేతులలోనే వుండేవి. ఏ తెగలోనూ, ఏ బంధు కుటుంబంలోనూ ఇముడ్చుకోజాలనంత సంఖ్యలో వారు వుండేవారు. వారికి యెదురెత్తుగా, వారికి ప్రవేశార్హతలేని, ప్రత్యేక హక్కులు గల సమితులుగా

గణసంస్థ లుండేవి. సహజ రూపంలోనే వచ్చిన ప్రాచీన ప్రజాతంత్ర విధానం, కృత్రిమంగా ఏర్పరచబడిన ప్రభువిధానంగా మార్పు చెందింది. ఇంక చివరకు-అంతర్వైరుధ్యాల నెరగని సమాజంతో గణసంస్థ ఏర్పడింది. అది ఆ సమాజానికే తగును. ప్రజాభిప్రాయం మినహాగా దాని చేతిలో మరో నిర్బంధ పరికరంలేదు. కాని ఈనాటి సమాజం? ఆర్థిక వ్యవస్థకు ఫలితంగా ఈ సమాజం ధనికులు – బీదలు, దోచుకొనేవారు— దోచుకోబడేవారుగా విడిపోయింది. ఈ సమాజంలో ఈ వైరుధ్యాలు ఉత్తరోత్తరా తీవ్రతరం అవుతాయేగాని – సమన్వయం కావు. అటువంటి పరిస్థితులలో ఉభయ వర్గాలూ నిరంతరం ప్రత్యక్ష పోరాటంలో చిక్కుకోనైనా చిక్కుకోవాలి. లేదా ఈ రెండింటికీ అతీతంగా కనబడే మూడోశక్తి ఆ రెండు వర్గాల నడుమనున్న ప్రత్యక్ష పోరాటాన్ని అణచివేసి ఆర్థికరంగంలో శాసనానుకూలపద్ధతులలో వర్గపోరాటం కొనసాగించుకోనివ్వాలి. గణ నిర్మాణం అంతరించింది. శ్రమ విభజనా, దానికి ఫలితంగా సమాజంలో ఏర్పడిన వర్గభేదాలూ ఆ నిర్మాణాన్ని ఛిన్నాభిన్నం చేశాయి. దాని స్థానే రాజ్యాంగం ఏర్పడింది.

* * *

గణనిర్మాణ శిథిలాల నుంచి రాజ్యాంగం మూడు తరహాలలో తలఎత్తుతుంది. ఆవిషయాన్నంతనూ పైన వివరంగా చెప్పాను ఏథెన్సు స్వచ్ఛమూ స్వతస్సిద్ధమూ అయిన విధంగా రాజ్యాంగం పరిణామం పొందడాన్ని చూపిస్తుంది. గణసమాజం లోపలనే వృద్ధిపొందిన వర్గ వైరుధ్యాలలోంచి రాజ్యాంగం అక్కడ పుట్టుకువచ్చింది. కాని రోములో పరిస్థితులు వేరు. ఇక్కడ గణసమాజం కులీన ప్రభుత్వవ్యవస్థగా తయారయింది. దానిచుట్టూ వేలకొలదిమంది ప్లెబియన్లున్నారు. వారికి బాధ్యతలేగాని హక్కులులేవు. ప్లెబియనుల విజయసాధనతో ఆత్మీయతా బంధాల మీద ఏర్పడిన అతఃపూర్వపు సమాజం శిథిలం అయింది. ఆ శిథిలాలమీద రాజ్యాంగం నిర్మితం అయింది. దీనిలో కులీన ప్రభువులయిన గణ సభ్యులూ, ప్లెబియనులూ కూడ లీనమయిపోయారు. ఇంక మూడోది–రోమను సామ్రాజ్యాన్ని కూలద్రోసి జర్మనులు స్థాపిం

ఓన రాజ్యాంగం. ఇక్కడ జర్మనులు పెద్దపెద్ద భూభాగాలను ఆక్రమించు కొన్నారు. గణ నిర్మాణం వాటి పరిపాలనకు కావలసిన అంగాల్ని సమ కూర్చలేకపోయింది. ఫలితంగా రాజ్యాంగం ఏర్పడింది ఇక్కడి విజేతలు దేశంలోని ప్రజలతో తీవ్రమైన పోరాటాలు చేయవలసిన పనిలేక పోయింది తమకంటె ఉన్నతస్థితిలోవున్న శ్రమ విభజనను ఎదుర్కో నక్కరలేక పోయింది. విజితులూ-విజేతలూ ఆర్థిక పరిణామక్రమంలో ఇంచుమించు ఒకే స్థాయిలో వున్నారు. ఫలితంగా సంఘంలోని ఆర్థిక పునాదులు పూర్వం మాదిరిగానే వుండిపోయాయి. ఈ కారణాలన్నింటి చేతా గణ నిర్మాణం ఎన్నో శతాబ్దాల వరకూ ఏదో ఒకరూపంలో జీవించి వుండగలిగింది. మార్కు గ్రామం ప్రాదేశిక రూపమైన ఒక రూపాంతరం. తర్వాత కాలంలో కులీన-పాట్రిషియన్ కుటుంబాల రూపంలోనూ, దిత్మార్షెన్‌లో లాంటి రైతుకుటుంబాలలోనూ స్వల్పకాలం పాటు పునరుజ్జీవం పొందింది.

అందుచేత రాజ్యాంగం అనేది పైనుంచి ఎవరో సమాజంమీద రుద్దినదికాదు. "నైతిక ఆదర్శానికి మూర్తిమంతం" అనీ, "కారణానికి ప్రతిబింబమూ, ప్రతిరూపమూ" అనీ హెగెలు చెప్పేమాటలలో నిజం ఎంతవుందో, పైనుంచి సమాజంమీద రుద్దబడిందనే మాటలోగూడ అంతే నిజంవుంది. సమాజపరిణామక్రమంలోని ఒక ప్రత్యేకదశలో రాజ్యాంగం సమాజంలోంచే పుడుతుంది. రాజ్యాంగం ఏర్పడింది అంటే ఆ సమాజంలో సమన్వయించడానికి సాధ్యపడని ఆత్మ వైరుధ్యాలు వచ్చాయని అర్థం. తనకు స్వాధీనంలోలేని, సర్దుబాటుకు సాధ్యంకాని వైషమ్యాలు దానిలో పుట్టాయన్నమాట. ఈ వైషమ్యాలు, పరస్పర విరుద్ధ ప్రయోజనాలు గల వర్గాలూ తమ నిష్ఫల పోరాటంలో తమరినీ, తామున్న సమాజాన్నీ కూడ నాశనం చేసుకోకుండా నిలపడమూ, ఆ

* గణాలంటే ఏమిటో చూచాయగానైనా తెలిసిన చరిత్ర కారుడు నీబుర్. దిత్మార్షెన్ కుటుంబాల పరిచయమే ఆయన కది తెలుపగలిగింది. అయితే ఆ పరిచయమే ఆయనలో ఎన్నో తప్పుడు అభిప్రాయాలకు మూలం అయింది. —ఏంగిల్సు.

పోరాటాల తీవ్రతను తగ్గించి, 'భద్రత'ను కాపాడేటందుకూ సమాజానికి అతీతంగా కనబడే శక్తి ఒకటి అవసరం అయింది. ఆ శక్తి సమాజం లోనే పుట్టింది. కాని, సమాజానికి అతీతంగానటిస్తూ అంతకంత కది సమాజంనుంచి దూరం అవుతూవుంది. ఆ శక్తే రాజ్యాంగం.

ప్రాచీనకాలంనాటి గణనిర్మాణానికీ, ఈ రాజ్యాంగానికీ తేడా ఏమిటి? మొదటిది — రాజ్యాంగంలో సభ్యుల్ని ప్రాంతీయ పద్ధతి మీద నిర్ణయిస్తారు. ప్రాచీన గణసంస్థలు రక్తసంబంధీకులతో ఏర్పడ్డవి. ఈ సంస్థలిప్పుడు నిరుపయోగం అయాయి. దానికి ముఖ్యకారణం ఒకటుంది. ఆ సంస్థలు పనిచెయ్యాలంటే ముందు ఆ సంస్థలోని వారంతా ఒకే నిర్ణీత ప్రదేశంలో నివసించాలి. ఆస్థితి ఏనాడో పోయింది. ప్రదేశా లెక్కడివక్కడే వున్నాయి. కాని ప్రజలు కదిలిపోయారు. అందుచేతనే 'ప్రాంతీయ పద్ధతి' మీద విభజన మొదటి మెట్టు అయింది. పౌరుణా గణాలతోగాని, తెగలతోగాని నిమిత్తంలేకుండా తమనివాస భూములలో తమ సామాజిక బాధ్యతలనూ, హక్కులనూ నిర్వహించే పద్ధతిని ప్రవేశ పెట్టారు. వారు వారు నివసించే ప్రదేశాలప్రకారం పౌరులను రాజ్యాంగం లోకి తీసుకురావడం అనేది అన్నిచోట్లా సమానమే. అందుచేతనే ఈ నూతన నిర్మాణం ప్రకృతిసిద్ధమైనదిగానే కనబడుతుంది కాని, రోమ్, ఏథెన్సుల చరిత్రచూస్తే రక్త బంధుత్వాల పునాదిపై ఏర్పడిన ప్రాచీన నిర్మాణాన్ని తొలగించి, దానిస్థానే రాజ్యాంగాన్ని నెలకొల్పడానికి ఎంతో కాలం, తీవ్రమైన ఘర్షణలూ అవసరమయాయని గ్రహించగలుగుతాం.

మనకి విస్పష్టంగా కనిపిస్తూన్న మరో భిన్నాంశం-ప్రభుత్వ సైన్యం నెలకొల్పబడడం. ప్రజలే సాయుధ శక్తిగా వ్యవహరించడానికి ప్రభుత్వ సైన్యం పనిచేయడానికీ పోలికేలేదు. ప్రజలు వర్గాలుగా విడిపోవడంచేత వారు సాయుధులుగా, స్వతంత్రంగా పనిచేయడం ఇంక జరగదు. కను కనే ప్రత్యేకంగా ప్రభుత్వాధీనంలో సైన్యం వుండడం అవసరంఅయింది. బానిసలుకూడా ప్రజానీకంలోనే లెక్క. ఆథీనియాలో 3,65,000 మంది బానిసలుంటే, స్వతంత్ర పౌరులు 90,000 మంది మాత్రమే వుండేవారు.

ఈ స్వతంత్రులకు ప్రత్యేక సౌకర్యాలుమాత్రం ఉండేవి. అధీనియను ప్రజాతంత్రంలోని ప్రజా సైన్యం ప్రభువర్గంయొక్క 'సైన్యం'గా బాని సలను అదుపులో వుంచేది; కాని ప్రజల్నికూడా అదుపులో వుంచవలసి నప్పుడు పోలీసు బలగంకూడా అవసరం అయింది. ప్రభుత్వ సైన్యం ప్రతి రాజ్యాంగంలోనూ వుంటుంది. ఒక్క సాయుధ భటులే కాకుండా వానికి అనుబంధంగా బందిఖానాలు, అనేకానేక నిర్బంధ పద్ధతులూ వచ్చాయి. వీటిలో దేనినీ గణవ్యవస్థ ఎరుగదు. ఇంకా వైషమ్యాలు వృద్ధిపొందని సమాజాలలోనూ, ప్రజలు ఒత్తుగాలేని అమెరికా సంయుక్త రాష్ట్రాలవంటి చోటా ప్రభుత్వ సైన్యం లేనే లేదనిపించేటంత అల్ప రూపంలోవుండొచ్చు రాజ్యంలోపలనే వర్గ వైషమ్యాలు నిశితం కావ డమూ, ఇరుగు పొరుగురాజ్యాలు బలవంతములై సంఖ్యాధికములు గావటంతో ప్రభుత్వ సైన్యం బలపడుతూవస్తుంది. ఒక్కమారు నేటి యూరపుదేశం చూడండి వర్గపోరాటాలు, విదేశాల ఆక్రమణకై పోటీలు మూలంగా ప్రభుత్వసైన్యం అక్కడిసమాజాన్ని, చివరకు రాజ్యాంగాన్ని కూడ మ్రింగివేసేటంతగా పెరిగిపోయింది.

ఈ ప్రభుత్వ సైన్యాన్ని పోషించడంకోసం రాజ్యంలోని ప్రజల నుంచి పన్నులు వసూలు చేయవలసివచ్చింది. గణసమాజంలో పన్నుల నెరగరు. ఈవేళ మనకు దానిని గురించి చాలాబాగాతెలుసు. నాగరికత వృద్ధిపొందినకొద్దీ ఎంతలేసి పన్నులూ చాలవు. భవిష్యత్తులో తనకు రాబోయే ఆదాయాన్ని ప్రభుత్వం ఇప్పుడే తాకట్టు పెడుతుంది. అప్పులు తీసుకుంటుంది. ప్రభుత్వపు అప్పులంటూ ఏర్పడతాయి. యూరపు ఖండంలో ఈ విషయాన్ని గురించి ఎన్నో వుదాహరణలు లభిస్తాయి.

ప్రభుత్వసైన్యాన్నీ, పన్నులువేసే అధికారాన్నీ చేతిలోపెట్టుకొన్న అధికారివర్గం సమాజాని కతీతమయిన సమాజాంగ మయింది. గణ సంస్థల పరిపాలనాంగాల కిచ్చిన స్వతంత్రమూ, మనస్ఫూర్తి యైన గౌరవమూ లభించినా అది వారికి చాలిందికాదు. వారు ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రభుత్వశక్తి వారిని సమాజానికి దూరంచేస్తుంది. అందుచేత

ప్రత్యేక శాసనాలుచేసి వానిద్వారా వారికి గౌరవం కట్టబెట్టారు. వారి మాట వినితీరవలసిన పరిస్థితి కలిగించారు. పలుకుబడి సృష్టించారు.

గణసమాజంలోని పరిపాలనాంగా లన్నింటికీవున్న అధికారంకన్న నాగరిక రాజ్యాంగంలోని పరమ నీచుడయిన పోలీసు ఉద్యోగికి వుండే అధికారం యెక్కువ. నాగరిక యుగంలోని గొప్ప గొప్ప రాజులు, రాజకీయవేత్తలు, సేనాధిపతులు' గణసంస్థల నాయకులలో అతి సాధారణుడికికూడా ప్రజలనుంచి లభించే మనస్ఫూర్తియైన మర్యాదకు అసూయ పడవలసి వుంటుంది. దీనికి కారణం అతడు ప్రజలమధ్య వుంటాడు. వారంతా సమాజానికి అతీతులుగా, దానితో సంబంధం లేనివారులాగా వ్యవహరిస్తారు.

వర్గాలమధ్య పోరాటం ముమ్మరంగా సాగుతున్న కాలంలో వర్గ వైషమ్యాల్ని అదుపులో వుంచడంకోసం రాజ్యాంగం పుట్టింది. అందు చేతనే అది సహజంగా మంచి శక్తి, ఆర్థికబలమూ వున్న వర్గంయొక్క ప్రభుత్వంగానే వుంటుంది. రాజ్యాంగంయొక్క సహాయంతో ఆ వర్గం రాజకీయంగాకూడా బలపడుతుంది. ఆవిధంగా పీడిత వర్గాల్ని అదిమి పెట్టి, దోచుకొనేందుకు నూతన పరికరాల్ని సంపాదించుకొంటుంది. ఆదిమ కాలంనాటి రాజ్యాంగం బానిస యజమానుల చేతుల్లో, బానిసల్ని అణచిపెట్టి అదుపులో వుంచేటందుకు సాగించబడింది. ఫ్యూడలు రాజ్యాంగం కులీనవర్గం వారిది. దానిద్వారా వారు దాసులయిన రైతుల్నీ, బానిసల్నీ అదుపులో వుంచేవారు. ఈనాటి ప్రజాప్రతినిధి రాజ్యాంగం పెట్టుబడిదారులు కూలీలను పీల్చివేసే సాధనంగా వుపయోగపడుతూంది. ఒక్కొక్కప్పుడు ఘర్షిస్తున్న వర్గాలు ఇంచుమించు సమానబలంతో వుంటూంటాయి. అటువంటి సమయంలో రాజ్యాంగం మాధ్యస్త్యం వహిస్తున్నట్లు కనబడుతుంది. తాత్కాలికంగా మధ్యస్థంగానేవుండొచ్చు. 17 18 శతాబ్దాలనాటి నిరంకుశ రాజరికాలు ఈ మాదిరివే. అవి అటు కులీనవర్గాన్నిగాని, ఇటు బూర్జువా వర్గాన్నిగాని బలపరచలేదు. ఉభయుల్నీ అణచిపెట్టి వుంచాయి. మొదటి ఫ్రెంచి సామ్రాజ్యంలో, రెండో సామ్రాజ్యంలో మరీ స్పష్టంగా బోనపార్టీ అనుసరించిన విధానం ఇదే.

బూర్జువావర్గాన్నీ. శ్రామికవర్గాన్నీ ఒకదాని కొకదానిని పోటీపెట్టి తాను పైన విలబడింది. ఈ మాదిరిగానే ఈ మధ్య బిస్మార్కు నిర్మించిన నూతన జర్మను సామ్రాజ్యమూ వ్యవహరించింది. ఆ వ్యవహారంలో పాలకులూ, పాలితులూకూడా అపహాస్యం పాలయ్యారు. పెట్టుబడిదారుల్నీ కార్మికుల్నీ ఒకరిపైఒకరిని ఆడించి, క్షీణించిపోతున్న ప్రష్యనుయూంకర్ల ప్రయోజనాలకోసం ఆ యిద్దర్నీ ఒకేవిధంగా మోసగిస్తూవుంది.

అదీగాక, చరిత్రలో మనకి కనబడే రాజ్యాంగాలు చాల వాటిలో పౌరహక్కులు వారివారికిగల ఆస్తుల్నిపట్టి నిర్ణయించడం కనబడుతుంది. దీనికి అర్థం – ఆస్తిలేనివారి వర్గంనుంచి ఆస్తిగలవారి వర్గాన్ని కాపాడేటందుకే రాజ్యాంగం ఏర్పడిందనే. ఏథెన్సులోనూ, రోములోనూ ఆస్తిని పట్టే తరగతి విభజన జరిగిందని చూశాం. మధ్యయుగంలోని ఫ్యూడలు రాజ్యాంగాలలో వారివారి అధీనంలో వున్న భూమి పరిమితినిపట్టి రాజకీయాధికారం వుండేది. ఆధునికములయిన ప్రజా ప్రతినిధి రాజ్యాంగాలలో వోటర్ల అర్హతలు వారి ఆస్తుల్నిపట్టే నిర్ణయించబడుతున్నాయి. కాని, ఆస్తిపాస్తులలోని విభేదాల్ని రాజకీయంగా గుర్తించవలసినఅవసరం ఏమీ లేదు. అలాగ గుర్తించడం ఆ రాజ్యాంగం పరిణామ క్రమంలో బాగా దిగువదశలో వుందనడానికి నిదర్శనం. ప్రజాతంత్ర రిపబ్లికు రాజ్యాంగం యొక్క అత్యున్నతరూపం. ఆధునిక సామాజిక పరిస్థితులలో ఈ రాజ్యాంగరూపం తప్పనిసరి, అత్యవసరమూ అవుతూంది. శ్రామిక వర్గానికీ – బూర్జువా వర్గానికీ మధ్య అంతిమ పోరాటం ఈ రాజ్యాంగంలోనే తేలిపోతుంది ఈ రాజ్యాంగం ఆస్తుల తేడాల్ని అధికారయుతంగా పరిగణించదు ఈ రాజ్యాంగంలో సంపదలు తమ అధికారాన్ని పరోక్షంగా నిర్వహిస్తాయి. పరోక్షంగా అయినా, ఆ అధికారం ఖచ్చితంగా నిర్వహిస్తాయి ఇది అమెరికాలోలాగ అధికారులకు లంచాలు పెట్టడం ద్వారా జరగవచ్చును. రెండోది స్టాక్ ఎక్స్చేంజికీ, ప్రభుత్వానికీ మధ్య మైత్రి ఏర్పరచడంద్వారా జరగవచ్చును. ఈ పద్ధతిలో ప్రభుత్వరుణం పెరిగిన కొద్దీ జాయింట్ స్టాక్‌కంపెనీలు స్టాక్ ఎక్స్చేంజిని కేంద్రంగా చేసుకొని రహదారుల్నే కాకుండా ఉత్పత్తినికూడా తమ చేతుల్లో

కేంద్రీకరించుకోవచ్చు. ఈమధ్య ఏర్పడిన ఫ్రెంచి రిపబ్లికూ, అమెరికా సంయుక్త రాష్ట్రాలూ దీనికుదాహరణ. వెనుకటినుంచీ మంచి రాజ్యాంగ మని పేరున్న స్విట్జర్లాండ్ కూడా ఈ విషయంలో తనవంతు ఆదర్శాన్ని చూపించింది. ప్రభుత్వానికీ - స్టాక్ ఎక్స్ఛేంజికీ మధ్య స్నేహం ఏర్పడ డానికి ప్రజాతంత్ర ప్రభుత్వమే ఉండనక్కర్లేదని ఇంగ్లండూ, నూతన జర్మను సామ్రాజ్యమూ నిరూపించాయి. నూతన జర్మను సామ్రాజ్యంలో సార్వజనిక వోటింగ్ హక్కువలన లాభపడినది బిస్మార్కా ? బ్లీక్రో డరా?* అనేది చెప్పడం కష్టం. ఇంకోటి కూడా వుంది. సార్వజనిక వోటింగు హక్కుద్వారా ఆస్తిపరులవర్గం తన పరిపాలనను సరాసరి సాగిస్తుంది. పీడితవర్గం-ప్రస్తుతంలో శ్రామికవర్గం తన స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొనేశక్తి కలగనంతకాలమూ వారిలో అధికభాగం ఈ వున్న సామాజిక వ్యవస్థకే తల ఒగ్గుతారు. రాజకీయంగా పెట్టుబడిదారీవర్గం లోని తీవ్ర వామపక్షానికి అనుబంధంగా మాత్రమే వుండిపోతారు. తమ స్వాతంత్ర్యం సాధించుకోగల శక్తిని సంపాదించుకొన్నకొద్దీ తామే పార్టీగా ఏర్పడతారు.

పెట్టుబడిదారుల ప్రతినిధులకు గాక తమ ప్రతినిధులకే వోటుచేసు కొంటారు. ఆ విధంగా పార్వజనిక వోటుహక్కు శ్రామికవర్గంయొక్క పరిణతిని కొలిచే సాధనం అవుతుంది. ఆధునిక రాజ్యాంగంలో అది చెయ్యగలదంతే. అంతకంటే చెయ్యలేదు, చెయ్యదు. అయితే అదే చాలు. ధర్మామీటరులాగ సార్వజనిక వోటుహక్కు కార్మికులలో పొంగులు వారేదశను చూపించేనాటికి ఉభయపక్షాలూ తమ తమ స్థితి గతుల్ని అర్థంచేసుకోగలరు.

అందుచేతనే రాజ్యాంగం అనేది అనాదిగా వచ్చినది కాదని తెలిసి పోతూంది. రాజ్యాంగంతో నిమిత్తంలేకుండా సాగిన సమాజాలు ఒకప్పు

* బ్లీక్రోడరు - గెర్సన్ బ్లీక్రోడరు పూర్తిపేరు. 1822-1893. బెర్లిన్‌లోని జర్మన్ బ్యాంకు అధిపతి. అనేక సంవత్సరాలపాటు ప్రష్యను ప్రభుత్వంయొక్క ఆర్థిక వ్యవహారాలలో పాల్గొన్నాడు. బిస్మార్కుయొక్క స్వంత బ్యాంకరు.

దున్నాయి. రాజ్యాంగం, రాజ్యాంగాధికారాల్నిగురించి వానికి కించిత్తూ తెలియదు. ఆర్థిక పరిణామక్రమంలో ఒకదశ వచ్చేసరికి సమాజం వర్గాలుగా విభజితం అవుతుంది. ఆ విభజనకు ఫలితంగా రాజ్యాంగం తప్పనిసరిఅవుతుంది. ఉత్పత్తి పరిణామక్రమంలో మనం ఇప్పుడొక ప్రత్యేక దశను సమీపిస్తున్నాం ఈ దశలో వర్గాలువుండడం అనవసరమే కాదు; ఉత్పత్తికి ఆటంకంకూడాను. అవి తప్పనిసరిగా ఎల్లాపుట్టాయో, అల్లాగే తప్పనిసరిగా అంతరిస్తాయి. వానితోపాటు రాజ్యాంగమూను. ఉత్పత్తిదారుల సమానమూ స్వతంత్రమూనైన సహోదాలో ఉత్పత్తినిసాగించేటట్లు సమాజం పునర్నిర్మాణం అవుతుంది. అది రాజ్యాంగాన్ని స్వస్థలానికి - ప్రాచీనవస్తు ప్రదర్శనశాలకు మార్చి రాట్నం, కంచుగొడ్డలి మొదలైనవాని సరసన భద్రపరుస్తుంది.

* * *

పై సమాలోచననుబట్టి నాగరికత అనేది సమాజం యొక్క అభివృద్ధిక్రమంలో ఒక దశ అని తేలుతూంది. శ్రమవిభజన, తత్ఫలితంగా వ్యక్తులమధ్య వస్తువులమార్పిడి ఏర్పడింది. వర్తకపు సరుకుల ఉత్పత్తి ఆ రెండిటినీ కలిపింది. ఇవన్నీ పూర్తిగా పరిణతిపొందింది. అంతక్రితం వున్న సామాజిక వ్యవస్థను పూర్తిగా మార్చివేశాయి.

అతఃపూర్వపు సమాజ దశ లన్నింటా వస్తూత్పత్తి ప్రధానంగా సమష్టిగా జరిగేది. చిన్నవో, పెద్దవో ఆ సామూహిక సంఘాలలో ఉత్పత్తిని సరాసరి పంచిపెట్టేవారు. ఈ సార్వజనిక వుత్పత్తి చాలా చాలపరిమితమైన హద్దులలో జరిగేది. అయితే ఉత్పత్తిదారులు ఆ వుత్పత్తిక్రమంమీదా, ఉత్పత్తియైన వస్తువులమీదా స్వాధీనం కలిగియుండేవారు. ఉత్పత్తియైన వస్తువు ఏమయిందో వారు ఎరుగుదురు; దానిని వారే అనుభవించారు. అది వారి చేతులుదాటి పోలేదు. ఈ పునాదులమీదనే ఉత్పత్తి సాగుతున్నంతకాలమూ అది వారికి అందకుండా పెరిగిపోలేదు. వారికి వ్యతిరేకంగా, చేతికి అందని విరుద్ధశక్తుల్ని తయారుచేయలేదు. కాని నాగరికతలో ఇది తప్పనిసరి; పొడూగునా జరిగేదిన్నీ.

ఈ ఉత్పత్తి విధానంలోకి శ్రమ విభజన చొరబారుతుంది. ఉత్పత్తి సమష్టిగా సాగించడమూ, అనుభవించడమూ అనే పద్ధతిని అది నాశనం చేస్తుంది. వ్యక్తులు వస్తువుల్ని స్వాధీనం చేసుకోవడం పరిపాటిచేస్తుంది ఆ విధంగా వ్యక్తులమధ్య మార్పిడిని ప్రవేశపెడుతుంది అదెల్లా జరిగిందో పైన చూశాము. క్రమంగా వర్తకపు సరుకుల ఉత్పత్తే ప్రాచుర్యంగల రూపం అయింది.

వర్తకపు సరుకుల వుత్పత్తితో వుత్పత్తి స్వంత వుపయోగం కోసం గాక మార్పిడికోసమే జరుగుతుంది. ఉత్పత్తి అయిన వస్తువులు తప్పకుండా చేతులు మారతాయి. మార్పిడిలో ఉత్పత్తివారు చేతిలోంచి ఆ వస్తువు జారిపోతుంది. దాని గతి ఏమయిందో అతనికి తెలియదు. ధనమూ, ఇద్దరు ఉత్పత్తిదారుల మధ్య దళారిగా వ్యాపారీ వచ్చాక మార్పిడి పద్ధతిలో మరింత గజిబిజి ఏర్పడుతుంది. వస్తువుల అంతిమగతి మరింత అనిశ్చితం అవుతుంది. వర్తకులు అసంఖ్యాకంగా వుంటారు. ఒక దేంచేస్తున్నదీ రెండోవానికి తెలియదు. వర్తకపు సరుకులు చేతులు మారడమేకాదు. మార్కెట్లుకూడా మారతాయి. ఉత్పత్తిదారులు తాము చేసే ఉత్పత్తి మొత్తంమీదా, తమ జీవిత పరిస్థితులమీదా యాజమాన్యం కోల్పోతారు. ఆ యాజమాన్యాన్ని వర్తకులు అందుకోలేరు. ఫలితంగా వస్తూత్పత్తీ, వస్తువులూ యదృచ్ఛాధీనాలుగా తయారయ్యాయి.

అంతస్సంబంధాలలో యాదృచ్ఛికత ఒకకొస అయితే రెండో కొస ఆవశ్యకత. ప్రకృతిలోకూడ యాదృచ్ఛికతదే పెత్తనం. ప్రతి రంగంలోనూ ఈ యాదృచ్ఛికతలో ఆవశ్యకతా,ధర్మసంబద్ధతా అంతర్గర్భితంగా వుంటాయని చాలకాలంక్రితమే చూపించాము. ప్రకృతిలోలాగే సమాజంలో కూడా ఇది ఇంతే. సమాజ కార్యకలాపాలనూ, సమాజ విధానాలనూ మానవుడు తన అదుపులో వుంచుకొనేటందుకు సాధ్యం కానంత బలీయం అయి, వానితలకు మించిపోతే అది కేవలం యాదృచ్ఛికంగానే కనబడతాయి. దానిలో అంతర్గతంగావుండే విశిష్ట ధర్మాలు యాదృచ్ఛికంగా తటస్థపడిన వానిలాగే కనబడతాయి. ఆధర్మాలే సరుకుల వుత్పత్తిలోనూ, మారకంలోనూ కనిపించే యాదృచ్ఛికతలను అదుపు

చేస్తున్నాయి. ఉత్పత్తినీ, మారకాన్నీ కొనసాగించే వ్యక్తులకవి వింతగా కనిపించవచ్చు. ప్రారంభంలో ఎక్కడినుందో ఆగంతుకంగా వచ్చినట్లు కూడా అనిపించవచ్చును. వాని స్వభావాన్ని గుర్తించేటందుకు చాల శ్రమా, శ్రద్ధా తీసుకోవాలి. వర్తకపు సరుకుల వుత్పత్తికి సంబంధించిన ఆర్థికధర్మాలు ఉత్పత్తిరూపాల అభివృద్ధి దశల్నిపట్టి మార్పుచెందుతూ వచ్చాయి. అయినా ఈ ధర్మాలే నాగరికతాదశ అంతటిలో ప్రాముఖ్యం వహించాయి. ఈనాడుకూడా ఉత్పత్తియే ఉత్పత్తిదారునిమీద పెత్తనం చలాయిస్తూంది, ఈనాడు గూడా సమాజంలో మొత్తం ఉత్పత్తి ఒక క్రమపద్ధతిలో, సమష్టిగా ఆలోచించి నిర్ణయించి జరగడంలేదు. గుడ్డిగా నడిచే కొన్ని ధర్మాలు దానిని శాసిస్తున్నాయి. మొంకిబలంతో అవి తోసుకుపోతున్నాయి. అప్పుడప్పుడువచ్చే వ్యాపారసంక్షోభపు తుపానుల రూపంలో అవి కనబడుతున్నాయి.

ఉత్పత్తి అభివృద్ధి క్రమంలో చాలాకాలంక్రిందటే మానవుని శ్రమ శక్తి ఉత్పత్తిదారుని పోషణ కవసరమైన దానికన్న అదనంగానే ఉత్పత్తి చేయగల స్థితి వచ్చిందనీ, శ్రమ విభజనా, వస్తువుల మార్పిడీ ఈ దశకు సమకాలీనాలేననీ పైన చెప్పాము. మనుష్యుడుకూడా వర్తకపు సరుకు కావచ్చుననే 'సత్యం' గ్రహించడానికి ఎంతోకాలం పట్టలేదు. మానవుణ్ణి బానిసను చేస్తే ఆతని శ్రమశక్తినికూడా అమ్మడం, కొనడం సాగించి వుపయోగించుకోవచ్చని గ్రహించారు. మానవులు వస్తువుల మార్పిడి ప్రారంభించారో లేదో తామే మార్పిడి అయిపోయారు. కావాలన్నా వద్దన్నా కర్తృత్వం పోయి ప్రేక్షకస్థితికి వచ్చేశారు.

నాగరికతాయుగంలో బానిసత్వం పూర్తి అభివృద్ధి పొందింది. బానిసత్వంతో సమాజం దోపిడీ చేసేవారూ చేయబడేవారూగా చీలిపోయింది. నాగరికతాయుగం అంతటిలో ఈ విభజన వుండనేవుంది. బానిసత్వం అనేది మొట్టమొదటి దోపిడిరూపం. అది ప్రాచీనయుగానికే తగినది. మధ్యయుగాలలో దానిస్థానే దాసత్వం (Serfdom - అర్ధబానిస స్థితి) ఏర్పడింది. ఆధునిక యుగంలో కూలిపని వచ్చింది. నాగరికత యొక్క మూడు అంతర్దశలలోనూ ఈ మూడు రకాల చాకిరీ పద్ధతులూ

అమలుజరిగాయి. వీని నెప్పుడూ బానిసధర్మం అంటి పెట్టుకొనేవుంటూంది. ఒకప్పుడు బాహాటంగానే కనిపించేది. ఈనాడు కొంచెం మారురూపంలో వుంది. అంతే తేడా.

వర్తకపు సరుకులు ఉత్పత్తిచేయడంతో నాగరికయుగం ఆరంభం అవుతుంది. వర్తకపు సరుకుల ఉత్పత్తి ఆర్థికమైన కొన్ని లక్షణాలతో ప్రారంభమవుతుంది.

(1) నాణాల రూపంలో ధనం. దానితోపాటు ధనరూపంలో పెట్టుబడీ, వడ్డీ, వడ్డీ వ్యాపారమూను. (2) ఉత్పత్తిచేసేవారికి మధ్యవర్తులుగా వ్యాపారస్తులు. (3) భూమిమీద వ్యక్తిస్వామ్యం, తనఖావద్ధతి. (4) బానిసవాని శ్రమే ప్రధానఉత్పత్తిరూపం కావడం. నాగరికతకు అనుగుణమైనదీ, నాగరికతాదశలో సర్వ సామాన్యమైనదీ దంపతీ వివాహపద్ధతి. స్త్రీమీద మగవానిది పెత్తనం. ఒంటరికుటుంబం సమాజంలో ప్రాథమిక యూనిటుఅయింది. నాగరిక సమాజంలో రాజ్యాంగయంత్రం సమాజాన్ని పట్టివుంచుతుంది. మంచి క్లిష్ట సమయాలలో ఇది ఎప్పుడూ పాలకవర్గాలదిగానే వుంటుంది. సర్వ సమయాలలోనూ ఇది పీడిత వర్గాలను, దోపిడీచేయబడే వర్గాలను అణచివుంచేటందుకో పనిముట్టుగానేవుంటుంది. నాగరికతకు ఇతర లక్షణాలు కొన్నివున్నాయి; సామాజిక శ్రమఅంతటినీ విభజించడంలో పట్టణాలకూ—పల్లెలకూ మధ్య శాశ్వతమైన వైరుధ్యం కల్పించడం దాని లక్షణాలలో ఒకటి. వేరొకటి వీలునామాలను ప్రవేశ పెట్టడం. దీనిద్వారా మానవుడు తన మరణానంతరంకూడా ఆస్తిని ఖర్చుచేయగలడు. ఇది ప్రాచీన గణవ్యవస్థకు పూర్తిగా విరుద్ధం. సొలోన్ కాలంవరకూ ఏథెన్సు ప్రజలుకూడా దీని నెరుగరు. యెప్పుడు జరిగిందో తెలియకపోయినా రోము ప్రారంభంలోనే అక్కడ యిది కనబడుతుంది.* జర్మనీలో మతాచార్యులు దీనిని ప్రవేశపెట్టారు. యోగ్యు

* System der erworbenen Rechte (System of acquired Rights) పుస్తకం రెండో భాగంలో లాసాల్లే రోమనులలో వీలునామా అనేది రోము అంత ప్రాచీనమూను. "వీలునామాలు లేనికాలం రోమను చరిత్రలోనే లేదు" – అని వ్రాశాడు. వీలునామా అనేది

లైన జర్మన్లు తమ ఆస్తిని దైవ కైంకర్యం చేయడానికి ఆటంకాలు లేకుండా చేసేటందుకు దీనిని ప్రవేశపెట్టారు.

గణ సమాజం చేయజాలని పనులను నాగరికత దీనితో సాధించింది. మానవునిలోని ఇతర శక్తులన్నింటినీ ఒకమూలకు నెట్టి, ఉద్రేకాలను కదలించి, విజృంభింపచేసి తద్వారా ఈ కార్యాల్ని సాధించింది. నాగరికత తలయెత్తినది మొదలు నేటివరకూ వట్టి దురాశే దానిని ముందుకు నడుపుతూంది : సంపద, ఇంకా సంపద, మరింత సంపద; సంపద – సమాజంయొక్క సంపదకాదు, దురదృష్టవంతుడైన వ్యక్తి సంపద – అదే దాని ప్రధాన గమ్యం. అంతిమ గమ్యమూను. ఈ గమ్యాన్ని సాధించడంలో విజ్ఞానశాస్త్ర పరిణామమూ, అప్పటప్పట కళాసంపద పరిపూర్ణంగా వికసించడమూ, వుద్రవుడియంగా దాని ఒడిలో పడ్డాయి. అవే లేకపోతే ఈనాడు మనం సంపదల ఫలితాన్ని పూర్తిగా అనుభవించనేలేకపోదుం.

అసలు నాగరికత అనేది ఒక వర్గాన్ని మరొకవర్గం దోచుకోవడం అనే పద్ధతిమీద బయలుదేరింది. అందుచేత దాని అభివృద్ధి పొడుగునా వైరుధ్యాలతోటే సాగుతూంది. ఉత్పత్తిలో వేసిన ప్రతిఒక ముందడుగూ, అత్యధిక సంఖ్యాకులయిన పీడితవర్గంయొక్క పరిస్థితుల విషయంలో ఒక వెనుకడుగే. ఒకరికి లాభం వేరొకరికి నష్టం; ఒక్కొక్కవర్గం నూత

రోముకు పూర్వమే 'మృతసంస్కార' పద్ధతులలోంచి వచ్చిందనీ, అన్నాడు. హెగెల్ తత్వశాస్త్రంమీద అత్యధిక భక్తిగల లాసాల్లే రోమను చట్టంలోని అంశాలకు మూలం రోమను సామాజిక పరిస్థితులలో వుందేమో పరిశీలించడానికి బదులు వీలునామా వ్రాయాలనే 'భావననుగురించి ఊహించడం' ప్రారంభించి చరిత్రకు పూర్తిగా విరుద్ధమైన నిర్ణయానికి వచ్చాడు. రోమనుల వారసత్వ చట్టంలో ఆస్తి మార్పిడి ప్రధానమైనది కాదని అటువంటి ఊహతోనే నిర్ణయించడంలో ఆశ్చర్య పడనక్కర్లేదు. ప్రాచీన కాలంనాటి రోమను న్యాయవేత్తల భ్రమలను లాసాల్లే విశ్వసించడమేకాదు. ఆ భ్రమలలో అతడు వారిని మించిపోతున్నాడు. – ఏంగిల్సు.

నంగా స్వాతంత్ర్యం పొందిందంటే మరోవర్గం కొత్తపీడనకు గురి అయిందన్నమాటే. యంత్రాలను ప్రవేశపెట్టడం వలన కలిగిన ఫలితాలను నే డందరూ ఎరుగుదురు. పైన చెప్పినదానిని నిరూపించడానికి అంత కన్న వేరు ఉదాహరణ అవసరంలేదు. అనాగరిక ప్రజలలో బాధ్యత లకూ - హక్కులకూ భేదం చూపడం సాధ్యంకాదు. నాగరిక ప్రజలలో ఆ భేదం కనిపిస్తుంది. ఒక వర్గానికి ఇంచుమించు అన్ని బాధ్యతలనూ, మరోవర్గానికి ఇంచుమించు అన్ని హక్కులనూ ఇచ్చేసి వానిమధ్యనున్న వైరుధ్యం మూఢుడికి కూడా తెలిసేటట్లు చేసింది, నాగరికత.

కాని, కావలసింది అదికాదు. పాలకవర్గానికి మంచిదైనదే సమాజానికంతకూ మంచి. పాలకవర్గంతానే సమాజం అని భావిస్తుంది. అందుచేత నాగరికత అభివృద్ధిపొందినకొద్దీ తాను తప్పనిసరిగా సృష్టిం చిన నష్టాలను ప్రేమ ముసుగులో అలంకరించ వలసివస్తుంది. వానిని పొగడడమో, అసలవి లేనేలేవనడమో చేయవలసివస్తుంది. అంటే గత సమాజ వ్యవస్థలలోనూ, నాగరికతయొక్క ప్రాథమికదశలలోనూ మనం ఎరగని మోసకారితనాన్ని సృష్టిస్తుంది. మోసానికి పరాకాష్ఠంగా-పీడిత వర్గం తన పీడన సాగిస్తుంది. పీడితు లీ విషయం గుర్తించలేకపోయినా, ఎదురుతిరిగినా అది వట్టి కృతఘ్నతతప్ప వేరు కాదు- అని ప్రకటి స్తుంది. *

---

* ఫొరియరు తన రచనలలో అక్కడా అక్కడా నాగరికత మీద చాల ప్రశస్తమైన విమర్శలు చేశాడు. మోర్గనూ, నేనూ చేసిన విమర్శలతోపాటు వానినికూడా జతపరుద్దామని మొదట అను కున్నా. కాని, దురదృష్టవశాత్తూ వ్యవధిలేకపోయింది. దంపతీ వివాహమూ, భూమిమీద వ్యక్తిస్వత్వమూ నాగరికతయొక్క లక్షణా లంటూ వానిని ధనికులు బీదలతో యుద్ధంచేయడంగా ఫొరియరు ఇదివరకే భావించినట్లు చెప్పి వూరుకోదలచాను. విరుద్ధ ప్రయోజ నాలతో, కొట్టుమిట్టాడే అసమగ్ర సమాజాలన్నింటా ఒంటరి కుటుం బాలే ( les families incoherentes ) ఆర్థిక యూనిట్లుగా వుంటా యనే అంశాన్ని ఆయన చెప్పాడు. [ ఏంగిల్సు పాదపీఠిక ]

ముగింపుగా నాగరికతమీద మోర్గన్ వ్రాసిన తీర్పును వుదహరిస్తా: "నాగరికతారంభంనుండీ ఆస్తి చాల విశేషంగా అనేక రూపాలలో పెరిగిపోయింది. దాని ఉపయోగాలు విస్తరించాయి. దాని స్వంతదారుల లాభంకోసం అది ఎంతో మెలకువతో నిర్వహించబడుతూంది, ప్రజలకు సంబంధించినంతవరకు, లొంగతీయలేని మహాశక్తిగా అది తయారయింది. తాను సృష్టించిన మహాశక్తి యెదుటనే మానవ మేధస్సు కరచరణాలాడకుండా అయింది. అయినా, మానవుని బుద్ధి ఆస్తిమీద ఆధిపత్యం సంపాదించగల రోజు వస్తుంది. రాజ్యాంగానికీ, దానిచేత నిర్వహించబడుతున్న ఆస్తికీ మధ్యనుండవలసిన సంబంధాలను నిర్వచిస్తుంది. ఆ ఆస్తిదారుల బాధ్యతలనూ, హక్కులకు హద్దుల్నీ ఏర్పరుస్తుంది. వ్యక్తుల ప్రయోజనాలకన్న సమాజ ప్రయోజనాలు ముఖ్యం. ఆ రెండింటిమధ్య న్యాయమైన సంబంధాలను పరస్పర సమన్వయంగా ఏర్పరచాలి. ఆస్తిని సంపాదించడమే మానవజాతి ధ్యేయంకాదు. మానవుడు భూమిమీదికి వచ్చినప్పటినుంచి జరిగిన కాలంలో నాగరికత ఏర్పడిన తర్వాత నేటివరకు జరిగినది అత్యల్పకాలం. ఇంకముందు జరగవలసినదాంట్లో కూడ అత్యల్ప భాగమే. ఆస్తి సంపాదనయే ఆశయం, ఆదర్శంగావుండే స్థితి ఆ సమాజంతోపాటు రద్దు అవుతుంది. ఏమంటే అటువంటి పద్ధతి ఆత్మ వినాశకరం. ప్రభుత్వంలో ప్రజాతంత్రం, సమాజంలో సోదరభావం, హక్కులూ, సౌకర్యాలలో సమానత్వం, అందరికీ విద్య – ఇది రాబోయే ఉత్తమ సమాజాన్ని సూచిస్తున్నాయి. అనుభవం, జ్ఞానం, విజ్ఞానం అటే దారితీస్తున్నాయి. ప్రాచీనకాలపు గణాలలో వుంటూ వచ్చిన స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరభావం ఒక నూతన ఉన్నత రూపంలో పునరుజ్జీవితం అవుతాయి."

అనుబంధం

# కొత్తగా కనుక్కున్న ఒక గుంపు పెళ్ళి

## ఫ్రెడరిక్ ఏంగెల్స్

హేతువాదులైన జాతిలక్షణశాస్త్రజ్ఞులు కొందరికి గుంపుపెళ్ళి పద్ధతి అసలు ఎప్పుడూ ఎక్కడా వుండనే లేదనడం ఒక పరిపాటి అయి పోయింది. అందుచేత మోస్కోవెదెదోస్తి (రష్యన్ గజెట్. అక్టోబరు 14, 1892 - పాత కాలండరు) నుంచి నేను అనువదించిన వార్త ఆసక్తి కలిగించవచ్చు. గుంపుపెళ్ళి (కొంతమంది స్త్రీలకూ, కొంతమంది పురుషులకూ మధ్య సంగమస్వేచ్ఛ) పద్ధతి బాగా ప్రచారంలో వుండడమొక్కటే కాదు, గుంపుపెళ్ళి పద్ధతులలో బాగా పరిణతి పొందినదీ, ప్రామాణికమైనదీ అయిన హవాయినుల ప్యునలాన్ కుటుంబపద్ధతికి చాల సన్నిహితంగా వున్న పద్ధతి అక్కడ అమలులో వున్నట్లు కనబడుతూంది. ప్యునలాన్ కుటుంబం అనేదాంట్లో ఏకగర్భజనితులైన సోదరులూ, వారి వేలు విడిచిన సోదరులూ కలిసి ఉమ్మడిగా ఒకే తల్లి సంతానం అయిన స్త్రీలనూ, వారి వేలువిడిచిన సోదరీలనూ పెళ్ళిచేసుకొంటారు. కాని సఖాలిన్ * ద్వీపంలో మగవాడు తన సోదరులందరి భార్యలకు, భార్య సోదరీలందరకు భర్తయే. అంటే, స్త్రీకి తన భర్తసోదరులతోనూ, చెల్లెళ్ళ - అక్కగార్ల భర్తలతోనూ సంగమ స్వేచ్ఛ వున్నదన్నమాట. దీనికీ ప్యూనలాన్ ప్రామాణికరూపానికీ వున్నతేడా చాలా కొంచెం. ఇందులో సోదరీల భర్తలు భర్తయొక్క సోదరులే అయివుండాలని లేదు.

---

* సైబీరియా ఎదురుగా వున్న పసిఫిక్ దీవి.

మరొకటి కూడా కనబడుతుంది: కుటుంబం వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల పుట్టుక—నాలుగో ముద్రణ - పుట 28-29 లో † చెప్పిన అంశం దీనినిబట్టి రుజువు అవుతూంది. వ్యభిచారగృహాలే మనస్సులో మెదిలే ఛాందసులు వూహించేమాదిరిది కాదు గుంపుపెళ్ళి: ఈ ఛాందసులు రహస్యంగా చాటుమాటున సాగించేమాదిరిగా గుంపుపెళ్ళి పద్ధతి బహిరంగంగా అవినీతి జీవితాన్ని ప్రోత్సహిస్తుం డనడం సరికాదు; ప్రస్తుతం అమలులోవుండి మనకు కనబడుతున్నంతవరకు ఈ మాదిరి పెళ్ళిళ్ల దృఢబంధంలేని జంటపెళ్ళికీ, బహుభార్యాత్వానికికూడ భిన్నమే. బహు కఠిన శిక్షలకు గురిచేయబడే సంగమస్వేచ్ఛ గుంపుపెళ్ళిలో ఆచారంగా అనుసరించబడుతూంది. ఈ ఆచారం క్రమంగా పోతూంది. అంటే ఆ మాదిరి పెళ్ళిపద్ధతి అంతరించక తీరదన్నమాట. అరుదుగా అక్కడా అక్కడా ఒకటీ అరగా కనపడడమే అందుకు నిదర్శనం.

ఇంక ఈ విషయం అంతా ఆసక్తిజనకంగా వుంది. ఇంచుమించు ఒకే పరిణామదశలో వున్న ఆదిమప్రజలలోని సామాజిక సంస్థలు ప్రధాన విషయాలలో ఒకే మాదిరిగా వుంటాయి. సఖాలిన్ దీవులలోని ఈ మంగోలియన్ జాతి ప్రజలను గురించి చెప్పిన అంశాలు భారతదేశంలోని ద్రవిడన్ ప్రజలలోను, దక్షిణ సముద్రదీవుల ప్రజలలో (వారిని కనుగొన్న నాటిస్థితిలో) ను, అమెరికన్ ఇండియనులలోనూ కూడ ఒకే మాదిరిగా కనబడుతున్నాయి. ఆ వార్త దిగువనిస్తున్నా. *

"నేచురల్ హిస్టరీ సొసైటీ మిత్రమండలికి చెందిన మానుషశాస్త్ర విభాగం అక్టోబరు 10 వ తేదీన (కొత్త కాలండరు అక్టోబరు 22) సమావేశ మయింది. సఖాలిన్ దీవులలోని గిల్యైకీ♦లను గురించి స్టెరన్‌బర్గ్ వ్రాసిన లేఖనుగురించి ఆ సమావేశంలో ఎన్. ఏ. యాన్‌చుక్ ఒక

† ఈ అనువాదంలోని 75-76 పుటలలో —అను.

* ఏంగిల్సు అనువాదాన్ని రష్యను పత్రికలోని వార్తతో సరిచూడడం జరిగింది. —సంపా.

♦ సోవియటు మానవజాతి శాస్త్రవేత్తలు ఈ తెగ నిప్పుడు 'నివ్‌ఖీ' అంటున్నారు.

నివేదిక చదివారు. గిల్యెకీ తెగనుగురించి ఇంతవరకు విశేష పరిశోధన జరగలేదు. వారు ఆటవిక స్థాయిలో జీవిస్తున్నారు. వారికి వ్యవసాయం తెలియదు. కుండలు చేయడం ఎరగరు; వేట, చేపలవేటద్వారా వారు పొట్టపోసుకొంటారు; కర్ర తొట్టిలో నీళ్ళుపోసి, దానిలో ఎర్రగా కాలిన రాళ్ళువేసి నీరు కాచుకొంటారు. వారి కుటుంబ, గణవ్యవస్థల గూర్చిన సంగతులు చాల ఆసక్తిజనకంగా వున్నాయి. గిల్యెకి జాతివాడు తన తండ్రినేగాక ఆయన సోదరులందరినీ తండ్రి అంటాడు. వారందరి భార్యలనూ, తన తల్లి సోదరీలనూ అమ్మఅంటాడు. పైన చెప్పిన వారందరి* సంతానాన్ని అతడు సోదరులు, సోదరీలు అంటాడు. ఉత్తర అమెరికాలోని ఇరాక్వ్యాలలోనూ, తదితర ఇండియను తెగలలోనూ, భారత దేశంలోని కొన్ని తెగలలోనూ ఈ మాదిరి పలుకుబడులే వున్నాయని అందరికీ తెలిసినదే.

అయితే వీరందరిలోనూ ఎంతోకాలంగా ఈ పలుకుబడులు ప్రస్తుతంవున్న బంధుత్వాలకు సరిపడడంలేదు. అయితే గిల్యెకీలలో ఈనాడున్న స్థితిగతులను తెలపడాని కివి వుపయోగపడుతున్నాయి. ఈనాడుకూడా తన సోదరుల భార్యలతోనూ, భార్య సోదరిలతోనూ సంగమించేటందుకు హక్కు గిల్యెకీ మగవాని కుంది; (ఆ హక్కు నమలు జరుపుకోవడం తప్పుగా పరిగణించబడడం లేదు.) ఈ శతాబ్దపు♦ ప్రథమార్ధభాగంనాటికి సాండ్విచ్ ద్వీపంలో కనిపించిన సువిఖ్యాత ప్యునలాన్ కుటుంబాల్ని ఈ గుంపుపెళ్ళి అవశేషాలు జ్ఞాపకం తెస్తున్నాయి. ఈ మాదిరి కుటుంబ పద్ధతి, గణబంధుత్వము గిల్యెకీల సాంఘిక గణ నిర్మాణాలకు ప్రాతిపదికగా వుంది.

"గిల్యెకీ గణంలో అతని తండ్రులు (తండ్రి, వేలువిడిచిన తండ్రులు, అసలు తండ్రులు, నామమాత్రపు తండ్రులు), వారి తండ్రులు.

---

* "ఈ తండ్రులూ,తల్లులూ అందరి"సంతానాన్ని అని ఏంగిల్సు అనువదించాడు. —సంపా.

♦ 19 వ శతాబ్దం.

తల్లులు(?)*, అతని బిడ్డలు, సోదరుల బిడ్డలు వుంటారు. ఈ విధమైన నిర్మాణంవున్న గణంలో జనం చాల మందేవుంటారు. గణంలో జీవితం ఈ విధంగా వుంటుంది. గణంలో అంతర్వివాహం పూర్తిగా నిషిద్ధం. గిల్యైక్ చనిపోయినప్పుడు గణనిర్ణయం ప్రకారం అతని భార్య అతని సోదరులలో (సహజ సోదరుడో, నామమాత్ర సోదరుడో) ఒకనికి చేరి పోతుంది. పనిచెయ్యలేని స్థితిలోవున్న సభ్యుల్ని గణమే భరిస్తుంది. "మాలో ముష్టివాళ్ళులేరు" - అని గిల్యైక్ వాడొకడు విలేకరితో అన్నాడు. "బీదవాడుంటే అతడిని ఖాల్ (గణం) పోషిస్తుంది." సార్వ జనికమైన బలులు, ఉత్సవాలు, అందరికీ సంబంధించిన శ్మశానం మొదలయినవి గణాన్ని కలిపివుంచుతాయి.

"మరోగణ సభ్యులనుంచి తన సభ్యులందరికీ గణమే ప్రాణ రక్షణ, భద్రత కలిగిస్తుంది. రక్త ప్రతీకారంద్వారా ఇది జరుగుతుంది." అయితే రష్యనుల సంపర్క ప్రభావంచేత ఈ మధ్య నిది తగ్గింది. చాల అరుదేగాని, కొన్ని కొన్ని సందర్భాలలో ఇతర గణాలనుంచి గణంలోకి సభ్యుల్ని దత్తుతీసుకుంటారు. చనిపోయినవాని ఆస్తి గణంలోంచి బయ టికి పోరాదనేది సాధారణసూత్రం. "వారసులు లేకుంటే గణసభ్యులకే వారసత్వం చెందుతుంది"-అనే పన్నెండు పట్టికలలోని ముఖ్యమైన సూత్రం అక్షరశః గిల్యైకీలలో అమలులో వుంది. గణానికి సంబంధం లేకుండా గిల్యైక్వాని జీవితంలో ప్రధానమైన ఘటన ఏదీ జరుగదు. ఇంచుమించు ఈ మధ్యవరకూ, ఒకటిరెండు తరాలక్రితం వరకూ గణం లోని వయోవృద్ధుడే నాయకుడు. గణానికి "స్టారోస్తా". ప్రస్తుతం, మత సంబంధమైన కార్యాలను పర్యవేక్షించడంవరకే గణనాయకుని బాధ్యతలు పరిమితమయి వున్నాయి. తరచుగా గణసభ్యులు ఒకరికొకరు ఎంతెంతో దూరాన వుంటున్నారు. దూరంగా వున్నా ఒకరినొకరు మరచిపోరు. అప్పు డప్పుడు పోయి చూసి వస్తుంటారు. ఒకరికొకరు సాయంచేసుకుం టారు. పరిరక్షణ కలిగించుకొంటారు. తప్పనిసరి పరిస్థితులలో తప్ప గిల్యైక్వాడు| తన తోడి గణసభ్యుల్నిగాని, తన గణ శ్మశానాన్నిగాని

* ఈ ప్రశ్నార్థకం చేర్చినది ఏంగిల్సు.

త్యజించడు. గిలైక్‌వాని మనస్తత్వంలో, స్వభావంలో, నీత్యవినీతులలో సామాజిక సంస్థలలో గణజీవితం గాఢంగా ముద్రితం అయివుంటుంది. సమస్త విషయాలూ సమష్టిగా చర్చించడం వాళ్ళ అలవాటు. తన తోడి గణసభ్యుల ప్రయోజనాలను గమనిస్తూ వ్యవహరించడం అవసరం.

రక్తప్రతీకార చర్యల విషయంలో పరస్పర బాధ్యతలున్నాయి. డజన్ల సంఖ్యలో తోడివాళ్ళతో కలిసి పెద్ద పెద్ద యూర్టాలలో నివసించే అవసరమూ, అలవాటూ వుంది. వీటన్నింటికీఫలితంగా గిలైక్ చాలకలిసి కట్టుతనంగానూ, హృదయమిచ్చి మాట్లాడేవాడుగానూ వుంటాడు. వాళ్ళు అతిథులకెంతో సత్కారం చేస్తారు. ఒకరి యింటికి వెడతారు. తమ యింటికి రావాలంటారు. ఈ అతిథి మర్యాద చేసే అలవాటు కష్టసమయాలలో మరీ స్పష్టంగా కనబడుతుంది. కరువు దినాలలో తనకూ, తన కుక్కలకూ తిండి యిబ్బందిగా వున్నప్పుడు గిలైకీ వాడెప్పుడూ భిక్షం యెత్తడు. బంధువుల ఇళ్ళకు వెడతాడు. అక్కడ పోషణదొరకుతుందనే విశ్వాసం అతనికుంది. వెళ్ళినవాడు చాలకాలమే వుండిపోవడంకూడా జరుగుతుంటుంది.

"సఖాలిన్ గిలైకీలలో స్వార్థంకోసం నేరంచేసిన ఘటన కనబడదు అతడు తన సంపదనంతా ఒక పాకలో పడేసుకుంటాడు. దానికెప్పుడూ తాళం వుండదు. అవమానం అంటే వణికిపోతాడు. అవమానకరమైన పనిచేస్తూ దొరికిపోయాడా గిలైకీ వాడు తైగాలోకి (అడవి) పోయి వురెట్టుకు చచ్చిపోతాడు. వారిలో హత్య చాలా అరుదు. జరిగినదికూడా ఏ కోపావేశంలోనో జరిగినదే అవుతుంది. స్వప్రయోజనంకోసం మాత్రం ఎప్పుడూ హత్య జరిగినది లేదు. ఇతరులతో వ్యవహరించేటప్పుడు గిలైక్ వాడు మాట తప్పడు. ఎంతో నమ్మకంగా, మనసిచ్చి వ్యవహరిస్తాడు.

"చైనావారి లక్షణాల నలవరచుకున్న మంచూరియన్ల ఆధీనంలో చిరకాలం వున్నా, అమూర్‌నదీప్రాంత ప్రజల అపఖ్యాతికర ప్రవర్తన వారిని చెడగొట్టినా, ఇప్పటికీ గిలైక్‌వాళ్ళ నైతిక ప్రవర్తనలో ఆదిమ తెగలలో కనిపించే ఉత్తమ లక్షణాలు వున్నాయి. అయితే వారి సామా

జిక వ్యవస్థకు భవిష్యత్తు లేదు. ఏమీ అనుమానంలేదు. ఒకటి రెండు తరాలలో సైబీరియా భూమిమీది గిల్యైకీలకు రష్యను అలవాట్లు పూర్తిగా పట్టుబడతాయి. నాగరికత ఇచ్చే మంచితోపాటు దాని అవలక్షణాలన్నీ వారికి వచ్చేస్తాయి. సఖాలిన్‌లోని గిల్యైక్‌లు కొంచెం ఇంచుమించు రష్యను మకాము గ్రామాలకు దూరంగా వుంటూండడంచేత మరికొంత ఎక్కువ కాలం మంచి లక్షణాలను పోగొట్టుకోకుండా వుండగలరు. వారిమీద రష్యను జనాభా ప్రభావం పనిచేస్తూంది. మూల మూల గ్రామాలనుంచి వారు బజారు చేయడానికో, పని చూసుకోవడానికో నికోలయేవ్‌స్క్ వస్తున్నారు; వుద్యోగం చేసి స్వగ్రామం తిరిగి వెళ్ళేటప్పుడు పట్టణ కార్మికుడు రష్యను గ్రామానికి తనతో పట్టణవాసపు అలవాట్లను తీసుకెళ్ళినట్లే గిల్యైకీ వాడూ మోసుకుపోతాడు. అదిగాక పట్టణాలలోని వుద్యోగాలు నేడుంటాయి. రేపు పోతాయి. వానిని నమ్ముకోడానికి వీలులేదు. అది గిల్యైకీ ప్రజలవంటివారి సాంఘిక ఆర్థిక జీవితంలో ప్రాధాన లక్షణం అయిన ఆదికాలపు సమానతను నిర్మూలిస్తూంది. *

"స్టెర్న్‌బర్గ్ వ్యాసంలో గిల్యైకీల మత భావనలు, ఆచారాలు, న్యాయవిధానాలు మొదలగువానిని గురించిన వివరాలున్నాయి. అది ఎత్నొగ్రాఫిచెస్కోయే ఓబొజ్రెనియే (ఎత్నొగ్రాఫికల్ రివ్యూ)లో ప్రచురించబడుతూంది.

* అక్టోబరు విప్లవవిజయంతో గిల్యైకీలతోసహా సోవియటులోని జాతుల, తెగల భవిష్యత్తు పూర్తిగా మారిపోయింది. పెట్టుబడిదారీ విధానంయొక్క దుష్టభావంనుంచి అది వారిని కాపాడింది. నిర్మూలం గాకుండా రక్షించింది. సోవియటు వ్యవస్థ కింద్ర స్వతంత్రంగా అభివృద్ధిపొందే అవకాశం కలిగించింది. —సంపాదకుడు.

